వెలువడినది!　　త్వరపడుడు!!　　వెలువడినది!!!

# జీవన ప్రభాతము

ఆంధ్ర గ్రంథమాలయందలి పదునైదవ గ్రంథము

అనువాదకులు: శ్రీ పోలవరపు రామబ్రహ్మముగారు B. A., Murugan the Tiller (మురుగన్ ది టిల్లరు) అను పేరున శ్రీ కే. యస్. వెంకటరమణిగారు ఆంగ్లభాషను రచించిన సుప్రసిద్ధనవల కిది యనువాదము. ఇది రమణీయమయిన సాంఘిక నవల. పాశ్చాత్య విద్యావిధానము, పాశ్చాత్య సంస్కారము, పాశ్చాత్యాదర్శములు మొదలగువానివలన గలుగు కష్టములు ఇందు చక్కగ వర్ణితములయినవి. ఆంధ్రవాఙ్మయమున నిట్టి కథావిధానము గల యీ నవల క్రొత్తది. ఆంధ్రులెల్లరు చదువవలసినది. క్రౌను ౪౨౬ పుటలు. వెల రు. ౧—౮—౦ మాత్రము.

తపాలా ఖర్చు ప్రత్యేకము.

త్వరపడుడు!　　వెలువడినది　　త్వరపడుడు!

# భారతీయ చిత్రకళ

గ్రంథకర్త: తలిశెట్టి రామారావుగారు, బి. ఏ., బి. యల్.

ఇది ఆంధ్ర గ్రంథమాలయందు పదుమూడవ గ్రంథము ప్రాచీనకాలము నుండి భారతదేశమున చిత్రకళ పొందుచువచ్చిన మార్పులు, అభివృద్ధి మొదలయిన విషయములు, హైందవ చిత్రలేఖనోదయము, బౌద్ధకాలమునాటి చిత్రకళ, అజంత విధానము, బాఘ్‌విహారములందలి చిత్రకళ, మొగలు చిత్రకళావిధానము, రాజపుత్ర చిత్రములపై ఖరి, నేటిచిత్రములు మొదలయినవానిని గూర్చిన చరిత్రాదులు వివరముగా నీ గ్రంథమున చర్చింపబడినవి. ఆయాకాలపు చిత్రవిధానమును దెలుపునట్టి త్రివర్ణ ఏకవర్ణచిత్రములు నలువది ఇందు గలవు. చిత్రకారులు, చిత్రకళాజిజ్ఞాసువులు, చిత్రకళాభిమానులు నగు నాంధ్రులెల్లరు తప్పక చదువవలసిన గ్రంథము. వెల రు. ౧-౦-౦.　　తపాలా ఖర్చు ప్రత్యేకము

మేనేజరు, ఆంధ్ర గ్రంథమాల,

7, తంబుశెట్టివీధి, మద్రాసు.

# భారతి

## సచిత్ర మాసపత్రిక



అధిపతి
కా. నాగేశ్వరరావు

సంపాదకుడు
గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. సంచిక ౮.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౨

# భారతి

## సచిత్ర మాస పత్రిక







అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. భా. ౨

ఆంధ్రపత్రికా ముద్రాలయము-మద్రాసు.

౧౯౩౨



# భారతి – నవమ సంపుటము – భా. ౨.

## వ్యాసముల అకారాది సూచి

# స

# భారతి – నవమ సంపుటము – భా. ౨.

## వ్యాసకర్తల అకారాది సూచి

---

# భారతి — నవమ సంపుటము — భా. ౨.

## త్రివర్ణచిత్రముల అకారాది సూచి

సం.


విషయసూచిక

## చిత్రములు

శకుంతల





“.............................

ఆసీ న్నివృత్తవదనాచ విమోచయన్తీ

శాఖాసు వల్కల మసక్త మపి ద్రుమాణామ్.”

—శాకున్తలమ్.

చిత్రకారుడు: శ్రీ యస్. వి. యస్. రామారావుగారు, ఆంధ్రజాతీయకళాశాల, మచిలీపట్టణము.




చెన్నపట్టణము, ఆగష్టు ౧౯౩౨

సంపుటము ౯ అంగీరస సంవత్సరము, శ్రావణమాసము సంఖ్య ౮

## మ జ నూ

సహదేవ సూర్యప్రకాశరావుగారు

[లైలా గోరీ-మజనూ ప్రణయపిపాసి; సౌందర్యతపస్వి-ఆతనిహృదయము వితంతు-చిరంతనాభ్యసనముచే అలవరించుకొన్న అపూర్వలక్ష్యములు అతని కనులు-అరచాచిన కాళ్లతో గోరీని ఆని కూర్చుంటాడు-కన్నీటిచారికలతో ఎండినవి కపోలాలు-నిట్టూర్పులులేక హృదయం గడ్డకట్టింది-నీరసంచేత నీరవమయింది గళం-ఆతనికడగంటిలో ఒక్కటే నిరీక్ష - హృదయంలో ఒక్కటే కాంక్ష - గీతిలో ఒక్కటే ఆరాధన.]

నాటికి నాడు రేగెడుదినాంతవిషాదములైన నీస్మృతుల్
మాటికి మాటికిన్ హృదయమర్మము లంటు; వియోగవాటిలో
తేటిమెలుంగు టేడుపు కుదింపగ, నావెలిజీవితమ్ము క
న్నీటి పదమ్ములో కరగి నీరయి మన్నును మిన్ను నేకమా.
చాయల విచ్చుకొన్న విరిజాలులు సోలి పడంగ; వానితో
నాయనుభూతసౌఖ్యములు నాశములై విదళీకృతమ్ములై
పోయె, రసోదయాంకముల పుట్టిన నాకొసవెఱ్ఱిగీతముల్
తీయని ప్రేమచిహ్నాలయి తీయమువోవును నీసమాధిపై.
అరవిరిపాన్పుపై నిదుర నంజలి మోడ్చిన కన్నుదోయి రే
విరిసిన తారపాళికతో వియ్యము సల్పెనొ లేదొ కాని, నే

గురిసిన మౌన బాష్పముల గోటి కొనన్ విదలింప తారలై
తరళమనోజ్ఞవీథికల తాండవమాడెను చాలుచాలుగా.
ఏ నెరసంజ రేకుల సుమించిన కోరిక శ్రావణాంతవే
ళానిబిరీసచంద్రికల లాస్యము లాడెనో లేదో సుంత ఛా
యానిశితోపగూహన పథాంచల చంచలమై నిశీథ గ
ర్భాన కవోష్ణ గీతికల రాల్చుచు వ్రేలెను నీసమాధిపై.
ఏమని యేడ్తు జీవితమె యేడ్పుపద మ్మయిపోవ, నాయెదన్
యామిని కోమలానిల విషార్చుల యూర్పుల రేచిరేచి, వాం
ఛామధురమ్ముతో గుసగుసల్ రగిలించు; తపఃపథమ్ములో
ప్రేమవిభాతగీత మిసిరింతలు పోవక కొరగింపదే.
ఈచిరువెచ్చనైన వలపే తల పేచగ అశ్రు మాలలో
దోచిన మూగభావముల దొంతర కీమెద సైపలేక దీ
ర్ఘాచిరహోమవాటుల వికాసిలు కాంచనదీపధూప రే
ఖాచలనాలతో కలగి గాసిలు గాటపుటూర్పు బుచ్చుచున్.
ఎంతతపించి వేగితివో ఇంతవిషాదములోన; స్వప్నలో
కాంతములోన క్రేళ్లురుకునాశల దీరిచికొంటి వీవు: శో
కాంతము విశ్వరాగము పదార్చనతో కుసుమార్చనమ్ము వి
శ్రాంతము దాక ప్రాక వలవంతల వీడుదు నశ్రుదోయినిన్.
ఇవురు సుమాలశయ్యల శయించిన మెత్తని నీశరీర మీ
పవడపురాల గోరిని భవమ్మును గోరుచు కూర్కుపోయె, ఈ
కువలయ వీథిలో నెవరికోసము నీకయి కాక నేను నీ
రవనవసాంధ్య రేఖికల ప్రాణము వీడుదు నన్నుయూర్పుగా.
నను తలపోసికొంచు మరణమ్మును బో నొక తార వెల్గె, నే
నిను తలపోసికొంచు మరణింపగ వేరొకతార వెల్గు, కో
రిన ప్రణయమ్ముకోస మిసిరింతగ జీవము లూడ్చు లేతప
స్వినులకునై విహాయసపు వీథి వెలుంగు నికన్ని తారకల్.
నే మరణించి పోవుదు వినీలపు నీడలదారులందు; న
న్నీమధురస్మృతుల్ కలచి ఏచెడు రాచెడు, ఇంతలోన నా
కీ మహదానుభూతము గుణింపులతో పరిపూర్తియాయె న
య్యో! మనలేనె ప్రేయసి, నవోదయసంధ్యల నేడ్చిపోవుచున్.

---

# రామచంద్రుని హంపీయాత్ర విమర్శన పర్యాలోచనము

గన్నవరపు - సత్యనారాయణమూర్తిగారు

భారతి యొక్క ఆంగీరస సంవత్సర వైశాఖ మాస సంచికయందుఁ బ్రకటింపఁబడిన విమర్శనమును జదివి, విమర్శింపఁబడిన గ్రంథమునకును విమర్శనమునకును గల సంబంధమును నాకుఁ దోఁచినరీతి నీక్రింద పొందుపరచుచున్నాను.

విమర్శకులు గ్రంథమును విమర్శించుచు విమర్శకులయొక్క విధులను, విమర్శనములయొక్క ప్రయోజనములను విశదీకరించిరి. విమర్శకు లొనర్పఁబూనిన యహేతుకమగు నింద కేదియో యవకాశము గల్పించుకొనుటకై పైయుపోద్ఘాతము వ్రాయఁబడె దని విమర్శన పఠనానంతరమునఁ దెలిసికొంటిని. క్రిందఁ జూపఁబడు నుదాహరణములనుబట్టి పైయభిప్రాయ మెంతమట్టుకు సమంజసమో విమర్శకులును పాఠకులే గ్రహింతురుగాక!

విమర్శము సేయునప్పుడు గ్రంథముయొక్క గుణదోషములను దెల్పుట విమర్శకునకు ధర్మమేగాని యభియుక్తులును, సుప్రసిద్ధులును నగు గ్రంథకర్తలను దూలనాడుటయు, వారిగ్రంథములను నిందించుటయు గూడనిపనులు. ఈ విమర్శనమున గ్రంథకర్త దూషణ మెక్కుటముగఁ గలదనుట కుదాహరణములు: (1) "ఇది యెల్లభంగుల మనయాంధ్రభాషయం దపురూపముగా నవతరించినదనియే చెప్పనగును." ఈ వాక్యము హేళన పూర్వకముగఁ జెప్పఁబడినదని ప్రకరణమునుబట్టి పాఠకులకుఁ దెలియకుండునా? (2) "ఇది యీకావ్యమునకెల్ల దలమానికమైన పద్యము." అని చెప్పఁబడు పద్యము దోషభూయిష్ఠమని నిరూపింపఁ బ్రయత్నించుట తిరస్కారమునకో కాదో తెలిసికొనుట సులభము. (3) "కవికాని రాముఁడుకాని సంస్కృతభాష చదువుకొనలేదనియే కాక సంస్కృతము చదువువారితోఁ బరిచయమైన చేయలేదని యీపద్యము రుజువు చేయుచున్నది." (4) "ఈ రాముఁడు తక్క మఱియెవ్వఁడును గావింపనోపఁడు." (5) "దీనినే రామాయణమున పిడకలవేట యందురు." (6) "దీని సన్మృత్త వచనమనఁదగును." ఇట్టి యనేకములగు వాక్యములు విమర్శనమునఁ గలవు. విమర్శకులు తమ యసమానమును జూపించుకొనుటకై యిట్టివ్రాఁతలు మార్గములను కాని సుప్రసిద్ధులైన గ్రంథకర్తలకు సంస్కృతము తెలియదనికాని, శాస్త్రద్యవలోకనము లేదని కాని యెవ్వరనుకొనఁగలరు? పండితవతంసులును, విమర్శకశ్రేష్ఠులును సహింపఁజాలని యిట్టి నిందను విమర్శించుట మాని విమర్శనములోని విషయమును విమర్శింతును.

విమర్శకులు కావ్యమునందలి గుణదోషములను బ్రకటించుట తమవిధియని తామే చెప్పికొనినను తా మనుకొనిన దోషములమాత్ర ముదాహరించి గుణములఁ జేర్కొనక పోవుట విమర్శనమునుండి నిష్పాక్షికతాగంధమునుగూడ దూరముచేయుచున్నది.

"కవి వివరించినదెల్లఁ గావ్యము కాఁజాల" నట్లె విమర్శకుఁడు వివరించినదెల్ల విమర్శనము గాఁజాలదని విజ్ఞులెఱుంగరా?

(౧) "గ్రంథప్రణాళిక": ఈశీర్షిక క్రింద "చైల్డ హారోల్డుస్ పిల్గ్రిమేజ్" అనునాంగ్ల గ్రంథము ననుసరించి రచింపంబడినదనియు నిట్టిగ్రంథము మన యాంధ్ర భాషలో నింతవఱకు లేదనియును కవి వాకొనియున్నాఁడు" అని విమర్శకులు రచించిరి.

ఇఁక పైవాక్యములోని విషయము గ్రంథమున నెచ్చోటను లేదు. ఉపోద్ఘాతమునందుమాత్రము "చైల్డు హారోల్డుస్ పిల్గ్రిమేజ్ అనుకావ్యమును బఠించి, అట్టి కావ్యము నాంధ్రమునందు విరచింపవలెనని యూహించుకొనుచుండఁగా" అనియున్నది. కావున నిట్టికావ్య మాంధ్ర

భాషయందు లేదని చెప్పునది వీరియభిప్రాయమేగాని కవిగారి యభిప్రాయమని గ్రంథమునఁ గన్పట్టదు. ఇఁక "సంస్కృతభాషయందును నిట్టికావ్యము లేదని చెప్పవచ్చు" నని వ్రాసియున్న విమర్శకులవాక్యము సత్యదూరమని నాకుఁ దోఁచుచున్నది. విశ్వగుణాదర్శచంపువునందును దీనికిని సామాన్యలక్షణములు అనేకము లున్నవి. "ప్రాచ్యు లేర్పరచిన కావ్యలక్షణములు వెదకుట వ్యర్థ" మని విమర్శకులు వివరించిరి. ఇక్కడ కావ్యలక్షణమనఁగా నష్టాదశవర్ణనలు గల్గిన కావ్యమనియా, లేక సర్వాలంకారికసమ్మతమై, కావ్యలక్షణనిర్వచనమునందు సుప్రసిద్ధముగ నుపయోగింపఁబడు కావ్య మనియా వీరి యభిప్రాయము? మొదటితెగకుం జేరిన కావ్య మిది కాదని తెల్పుటకుఁ బరీక్ష యనవసరము. ఇఁక మనవారు కావ్యమునకుఁ జెప్పిన లక్షణములు: (౧) "వాక్యం రసాత్మకం కావ్యమ్"; (౨) "రమణీయార్థ ప్రతిపాదకః శబ్దః కావ్యమ్"; (౩) "విశ్వశ్రేయః కావ్యం"; "తదదోషాపరికృతౌచ వాగర్థౌ" మొదలగునవి. ఈలక్షణములు పై కావ్యవిషయమునఁ బ్రవర్తించవని వీరి యభిప్రాయమా? అట్లయినయెడల లక్ష్యలక్షణసమన్వయ మెట్లు కుదురదో చూపింపవలయునుగదా? రసాత్మకమైనదిగాని, చమత్కారజనకమైనదిగాని యొకవాక్యమైన గ్రంథమున లేదని వీరియభిప్రాయము కాఁబోలు! ఈయభిప్రాయమును సహృదయు లొప్పుకొందురా?

(౨) "గ్రంథవిషయము": ఈశీర్షిక క్రింద "విజయనగరపూర్వ(?) చరిత్రమును ప్రకటించుటయే గ్రంథపరమోద్దేశ్యము కావలయును" అని వ్రాయఁబడినది. పూర్వశబ్దమునకుఁ బ్రక్కనున్న ప్రశ్నార్థమున కర్థమేమి? పూర్వచరిత్రమును బ్రకటించుటయే పరమోద్దేశమని వీరు భావించుటచేఁ గావ్యలక్షణమునుగాని, కావ్యపరమార్థమునుగాని వీరు గుర్తించలేనట్లు భావింపవలసియున్నది. విజయనగరశిథిలములను వర్ణించుచుఁ బూర్వచరిత్రము నుదాహరించుచు, మార్గమునందలి యద్భుతవిషయములను నిరూపించుచు, మానవస్వభావమునుగుఱించియు, మానవజీవితముయొక్క ప్రయోజనములను గుఱించియు వ్యంగ్యముగా "కాంతాసమ్మిత" మనునట్లు బోధించుటయే గ్రంథపరమోద్దేశమని పరీక్షకులకుఁ దెల్లముకాకపోదు. విజయనగరవర్ణనమును, ప్రయాణవర్ణనమును పైపరమోద్దేశమును చిత్రించుటకు ఆధారప్రాయములని పరీక్షించిన యెడలఁ దెలియఁగలదు.

(౩) "గ్రంథాభిధేయము": "శీర్ణవిజయనగరౌన్నత్య" మనునప్పుడు పూర్వౌన్నత్యమును ఇప్పటియౌన్నత్యమునుగూడ నభిప్రేతములనియు, సమాసగతార్థములనియుఁ దెల్లముగాక తప్పదు.

"దీనికి కావ్యమని పేరిడుటకంటె చాటుపద్యములని పేరిడుటయె సమంజసమగును." ఈవాక్యము నిరర్థకము. పేరిడుట యసమంజసమగుననికాఁబోలు విమర్శకుల యభిప్రాయము. చాటుపద్యమునకు గావ్యత్వప్రహాణిని గల్పించుట కేయాలంకారికుఁడు నొప్పుకొనఁడు. ఇంతకును చాటువనఁగా మనోహరముగదా! నిందాపూర్వకముగ వ్రాయఁదలఁచుకొన్న వీరివాక్యమునకు మనోహరమైన పద్యసమూహమనియే యర్థము చెప్పుట యుక్తము.

(౪) "గ్రంథస్వభావము.": ఈశీర్షికయందు "ఈకావ్యము చదువరులకు భావోద్రేకమును గల్గించుచుండు ననియు, ఆకస్మికానుభవమువలన గలిగిన" దనియు విమర్శకు లొప్పుకొనిరి. చాటుకృతులందు (మనోహరమైన కృతులందు) ఈలక్షణ ముండితీరును. కావుననే వాల్మీకిముఖనిర్గత "మానిషాదప్రతిష్ఠాంత్వం" ఇత్యాదివాక్యము శ్లోకమై కావ్యరాజమైనది. అట్టిలక్షణ మిందు పట్టినదనుట కావ్యోత్తమత్వమునే నిరూపించుచున్నది. ఇఁక నపరాధపరిశోధకనవలలను జైతరగతిలోఁ జేర్చుట యెట్టి విమర్శనమో పాఠకులే గుర్తెఱుఁగుదురుగాక!

(౫) "అపూర్వములు.": అపూర్వములైనవిషయములను దెల్పుట గ్రంథముయొక్క యౌత్కృష్ట్యమునే దెల్పును. ఈశీర్షికలో "ఈకవి ఆంగ్లగీర్వాణభాషల నెఱింగినవాఁ డగుటచే........." అని వ్రాసి, యేడవశీర్షికలో "కవికాని రాముఁడుకాని సంస్కృతభాష చదువలేదనియేకాక సంస్కృతము చదువువారితోఁ బరిచయమైన చేయలే" దని వ్రాసిరి. ప్రకరణాంతరమున

వీరివిమర్శనములో వీరు వ్రాసినట్లు ఇది "యువ్యక్తవచన"మో లేక మరోవ్యక్తవచనమో పాఠకులే నిర్ణయింపవర్తులు. ఆంగ్లభాషలోని పదములను కొన్నిటిని, సుబోధకములును, రూఢములును నగుపదాంతరములు తెనుఁగున లేనప్పుడు కవిగారు వాడియుండుట నిజము. కాని, ఈయభ్యాసమును హేళన సేయు విమర్శకులు "కర్నూలు ఫారెస్టులో రైలురోడ్డు" అని యీవ్యాసమునందే తమ భాషలో నేల ప్రయోగించిరో!

(౮) "వింతరచనలు.": దీనిని మహాగ్రంథమని విమర్శకులు పేర్కొనిరి. ఈమహాగ్రంథశబ్దార్థనిర్వచనమందు విపరీతలక్షణమే ఆశ్రితము గానిచో దీని నెట్టివారివచనమనవలెనో విపశ్చిద్వర్యు లెఱుంగకపోరు. "ఒక్కపుటయందున్న నాలుగైదుపద్యములకైనను పరస్పరసంబంధముండ"దని వ్రాసిరి. సంబంధము నెఱింగియు నెఱుంగని వారికి బోధించుట యీవాగ్వ్యథానేతకైనను నైతికాదు. "ఆపద్యములు పైకి మనోహరములుగానే యున్న" వఁట! "పై" శబ్దార్థనిర్వచన మేమో! మఱియు "భావోద్రేకమున నాపద్యములు రచింపఁబడినవి కావఁటయు" నని వ్రాసిరి. ఇది పొగడుటయో? తెగడుటయో? భావోద్రేకము లేక గడ్డిపచ్చడివలె నుండుపద్యములు విమర్శకులకు రుచించునేమో కాని సహృదయులకుమాత్రము రుచింపవు. "విజయనగరపూర్వౌన్నత్యము నిప్పటిస్థితియు" ననుశీర్షిక యొండు గ్రంథమునఁ గల దనిరి. ఇట్టి శీర్షిక గ్రంథమున నెచ్చటను గానరాదు. "విజయనగరమునొక్క పూర్వస్థితికిని బ్రస్తుతస్థితికిని గలభేదము" అను శీర్షికమాత్రము విషయసూచికయందుఁ గన్పట్టుచున్నది. ఇయ్యదియే వైరూప్యము నొంది విమర్శకులచే నట్లు పేర్కొనఁబడినదేమో! ఇట్టి వైరూప్యమును, వైయర్థ్యమును మూలాతిక్రమణముగ విమర్శకు లేల కల్పింపవలయునో తెలియదు.

(౯) "రామాయణమున పిడకలవేట": ఇది రామాయణమునఁ బిడుకలవేటయో, ప్రయత్నపూర్వక నిందయో గ్రంథమును చదివినవారికి తెలియకపోదు.—

మ. కవిరాణ్మండలసార్వభౌమరచనల్
జ్ఞానము ల్పక్వము ల్గా
ని వయఃకాలమునందు బాలకులచే
నిత్యంబు వల్లించుటన్
జవిచచ్చున్ మఱి కాళిదాసవనద్య
ప్రంబోప్ప రాముండు త
త్కవిసంకల్పిత కావ్యరాజముల సం
తల్ నేర్వఁడారీతిగాన్.

"ఈపద్యము నిశ్చయముగ కావ్యమం దెల్లఁ దల మానికమనియే చెప్పవచ్చును." అని నిందాపూర్వక విమర్శనము. ఇందు కవి గారు (రాముఁడు) తమ యభిప్రాయమును నిర్వచించియున్నారు. ఇది పండితుల నిందయని భావించుట యసాధారమణీయము. అట్లయిన యెడల "వేదాభ్యాసజడః" అను కాళిదాసు వాక్యమును, "బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్" అను పెద్దన వాక్యమును గూడ శ్రోత్రియనింద యుద్దేశము గలదిగా నిర్ణయింపఁబడవలెను. ప్రపంచజ్ఞాన మెఱుఁగని చిన్నిపిల్లలచే "సరాజ్యం సురజావత్తం" అని వల్లించుట రసాస్వాదులకు కత్యంతోపకారకము కాదని కవిగారి యభిప్రాయమై యుండవోపు. ఇట్టి యభిప్రాయమునే యొకానొక యాంగ్లకవి

"I abhored
Too much to conquer for the poet's sake,
The drilled dull lesson, forced down word
by word·
In my repugnant youth, with pleasure to
record
Aught that recalls the daily drug which
turned
My sickening memory, and though Time
hath taught,
My mind to meditate what then it learn'd
Yet such the fixe'd inveteracy wrought
By the impatience of my early thought
That with the freshness wearing out before
My mind could relish what it might have
sought,

If free to choose; I cannot now restore
Its health; but what it then detested, still
abhor
Then farewel, Horace; whom I hated so."

అని వెలిపుచ్చియున్నాఁడు. విమర్శకులు భిన్నాభిప్రాయముతో నుండిరేని యట్లు నిరూపించుట లగ్గు. కాని గ్రంథకర్తృనిందమాత్ర మెగ్గగును. అభిప్రాయభేదము సైర్పలేమి యుత్తమ విమర్శకుల లక్షణము కాదు. ఈ శీర్షిక క్రింద నింకను కొన్నినింద లారోపింపఁబడినవి. నిర్హేతుకము లైనవానికన్నిటికిని సమాధానము లిచ్చుటకంటె నవియున్నయని యసమర్థములని విరమించుట యుక్తమని "స్థాలీ పులాకన్యాయము"న నొక్క యుదాహరణము నుమాత్రము చూపుచున్నాము. "బాలకులు వల్లించు-చో" ననుటకు, "బాలకులచే వల్లించుటఁ" అని వ్రాయఁబడుట యొక దోషమని వ్రాయునపుడు, వల్లించు శబ్దము ప్రేరణార్థకమని విమర్శకులు గుర్తెఱుఁగలేకపోయిరి. పాపము! శబ్దరత్నాకరమునైన వీరు తిలకించియుండినచో నిట్టివ్రాఁతలు వ్రాసియుండరు. 'బాలకులచే వల్లించుటఁ' అనఁగా బాలకులచే వల్లింపఁజేయుట యని యర్థమని యిప్పుడైన తెలిసికొందురుగాక!

అతర్వాత "కవి రసానందపరవశుఁడై చెప్పిన పద్యమని దీనిని మెచ్చుకతీర" దనిరి. రసపరవశుఁడనిగాని, ఆనందపరవశుఁడనిగాని చెప్పిన శబ్దజాలకు సుబోధమగును గాని రసానంద మనునది దుర్బోధము. ఈ సమాసమునకు నిర్వచనముచేసి వారె యర్థముచెప్ప నర్హులు.

సంకల్పిత కల్పితశబ్దముల కేకార్థత గ్రంథమునఁ గల్పింపఁబడినదని వీరు భ్రమించిరి. సంపూర్వకమైన కల్పితశబ్దమున కీయర్థవిశేషము గలదో తమకుఁ దెలియక పోయినయెడల నొకరి నడిగియైనను దెలిసికొని యీయర్థ సమన్వయ మెట్లగునో విచారించి వ్రాసినయెడల బాగుగ నుండును. ఏకార్థతమాత్రము లేదని గుర్తెఱుఁగుదురు గాక! కృతమునకును సంస్కృతమునకును నెట్టిభేదము గలదో వీరి యర్థమునకును సరియగునర్థమునకును అంత భేదమున్నది.

ఇఁక విమర్శకులకు సూక్ష్మబుద్ధిగ్రాహ్యములును, స్థూలదృష్టిగోచరములును నగు మిగిలినదోషములను న్యాయబుద్ధితోను, నిష్పాక్షికదృష్టితోను బరిశీలింతము.

(౧) ప్రథమాశ్వాసాంతము ప్రథమపురుషమున ముగింపఁబడి ద్వితీయాశ్వాసాంత ముత్తమపురుషమున నారంభింపంబడిన దని వ్రాసిరి. యథాస్థితముగా నీ వాక్యమునకు యోగ్యతాకాంక్షాసత్త్యాదులు లేమిం జేసి, యిది వాక్యలక్షణమునకు దూరమైయున్నది. అశ్వాసాంత మారంభింపఁబడు టెట్లో? ఇఁక గ్రంథమునం దన్నిచో నేపురుష మెక్కడ వక్ప్రేరితమో, ఆపురుష మక్కడ నుపయోగింపఁబడినది. సందర్భమునకుఁ దగిన పురుషము నుపయోగించుట వీరి యభిప్రాయమేమో!

(౨) "ఆర్యకల్పనాకుట్టిమపంక్తులు.": "ఇందలి రూపకమునకు ప్రయోజన మేమి?" అని ప్రశ్నించి "పద్యపూరణమును అర్థానాలోచనమును దీనివలనఁ బ్రస్ఫుటమగుచున్న"వని వ్రాసిరి. ఆర్యకల్పనలయందు కుట్టిమత్వారోపణమునకుఁ గలప్రయోజనము "చనఁగోరు" అను మందుక్రియలోఁ గన్పట్టుట లేదా? మఱియు కుట్టిమ పంక్తులని నిరూపించుటవలన నిఁకముందు రాముఁడు విజయనగరశిథిలసౌధముల కుట్టిమపంక్తులందు సంచరింపఁ గోరునను భావ్యర్థము సూచింపఁబడుచున్నది. ఇఁక కుట్టిమము లెట్లు సుదృఢములై సౌధస్థితికి హేతువు లగుచున్నవో అట్లే ఆర్యకల్పన (శాస్త్రము) లును, ఆర్యనాగరకతా సౌధమునకు హేతుభూతము లగుచున్నవని సహృదయులకు స్ఫురించును. ఇఁక విమర్శకులప్రశ్న వాక్యపూరణమును, అర్థానాలోచనమును అనుటలో సహృదయులగు విమర్శకులు విప్రతిపన్నులు కానేరరు.

(౩) ఈ క్రిందిపద్యము ననన్వితముగ విమర్శకు లుదాహరించిరి:

చ. కళలకు నాలయమ్ము, కృతి
కర్తలకుఁ శరణమ్ము, పెక్కువి
ద్యల కొకయిమ్ము, నాగరక
తాప్రతతికి కాశ్రయమ్ము, నీ
యిల కొకభూషణమ్ము, మన
జీవుల యాశలలాసపొమ్మనై

బలిసిన పక్వరీమణిని
ధ్వంసమొనర్చుట నేమి లాభమో?

ఈపద్య మన్వితమో, అనన్వితమో పాఠకులే నిర్ణయింతురుగాక!

(౮) "కుసంధి": 'అక్కడక్కడెపుడేక.' ఇందు ఎపుడుశబ్దమునకుఁ బూర్వపదముతో సంధికల్పుటను విమర్శించుచు "ఇట్టివి పూర్వకవిప్రయోగములు కొన్ని యుండుటచే నిది కుసంధియని వ్యవహరింపఁబడు" నని విమర్శకులు వ్రాసిరి. ఇఁక పూర్వకవిప్రయోగము లుండుట దీనికి కుసంధిత్వము నారోపించుటలో హేతువగునేని పూర్వకవివిరుద్ధములగు ప్రయోగములఁ జేయుటయే కుసంధిత్వములో హేతువగునమట వీరి యభిప్రాయ మేమో! అట్టియభిప్రాయ మనుపపన్నమని యంగీకరింపక తప్పదు. కావున నీప్రయోగ మసాధువని వీరియభిప్రాయము కానోపును. అట్లయినయెడల "మమ మాతా వంధ్యా" యనునట్లు పూర్వకవిప్రయోగసత్త్వము తదసాధుత్వ భంజకము కాదా?

(౯) సీ. తనకు సరియయిన ఘనమంత్రి లేకుంట
నలపృథ్వీరాజేంద్రుఁ డడఁగిపోయె
సరియైన ప్రభువులు దొరకక రాక్షసుం
డోడెను నందరాజోద్యమమున
తనలాభ మెఱుఁగక ధరణిని జయచంద్రుఁ
డర్పించె గోరీకి సాహసమున
దర్పమేయని యెంచి తంత్రమ్ము నెఱుఁగక
భూమిఁ గోల్పోరె రాట్పుత్రవరులు
గీ. వారివలెఁగాక జయములో వరలివారు
మహిపునకుఁగూర్చు సచివుండు మంత్రివర్య
మాట నాటనిరాజు గా మసలియుంటి
రందఱకుఁగూడ నాదర్శ మనఁగ నలరి.

ఈపద్యమునందలి తృతీయచతుర్థ పాదములలో వర్ణింపఁబడిన జయచంద్రాదుల దోషములును, తెగిన మంత్రి లేకుండుటచే వచ్చినవనియే యోజనాపరు లూహించుకొనఁగలరు. జయచంద్రరాజపుత్త్రుల ప్రసంగము ప్రకృతార్థమున కెట్లుపకారకమో, పాఠకు లెఱుంగకపోరు. ఈపద్యము "రాజమంత్రుల యన్యోన్యానురాగ ముండవలయునని చెప్పఁదలంపున" వ్రాయఁబడినదని విమర్శకు లభిప్రాయపడిరి. ప్రజ్ఞావంతులైన రాజమంత్రుల కూటమియె యిం దుద్దేశింపఁబడినదని స్పష్టము.

సీ. ఉదయపర్వతదుర్గ ముద్ధతి భేదింపఁ
జూపిన యాంధ్రుల శూరచరిత
కొండవీడుపురమ్ముఁ గొట్టింప ధామ్మని
ప్రేలు నాంధ్రుల ఫిరంగీలమోత
రాచూరుముదిగండ్ల రాజుల నేచంగఁ
దెలుఁగువారలు చూపు చలముబలము
శివసముద్రపుఁగోట చెంగాంపసము పూన
సమరభూమిని జూపు సాహసమ్ము
గీ. బీజరూపమ్ము దాలిచి వెలయునేమొ
యాంధ్రజనముల రక్తంపు టణువులందు
బలముగా నందుకారణం బలరునేని
దీప్తిగాంచునో యేమొకో తెలియరాదు
రమ్యగుణపాళి శ్రీకృష్ణరాజమౌళి.

ఇందు నాలవపాదమున నాంధ్రుల విడిచిరి యని యొకదోషము. శివసముద్రవిజయముకూడ నాంధ్రులదే యని చారిత్రకు లెఱుంగుదురు. అట్లు తెలియనివారు ప్రకరణమువలన దాని నెఱుంగఁగలరు. ఇఁక పైపద్యమును "వ్యర్థమును, అసమర్థమును" అనుటయే వ్యర్థమును అసమర్థమును అగుచున్నది.

సీ. ఐశ్వర్యమా! విశ్వవిశ్వంభరాభార
గౌరవంబును లీలగాఁ దలంచు;
విజ్ఞానమా! సర్వవిద్యావళీదివ్య
దీప్తి ప్రకాశమ్ము ధిక్కరించు;
సౌజన్యమా! గుణి సంఘశిరోవీథి
స్థాపించె నీపేరు శాశ్వతముగ
విక్రమంబా! వర వీరరాజన్యహృత్
సీమలం దిపుడుఁ బ్రతిధ్వనించు
గీ. నన్నిగుణములు నిన్నెట్లు లాశ్రయించె
నక్కజంబయ్యె! లోకాన నొక్కచోటఁ

గూడియుండని గుణములు గూడె నిన్ను
సరసగుణధామ! శ్రీకృష్ణ సార్వభౌమ!

పై యెత్తుగీతమందలి ప్రథమతృతీయపాదములలో నర్థపునరుక్తి కలదని "అన్నిగుణములు నిన్నెట్టు లాశ్రయించె, కూడియుండనిగుణములు కూడెనోర" అని వీరు వ్రాసిరి. గ్రంథమునందలి 'నిన్ను' శబ్దమునకు 'ఔర' శబ్దము వీరిసవరణ కాఁబోలు! ఇఁక పైపాదములయర్థము వీరికి బోధపడలేదు. మొదటిపాదములోని అన్నిగుణములు అనునది "పైఁజెప్పినగుణములన్నియు" నని గుణాధిక్యమును సూచించుచున్నది. లోకాన నొక్కచోటఁ గూడియుండని గుణము లనఁగా లోకాధికరణకములు కానిగుణములు కూడియున్నవని యభిప్రాయము. ఇం దర్థపునరుక్తియే గలదో, అర్థాధిక్యమే గలదో యుచితజ్ఞు లూహించుకొందురుగాక!

"కాంచనమ్ము శిఖిఁ బొందుటఁ జైమలినమ్ము వీడి కాంతల్యయమాటచే నమల మై కనుపట్టదె చూచువారికిన్."

"అమల మగుటకును మలినమ్ము వీడుట యనుటకును అర్థభేదము లేదుగదా?" అని విమర్శకుల సందేహము. అమలమగుటకు మలినము వీడుటయే కారణముగదా? కార్యకారణములకు భేదమును వీరు కల్పించిన కల్పింప వచ్చును. కాని ప్రమాణము లొప్పుకొనవు. "ధనము సంపాదించి ధనికుఁడయ్యె" ధనము సంపాదించుటయు ధనికుఁడగుటయు నభిన్నములు గావా? లేనియెడల శాబ్దబోధ కుదురుట యెట్లు? అర్థభేద మెందు కుంఁటవల యునో కూడ తెలిసినదా?

శా. విద్యారణ్యుఁడె! మాధవుండు! స్వకుటుం
బిత్వంబుఁ బోద్రోసి స
ర్వోర్వీలోకమ్ము జగత్కుటుంబకోయు శ్యా
గోద్వృత్తిపైఁ దాల్చి స
ద్విద్యాదాన మొనర్ప దండమును చే
తింబట్టి సన్న్యాసియై
విద్యారణ్యసమాఖ్యలో వెలసెనా!
వింతయ్యె విన్నంతనే

పైపద్యమున "విద్యారణ్యుఁడె......విద్యారణ్యసమాఖ్యతో అనుచోఁగూడ (అర్థపునరుక్తి) గల"దని విమర్శకులు సూచించిరి. విద్యారణ్యుఁడు బిరుదనామమనియు, మాధవుఁడు జన్మనామమనియును విమర్శకు లెఱుంగరో! పద్యము మొదట విద్యారణ్యమాధవుల కైక్యమును గ్రహించి విద్యారణ్యసమాఖ్యదాల్చుటకుఁ బూర్వముగల చరిత్రమును రాముఁడు తలంచుకొనుచున్నాఁడు. ఇం దర్థపునరుక్తి వీరి కెక్కడనుండి వచ్చినదో?

(౭) "కాంతితేటి నించు నుపలముల్ హృదయంబు లుబ్బఁజేయు." ఇక్కడ "రత్నము లనుటకు కాంతినించు రా లనుట యసమర్థము" అని విమర్శకులు వ్రాసిరి. ఉపలశబ్దమునకే రత్నమర్థమని శబ్దరత్నాకరమైనఁ జూచినఁ దెలియఁగలదు. అదియు యిచ్చట నభిప్రేతము. కనకసింహాసనమునందుమ వెలుఁగు వెల్లువలను నింపునట్టి రత్నములు అనియర్థము. ఇది వారి "యసమర్థ" దోషమా?

(౮) "రాతికిన్నునను; ఖడ్గాళికి స్నేరయై. ఈ నకారద్విత్వము వైయాకరణు లంగీకరింపరు. కవిప్రయోగములుమాత్రము కొన్ని యున్నవి. వ్యాకరణవిరుద్ధము కావున నిది చ్యుతసంస్కారము" అని విమర్శకుల వ్రాత. ప్రయోగసాధుత్వము నిర్ణయించునపుడుగాని, దోషారోపణసేయుటకు ముందుగాని లక్ష్యలక్షణపరీక్షయైనఁ జేయవలదా? దీనిని వైయాకరణు లంగీకరింపరఁట! ఏవైయాకరణు లంగీకరింపరో? అట్లంగీకరించకపోవుట సార్వత్రికమా, పాక్షికమా? ప్రౌఢవ్యాకరణమునందలి సంధిపరిచ్ఛేదములోని మూఁడవసూత్రమును బరీక్షించిన యెడల వైయాకరణులయభిప్రాయము తెలియఁగలదు. సర్వలక్షణసారసంగ్రహాకర్త,

"క. ఎన్నఁగ నకారపొల్లుల
కు న్నచ్చుల పొల్లుజేసి కూర్పగ వచ్చున్
బన్నగపతిశయనం డో
ర్చు న్నఘములఁ బాప భక్త సులభుం డైనన్."

అని సూత్రించియున్నాఁడు. "అన్నిష్టసఖినూది", "శక్తి కిన్నరుఁడుగ"; మున్నగుభారతప్రయోగములను, లెక్కకు మిక్కుటములైన యనశ్యకవిప్రయోగములను, తిమ్మ నాద్యభినవవాగనుశాసనుల లక్షణములను ధిక్కరించి ప్రామాణికప్రయోగముల దోషారోపణసేయుట చ్యుత సంస్కారులగు వైయాకరణఖసూచులకు స్వాభావికమే కదా ?

చ. విరివి వహించె మానసము
పెద్దతనమ్మును గర్వముగా వడిం
గొఱత వహించె, నీశ్వరుని
కోవెలముందఱఁ జిన్నచీమనై
తిరుగుటతప్ప నేన నదు
తీవ్రత సర్వము జచ్చిపోయెను; భా
స్వరమగు నీదు తేజమున
వర్ధిల్లు నొక్కకణమ్మ గానొకో.

"పై పద్యమున సంబోధ్యుఁ డెవ్వఁడో, యెం దున్నవాఁడో కనఁబడండు. దీని మన్మత్తవచన మన దగును." ఇది విమర్శన. ఈవిమర్శనము సత్యమని యొప్పు కొనక తీరదు. సంబోధ్యుఁ డీశ్వరుఁడేగదా? అజ్ఞానా వృతబోధ గలవారికి "విస్మృతకంఠచామీకర" న్యాయం బున సిద్ధపదార్థముగూడ నసాధ్యమేగదా? హస్తస్థమై నను దూరస్థితమేగదా ? ఇఁక పద్య మున్మత్తవచనమో, భక్త్యున్మత్తవచనమో తజ్ఞు లెఱుంగుదురుగాక !

(౧౦) మ. అనుమానమ్మున యోచనల్ సలుప నే
లా ? మీరు వ్యక్తిత్వమం
దునఁ గాలంబున నామధేయముల భి
న్నుల్ గాని మీయంతరం
బునఁ జైతన్యము మాత్ర మొక్కటియెను
మ్మూహింప, లేకున్న
ఘనరూపం బొక రీతి వెల్వడును, మీ
గంటానసేనమ్మునక్ .

అను "పద్యము అస్పష్టముగ నుండుటచే నపుష్టా ర్థము, నేయార్థము మొదలగు దోషముల కాకరమై వ్యర్థ ముగ నున్నది." అని విమర్శనము. ఇఁక సందర్భమున వినుండు. రాముఁడు హంపీశిథిలములను బరీక్షించుచు భీకరమును, మహోన్నతమును నైయున్న యుగ్రనరసింహ మూర్తిని జూచి, పోతనకృతనృసింహమూర్తి వర్ణనమును స్మరించి రెంటింటికిని గల యత్యంతసాదృశ్యమునుదలంచి, అట్టి సాదృశ్యమునకుఁ గారణ మేమని సందేహించుచు, సమాధానము నూహించుకొనిన పద్యమిం దుద్దేశింపఁబడి నది. అంతకుఁ బూర్వ పద్యముఁ గనుఁడు.—

గీ. అట్టి పోతన కేసియున్నట్టి కృతిని
గల్గు నరసింహరూపంబుఁ గాంచి యుంటె
నిందు నందును భేదమొక్కింత లేదు
శిల్పశేఖర ! యిది యెట్లు చెలఁగెనయ్య.

ఇఁక పద్యమునందలి యస్పష్టార్థత పాఠకులు నిర్ణ యింతురుగాక.

(౧౧) "భావి శుభోదయంబు సంధిల్లెడుచోన్": కాలవిరోధము. భావిశుభోదయము సంధిల్లుట యెట్లు ? భావికాలమును సంధిల్లుకాలమును విరుద్ధములుకావా ?" అని విమర్శకులసంశయము. భావిన్ = భవిష్యత్కాల మున ; శుభోదయంబు, సంధిల్లెడుచోన్ = కల్గునెడల నని యర్థము గావున నిందలి విమర్శకు వైరుద్ధ్యము ప్రాతిభాసికత్వాకమే గదా? "సంధిల్లుకాల" మననేమి? సంధిల్లు అనఁగా కూడు, చేరు అని శబ్దరత్నాకరము. 'సంధిల్లు' శబ్దమునకుఁ గాలముతో సంబంధ మెట్లు ?

(౧౨) "అజ్ఞాతోపమ" :— "పెరికిల్సుకాలాన, అగష్టుసుకాలమందు—ఈ యుపమానములు ఆంగ్లభాష లేని యాంధ్రులకు జ్ఞాతము లెట్లగును ?" అని ప్రశ్న. పుస్తకములు చూచుకొనినను, తెలిసినవారి నడిగినను జ్ఞాతము లగునుకదా! ఇదియు నొక సంశయమా ? "శివన్ భద్రాణి పశ్యతి యను వేదవచనం బవలంబించి" యని శ్రీనాథుని ప్రయోగము. సంస్కృతభాష నెఱుఁగని యాంధ్రపండితులకు "శివన్ భద్రాణి పశ్యతి" యన నెట్లు తెలియును ? అన్యభాషానుకరణములు గల యాంధ్రవచనము లెట్లు తెలియునో ఇయ్యవియు నట్లే తెలియఁగలవు.

(౧౩) "అసంబద్ధము" : "విశీర్ణ పట్టణవిలీన మహత్త్వము పీడి రమ్మ" మహత్త్వము దేనిది? విశీర్ణ పట్టణముదా? పూర్వపట్టణముదా? లేక రామునిదా? ఆ మహత్త్వమునకు దేనితో సంబంధమో తెలియదు." ఇది విమర్శనము. మహత్త్వము విలీనమైనది. విశీర్ణ పట్టణమునకో పూర్వపట్టణమునకో యోజించినయెడల నిది యసంబద్ధముగాక సుసంబద్ధమే యగును. మఱియు మూలములో "విలీనమహత్త్వము పీడిపొమ్ము" అని యుండ "పీడిరమ్మ" అని వీరేల వ్రాసికొనిరో!

(౧౪) ""అప్రయుక్తము": జీవశబ్దము బ్రదుకుట యనునర్థమున నప్రయుక్తము"అని విమర్శకుల యభిప్రాయము. "జీవో౽సుధారణమ్ జీవనం జీవః; బ్రదుకుట జీవము; అసూనాం ధారణం అసుధారణమ్, ప్రాణముల ధరించుట యసుధారణం, రెండును బ్రదుకుట పేళ్లు"అని గురుబాలప్రబోధిక. ఇక నప్రయుక్తదోషమునుగుఱించి (చూ. వికృతివివేకము). "సర్వే శబ్దాః ప్రయోక్తవ్యా యది దోషవివర్జితాః, అప్రయుక్తత్వదోషస్తు నవి రుద్ధో మారే ర్మతే."

జీవజీవితజీవనశబ్దములు మూఁడును భావార్థకములే. వీనియందు వరుసగ, ఘఞ్, క్త, ల్యుట్, అను మూఁడును ప్రత్యయములు. ఇవి సమానార్థకములు. జీవ శబ్దమునకు జీవనమనునర్థమును—ప్రయోగము. "జీవః పు. (జీవనమితి) యథాహారివంశే "స్వకార్యేముహ్య జేలోకో యథా జీవంలభామ్యహం".

పైదానినిబట్టి జీవశబ్ద మప్రయుక్తమో సుప్రయుక్తమో యుక్తిగలవా రెఱుంగకపోరు.

(౧౫) "భాషాసంకరము": "విక్రుత వర్తకుల్". "వణిజులనుటకు వర్తకులనుపదము సంస్కృతము కాదు. వర్తకశబ్దము దేశ్యము; విక్రుతశబ్దము సంస్కృతము. రెంటికి మిశ్రణము." అని విమర్శము. విమర్శకులు శబ్దరత్నాకరమునైనను బరిశీలింపకపోవుటవలనచే యీదోషమును నారోపింపఁబడినది. శబ్దరత్నాకరమందు "వర్తక" శబ్దము సంస్కృతమని యుదాహరింపఁబడుటయేగాక ప్రయోగముగూడ నీయఁబడినది.

(౧౬) "మునురుమమూదురత్నము లమూల్యలు:" పీఠికపద్యము. మనుజులకుమూల్యమా?" అని విమర్శనము. ఇచట నమూల్య లనఁగా నిర్దిష్టపురుషులకు వెలయున్నదని యెవ్వరైన భావింతురేమో పాఠకు లెఱుంగరా? వర్ణ్యమునందు రత్నత్వమారోపింపఁబడినదిగావున నవర్ణ్యమునం దున్నదానికంటె వర్ణ్యమునం దతిశయమును నిరూపించుటకు అమూల్యలను విశేషణము ప్రయోగింపఁబడినది. "మనుజులకు మూల్యమా?" అను ప్రశ్నకుఁ బ్రసక్తి మిథ్య యినను ఆప్రశ్నకు సమాధానము నీక్రింది ప్రయోగములవలన, విమర్శకులు తెలిసికొందురుగాక!

"ఆతఁడు కోటివరహాలు"; "ఈ పిల్లవరాల కుప్ప"; "నీకల దమ్మిడీచేయదు."

(౧౭) "తాతయు తండ్రితాతయు స్వధర్మరతుల్ సకలాగమార్థవిజ్ఞాతలు నయ్యు". "దీనిలో కర్తయేది? విజ్ఞాత లెవరు? చేసినవా రెవరు? చేయుటకుఁ గర్త లేకుండుట, తండ్రి విద్యోద్యోగములు చెప్పకపోవుట క్రొత్తదోషములు." ఇది విమర్శనము. ఈప్రశ్న లెంత సమంజసములో పాఠకులకుఁ దెలియుచునే యున్నది. 'ఉతఁడు పండితుఁడయ్యును పండితునివలె నటించును.' ఈవాక్యములో శాబ్దబోధ యెటులో, కర్తను దెలిసికొనుట యెట్లో, అట్లే ప్రస్తుతవాక్యమునందునుఁగూడనని తెలియునది. విజ్ఞాతలునయ్యు ననునప్పుడు తాతయు తండ్రితాతయుఁగదా కర్తలు?

(౧౮) "హూణవిద్యలందుఁ జెడ్డఁజేసిరి. "ఎన్ని విద్యలయందు? ఒక యింగ్లీషుభాషయందే కాదా?" ఇది విమర్శనము. విద్యయనఁగా భాషయని యర్థముచెప్పు యెట్టిపాండిత్యమో? పదార్థవిజ్ఞానశాస్త్రము, రసాయనశాస్త్రము మున్నగు హూణవిద్య లెన్ని లేవు?

(౧౯) "సంస్కృతగ్రంథజాలముల్ ; తద్వేగ ప్రాభవమున:" ఈస్థలములందు రేఫలకిత్తములను జేర్చి పలుకకున్న గణభంగమును, చేర్చిపలుకుట సంప్రదాయ విరుద్ధము నైయున్నది. కొందఱుకవు లగతికముగా నిట్టిప్రయోగముల నంగీకరించినను.........

అని విమర్శనము. దీనినిబట్టి విమర్శకుల సంప్రదాయజ్ఞతయు, ప్రయోగజ్ఞతయుఁ గూడ తెల్లమగుచున్నవి. అథర్వణుఁడు వికృతివివేకమునందు "ధివేదాద్యసమాసేఽపి రేఫయోగాత్పదం తథా" అని సూత్రించియున్నాఁడు. దీనికి వ్యాఖ్యానమున 'లోకాది త్రిలోకపూజ్యులు' అను ప్రయోగము నిచ్చి "సంస్కృత సమాసమునందును రేఫయోగముకంటెఁ బూర్వవర్ణము లఘువగును"అని వ్రాయఁబడియున్నది. "ఈదంతా ఇద్వ దేవ కృతప్రహ్వాః" అని నన్నయభట్టు ప్రయోగము. "సర్వాస్వపిచ భాషాసు రహయుక్తేఽక్షరే పరే, పూర్వశ్చ లఘుతా వేష్టా" (పారావళి) అనియు లక్షణము. లక్ష్యలక్షణసమ్మతమై పూర్వకవిప్రయోగానుసారమైన యిట్టివానిని దోషమను టెంతయు శోచనీయము. మఱియు "అగతికముగా కొందఱుకవులు ప్రయోగించి" రన నర్థమేమి? "అగతికము = Helpless, the lost resource or shift" అనియు, ఆప్టేసంస్కృతనిఘంటువు. కావున అగతికముగానన గతిలేకయని యర్థమగుచున్నది. ఇట్లు వ్రాయుటవలన పైప్రయోగములను జేసిన నన్నయాదికవులు తత్తదక్షరములకు లఘుత్వ మన్యథా సంపాదింపనేరక ప్రయోగించిరని వీ రూహింతురా? అట్లైనయెడల నన్నయాదులను ప్రయోక్తలనుగాని, అథర్వణాదులను లాక్షణికులనుగాని వీరు అశక్తి నాపాదింపఁగోరువా రగుదురు.

(౨౦) "ఎల్లబాసలకును దల్లిని నెచ్చోట నర్చించెదొలుదొల్త నాంధ్రవనిత" ఇం దాంధ్రవనిత యన నర్థమేమో దురూహ్య" మని వ్రాసిరి. దురూహమనుటకు దురూహ్యము ప్రామాదికము గాఁబోలు! ఆంధ్రవనిత యనఁగా నాంధ్రమనెడు వనిత. ప్రాకరణికంబుగ నాంధ్రమనిన నాంధ్రభాష. యనునర్థము విస్పష్టముగదా!

(౨౧) "విద్యాభ్యాసమనుటకు విద్యాటన మనుట సరియా" యని ప్రశ్న. సరికాదు; కాని యీప్రశ్నకిం దేమి ప్రసక్తియో తెలియదు.

"లోటొకయింతలేనటుల
లోకులు మెచ్చఁ గుటుంబభార మె
ప్పాటనునైనఁ దండ్రిపయి
వైచుక పోయఁగ బాలకుండు వి
ద్యాటనముం బొనర్పనగు
నయ్యది తప్పుట నగ్రజుండు దాఁ
బోటయి నిల్చి జంకకయె
పోయఁగ నయ్యె గృహాధికారముల్."

పైపద్యములోని విద్యాటనమను పదమునకు విద్యాభ్యాస మర్థమని విమర్శకులు భ్రమించిన ట్లున్నది. విద్యాటన మనఁగా విద్యకై సంచరించుట యనియర్థము కాని విద్యాభ్యాసమని కాదు. ఈయర్థము "పోటయినిల్చి జంకకయె" అను ౮-వ పాదము గ్రహించిన నుపపన్నతర మగును. చూ. భిక్షాటనము.

"వృక్షములు పాంథులశ్రమ మపహరింప నేయుద్భవిల్లెననుట (పాంథాళికుద్భవమూ బాధ హరించు నిచ్చ దెశలఁ వ్యాపించు వృక్షేంద్రముల్) క్రొత్తవింత" కాదు. "పరోపకారాయ ఫలంతి వృక్షాః; పరోపకారాయ వహంతి నద్యః" అని యుండుటచే నిది పాతవింతయే యగును.

'కోడెకన్నియల్', "ఆఁడుపడుచునకు కన్నియ యనియు, మగబిడ్డనికిఁ గోడెకాఁడనియు వ్యవహారసిద్ధములు. పురుషధర్మము స్త్రీల కారోపితము." ఇది విమర్శనము. శబ్దరత్నాకరమైన చూడనిదోషమే యిచ్చటఁ గూడ విమర్శకులయందు సంక్రమించుచున్నది. కోడె యనఁగా తరుణమని యర్థము (మా. శ. ర.). కోడె కన్నియలనిన తరుణవయస్కలైన కన్నియలు అని యర్థము. మఱియు కోడెకాఁడనఁగా మగబిడ్డఁ డని యర్థము విమర్శకులు చెప్పిరి. కోఁడెకాఁ డనఁగా విటుఁడు అని యర్థముగాని మగబిడ్డఁ డని కాదు. కావున వీరియర్థ మప్రసక్తమే గాక అప్రామాణికము గూడ నగుచున్నది (మా. శ. ర.).

"వజ్రపుందునకలరాళ్లతోడ": "వజ్రమున కంటె యనర్థపద మేల ప్రయోగించుట" యని విమర్శనము. ఈవిమర్శనమును బట్టి, "వజ్రపుందునకలరాళ్లతోడఁ గులుకుచుఁ జాలినయన్నిదాల్చి" యనుపద్యపాదమే

విమర్శకుల కర్థముకాలే దని విస్పష్టము రాఁళ్లతోడఁ దులదూఁగఁగఁజాలిన యన్ని వజ్రపుఁదునుకలఁ నని యర్థము కాని, వీ రనుకొనినదికాదు.

"శైలులో"; "ఔపథ_త్తిక మిట్టులైనది" అని విమర్శనము. ఔపవిభ_క్తికత్వము వైకల్పికమని వీ రెఱుఁగరు కాఁబోలు.

"బహవో త్రాంధ్రభాషాయాం, వర్ణా ఔపవిభ_క్తికాః
ప్రవృత్తిశ్చా ప్రవృత్తిశ్చ వికల్పశ్చ క్వచిద్భవేత్."

అని అథర్వణకారిక. కావున శైలశబ్దముయొక్క యౌపవిభ_క్తికాంతత్వము వైకల్పికమని విమర్శకు లెఱుంగువది.

"ఉదయమరీచికావికసితౌ ఢ్రసుమమ్ముల వాసనావళుల": "ఇందర్థము మధ్యాహ్నార్క మరీచికాజలప్రాయము". అని విమర్శకుల వ్రాఁత. దీనియర్థము "ఉదయకాలమందలి సూర్యకిరణములచేత వికసించిన ఓఢ్ర (గులాబి) కుసుముల వాసనలను" అని స్ఫురించకపోదు.

"పారునాకృతులఁ బట్టెడు లేఖకులు": "ఆకారముమ లేఖకులు పట్టుట కని వినియుండము. ఆకారముల యంత్రముల గ్రహించువారు ఛాయారూపగ్రాహకులగు శిల్పులు" అని విమర్శనము. ఆకారమును పట్టుట వీరు కనివినియుండరు గాని గ్రహించుట కనివినియున్నారని వీరివాక్యములవలననే తేలుచున్నది. గ్రహించుటకును కట్టుటకును గలయర్థభేదము ను వీరు విమర్శించుట లగ్గగు.

"గార్హస్థ్యముల్ వీడి తీవిల నీరేజము శాశ్వతమ్ముగు విథిక్ వెల్గఁగదే". "ఇలకు వెల్గుకు యతిదుష్టము కవి మతమున నిడియు నఖండయతి గానోపునేమో?" ఇది విమర్శనము. ఇచట యతిదుష్టమో విమర్శదుష్టమో సత్యేష్టులకుఁ గ్రింది ప్రమాణముంబట్టి స్పష్టము కాఁగలదు. ఇది యఖండయతియగుట కవిమతమునకేగాక అఖండమతులగు భీమన, కూచిమంచితిమ్మన, భాస్కరుఁడు మొదలగువారి మతమునఁగూడ కలదని గ్రంథపరిచయము గలవారికిఁ దెలియునుగదా! "రాజవే మన్నను జెల్లుగాక మణి మండన......" (భాస్కరుఁడు).

"సంధ్యంగతమైన": "ప్రాపకోసమేసిన కూకుప్రయోగము సంధ్యంగతపదము. సంధ్యాంగత యనియేని, సంధ్యాగతయనియేని ప్రయోగించిన లగ్గగును." అని విమర్శము. ఇది యర్థము తెలియని వ్యర్థప్రసంగము తక్క వేరుకాదు. సంధ్యాక్ + గతము = సంధ్యంగతము; అను వివరణము యుక్తము. విమర్శకులు దీనిని సంస్కృతసంధియని భ్రమించి కాఁబోలు నిట్టిసవరణను సూచించిరి. మఱియు సంధ్యాంగత శబ్దసాధుత్వమును వీరే నిర్ణయించుకొనుటయు, ఆక్షేపణ నుపసంహరించుకొనుటయు లగ్గగు.

విమర్శకులు "ఐంద్రజాలికుఁడనుటకు ఇంద్రజాలికుఁడనుట సరికా" దనుట యాథార్థ్య మనిచెప్పకతప్పదు. ఇంద్రజాలశబ్దముపై "ఠన్" ప్రత్యయము చేసికొనినయెడల నింద్రజాలికుఁడనియు ఠక్ ప్రత్యయముఁజేసికొనినయెడల ఆదివృద్ధి గలిగి యైంద్రజాలికుఁ డనియు, రూపము లేర్పడునని శబ్దవేత్తలును, ప్రయోగవేత్తలును, కోశపరిశీలకులును నెఱుంగక పోరు.

ఇట్టిదోషములే నూఱులకొలఁదిఁ గలవని మాటిమాటికిని విమర్శకు లుదాహరించిరి. వారుచూపిన పై దోషములను పరీక్షించినయెడల వారివాక్యము లెంత విశ్వాసార్హములో పాఠకు లెఱుంగఁగలరు. ఇంతకును ఈగ్రంథము నాంధ్ర విశ్వవిద్యాలయమువారు పాఠ్యగ్రంథముగ నిర్ణయించుటయే విమర్శకుల యాగ్రహ కారణమని, విమర్శమునందలి తుది పరిచ్ఛేదమునుబట్టి కన్పించుచున్నది. ఆంధ్ర విశ్వవిద్యాలయమువారే గాక చెన్నపురి విశ్వవిద్యాలయమువారును, మద్రాసు "Text Book Committee" వారునుగూడ దీనిని పాఠ్యగ్రంథముగ నియమించిరనియెఱుంగరు కాఁబోలు! పై విశ్వవిద్యాలయములందలి "Board of studies" లోని పండితప్రవరులు కావ్యగుణమును, గ్రంథప్రాశస్త్యమును నెఱింగినవారు గావుటచేతనే దీనిని పాఠ్యగ్రంథముగ నియమించిరని వీరు తెలిసికొందురు గాక!

ఇఁక విమర్శకుల విమర్శమునందుఁ గల దోషములను దిఙ్మాత్రముగ నుదాహరించి వేరొక ప్రకరణము నకుఁ బోదము. కవిత్వముయొక్క లక్షణమును విమర్శకులు "శాస్త్రకావ్యాది పరిశీలనమువలనను, లోకానుభ

వములవలనను, గలిగిన మానసిక భావములను సరసముగురీతిని మృదులము లగు పదములతో భావకుల హృదయములు గఱంగి యానందమొందురీతిని చెప్పుటయే కవిత్వము" అని వివరించిరి. ఈ లక్షణప్రకారము మృదులము లగు పదములు లేనిచో కవిత్వమునకుఁ గవిత్వప్రహాణి గల్గుచున్నది. అనఁగా (౧) అటఁజనికాంచెభూమిసురుఁడు" ఇత్యాది మనుచరిత్రపద్యములును, (౨)

శా. చూడంబోదు గజాననీలకటల ఝ
ఝాఘూర్ఝఝ్ఝార లీ
లాడోలాసుఖలేఖలోకమహిళా
లంకారహారక్షణ
క్రీడాతార కితాంతరాళతరళ శ్రీ
కంఠకంఠప్రభా
చూడాచంద్రకళావిలాసము సతీ
శుద్ధాంతకైలాసమున్
(ఉ. హ. పం.)

మున్నగు నితరపద్యములును కవిత్వము కాకపోవలసిచ్చును. ఇది సమంజసమా ?

కావ్యముయొక్క యుత్తమాధమతలను నిర్ణయించుచు కావ్యములను మూఁడు విధములుగ విభజించియున్నారు. "గుణాలంకారాది సర్వాంగములు గలిగి రస వంతమగునది యుత్తమము; రసము బాగుగ నుండి గుణాలంకారాదులు కొంచెము కొఱవడినను నది మధ్యమము......ఇత్యాది విభజనమునుబట్టి గుణాలంకారాది సర్వాంగములకును రసమునకు గల పరస్పర సంబంధమును వీరు సత్తైఱుంగలేదని విదితమగుచున్నది.

"ఆనందాపరపర్యాయంబగు రసానుభవం" అని విమర్శకులు వివరించిరి. ఇట నన్వయ మెట్లో వారే యోజించుకొందురుగాక! 'ఆనందాపరపర్యాయం' బను దాని కన్వయము సమానైకదేశంబగు రసశబ్దముతోడనా? లేక అనుభవముతోడనా? ఆనందాపరపర్యాయంబనునది రసము గాని యనుభవము కాదు గదా ? అట్టియెడ రసశబ్దముతోనే దీని కన్వయము చెప్పునెడ సమానైకదేశపదంబగు రసశబ్దముతో సామానాధికరణ్యం బెట్లు పొసఁగును? "బుద్ధస్వరాజమాతంగః" ఇత్యాద్యన్వయములు వైయాకరణనిందితములు గావా ?

"ఒక్క పింగళిసూరనార్యుఁడుమాత్రమే శ్రీకృష్ణదేవరాయని చరిత్రమెల్ల గళాపూర్ణోదయమున నిగూఢముగ వర్ణించియున్నాఁడు" అని విమర్శకులు తెల్పిరి. ఈసిద్ధాంతమును సప్రమాణముగ నిర్ణయించి విమర్శకులు సారస్వతమున కుపకారము సేయుదురుగాక!

మఱియు విమర్శకులు గ్రంథమునందలి గుణములను విమర్శింపక పైరీతిని తాము దోషములని భ్రమించిన వానినిమాత్ర ముదాహరించి యూరకుండుట కడుంగడు శోచనీయము. గ్రంథము శ్లేషప్రసాదమాధుర్యసౌకుమార్యాదిగుణములును, పాంచాల్యాదిరీతులును, ఉపమోత్ప్రేక్షాద్యలంకారములును గలిగి, రసపుష్టిని గల్గించుచు, వ్యంగ్యప్రధానమగు నుత్తమకావ్యము గావుననే పండితప్రవరులచే నంగీకరింపఁబడి గణుతింపఁబడినది. పాత్రౌచిత్యమును గుఱించియు, రచనావిధానమును గుఱించియు నుపోద్ఘాతము వ్రాసిన శ్రీయుత సుబ్రహ్మణ్యముగారు తగురీతిని సోదాహరణముగఁ జర్చించిరి కావునను, సహృదయులు వానినెఱుంగ సమర్థులుగావునను ఆవిషయము నుండి విరమించుచున్నాను.

[ ఏతద్విషయమున పునః పునః పర్యాలోచనములకు భారతి చోటొసగఁజాలదు—సంపాదకుడు. ]

---

# వానకోయిల

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మగారు

పొందికవిన్ము నాపలుకుఁ జోలిక నెచ్చెలి! వానకోయిలా!
ఎందఱో మింట మేఘులు వసింత్రు స్వభావవిభేద మొప్పఁగాఁ
గొందఱు వృష్టిచేఁ బుడమిఁ గుందు నడంత్రు వృథాగ గర్జలం
గొంద ఱొనర్తు రట్లగుటఁ గోరకు చూచినవారి నందఱిన్.

చాతకమా! వెంటఁ జనుచుంటి వేల? - యాతండు ఘనుఁడుగాఁ డిభమదాంధుండు
ఖ్యాతికై నీవంటి కవులకొసఁగఁడు - మాతంగదానమ్ము మధుపాళిపాలె.

నిరవలంబనంబుగ, నింగినిలిచి నోరు - దెఱచి దీర్ఘకాలమ్ము ప్రార్థించు చాత
కమునకు నీ నీటిమాట కేమి? మధురస్వ - నమ్మునైన విన్పింప వ్రథమ్మ! యేల?

వాపి స్వల్పనీరము, సరోవరము విషమ - యమ్ము, నీచావగాహమ్ము హ్రదము, పాద
జలము త్రిపథగ, వారిధి తుషారనీర - మగుటనో! చాతకము ఘనునడుగు నీరు.

ఎవరిఁ బరులఁ గోరక 'ఘనుఁ - డవుగద నిక్షేపమేదొ డక్కు' - ననుచు ను
న్నవి చాతకములు నోటం - జివరకకట! పిడుగెపడునో? చినుకే పడునో?

నిన్నడిగి వానకోయిల - కన్నుల నెన్నింటి నశ్రుకణముల వదలెఁ
దిన్నఁగ జలకణముల నీ - వన్నింటింగూడ నీయవైతివి జలదా!

వసధి, నదిఁ, సరస్సునను, బల్వలమందు మఱెందునైన జీ
వన మెలయించుకొన్నఁ దలవంచి భజింపఁగనా! నిదెంత నై
చ్యనిరతియం చెటుల్ సనక చాతకసంతతు లంబుదా! నిర్మ
బన వెడునట్టులెత్తి తలవంపులమన్కిఁ గవుల్ సహింతురే?

ఇమ్మా! ఇమ్మా! జలము ఘ - నమ్మా! నమ్మినఁ జెఱుప ఘనమ్మా? సారం
గమ్మా దప్పిం బడలెను - ణమ్మాఁ గిన నెట్టివార్త నాచెవిఁ బడునో?

ఇచ్చెదవా? లేదా? జల - మచ్చము జలద! నిను నమ్మినది చాతకమే
పొచ్చెము గలిగినదగచేఁ - జచ్చునుగా కొరుల వేఁడఁజాలదు సుమ్మీ.

చాతకపోతకములు తమ - కై తమకముతోడ వేఁడ నమృతంబును, జీ
మూతుఁడు సమస్తభూతల - భూతమ్ములుగూడఁ బ్రీతిఁబొంగ నొసంగున్.

నోరుకాయగాయ నుతిచేసిచేసి నీ - వింతలోన నెచటకేఁగితమ్మ
చాతకమ్మ! ఘనుఁ డొసఁగిపోయు జల మద్య - ష్టరహితుల నెవండు చక్కఁబఱుచు.

పిల్లలుగలవాఁడను గవి - తల్లజుఁడను బీదవాఁడ దానమొనఁగు మం
చుల్లంబు గరఁగఁ జాతకుఁ - డొల్లిన వినఁడు ఘనుఁ డెట్టులో దాతయ్యెన్.

(అడవి పువ్వులు)

## బాలవ్యాకరణము

జాస్తి వెంకటనరసయ్యా చౌదరిగారు

"సమాసంబునం బ్రాతాదుల తొలియచ్చుమీఁది వర్ణంబులకెల్ల లోపంబు బహుళంబుగా నగు"నను సూత్రమునందు బిందువునకు లోపంబును — "చవర్గకంబు పరంబగునపు డవ్వాదుల కత్వలోపంబేని నస్థానంబున బిందువేని విభాష నగు"నను సూత్రమున నాదేశముగా బిందువును విధించుటయుఁ జూడఁగాఁ జిన్నయసూరి బిందువునుగూడ నొకవర్ణముగా గ్రహించినటుల విదితము గాఁగలదు. కావుననే యనేకస్థలములందు లోపాదేశాదికార్యములు బిందువునకు విధించినాఁడు. కాఁబట్టి లోపమును విధింపకుండ బిందువును లోపింపఁజేయుటయు, నటులనే విధించుకొనకుండ నాదేశముగాఁ జెప్పుటయుఁ బొసఁగనేరదు. ప్రత్యేకవర్ణముగా గ్రహించినందులకు ఫలముకూడ నుండును.

"రంజాదుల యించుక్ప్రకారంబునకు సబిందుకంబున క్రేరణంబున ద్విరుక్తలకారం బగు"నను (క్రియా-పరి...71) సూత్రమునందు స్థిరవర్ణమైన ద్విరుక్తలకారంబును విధించుటచేత, బిందుపూర్వక స్థిరవర్ణ మంద్రభావలో నుండదుగాఁబట్టి కారణ మపేక్షింపకయే బిందువు లోపించుననియు "సబిందుకంబు"న కను పద మీసూత్రమున వ్యర్థమనియుఁ బలువుర యభిప్రాయమై యున్నది. కాని బిందువునకు లోపము వచ్చుచున్నను "సబిందుకంబున"కను పద మీసూత్రములోఁ బెట్టుటకు సూరియభిప్రాయ మేమైయుండును? కేవల మాపదము వ్యర్థము కావలసినదేనా? లేక ప్రయోజన మేమైన నున్నదా? "ఏకమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణా" యను నార్యోక్తి గలదుగదా? అట్టికో వ్యర్థపదములతో సూత్రముల నింపుటకు సూరిమాత్ర మంగీకరించునా? అ ట్లెన్నఁడు జరుగనేరదు. సూత్రమునందు వ్యర్థమగు చున్న పదములకు—పురతో వైయర్థ్యం — పశ్చాదపూర్వార్థ కల్పనం — ప్యాంశే చారితార్థ్యం — అన్యత్ర ఫలమ్మని చతుర్విధములగు ప్రయోజనములఁ గల్పించు నాచారము సంస్కృత వైయాకరణుల కున్నదిగదా? ఆవిధముగా నీసూత్రమందుఁగూడ వ్యర్థమగుచున్న "సబిందుకంబున" కను పదమునకుఁ బ్రయోజనముఁ గల్పింపవచ్చునేమో విచారింతము.

### పురతో వైయర్థ్యమ్

స్థిరవర్ణమగు ద్విరుక్తలకారమును విధించుటచేతఁ, దెనుఁగున బిందుపూర్వకస్థిరవర్ణముండదను నియమమువలనను, స్థిరవర్ణవిధాన సామర్థ్యముచేతను, బిందువునకు లోపము ప్రాప్తించుచుండఁగా "సబిందుకంబున"కని మరల బిందువునకు లోపమును విధించుట యనవసరము. కావున నాపదము మొట్టమొదట వ్యర్థమగుచున్నది.

### పశ్చాదపూర్వార్థకల్పనమ్

ప్రథమమున వ్యర్థమయినటువంటి "సబిందుకంబున"కను పద మపూర్వార్థకల్పనము చేయుచున్నది. ఎట్లన? సమాన (అఖండ) పదములందు స్వతస్సిద్ధబిందుపూర్వకమగు వర్ణముల కేవేని కార్యములు (లోపాదేశాదులు) చేయునప్పుడు విధించునటువంటి లోపాదేశాదికార్యములు బిందువునకు వర్తింపఁగూడదను నియమము దీనిచే జ్ఞాపితమగుచున్నది. బిందువును ప్రత్యేకవర్ణముగా గ్రహించినందున దానికిఁగూడ లోపాదేశాదికార్యములు విధింపవలయును. కావుననే "ఆఁగు—రేఁగు" త్యాదులందు గకారమునకుఁ జుక్పుగాగమంబులఁ జెప్పి గకారమునకు లోపమునుగూడ విధించినను బిందువునకు లోపము రాక "ఆఁచు-ఆఁపు, రేఁచు-రేఁపు" అని యొప్పటివలె బిందుసహితముగానే యున్నవి. అట్లే రెండు మూఁడి త్యాదులందుఁగూడ డకారమునకు టవర్గకము నాదేశముగా విధించినను బిందువునకుఁ జలనము గలుగక "రెంటిని-మూఁటిని"యని సబిందుకంబులుగానే యున్నవి. కాని స్వతస్సిద్ధబిందువుకాక "తుద్-తుద్" అని జిత్వం

జ్ఞలద్వారా సబిందుకవర్ణముల విధించుకొనిన శబ్దముల యందు మరల నా (విధించుకొనిన) వర్ణముల కేవేని కార్యములు (లోపాదేశాదులు) చేయునప్పు డవి బిందువునకుఁగూడ వర్తించును.

## స్వాంశే చారితార్థ్యమ్

పైనఁ జెప్పినవిధముగా బిందువునకు లోపము రాకపోవుటవలన "సబిందుకంబున"కను పదము సూత్రములోఁ జెట్టి బిందువునకు లోపము విధించుకొనుటవలన నాపదము చారితార్థ్యముఁ బొందినది.

## అన్యత్రఫలమ్

ఏండ్లు-కాండ్లిత్యాదులందు "బహువచనశిష్టంబులై యద్విరుక్తంబులయిన డకారలకారంబుల కలఘులకారంబు నిత్యంబుగ నగు"నను (ఆచ్ఛిక-పరి-14 సూ.) సూత్రముచే డాకు ళాదేశము వచ్చుచున్నది. కాని తెనుఁగున బిందుపూర్వకస్థిరంబు లేమిం జేసియు, నేండ్లు-కాండ్లిత్యాదులందు బిందువునకు లోప మెచ్చటను జెప్పకపోవుటచేతను ళాదేశము గ్రాహ్యముకాదు. కావున నయ్యది నిషిద్ధమగుచున్నది. ఈవిధముగాఁ జూచినచో "సబిందుకంబున"కను పదమునకును వైయర్థ్యముఁ గల్పించుట సమంజసముగాఁ దోఁపదు.

అటులయినచో "నానాఁడి" త్యాదులందు బిందువునకు లోప మెచ్చటను జెప్పకపోయినను నెటుల లోపించినదని ప్రశ్నింపవచ్చును. పశ్చాదపూర్వార్థకల్పనమనుచోటఁ జెప్పినట్లుగా నఖండ పదములందు స్వతస్సిద్ధబిందుపూర్వక వర్ణమునకు విధించు లోపాదేశాదికార్యము గాదుగనుక నిచట బిందువునకు లోపము రాఁగూడదను నియమము లేదు. అయిన "నించుక, నాఁ డిత్యాదులందు బహుళగ్రహణముచేత నంతిమాక్షరలోపం బగు"ననుటవలనఁ దుదివర్ణమగు డకారమునకు లోపము రావలసియుండఁగాఁ బ్రత్యేకవర్ణముగా గ్రహింపఁబడు బిందువునకుఁగూడ లోప మెటుల వచ్చెనని శంక పొడముచున్నది. కాని యంతిమాక్షరలోప మనునపుడు-"అక్షరాణాం లోప"యనియు, "నక్షరస్య లోప"యనియు నిరుతెఱఁగుల బహుళగ్రహణమునకు ఫలముగాఁ జెప్పినచో నాశంక నివారితమగును. "ఇంచించుక" యిత్యాదులంగుఁ దుదియక్షరమునకు లోపమనియు, నానాఁడిత్యాదులందుఁ దుదియక్షరములకు (తొలియచ్చుమీఁది వర్ణములకు) లోపమనియు బహుళగ్రహణమునకు ఫలముగాఁ జెప్పినచోఁ గారణ మపేక్షింపకయె స్థిరపరకమైన బిందువు లోపించునని లేనిపోని కారణములఁ గల్పించి చెప్పుకొనవలసిన యావశ్యకత కలుగదు.

మఱియు హనుమాఁడు-భగవాఁ డిత్యాది పదముల సాధించునపుడు హనుమంత్-భగవంతయను ప్రాతిపదికములలోని బిందువునకు లోపము విధింప లేదుగదా? అటులయిన నెటుల లోపించినదని యడుగవచ్చును. "మతుబాదికంబు ద్వితీయైక వచనాంతతుల్యంబు నామంబగు"నను (తత్స-పరి-70) సూత్రముచే "హనుమంత" మ్మని కాఁగా (తత్స-పరి-71)సూత్రముచే "హనుమంత" యని సిద్ధించును. ఇప్పుడు "ఒకానొకచో మహత్త్వంబునందు మతుప్తకారంబున కానాదేశంబు విభాషనగు" నను (తత్స-పరి-74) సూత్రముచే "హనుమం + ఆన" కాఁగా నాకారంబునకుఁ బూర్వము బిందువుండుట యాంధ్రభాషలో నప్రసిద్ధమను నగతికన్యాయ్యముచే బిందువునకు లోపముచేసి యనంతర మపదాదిస్వర సంధి చేసినచో "హనుమానుఁ" డను రూపము సిద్ధించునని పలువుర యభిప్రాయమై యున్నది. కాని బిందువునకు లోపము చెప్పకపోయినను నగతికన్యాయ్యము ననుసరించి దానిని లోపింపఁజేసి చివఱకు నతికష్టముమీఁద హనుమానుఁ డను రూపమును సాధించుటకంటె నీక్రింది విధముగా నేల సాధింపఁగూడదు?

"హలంతంబు ప్రథమైకవచనాంతతుల్యం బిందు నామంబగు"నను (తత్స-పరి-67) సూత్రముచేఁ బ్రథమైకవచనమును బ్రాతిపదికముగా గ్రహింపవలసియుండఁగా "సాంతంబుల తుదిసకారంబునకు లోపంబు బహుళంబుగా నగు"నను (తత్స-పరి-80) సూత్రముచే సకారలోప మెటుల విధింప వీలగును? ప్రథమైకవచనము గ్రహించినచో "షరః" అని యుండును. కాబట్టి సకారంబునకు లోపం బనువిధానసామర్థ్యముచే సకారాంతముగా గ్రహింపఁదలఁచినచో సంస్కృత ప్రాతిపదికమును

గ్రహింపవలయును. అనంతరము "ము" ప్రత్యయాదులు చేసినచో మరమిత్యాదిరూపంబులు సిద్ధించును. ఈవిధముగా హనుమానుఁ డనునపుడుగూడ సంస్కృతప్రాతిపదికమును గ్రహించినచో "హనుమత్"ని యుండును. దానికి తత్స-పరి-74 సూత్రముచేఁ దకారమున కానాదేశముఁ జేసినచో సపదాదిస్వరసంధిచే హనుమానుఁడను రూపము సిద్ధించును. ఇట్లు చేయక హనుమంతమ్మను ప్రాతిపదికమును గ్రహించి మకారలోపము చేసి, తకారమున కానాదేశము విధింపఁదలఁచినచోఁ జిన్నయసూరి బిందువునకు లోప మెందుకుఁ జెప్పియుండఁడు. లోపము విధింపకుండ బిందువును లోపింపఁ జేయఁగూడదను నియమమును సూరి యంగీకరించినటుల సేండ్లు-కాండ్లు-రంజిం చిత్యాదులయందు విదితముకాఁగలదు. కావున "హనుమంతమ్మ"ను ప్రాతిపదికమును గ్రహింపఁదలఁచినచో "సబిందుకంబున"కను పదమును సూరి ప్రయోగించియే యుండును. అట్లు చెప్పకపోవుటచేతనే "హనుమత్"తను ప్రాతిపదికమును గ్రహించినాఁడని యనుకోనవలసివచ్చుచున్నది.

మఱియు మూఁడు + జగములు = ముజ్జగములు· ఎఱుఁగు-ఎఱుక యిత్యాదులందు బిందువు లోపించుటకుఁ గారణ మారయుదము. "సమానాధికరణంబగు నుత్తరపదంబు పరంబగు డు మూఁడుశబ్దము డువర్ణంబునకు లోపంబును, మీఁదిహల్లునకు ద్విత్వంబు నగు"నను సమాస-పరి.17 సూత్రముచే డువర్ణమునకు లోపము జకారమునకు ద్విత్వమును వచ్చి మూఁ + జ్జగములని యుండఁగా "ద్విరుక్తంబగు హల్లు పరంబగునపు డాచ్ఛికంబగు దీర్ఘంబునకు హ్రస్వం బగు"నను సమా-పరి- 13 సూత్రముచే ముఁ + జ్జగములను రూపము కాఁగా నిప్పుడు "అఁట-యుఁక్-చుఁడు శబ్దంబులందప్ప నడితోలి హ్రస్వంబు మీఁది ఖండబిందువును ద్రుతంబునకు లోపంబును లే" నను సంధి-పరి-22 సూత్రముచే ఖండబిందు వుండుటకు వీలు లేకపోవుటచేతను, మఱియు సంజ్ఞాపరిచ్ఛేదమున "హ్రస్వముమీఁది ఖండబిందువునకుఁ బూర్ణబిందువు వైకల్పికముగనగు"నను పదునాలుగవ సూత్ర మేకపదమాత్రవిషయక మగుటంజేసి పూర్ణబిందువు రాకపోవుటచేతను నిచట బిందువు లోపించి ముజ్జగములను రూపము సిద్ధించినది.

"కవర్గకం బలుగ్వాదుల కగు" నను కృదంతపరి...8 సూత్రముచే "ఎఱుఁగు" ధాతువునకు "క" ప్రత్యయము వచ్చుచున్నది. మొదట ధాతువులందు బిందువుండి కృదంతరూపము లయిన తరువాత కొన్నిధాతువులందు బిందువు గానంబడకపోవుటచేతను, నాబిందువునకు లోపమెచ్చటను విధింపకపోవుటచేతను, "ఇట బిందులోపంబు. ఇట్లు కొన్నిట గ్రహించునది" యని చిన్నయసూరి చెప్పుట తటస్థించినది. కావున "ఎఱుఁగు = ఎఱుక, ఎఱుకువ., మునుఁగు = మునక తునుఁగు = తునక, యిత్యాదిరూపములందు బిందులోపంబు గ్రహించునది

ఇంతవఱకును బిందువునకుఁ బరమందున్న వర్ణముల కేవేని కార్యములు (లోపాదేశాదులు) విధించునప్పుడు బిందువునకుఁ జలనము గలుగదని సోదాహరణముగాఁ జెప్పియుంటిమి కాని, యిప్పుడు బిందువునకుఁ బూర్వమం దున్న వర్ణమునకు నెద్దియేనికార్యము విధించునప్పు డయ్యది బిందువునకు వర్తించునేమో విచారింతము.

"అండగ్వాదుల డాకు ణకారంబు విభాషనగు" నను ప్రకీర్ణ పరి...18 సూత్రముచే నడఁగు కడఁగిత్యాదులందు డాకు ణకారంబు వచ్చి యణఁగు - కణఁగిత్యాది రూపములు సిద్ధించును. బిందుపరకంబగు డకారంబునకు ణకారాదేశము వచ్చినను ఇట బిందువునకుఁ జలనమేమియుఁ గలుగలేదు. ఇట్లే "దక్కు లోనగువాని దాకు డకారంబు విభాష నగు" నను ప్రకీ...పరి-14 సూత్రముచే దాఁగు - దాఁకలి, యిత్యాదులందు బిందుపరకంబగు దకారంబునకు డకారాదేశము వచ్చినను బిందువునకుఁ జలనము గలుగక డాఁగు - డాఁకలి యిత్యాది సబిందుకరూపములే కానంబడుచున్నవి. కాని బిందువెల్లప్పుడు వచ్చునమాత్రమే యాశ్రయించియుండును గనుక బిందుపరకంబగు వచ్చునకు విధించు లోపాదేశంబు బిందువునకుఁగూడ వర్తించునని యంగీకరింపవల

యును. "లాంతియచ్ఛ్వనకు సహిత మెుకానొకచో నుడి నడుమ లోపంబు గానంబడిరొుడి"అను ప్రకీర్ణ.పరి. 18 సూత్రముచే "పాలంతి" శబ్దములోని లకారోత్తరవర్తి యగు "అ"కారము లోపించుటంజేసి దాని నాశ్రయించిన బిందువుకూడ లోపించి పాల్తియను రూపము సిద్ధించినది.

ఈవిధముగా విచారించిమాడ బిందువునకుఁ బూర్వమం దుండు వర్ణములోని కేవలహల్లునకు లోపము గలిగినను, బరమందుండు వర్ణము (అజ్ఝల్సహితము) లోపించినగూడ బిందువు లోపింపదనియు, దానికిఁగూడఁ బ్రత్యేకముగా లోపము విధించుకొనవలయుననియు; లేదా,...బిందువున కాశ్రయంబగు నచ్చు లోపించినచో బిందువుగూడ లోపించుననియు విదితమగుచున్నది.

---

# కృష్ణార్పణము

విశ్వనాథ సత్యనారాయణ గారు, యం. ఏ.

(వరలక్ష్మీత్రిశతి-కర్మశతకము, పదవపది)

శఫరీవిలాస పుచ్ఛత్రిధాహత లుఠత్క్రమ పాథోనుషంగములతోడి
శఫరనూతనవధూసముదాయముగ్ధ దర్శన నవాపాంగకచ్ఛవులతోడి
వ్యాత్తమత్స్యశిశు శిశుక్రీడార్థ మత్స్యమాత్రభ్యర్థనా వైభవాప్తితోడి
శఫరీప్రసూతివేశ్మ ద్వారదుర్దృష్టి హాతిహేతు ఘటనదివ్యతలతోడి
పృషదధస్స్నితికొలఁకు గృహీటనివస-నార్థమేదమంభః ప్రవాహమ్ము నావి
వస్వాదుదయ మాచంద్రమః ప్రభము మత్ప్రి - యాంగనాశరీ రాస్థి కృష్ణార్పణమ్ము.

వర్షాకమత్కూలవార్నట చ్ఛ్రితరంగాహతంబులకు నుయ్యాల లూగి
కుంభజన్మోదయారంభ శుక్లచ్ఛవీభవదంబు మృదుశయ్యపైన నొరగి
మాఘమాసికకోష్ణ మార్తాండరుచిధగచ్ఛబలితాంబువుల విశ్రాంతి పొంది
శుచ్యుష్ణతాదహచ్ఛ్రద్ధ వార్వేణికాంతర్లీన పరిరక్షితములఁ బొలసి
నాల్గుకాలాలవా టనంతప్రపూత-జలనివాసంబు కొలఁకు నాసార మాశ
రత్తు నామధు వాగ్రీష్మ ముత్తమాస్మ-దంగనాశరీ రాస్థి కృష్ణార్పణమ్ము.

ఊర్ధ్వతిర్యగధోముఖాస్తాడనాంభో విధృతి ఘూర్ణతాసికతిలము లైన
ప్రత్యూషోమరుదంకురప్రోత బుద్బుదానీక సంఘట్టఫేనిలము లైన

రాజన్వయశ్యామ్నకర ప్రౌఢయువతీగతి ప్రాత్తమాదగంధిలములైన
బహుళయాదోవినిశ్వసనవాసిత మాధురీనిర్ఝరీ శర్కరిలములైన
ఈమహావారిసంచ్యుతి నెనయ కఖల - దేవతారక్షితమ్ముగా నా విస్పష్ట
పంచభూతమ్ము మత్కులపాలికాన - వామృతతనూగతాస్థి కృష్ణార్పణమ్ము.

బొల్లెమ్ములో గ్రుచ్చి సోగగా భిల్లకన్యాముగ్ధవేషమ్ము నవధరించి
ముంగురుల్ కొసల నిమ్ముగ వంకరగఁ జోపి గిరిజానవాకృతి కీలుకొల్పి
కటినీభవత్కుచాగ్రప్రలంబి విక్షప్తి శాంబరీవేషమ్ము నంతరించి
నవరించి రత్నభూషలుగ తీరిచి దిద్ది యతనియిల్లాలె యన్నట్లుతోచి
అమృతమోహన రత్నాకరాభిసరణ - వేళ నవనవశృంగారవేషమేచి
కొనగనిదిశాశ్వతముగ మత్కులసతీమ - హాపవిత్రదేహాస్థి కృష్ణార్పణమ్ము.

ఈయస్థిపతివత్నిదాయత మహిమ మం చంభోధి దేవత లాదరింప
అతిలోకసౌందర్యవతి యస్థి యిదియంచు నాగకన్యకలు మన్ననలు నలుప
తమవంటి సొబగునేత్రముల చానదియంచు మత్స్యకుటుంబినుల్ మమత పెంచ
అలప్రౌఢసుకవి యిల్లాలిదంచును జలాంతర్లీననాద సంతతులు పొగడ
ఈమహావారిసంస్థాన మెనయుకొలకు - నా మహాప్రేమ బలమున నా మహార్ష
మతము నా సర్వదేవతా వితతభావ - మస్మదీయ వ్రతాస్థి కృష్ణార్పణమ్ము.

సుతవావిర్ధృత మహాసుతతి తూష్ణీం సురాహారదుషద్బుధరూపమైనజ్యోతి
ప్రాగభూతము భూతవత్పరిణమయితవ్యీకరించిన యార్ద్రమైకరసము
సర్వభూతపునారసత్వసంకోచవేళావికారోజ్జ్వల దమృతమూర్తి
అఖిలావకాశ పూర్ణాను సంగత సంవిదాకార పరరూపమైన బ్రహ్మ
మీ మహాపస్స్వరూపము నామహాజ - లావికారరూపము, నా ప్రళయము నిండు
నునికికై యస్మదీయ వంశోత్తమాంగ - నామృతతనూగతాస్థి కృష్ణార్పణమ్ము.

ఏతన్నదీకుల్య లెగచి పండించెడు రాజనమ్ములకు శ్రీరామరక్ష
ఏతత్పయః ప్రాశనైధమానాంధ్ర పాలీదూపితామయాళికి శివాజ్ఞ
ఏతదగ్రాధ్వనీనాతి ప్లవత్పోతక శ్రేణి కాత్మరక్షా కవచము
ఏతదంతర్వసత్ప్రీత జంతువ్రల కనోన్యస్యహితం కరణౌషధమ్ము

గాగ నీవారి న్వాత్రిలింగవిషయమ్ము - నాసకలవారిజంతువు నమరియుండ
అస్మదంతర్ జ్వాలద్దీప మస్మదంగ - నాసుధాశరీ రాస్థి కృష్ణార్పణమ్ము.

వితతోగ్రవార్జంతు వివృతాస్యదశన సంగ్రసన ప్రమాదసంఘములవలన
ప్రాక్తీరబహుళతీవ్ర ప్రభంజనధుతాంభఃప్లోషణోపప్లవములవలన
పర్యగాధాంబుశాఫరచమూహారణార్థ పరికీర్ణవాగురాపదలవలన
శుక్తికాద్యప జిహీర్షుజన నానా సహాకర్షణాదిక దైవికములవలన
పొల్లుపోకయు సంచ్యుతి పొరయకయును-తత మహావారి నిత్యసంస్థానమందు
కొఱకు నాతారకముగ మత్కు-లసుధేశు-ణామృదు తనూగతాస్థి కృష్ణార్పణమ్ము.

వార్ధ్యంతు విధుతజంబాలాంతరుద్గత బుద్బుదశ్రేణియూర్పులుగ దనరి
అన్యోఽన్యసంఘట్టితాతివేలతరంగ ఘోషచేతులుమోదుకొనుట నొప్పి
అస్తవేళావీజితానిలాహతతటచ్ఛిన్నడిండీరమ్ము చెమట నలరి
ఉపరికూజద్విప్రయోగవ్యథాప్లుష్టచక్రవాకి యెలుంగునమితికూర్చి
నాకు దోడుగదుఃఖమంధరవిషాద-మూర్తియైనది శాశ్వతమ్ముగనె గాగ
అస్మదీయ గోత్రవిభూషమైన మత్ప్రి-యాంగనాశరీరాస్థి కృష్ణార్పణమ్ము.

ఒకయెన్నొ పుట్టుకలకుముందరైన మత్ప్రారబ్ధ మీరీతి బరిణమించె
నానావిచిత్ర జన్మకృతాస్మదఘరాశి అయిఅయి నేటి కిట్లయ్యె దుదకు
పితృదత్తమగునాస్తి హతమయ్యె నాయందు ఆయనిచ్చినభార్య అస్థైపోయె
నాతండ్రిచేసిన నానామహాపుణ్యకర్మ లీగతి గంగగలసిపోయె
మిగిలినది యొక్కడే నాకు, మేరువంత-బరువు నాగుండెలో మధ్యభాగమందు
అంతె పేరున కంతె భార్యాస్థిగాని - నాశరీరాస్థి నిజము కృష్ణార్పణమ్ము.

---

# శ్రీ కం. వీరేశలింగకవి-నవలలు

టి. కామేశ్వరరావుగారు

(వెనుకటి సంచిక తరువాయి)

౬. పరిశిష్టము

వచనగ్రంథాలపయి విమర్శ పూర్తిఅయింది. శ్రీ వీరేశలింగకవి అప్పటి సంఘంలోని లోపాలనుగ్రహించి వాటినిర్మూలనకై వ్రాసిన గ్రంథాలలో వచనప్రబంధాలు కొన్ని. మన సంఘంలో స్త్రీల స్థితి బొత్తిగా హీనంగా వుందని ఆయన తెలుసుకుని వారి అభివృద్ధి కోసంకూడా కొన్ని గ్రంథాలను వ్రాసేరు. వీరేశలింగకవి,సంస్కారోద్దేశంతోకాక, కేవలం వినోదంకోసం వ్రాసిన గ్రంథాలు చాలా తక్కువ. తెలుగువాఙ్మయంలో పారంపర్యంగా వస్తూన్న వాఙ్మయశాఖలను విడిచి విదేశ వాఙ్మయంనుండి కొన్ని నూతనవిధానాలను గ్రహించి ఈయన గ్రంథరచన చేసేరు. ఈయన రచనలకు దేశభాషల్లో వుపజ్ఞలులేమి కళాకౌశలవిషయకలోపాలు కొన్ని ఈయన గ్రంథాలలో కనపడుతున్నాయి. అయినా తమ అపారమౌలికత్వంచేత విస్మృతప్రపంచంలోకి దుముకజాలనట్టి గ్రంథాలను ఈయనవ్రాసేరు. ఆధునికాంధ్రవాఙ్మయాన్ని ప్రతిష్ఠించినవారు వీరేశలింగకవే. ఆకాలంలో వాడుకలోవున్న వచనశైలికీ ఈయన అవలంబించిన శైలికీ పోలిక లేదు. నేటివరకూ వాడ బడుతూన్న తెలుగువచనశైలికి కొంతవరకూ స్థిరమైన రూపం నిర్మించింది శ్రీవీరేశలింగకవే. ఇట్లన్నివిధాలా సాంఘికవిషయాల్లోను, వాఙ్మయంలోనుకూడా నూతనపద్ధతుల నీయనే స్థాపించేరు.

వీరేశలింగకవి వ్రాసిన నవలలు చాలా తక్కువ. ఈయన మరికొన్ని నవలలు వ్రాసి వుండవలసిందే. కాని యెక్కువ నవలలు వ్రాయకపోడానికి కారణ మీయన యిలాగ చెప్తున్నారు:

"రాజశేఖరచరిత్రము పత్రికాధిపతులచేతను, తదితరులచేతను బహువిధములు పొగడబడెనుగాని సామాన్యజనులు దానిని గ్రహింపలేకపోయినందున దానివలన నట్టి పొగడ్తలేగాని రశ్మి యేమియు నాకు గలుగలేదు. వేయిప్రతులుగల మొదటికూర్పమ్ముడుపోవుటకే బహు సంవత్సరములు పట్టినది. అందుచేత నిప్పుడు నవలలన బడెడు వచనప్రబంధములను వ్రాయు ప్రయత్నమును మానివేసితిని." (కం. వీ. స్వీ. చ. రెం. 143-వ పుట.)

పైకారణ మెంతస్వల్పంగా వుందో చూడండి. వీరేశలింగకవి చెప్పవలసిన మాటలా యివి! సామాన్యంగా గొప్పగ్రంథా లన్నిటికీ మొదట్లో జనాదరణఅంటూ లేదన్నసంగతి అందరూ యెరిగిందే. అటువంటి సందర్భంలో తా మట్టియోచనతో గ్రంథరచన మానుకోడం క్రమమైనపని కాదని వేరే చెప్పనక్కర్లేదు. అప్పు డాదరించబడని రాజశేఖరచరిత్ర

మిప్పు డెంత జనామోదితంగా వుందో చూడండి. ఈయన పడ్డ అభిప్రాయ మెంతపారపాటో మనకు తెలుస్తూంది. గ్రంథరచన కేవలం ధనంకోసం చెయ్యవలసిన పనే కాదు. విలువలేని గ్రంథాలను విలువకట్టతగిన ధనంతో సరిపోల్చకూడదు. ఈయన వ్రాసినగ్రంథాలెంత ప్రశస్తమైనవో అవి అనేక-ఇతరభాషల్లోకి అనువదించబడ్డాయన్న సంగతే చెప్తూంది.

ఈవిమర్శలో వీరేశలింగకవి వ్రాసిన స్వీయచరిత్రలోంచి అనేకఅంశా లెత్తిపొందించబడ్డాయి ఈఅంశా లీకావ్యాలను విమర్శించడంలో యెంత సహాయకారిగా వున్నాయో చదువరులే గ్రహించివుంటారు. వీరేశలింగకవి తన జీవితచరిత్రను రెండుసంపుటాలుగల గ్రంథంగా వ్రాసేరు. ఈయనజీవిత మెంతో ముఖ్యమైనది. దేశాభివృద్ధికోస మీాయిన తన జీవితాన్నంతా బలిదానం చేసేరు. అటువంటి అసామాన్యవిషయాలతో నిండివుండడంచేతే ఈయన తన చరిత్రను రెండుసంపుటాలుగా వ్రాయవలసి వచ్చింది. ఈమహాపురుషునితో సమంగా జీవితబలిదానం చేసిన వ్యక్తిగాని, లేక యింతటి ధీశక్తితో సకలకార్యాలు నిర్వహించిన వ్యక్తిగాని తెలుగుదేశంలో మరెవరు యింతవరకు పైకిరాలేదు.

తెలుగుమహాకవుల జీవితచరిత్రలనేవి ఎక్కడా, పూర్వ మెవరిచేత వ్రాయబడివుండలేదు. జీవితచరిత్రలయొక్క అవసరం మన పూర్వులకు కలగనేలేదు. దీనికి కారణం ప్రజలయొక్క కపటవైరాగ్యమో, లేక అజ్ఞానమో తెలియకుండావుంది. ఆమహాకవుల యొక్క నిజమైన జీవితాంశాల స్థానాన్ని పుక్కిటిగాథ లాక్రమించుకుని వారిని పురాణపాత్రలను మించిన వ్యక్తులుగా చేసివేసేయి. చరిత్రరచనయం దభిలాష లేకపోవడంవల్ల కలిగిన దౌర్భాగ్యమేకదా యిది. ఆకవులైనా తమ చరిత్రలను వ్రాసుకున్నారుకారు. సరే! ఆవిషయాలనుగురించి మన మిప్పుడు చింతించి ప్రయోజనం లేదు. కాని యిట్టి అనర్థం యికముందు కలగకుండా వుండేటట్లుమాత్రం చూసుకోవలసివుంది......ఆంధ్రమహాకవుల జీవితకాలనిర్ణయం చెయ్యడమే దుస్సాధ్యమైపోయింది. వారి చరిత్రలను చుట్టుకునివున్న పుక్కిటిగాథలను వదిలించి వారి నిజమైన చరిత్రలను తెలియజెయ్యడం సామాన్యమైనపని కాదు. ఈపనిని విశేషసామర్థ్యంతో చేసిన వారు వీరేశలింగంగారే. ఈరకమైన వీరి అద్భుతవిమర్శజ్ఞానానికి వీరి 'ఆంధ్రకవుల చరిత్ర'మే సాక్ష్యం. ఆంధ్రమహాకవుల జీవితాలనుగురించి చరిత్రలు బొత్తిగా లేనందువల్ల వీరేశలింగకవి ఆకవుల కాలనిర్ణయం చెయ్యడంతోనే తన పనిని ముగించవలసివచ్చింది. ఆకవులచే రచియించబడ్డ గ్రంథాలనుకూడా విమర్శించడానికి వారి కవకాశం లేకపోయింది. అందుచేత ఆపనిని తక్కిన భాషాసేవకులకు విడిచిపెట్టి తాముమాత్రం మొదటి సగంపనిని నెరవేర్చి వూరుకున్నారు.

ఇప్పటికాలంకూడా మునుపటికాలంలాగే వుండ నవసరం లేదుకదా. మునుపున్న లోపా

లను యిప్పుడు సవరించుకోవాలి. ఇప్పటి మహారచయితల జీవితచరిత్రలు వ్రాయబడ వలసిఉన్నవి. వీరేశలింగకవి తన జీవిత చరిత్రను విజ్ఞానచంద్రికాగ్రంథమండలివారి కోరికపై వ్రాసేరు. తెలుగుదేశంలో యింకా అనేకమంది మహారచయిత లున్నారు. వారి చరిత్రలుకూడా మన కెంతో అవసరమే. ఈమహారచయితలుకూడ తమ జీవితచరిత్రలను ముఖ్యంగా ప్రజలకోరికపై రచించి జనులకు ముందుముం దెంతో వుపయోగంగా వుండేటట్లా చేస్తే మంచిది. వీరేశలింగకవిజీవిత మెన్నెన్నో విషయాలతో సంబంధించినదికాబట్టి ఆజీవితాన్ని పూర్తిగా తెలియచెయ్యడానికి రెండుసంపుటాలు పట్టింది. కాని అన్నివిషయాలతో సంబంధించని యితర మేరచయితజీవితానికైనా వొకసంపుటంచాలు. కనుక యిప్పటి మహారచయితలు కూడ తమ వ్యక్తిజీవితాలను తమ గ్రంథకర్తృజీవితాలను తగురీతిని వ్రాస్తే సమర్థులైనవా రాగ్రంథాలను సంగ్రహపరచి ప్రజల కుపయోగపడేటట్లా చేయవలసివస్తుంది. కనుక ఆమోస్తరు సవరణలబారి పడకుండా మొదట్లోనే జాగ్రత్తగా వ్రాస్తే మెరుగు. జనులకు, విమర్శకజనులకుకూడ ఆస్వీయచరిత్ర లెంతో ప్రయోజనకారులుగా వుంటాయి.

వీరేశలింగకవి రాజశేఖరచరిత్రాన్ని ప్రకటించి యేభైయేళ్లపైన అయిపోయింది; సత్యరాజాపూర్వయాత్రలను ప్రకటించి నలభైయే ళ్లయిపోయింది. ఈగ్రంథాలను ప్రకటించి రమారమి రెండు పురుషాంతరా లైపోయేయి. అప్పటికీ వీటినిగురించి విమర్శ నేటివరకు వెలువడనేలేదు. ఏ గ్రంథంయొక్క ప్రాశస్త్యమైనా విమర్శమీదే తెల్లమవుతుంది. విమర్శవల్లే గొప్పకవులలో వున్న భేదాలు బైటపడుతాయి. అటువంటి విమర్శ లేకపోతే అంతా గొప్పకవులే అవుతారు. కాని వారిలో గల భేదాలు, గుణలోపాలు బైటపడవు. అట్లుగాక నిజస్థితి విశదము కావాలంటే విమర్శ అత్యవసరం.

వీరేశలింగకవినిగూర్చి శ్రీతోలేటి సుబ్బారావుగారు 'శ్రీవీరేశలింగకవిచరిత్ర' అను ఒకగ్రంథం ౧౮౯౮ లో ప్రకటించేరు. అటుతర్వాత ఆపుస్తకానికే మరికొన్ని కొత్త సంగతులు చేర్చి ౧౯౦౯ (?) లో తిరిగి ముద్రించేరు. వీరేశలింగకవి స్వీయచరిత్ర వ్రాసుకున్నారు. శ్రీసుబ్బారావుగారి గ్రంథం వీరి స్వీయచరిత్ర కెంతేనా సహాయ మయింది. సుబ్బారావుగారి గ్రంథంలో వున్న కొన్ని భాగాలు వీరేశలింగకవి తన సొంతభాషలో వ్రాసుకున్నారు. ఈమోస్తరుగా శ్రీసుబ్బారావుగారి గ్రంథం సఫలమయింది.

ఈవిమర్శవ్యాసానికి 'శ్రీ కం. వీరేశలింగకవి-నవలలు' అని పేరుపెట్టేను. ఇందులో విమర్శించబడ్డవాటిలో వొక్క- నవలలేకాక కథలుకూడా వున్నాయి. అందుచేత ఈపేరు సరియైనదిగా కనపడకపోవచ్చు. కాని యీ

వచనప్రబంధాలలో ముఖ్యమైనవి నవల లవడంచేత, వచనప్రబంధ మనేది మనలో ఇప్పుడు వాడుకలో ఉన్నమాట కాకపోవడంచేత, వీరేశలింగకవే వచనప్రబంధమంటే నవల అని అర్థంచెయ్యడంచేత యీవ్యాసాని కావిధంగా పేరు పెట్టను.

వీరేశలింగకృత పత్రికరచనలనుగురించి విమర్శ లేదు. అందుచేత వారి గ్రంథాల యొక్క విలువనుగురించి అభిప్రాయ మేమీ మనకు దొరకదు. అట్టిస్థితులలో సాహసించి నే చేసినవిమర్శలోఅనేకదోషాలుండవచ్చు.సహృదయు లాదోషాలను విమర్శించ ప్రార్థితులు.

---

# మే ఘ దూ త

(ఆంధ్రగ్రంథమాల ౧౬-వ కుసుమము)

కర్త: దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు (కళానిధి గ్రంథమాల, నెల్లూరు).

కాళిదాసుని మూలమునందలి భావసంపద కోలుపోవని స్వతంత్ర పద్యరచనము. పదముల కూరుపు, నుడికారము సొంపు, జాతీయముల పెంపు, అన్వయసారళ్యము గలిగి, రచనము తేటతేనవలె నూటలూరించును. సహృదయు లగు పలువు రాంధ్రకవిపండితవర్యులచే ‘ మేలు మేలు ’ అని మెప్పు గన్నది. వెల రు. ౦-౧౨-౦.

మేనేజరు: ఆంధ్ర గ్రంథమాల, 6-7, తంబుశెట్టివీథి, జార్జిటవున్, చెన్నపురి.

# శతకమంజరి - భక్తిసంపుటము

వృషాధిప, సర్వేశ్వర, దేవకీనందన, ఒంటిమిట్టరఘువీర, నారాయణ, శ్రీకాళహస్తీశ్వర, దాశరథి, రంగశాయి, శ్రీరామతారక, రామచంద్రశతకములు పది యిందు గలవు. ఒక్కొక్క శతకమునకు పెక్కు మాతృకలతో సరిచూచి చేర్చిన పాఠభేదములును, ఆయా శతకకర్తల చరిత్రమును, రచనమును, విషయమును విమర్శించిన విపులమగు పీఠికయును గలవు. ముచ్చటలు గొల్పునట్లు మేలి క్యాలికో బైండు. వెల రు. ౧-౮-౦. శతకములు విడిగను దొరకును.

విలాసము—ఆంధ్ర గ్రంథమాల, 7, తంబుశెట్టివీథి, మద్రాసు.

# సాంఘికనవల

గరిమెళ్ల సత్యనారాయణగారు

మన ఆంధ్రమున నిప్పటి కొకవేయినవలలయినను ప్రచురింపబడియుండవచ్చును. వీటిలో ననేకములు బంగాళీ, హిందీ, మహారాష్ట్రము మొదలగు దేశీయ భాషలనుండి తర్జుమాలై యున్నవి. వీటిలోగూడ కొన్ని మహమ్మదీయ, మహారాష్ట్ర, రాజపుత్రయుగములనాటి చరిత్రాత్మకములై యున్నవి. కొన్ని బ్రిటిషుయుగము నాటి రహస్యపరిశోధకములై యున్నవి. మఱికొన్ని పౌరాణికములై కూడ యున్నవి. అతికొంచెముమాత్రము గ్రంథకర్తలు తాము స్వతముగా నాలోచించి వ్రాసినవై యున్నవి. వీటిలోగూడ కేవల మాంధ్రదేశపు టాచారవ్యవహారములకును, ఆంధ్రదేశపు పల్లెలు, పట్టణములు, ఏఱులు, సరోవరములు మొదలగువాటి వర్ణనలకును సంబంధించినవి మఱియు స్వల్పము. ఈచివర వాటినే తప్ప మఱివేనినిగాని ఆంధ్రసాంఘికనవలయని పిలచుటకు వీలులేదు.

అయినను ప్రస్తుతగ్రంథకర్తలలో సాంఘికనవలలు వ్రాయుదమను నుత్సాహము మిక్కుటముగ గనుపట్టుచున్నది. ఇట్టి యవసరమున సాంఘికనవల కుండవలసిన లక్షణము లెవ్వి, అవి యెట్లు మన ప్రస్తుతసాహిత్యమున నచ్చటచ్చట పొడచూపుచున్నవి. వాటి నెల్ల సంపుటీకరణము చేసి యందమగు సాంఘికనవలానిర్మాణమున కెట్లు దారితీయవలెను అను నంశములను కొంచెము విచారించుట యెంతమాత్రమును నప్రస్తుతము కాదు. లాక్షణికు లిట్టి నిర్ణయ మిప్పుడు చేయనిచో ప్రతిలేఖకుడును ఏవివాహమునకో వ్యవహారమునకో లేక వింతకో సంబంధించిన యొక కథ నల్లి దానికి సాంఘికనవల యను పేరు పెట్టుట తటస్థింపవచ్చును. అట్లు జరుగుచున్నదికూడను.

ఐరోపాఖండములోనేమి భారతదేశముననేమి నవలయననది పురాణములు, పద్యకావ్యములు, వచన చరిత్రములు మొదలగునవి యెన్నియో వెలువడినతరువాత నూతనముగ వికసించిన సాహితీవిశేషమని చెప్పవచ్చును. అయిరోపాఖండములో అనేక సాహిత్యవికాసములకు లేటినుభాషయు ఇటాలియనుగ్రంథములును మార్గదర్శకములైనట్లే నవలలకుగూడ ఇటాలియనునవలలే మార్గదర్శకములుగా నుండెను. ఇటాలియనునవలలు తరచుగా ఉన్నతకుటుంబములకు చెందిన యువతీయువకులు నాయికానాయకులు కలవిగాను, వారు ఒకరి ప్రేమ నొకరు చూఱగొనుటకు చేయు త్యాగములు, విలాసములు, పరిశ్రమలు మొదలగునవి విషయములుగా గలవిగాను, చాలామట్టుకు చరిత్రాత్మకములుగాను, కొంతవరకు అద్భుతములతో కూడినవిగాను నుండెడివి. అయిరోపాఖండము ఇటాలియనుసాహిత్యపరిచయము వలన బడసిన నూతనభావములతోను, ఉత్సాహములతోను ఉఱ్ఱూతలూగెడి సమయమున వివిధదేశములలో ప్రథమమున వెలువడెడి నవల లిట్టివిగానే యుండెడివి. ఆంగ్లేయ భాషలో స్కాటునవలలను పఠించినవారికి వీటి లక్షణములు తెలియగలవు. మనదేశములో రసపుత్రశౌర్య ప్రచురముగా రచించిన విమలాదేవి, రాణీసంయుక్త మొదలగు నవలలుకూడ నిట్టివే.

ఈనవలలను పఠించుటవలన నవలయను పేరు మోసెడి ప్రతిగ్రంథమునకును కొన్ని పడికట్లుండు ననియు, అవి లేనిచో ఆగ్రంథము నవల కాదనియు అభిప్రాయము సాహిత్యప్రపంచమున నల్లుకొనెను. ఆపడికట్లు ఉన్నతవంశమునకు చెందిన నాయికానాయకులు, వారొకరికొరకొకరు తప్పక త్యాగము చేసి యిడుమలు గుడిచి తమ ప్రేమను బుజూవుపరచుట, ఇందుకొరకొక యుద్ధమో లేక పోరాటమో కల్పించుట, నవల శుభప్రదమై నీతిదాయకమై వెగడుట, భావరసోద్దీపకమై శబ్దాలంకారశోభితమై లలితమై గంభీరమైయుండుట. ఆయాతావుల కథ కెంతయవసరమో అంతకుమించియు (కథనడకతో విస్తారముసంబంధము లేకపోయినను సరే)

ప్రకృతివర్ణనలు సలుపుట మొదలగునవి. ఈవిశ్వాసము నవలప్రపంచమున నొక మార్గమతమువలె వ్యాపించి యీజాతినవల లన్నియు స్థలనామములు పురుషనామములుమాత్రము భేదముగా సమస్తదేశముల నవలలు నొక్కమాదిరిగా నుండునట్లు చేసినది. ప్రత్యేకస్థలముల యాచారవ్యవహారములుగాని నిరూపణలుగాని వ్యక్తుల పోలికలుగాని చేజిక్కక యువకజనోచితంబగు నుత్సాహమునుమాత్ర మినుమడించుచు, అద్భుతచర్యల పఠనమున కాసక్తిం గొలుపుచు వచ్చినవి. వీటిని నవలలుకావని యెవ్వరును ననజాలరు. అవి యొకరీతినవలలు. కాని సాంఘికనవలలు కావు.

సంఘజీవనమునం దాసక్తిపుట్టి, వారి యాశలు ఆశయములయందు మన కభిరుచి జనించి వారి కోపములు చెలుపులు హాయలు యెయ్యారములు నవ్వులు పరియాచకములు విచారములు కష్టసుఖములు మొదలగు వానియందు సానుభూతి జనించి, ఆఅచ్చటలనుముచ్చటలను ఆనందదాయకముగ వీలయినంతవరకు వారు మాటలాడుకొనే శబ్దార్థాద్యలంకారరహితమగు శైలిలో చెప్పెడి ప్రశంసలకే సాంఘికనవలలని పేరు. అట్లని శైలి నీచులు అల్పులు మాటలాడెడిరీతిని హీనపదభూయిష్ఠమై యుండకుండా సత్యమై వెగటుపుట్టించకుండిన చాలును. ఇట్టి నవల కుండవలసిన ముఖ్యలక్షణమేమన కథయేకాలమునాటిదని మనము చెప్పుచున్నామో ఆకాలమునాటి మాటవడుపు, యాస, మర్యాదతీరు స్థలాదుల చిత్రము కళ్లకు కట్టినట్లగపడవలెను. ఇట్టివన్నియు పురుషాంతరమున కొకసారి యైన నచ్చుముగ మారిపోవుచుండును. సాంఘికనవలయనిన కథచెప్పుట కాదు. కథచెప్పుట కట్టి శైలియైనను నొకటే, యెట్లు వర్ణించినను నొకటే. సాంఘికనవలయనిన కథను చిత్రించుట. ఇట్టిచిత్రమున కెక్కడ నుండవలసిన రంగు, నీడ, కాంతి, అక్కడ సరిగానుండినచే చిత్రము సరియైనదగును కాని సంఘమర్యాదలు వివరములు స్థలముయొక్క తాత్కాలికవిచిత్రములు మొదలగువానియందు లక్ష్యములేక లేఖకుడు తన కల్పనలతో నవిచ్ఛిన్నముగ విజృంభించినచో ఏదోయొక చిత్రము తయారయి ఏకొయొకవింత గొలిపి మోహింపజేయునేకాని అది సంఘచిత్రము కానేరదు.

సంఘచిత్రము సరియైనదై యుండవలెను, అనగా సత్యమైనదై యుండవలెను. సత్యమనగా ఇక్కడ బ్రహ్మపదార్థమును గూర్చిన సత్యమువంటి విశేష సత్యముకాదు. ఆసత్యము దేశకాలపరిస్థితుల మార్పువలన బాధింపబడనిది. ఈసత్యము దేశకాలపరిస్థితుల మార్పువలన బాధింపబడు సామాన్యసత్యము. స్థలములు నేడున్నట్లు మరి పదియేండ్లతరువాత నుండవు. మాటతీరులు అలవాటులు మర్యాదలు ఆచారములు తాత్కాలికచరిత్రాత్మకమగు విశేషములు మొదలగునవికూడ నేడున్నట్లు ఒకపురుషాంతరమునకుముం దుండియుండవు; ఒక పురుషాంతరముతరువాత నుండబోవు. ఈచిత్రమును మనము కన్నులారచూచుచు చిత్రించినచే సరియైన సత్యమైన చిత్రము చిక్కునుకాని ఊహాప్రపంచమునుండి కల్పనలను తీసుకొనివచ్చి చిత్రించినచో అది కృత్రిమము కాకమానదు. కనుక సాంఘికనవలగ్రంథకర్త తనకన్నుల యెదుట ప్రవహించుచున్న కాలవాహినిని గాంచుచు, అందలి విషయములనుగూర్చి వ్రాసినప్పుడే సరియైన సత్యము చిక్కునుగాని రసపుత్రయుగమునాటిదియు, వంగభాషమాటాడు వంగదేశమునకు సంబంధించినదియు రాయదూరుయుద్ధమువలె విజయనగరసామ్రాజ్యము నాటి ఆంధ్రులచరిత్రకు సంబంధించినదియు నగు విషయము నెత్తుకొని వ్రాయగడంగినచో మన చర్మచక్షువులయెదుట జరుగు ఆకళంకసత్యమును గాక ఊహాచక్షువునెదుట గోచరించునట్టియు అఘోరకల్పనలతో కూడినట్టియు శృంగారవీరశోకాద్భుతాదిరసంబులతో మనడెందముల నానందకల్లోలినిలో మునుచునట్టియు విచిత్రకాల్పనికసత్యమునుమాత్రమే చిత్రించినదగును. పందొమ్మిదవ శతాబ్దమున జీవించిన థాకరేయను ఆంగ్ల నవలకారుడు పదునెనిమిదవశతాబ్దమునాటి యొకకథను నవలరూపముగా వ్రాసెను. అందుకొర కాశతాబ్దపు మర్యాదలు సంభాషణములు మొదలగునవి యెన్నో పఠించి చిత్రముల నెన్నింటినో దర్శించి కష్టపడెను. అయినను అతనిని అద్భుతకార్య మొనర్చిన యొకప్రజ్ఞా

వంతుడుగను, సాధింప సాధ్యముకాని కృత్యమును చాలావరకు సాధించిన యొకవీరునిగనుమాత్రమే పరిగణించుచున్నారు. కాని దానిని సంపూర్ణమగు సాంఘిక నవలయని వ్రాయుట కేవిమర్శకునకును చేయిరాకున్నది.

సాంఘికనవలయనగా కథ యేకాలమునకు చెందినదో ఆకాలముయొక్క సరియైనచిత్రము. గ్రంథకర్తలు తరుచుగా తమకన్నుల యెదుట జరుగు చర్యలనే సరిగా చిత్రించలేక యేదోఒక ఆభాసము చేయుచుందురనిన వేరొక కాలమునాటి చిత్రము నెట్లు సరిగా వర్ణించగలరు? వారు వర్ణించిరని నిర్ణయించగల తీర్పరు లెవరు? జరుగుచున్న కాలమునాటిదానికి సజీవమగు ఆసంఘమే సాక్షి. ఏమాత్ర మెచ్చుతగ్గున్నను యేయమ్మలక్కలైనను కనిపెట్టగలరు. ఇక విమర్శకవిశారదులమాట వేరె చెప్పనేల?

కనుక సాంఘికనవలను వ్రాయబూనువాడు తన కాలమునాటియు, తనకు తెలిసినట్టియు, తాను కనినట్టియు జీవితాంశముల నెత్తుకొని వర్ణింపదొడగిననే సఫలీకృతుడగునుకాని "అనగనగా నొకరాజు" అని యేపూర్వచరిత్రనో గైకొనినచో కేవలపరిహాసపాత్రుడగును. కథ జరిగితీర నక్కరలేదు. నిజముగా జరుగుచున్నట్లుపించినజాలును.

సాంఘికనవల కవి వ్రాయుచున్ననాటి కాలముదై యుండవలెను. 'మనకథ జరుగుచున్ననాటి సమయమున' నమప్రయోగ మం దెచ్చటను కానరారాదు. కథ యేభాషలో వ్రాయబడుచున్నదో ఆభాష మాటలాడే పాత్రలకును జాతికిని సంబంధించినదై యుండవలెను. ఒకదేశపు ప్రజలు వేఱొకదేశపు భాషను దానికి స్వతస్సిద్ధమగు జాతీయములతోను, నుడువుతోను సౌందర్యముతోను మాటలాడజాలరు. కవి తన స్వభాషలో స్వభాష మాటలాడువారి జీవమును ప్రతిబింబింపజేయుటకు ప్రయత్నించిననే సాంఘికనవల సరియైన చిత్రము కాగలదుకాని లేనియెడల సరియైనది కాజాలదు.

కథ సత్యముగ జరుగుచున్నట్లగుపించవలెననిన సాంఘికనవల కవికాలమునాటిదై కవియొక్క స్వభాషలో రచితమై, పాత్రలు తమ మాతృభాషను నవలలో మాటలాడుచుండవలెనని చెప్పియుంటిమి. కథ సహజముగ నగుపించవలెననిన కథలో నెచ్చటను కృత్రిమ నామము లుండరాదు. కృత్రిమనామములనగా ఆభాష మాటలాడే ప్రజలుగల రాష్ట్రములో వాడుకలోలేని స్థలనామములు, పురనామములు, పురుషనామములు మొదలగునవి. భోగవతి, మధురానగరము, ధార్మికపురము, శ్రీనికేతనము మొదలగు పురనామములు, రజతగిరి, కనకాచలము మొదలగు కొండలపేరులు, మందాకిని, మత్స్యవతి మొదలగు నేఱులపేరులు, వీరసేనుడు, విజయసింహుడు మొదలగు పురుషనామములు, సంధ్యావళి, మదాలస, మనోరమ మొదలగు స్త్రీనామములు—ఇట్టివి మన తెలుగుదేశములో లేవు. కనుక ఇట్టి పేరులను కవి సాంఘికనవలయందు ప్రయోగించినచో, అంతవరకు అవి కాల్పనికములుగా తోచి కథ నంతవరకు సత్యము కానట్లు తోపజేయును. ఆంధ్రదేశపు సాంఘికనవలను వ్రాయగడగినచో ఆంధ్రదేశములో నున్న నదులు, కొండలు, గ్రామములు, పట్టణముల పేరులును ఆంధ్రదేశములో వ్యాపకములో నున్న స్త్రీపురుషనామములనుమాత్రమే ప్రయోగించవలెను.

ఇంతియకాదు. ఈనదులను గ్రామములను మొదలగువానినిగూర్చి వర్ణించునపుడుగాని, వాటి ప్రశంసలు వచ్చునపుడుగాని యేనదులకైనను గ్రామములకైనను సమానముగ వర్తించునట్టియు పురాణప్రబంధములలో తరుచుగా గానవట్టియు సమానగుణములు కురిపించి విడచి చేయక, ఆయాపేరులుగల గ్రామములకు నగరములకు పట్టణములకు ప్రత్యేకించి చెల్లునట్టియు, కథనముయొక్క గమనికకు వీలయినంతవరకు ప్రతియక్షరమును సంబంధించునట్టియు విశేషములు చేర్చవలెను. ఇట్లు చేయుట వలన ఇతివృత్తము సరిగా నడచుచున్నట్లు మనదృష్టికి గోచరించుచుండును.

పిమ్మట ఈదేశములో నున్న కులాచారవ్యవహారములను చిత్రించుచురావలెను. కాని పల్లెపడుచులకు పట్టణవాసపు ఫేసుపౌడరులను పూసియు, పట్టణపుకన్య

లకు టక్కుమునుగులు, ఇంగ్లీషుగౌనులు తొడిగియు వికారవేషములు వేయరాదు. ఆచారములను వారి ప్రవర్తించువారి విషయమై వర్ణించునప్పుడు మాత్రమే అట్టుల వ్రాయనగును. ఇదికాక ప్రతిజాతికిని జాతిలక్షణము లనవొప్పు కొన్ని స్వభావలక్షణము లుండును. ఇవి దేశము నుండి దేశమునకు, రాష్ట్రమునుండి రాష్ట్రమునకు మాత్రమేకాక ఒకే గ్రామము లేక నగరములోకూడ ఒక తెగనుండి మరియొక తెగకుకూడ భేదముగా నుండును. వారి యిళ్లు వాకిళ్లలోను, వారి వస్తువాహనముల నుంచు కొనెడి యిమ్ములలోను, ఒకరినొకరు పలుకరించి ఆదరించెడి విధానములోను, ఇతరులతో ప్రవర్తించునప్పుడు కనబరచు విధివిషయములు లేక పెక్కుటక్కులలోను, శుభాశుభపుణ్యాపుణ్యకార్యములలోను, ద్రవ్యాదుల నాకర్షించునట్టి లేక వెచ్చించునట్టి తెరవులలోను, సరసములు సల్లాపములలోను ఈ లక్షణములు తమ్ము చూడు చూడుమన్న ట్లగుపించుచుండును. నిజమైన శిల్పదృష్టి గలకవి వాటి నిట్లే పోల్చి వర్ణనలలో ప్రశంసలలో సంభాషణలలో వాటిఛాయల నాకర్షించి ముద్రించ గలడు. ఈశిల్పదృష్టి లేనివా డెంతపండితుడయ్యు, ఎట్టి గ్రాంథికశైలి గలవాడయ్యు, ఎట్టి యనర్గళధార కలవాడయ్యు ఆసంఘచ్ఛాయ నాకర్షించలేడు.

ఈ శిల్పదృష్టి స్వతస్సిద్ధముగా పుట్టుకొనిరావలసినదే యని యొప్పుకొనుచునే అట్టి శిల్పుల కుండవలసిన కొన్ని సాధారణలక్షణములుమాత్ర మిచ్చట చెప్పవలసియున్నది. వారు సంఘమున కెడయెడముగాగాక సంఘముతో కలసిమెలసి తిరుగ నభిలాషగలిగి తిరుగుచుందురు. వారి కష్టములను సుఖములను, సరసములను విరసములను తాముకూడ ననుభవించునట్లు మనశ్శీలనములను గలిగియుందురు. అందరితోను కలుపుకోలుతనముతో తిరుగగలట్టియు, అరమరఅభ్యంతరము లేక ప్రవర్తించునట్టియు, అందరికిని హర్షప్రదమైనట్టియు స్నేహపాత్రమైనట్టియు జనపరిచయము, సంభాషణతీరు, హాస్యరసము, అనుకూలమను నడవడి కలిగియుందురు. సాంఘికనవల వ్రాయగోరువారు ముఖ్యం దెంతవర కీలక్షణములు తమకు గలవో యోచించుకొని, అలవాటు చేసుకొని ఛాయాగ్రహణశక్తి నలవరచుకొని గ్రంథరచనకు గడగినచో బాగుండును. లేనియెడల ఆగ్రంథము సరియగు చిత్రముగా ప్రచారముకాక గ్రాంథికశైలికొరకో, అద్భుతములగు చర్యలకొరకో, దీర్ఘమగు కథకొరకో, నీతిబోధకొరకో, పాఠశాలతరగతులలో పఠనీయమైనదిగా కమిటీవారిచే నిర్ణయింపబడుకొరకో మాత్రమే గౌరవము కలిగియుండును.

కవి కీదృష్టి యుండి, స్వభాషలో రచించుటకు, స్వభాష మాటలాడువారి చర్యలే వ్రాయుటకు వారి ఆచారవ్యవహారములను, లక్షణములను, ఆశలు విలాసములను, కష్టసుఖములనే చిత్రించుటకు గడగినచో సాంఘికనవల మనోహరముగ నుండును. సాంఘికనవల రచించువారి కింకొకవిషయమునుగూర్చి అత్యంత శ్రద్ధ వహించవలసియున్నది. అది శైలినిగూర్చి. ఈసందర్భమున గ్రాంథికవ్యావహారిక శైలులనుగూర్చిన చర్చకు దిగుటకు నా కెంతమాత్రమును నిష్టములేదు. సాంఘికనవలనుగూర్చి ఆలోచించినంతవరకైనను, ఒక శైలి వ్యావహారిక మైనంతమాత్రమున గ్రంథస్థమగుటకు తగదనియు, గ్రాంథికమైనంతమాత్రమున సంఘమును చిత్రింపజాలదనియు చెప్పుటకు నేను సాహసింపను. శైలి కవికి నైజమైయుండవలెనుకాని శ్రమపడి పుస్తకములు వెదకి కష్టమై అపరూపమైన ప్రయోగముల నేర్చి గ్రంథములో గాంభీర్యముకొరకు జొనుపబడినదిగా నుండకూడదు. సముద్రతరంగములవలె గంభీరముగ నుండునుగాక, సెలయేటి కలకలమువలె మంజులముగ నుండునుగాక, తేనెసోనవలె తేటగ నుండునుగాక! శైలి కవికి నైజమై యుండవలెను. అతను సృష్టించెడి పాత్రలనోటిలో నది ఔచిత్యము గలిగియుండవలెను. పాత్రల సంభాషణలో నుపయోగించెడి శైలిమాత్రము వీలయినంతవరకు మాటలాడుకొనే భాషలో, అరసున్నలు నెరసున్నలు లేక అనాయాసకరమైనదిగా నుండకతీరదు. లేనియెడల నాపాత్రలు మనకు వింతగొలుపునుగాని నైజత్వమును స్ఫురింపజేయవు. వారి సంభాషణపై విమర్శనములు, వారు సంభాషించుచుండు తరి వారి హావభావవిలాసములను వర్ణించు భాగములు

కూడ ఆశైలిలోనే వ్రాయుట యెంతయు నుచితము. కవి తానుగా నొనరించు స్థలాదుల వర్ణనలు, సంఘసమస్యల చర్చలు, పాత్రల యోగ్యతలనుగూర్చి అభిప్రాయములు, వాటిపై విమర్శలు తన కిష్టమైన శైలిలో వ్రాయవచ్చును. అవి కవిఅభిప్రాయములు కనుక పాఠకులు శ్రమతీసుకొని చదువగలరు. కాని పాత్రలే మాటలాడునప్పుడు లేదా వారి సంభాషణలలో ప్రక్కప్రక్కను వచ్చుచు వాటి సున్నితములను మనము గ్రహించుటకు కవి సహాయముచేయవచ్చునప్పుడు, కవి తన ప్రతిభను పాండిత్యమును కల్పనాప్రాగల్భ్యము జొప్పించక పాత్రలను తమంతటతామే వచ్చుచుపోవుచు మాటలాడునట్లు చేయవలెను.

చారిత్రకనవలలవలె, మోహశౌర్యప్రధానములగు నద్భుతనవలలవలె, కూపీలుతీసెడి చమత్కారముల మాపు రహస్యపరిశోధకనవలలవలె సాంఘికనవలలు కథాప్రధానములైనవి కావు. వీటికి ఒక మొదలు, ఒక నడుము, ఒకతుది అని యుండవలసిన ఆవశ్యకత లేదు. సంఘపు పోకడయు మానవుల సామాన్యసాంసారికచర్యలే యొక మనోహరములగు నవలలవంటివి. దానిని చిత్రించుట కెక్కడ నుంచి ప్రారంభించి యెక్కడతో మన మాపినను ఒకటే. మన గ్రంథప్రారంభమే ఆకథయొక్క ప్రారంభము కాదు. మన మాపిన మాత్రమున ఆకథ ముగిసినదని చెప్పుటకు వీలు లేదు. కాలశకటములో ప్రయాణము చేయుచు కవి చూపినంత మేరను మనము చూచినాము. చూపని మేరలనుకూడ చూడవలె నని యున్నను మనకు సాధ్యము కాక యూరకొనుచున్నాము. సంఘములో ఏ గ్రామములో లేక ఏవ్యవహారములో, ఏయే రంగములకు సంబంధము గలదో ఆయా రంగముల వాయా వరుసను చిత్రించుకొనుచుపోయినచో చాలును. కారణాంతరములచే వాటికి ముందుండిన రంగములను విడువవచ్చును. వాటి తరువాతి రంగమును చిత్రింపక పోవచ్చును. ఈకారణములచేత ఇట్టి నవలలకు శ్రమపడి ఆలోచించి పన్నవలసిన వ్యూహము లేక చట్రము (delibarate plot) ఉండవలసిన ఆవశ్యకత లేదు. సరే గదా అది యెంత లేకపోయిన కథ అంత స్వతసిద్ధమై యున్నట్లగుపించును.

చిత్రవిచిత్రముగ నల్లిన వ్యూహము (plot) లేనిదీ, శౌర్యపరాక్రమాది రసప్రధానము కానిదీ, అద్భుతాశ్చర్యముల పెల్లుగ్రుమ్మనిదీ, రహస్య పరిశోధకులు వెన్నాడి లోకకంటకుల గుట్టుమట్టు కనిపెట్టి పాఠకుల కుతూహలము తీర్చనిదీ, విరహవేదనతోడి విప్రలంభములు, సుందరపద్యములతోడి మోహలేఖలు, శబ్దాద్యలంకారయుక్తములగు ప్రకృతివర్ణనలు లేనిదీ, నవలయేమిటి అని ఇప్పటి పాఠకలోకమున కచ్చెరువు కలుగవచ్చును. కాని యిట్టి విశేషములు సంఘములో నెప్పుడేని కలుగుచుండును గనుక కథలనియు, సదా సంఘములో నిల్చి జరుగుచుండవు గనుక సాంఘిక నవల కథ కాదనియు, కథకాని సాంఘికచరిత్రలో నిట్టివి తరుచు కలుగుచుండవు గనుక సాంఘికనవల యిట్టి పైపై తెచ్చుకోలు విశేషములేక సాధారణసంఘమువలె చల్లగా సాధారణపు టచ్చటలుముచ్చటలు, కష్టసుఖములు కోరికలు ప్రయత్నములు జయాపజయములు మొదలగు వానితో గూడి సంఘముయొక్క సాధారణ సమయవాహినీ చిత్రమువలె నలరారవలెను.

---

# యోగనిద్ర

దివాకర్ల వేంకటావధానిగారు

అవని జనింతు ధర్మమున కభ్యుదయంబు నశించి, హాని సం
భవమయినప్పుడెల్లఁ, బరిపంథుల దుష్టుల నుక్కడంతు, న
ష్టవిషయ ముద్ధరింతునని పల్కియు నయ్యది విస్మరించువాఁ
డవె? నిదురించుచుంటివో? విలంబమొనర్చెదవేల నీక్రియన్?

ప్రతియుగమందు లోకు లలరన్ బ్రతిదేశమునందు నేను పు
ట్టితి, విశదీకరించితిఁ గడిందిగ నుత్కట ధర్మసూక్ష్మ, ము
న్నతిని ఘటించుమార్గము కనంబడుచున్నది, లోకసంకట
చ్యుతి తనయంతనే జరుగుఁ జోద్యముగా ననఁబోకు మోప్రభూ!

తనప్రాణములఁ దీయఁదలఁచినదుష్టుల నైనను క్షమియించు టర్హమనియుఁ
దనశాత్రవునిగూడ ననురాగబలమున వశునిగాఁ జేయఁగ వలయుననియుఁ
జలిచీమకేనియు బలమున్నదని యెంచి హానియొనర్చు టన్యాయ మనియుఁ
దనకున్న ధనకాంక్ష తఱుమగా నితరుల కుత్తుక ల్గోయుట కూడదనియుఁ
బలికినది నిల్పుకోవలె విలయమబ్బు-గాక! యని మాకొసర్చిన కఠినధర్మ
శాసనము లన్నియున్ శిరసావహింపఁ-దగిన వత్యుత్తమంబులే యగునుగాని

అర్థమేలేని వందనమాచరింతు-రఖిలజనులును దూరమ్మునందె నిల్చి
మారేఁగాలం బదేమికర్మమ్మొగాని-నీవుపడినట్టి శ్రమయెల్ల నిష్ఫలంబు.

ధనమే నేడు ప్రధానవాంఛితము తద్దాస్యంబునం జేసి చే
యని దుష్కార్య మొకండు లేదు, కృతకవ్యాపారమే జీవనం
బున కాదర్శము, ప్రస్తుతావనికి సంపూర్ణాధి నిర్ణేతయున్
ధనవంతుండె, భవత్ప్రతిష్ఠ యిపు డేదావాగ్నిలో మ్రగ్గెనో?

ముమ్మరమైన యంత్రబల ముండితమూర్ధము లౌచు నెన్ని రా
జ్యమ్ములు కూలుచున్నవి? విచారమెఱుంగని దుష్టులైనవా
రమ్మలికంబు దీర్చుకొను చుండఁగ దుర్బలు లెంతమంది మా
న మ్ముడిపోయి, భాగ్యములు నాశనమై గతియించుచుండిరో?

ఖేదముతోడ మానస మకించనమై కృశియించుచుండ ను
న్మాదమునన్ జరించుచు సమాయితు లెంద రధర్మసాగరం
బీఁదఁగఁ బోయిపోయి చలియింపని దుర్భరకర్కశార్దులన్
మోదుకొనంగ నేగతిని మూర్ధము బీటలు వారుచున్నదో ?

అడలఁగఁ జోటులేమి విపినాంతర భూములకేఁగి యచ్చటన్
జడియుచు ధర్మదేవత నిశాసమయంబులయందు మాత్ర మె
న్నడుఁ గనరాని దీ బ్రతుకు నాకు ఘటించిన దేమటంచు నె
క్కుడుగ మనంబునం గుమిలి కూఁయిడుచున్నది కుంచితాస్యయై.

ఇట్టి విపరీతనాటకమెల్లఁ జూచు-కొలఁది నీకును చిత్తంబు జలదరింపఁ
దత్పరంబుగ మౌనముద్రను వహించి-యేమి యోజించుచుంటివో యెఱుఁగనగునె?

అవనీపాలనమందు నిప్పటికి నీ కాయాసమే కల్గెనో
వివిధానర్థములన్ ఘటింపుచు భవద్విఖ్యాతి మాయింప స
ర్వవిధానంబులఁ జూచు మోరకు లధర్మాధ్వమ్ములం బోవువా
గు విశేషమ్ముగఁ బ్రీతిపాత్రు లయినారో? తెల్పు మీశానుఁడా!



# 'విజయవిలాసవ్యాఖ్యానవిధాన' విమర్శనము

భాగవతుల వెంకటశాస్త్రిగారు, బి. ఏ., యల్. టి.

ఆంధ్రవిశారద తాపీ ధర్మారావుగా రధికపరిశ్రమ చేసి "విజయవిలాసవ్యాఖ్యానవిధాన" మను శీర్షికతో భారతియందు వరుసగ వ్యాసములు వ్రాయుచు నాంధ్రుల కృతజ్ఞతకుఁ బాత్రులగుచున్న విషయము భారతీపాఠకుల కందఱకు విశదమే. గ్రంథమునఁ బ్రక్షిప్తముగ నున్న యనేకసుప్తార్థములను వీరు త్రవ్వి బైటకుఁ దీసి పాఠకులకు విచ్చలవిడిగఁ బంచిపెట్టుచున్నారు. కావున వీ రాంధ్రులప్రశంస కెంతయుఁ బాత్రులు.

కాని వీ రప్పుడప్పుడు విమర్శనాపారవశ్యతచేఁ గాఁబోలు కొంచెము ప్రస్తుతము మఱచునట్లు కనఁబడును. ఒకపద్యమును వ్యాఖ్యానముచేయునప్పు డాపద్యార్థము నవధిఁ జేరుటకుఁ బయనమై యాయూఁపున నాయవధిని దాఁటి మఱికొంతదూరము పోవుటకు నావేగము నణఁచుకొనఁజాలనట్లు కనఁబడును.

జూన్ నెలభారతిలోఁ బ్రకటింపఁబడిన "కమ్మని జాళువా" అను పద్యవ్యాఖ్యాన మిందుకు నిదర్శనము. ఆపద్య మిది :—

ఉ. కమ్మనిజాళువా పొరయఁ
 గల్గిన చెక్కులచెక్కువాఁడు చొ
 క్కమ్మగు జాతికెంపు వెల
 గాఁగొను మోవిమెఱుంగువాఁడు స
 త్యమ్మగు రూపసంపద ధ
 నాధిపసూనుని ధిక్కరించువాఁ
 డమ్మకచెల్ల! నాహృదయ
 మమ్మకచెల్లదు వీని కిత్తఱిన్.

ఈపద్యమందలి మొదటి మూఁడుపాదములందును రెండు విషయములు రెండుపాయలుగా నొకదాని ననుసరించి యొకటి ప్రవహించి నాల్గవ పాదమునఁ గలిసి యొంటిపాయగఁ బారుచున్నవి. అ దెట్లన, వర్ణ్యుని యంగములు (౧) సౌందర్యము, (౨) ధనము, గలవిగా వర్ణింపఁబడినవి. కావుననే నాల్గవపాదమందు "హృదయ మమ్మ"ట కవకాశము కలిగినది. అనఁగా వర్ణ్యుఁడు ధనవంతుఁ డగుటచే నులాది తన హృదయము నాతని వశము చేయఁదలఁచినది. అనఁగా నతనిని ప్రేమించిన దనుట. వర్ణ్యుఁడు ధనవంతుఁడుగనుక తన హృదయమను నమూల్యవస్తువు నాతని కమ్మఁజూచుచున్నది. నాల్గవ పాదమం దిమిడియున్న యీరెండు భావములను మొదటి మూఁడుపాదములయందలి విషయములును సమర్థింపవలసి యున్నది. ఆంధ్రవిశారదులు తెలిపినట్లు 'అమ్మకచెల్లదు' అని యుండుటచే వర్ణ్యుఁడు ధనముగలవాఁడని నిరూపించుట యవసరమే యగును. ఇట్లు నిర్ధారణచేసియు విశారదులు ప్రథమపాదమును వ్యాఖ్యానముచేయుటలోఁ గొంచెము నేలవిడచి సాముచేయుట మొదలుపెట్టినట్లు తోఁచుచున్నది. ఏలన, హృదయమను నమూల్యవస్తువును గొనుటకు ధన మవసరము. రెండుమూఁడు పాదములలో 'కెంపు', 'సంపద' స్పష్టముగ గోచరించుచున్నవి. కాని మొదటిపాదములో వీ రిచ్చిన యర్థమునుబట్టి గీటురాయి మాత్రమే కనఁబడుచున్నది. గీటురాయి యున్నంత మాత్రమున స్వర్ణాభరణమును గొనఁజాలముకదా! పరీక్షించుటకు గీటురాయి యవసరమేకాని కొనుటకు ధనము ముఖ్యముగదా! మూఁడవపాదమందలి 'రూప సంపద'లో ధనము గోచరించుచున్న దనినచో రెండవ పాదమందలి "కెంపు"నకుఁ బ్రయోజన మేమి? అది కూడ ధనసూచకమే యగునుకదా? ఐనచోఁ బద్యమందు భావైక్యము లేకుండఁబోవును. ఎట్లన, మొదటిపాద మందు నగయొక్క బంగారమునుఁ బరీక్షించుటకు గీటురాయియు, రెండుమూఁడుపాదములయందుఁ గొనుటకు ధనమును సూచించిన ట్లగును. మూఁడుపాదములందును గూడ ధనముగాని, లేక ఒక్కొక్కపాదమునందు నగను

గొనుటకు వలయు నొక్కొక్క సాధనముగాని సూచించినచో భావైక్యము చెడదు. అనఁగా మొదటిపాదమున గీటురాయియు, రెండవపాదమున త్రాసును, మూఁడవ పాదమున ధనమును సూచింపఁబడినచో నైక్యము చెడదు. ఆంధ్రవిశారదులు సూచించిన యర్థములో నీభావైక్యము కొఱవడుచున్నది. రెండవపాదములో రత్నపరీక్ష గలదని వీరు చెప్పుచున్నారు. ఇది కేవలము విమర్శకలుబ్ధత్వము. మొదటిపాదమునకు స్వర్ణపరీక్షయను నొక వింత వ్యాఖ్యానము చేసి రెండవపాదమున రత్నపరీక్ష గలదన్నారు. అర్జునునివద్ద కెంపున్నంతమాత్రమున నతఁడు రత్నపరీక్షకుఁడని యెట్లు చెప్పనగును? రెండవపాదములో నర్జునుఁడు కెంపుగలవాఁడుగా సూచింపఁబడినది గాని రత్నపరీక్షకుఁ డనుట లేనియర్థము నెరువుదెచ్చి మడిపెట్టుటయే యగును. కనుక మొదటిపాదమున స్వర్ణపరీక్షయు, రెండవపాదమున రత్నపరీక్షయుఁ గలవనుట కొంచెము విపరీతవ్యాఖ్యాన మనియే చెప్పవలసివచ్చును.

మొదటిపాదమునకు "బంగారమును రాయుటకుఁ దగిన యొరగల్లువంటి నల్లని చెక్కిళ్లు గలవాఁ"డనునర్థము నిచ్చుటకు మఱియొక ప్రతిబంధక మున్నది. మొదటి పాదమున "కమ్మనిజాళువా నొరయఁగల్గిన చెక్కుల చెక్కువాఁడు" అని యున్నది. ఇందు 'కమ్మనిజాళువా నొరయఁగల్గిన' యను విశేషణమునకు "చెక్కుల చెక్కు" విశేష్య మగును. అనఁగా "బంగారమును రాచుటకుఁ దగిన చెక్కిళ్లు గలవాఁడు" అని యర్థ మగునుగాని "బంగారమును రాయుటకుఁ దగిన (యొరగల్లువంటి) చెక్కిళ్లు" అను నర్థము రాదు. "చెక్కిళ్లు బంగారమున రాచుటకు తగియున్నవి" అను నర్థ మగును. ఈయర్థ మందు వర్ణముకంటె కాఠిన్య మెక్కువ స్ఫురించును. అదియునుగాక చెక్కిళ్ల నొరగల్లురాతితోఁ బోల్చుట నీచోపమ యగును.

మఱియొక మాట. "బంగారమును రాయఁగల్గిన రాయివంటి చెక్కిళ్లు" అని చెప్పినప్పుడు "బంగారుపై నొరగల్లుపెట్టి రాయు"టు సూచితమగును. మనము బంగారమును బరీక్షించునప్పు డొరగల్లుపై స్వర్ణశకలమును బెట్టి రాయుదుముగాని బంగారముపై నొరగల్లును పెట్టి రాయముకదా! కావున ధర్మారావుగారి వ్యాఖ్యానమున కిది యొక ప్రతిబంధక మగును.

మఱియొక విషయము. ధర్మారావుగారు "అర్జునుఁడు నల్లనివాఁడుగనుక వాని చెక్కిళ్లను జాళువాతోఁ బోల్పఁదగ" దనుచున్నారు. గండయుగమును కవులు సాధారణముగా నద్దములతోఁ బోల్తురుకదా! ఇక్కడ గండస్థలమునకును అద్దమునకును స్నిగ్ధతయందును దళుకునందునే సామ్యమున్నదిగాని వర్ణమునందు లేదు. అట్లుగాక వర్ణమునందుఁగూడ సాదృశ్యము కలదనుచోఁ 'చెక్కిళ్లు తెల్లగ పాలిపోయియున్న'వని వర్ణించుట యగును. ఇది సమంజస మగునా? ఇదికాక సాధారణముగాఁ గవులు చెక్కిళ్లను బంగారముతోఁ బోల్చునపుడు మెఱుపునే ముఖ్యముగఁ దీసికొనుచున్నారు. విజయవిలాసమునందే యర్జునుఁ డులూచినిఁ జూచి "చెండ్లా గుబ్బలు జాళువాతళుకులా చెక్కిండ్లదాల్" అని మెచ్చుకొనినట్లున్నది. ఇక్కడ బంగారముయొక్క తళుకునే యుపమానముగాఁ దీసికొనినాఁడు. ఇదిగాక మన "కమ్మని జాళువా" పద్యమునకు రమారమి పదిపద్యములముం దీ క్రిందిపద్య మున్నది. ఇదికూడ నదేఘట్టమున నున్నది. అందుఁగూడ నులూచి యర్జునుని యందము మెచ్చుకొనినట్లే యున్నది.

"రాకొమరు నెఱులు నీలపు
రాకొమరు నిరాకరించు రాకాచంద్రున్
రాకొట్టు మొగము కెంజిగు
రాకుఁ గని పరాకు నేయునొర పదంబుల్."

ఇక్కడ నర్జునుని మొగము చంద్రకాంతిని మించియున్నదనిగదా యర్థము! ఇక్కడ చేమకూరవాని సొమ్మైన "భక్తివిశ్వాసము" లేమైనవి? ఇట్లంటినని వెంకటకవినిఁ జుల్కన చేయుచున్నానని పాఠకు లెంచకుందురుగాక! 'కమ్మనిజాళువా' పద్యవ్యాఖ్యానవుఁ బ్రసక్తి వచ్చుటచే నిది వ్రాయవలసివచ్చినది. కావున డొంకతిరుగులు తిరిగి "చెక్కిళ్లను నికషోపలములతోఁ బోల్చినాఁ"డని వ్యాఖ్యానము చేయవలసిన యావశ్యకత

కాన్పింపదు. కావున మన "కమ్మనిజాళువా" పద్యము
నందుఁ జెక్కిళ్లకును జాళువాకును దళుకునందు మాత్ర
మే సాదృశ్యమును దీసుకొనినచో దోషము లేదని చెప్ప
వచ్చును. లేదా పొరబడినాఁడన్నను దప్పులేదు.
అట్లొప్పుకొనుటవలనఁ జేమకూర వెంకటకవికిఁ దీరని
లోపము వాటిల్లదు.

ఇఁక "జాళువా నొరయఁగల్గిన" యనునప్పుడు
"జాళువాన్" అను ద్వితీయావిభక్తి ప్రయోగమునుగూర్చి
విచారింతము. ధర్మారావుగారు "జాళువాతో సమాన
ము" ననునర్థము రావలెనన్న "కమ్మని జాళువాతో"నని
తృతీయ యుండవలె నని సిద్ధాంతీకరించినారు. కాని
'చెక్కిళ్లు జాళువాను మించిన నైగనిగ్యము గలిగి
యున్నవి' అని వర్ణించుటకుఁ దృతీయకంటె ద్వితీయయే
యెక్కువ సమంజసమని తోఁచెడిని. ఏలన 'తోన్'
అను తృతీయప్రత్యయము తుల్యతను సూచించును
గాని యాధిక్యమును సూచింపదు. నాచనసోముని
యుత్తరహరివంశమున "......తోటలో నాడెదు
రాయంచకొదమతో రాయఁజాలి" యనువర్ణనమునఁ
దుల్యతమాత్రము సూచింపఁబడుచున్నది. కాని "జాళు
వాను ఒరయఁగల్గిన చెక్కిళ్లు" అనునప్పుడు చెక్కిళ్ల
యాధిక్యము ధ్వనించుచున్నది. "చెక్కిళ్లు జాళువా
నొరసికొని పోఁగలవి" అని చెప్పినప్పుడు "జాళువాను
లక్ష్యముచేయకుండ రాచుకొని పోఁగలిగినవి" అని
యర్థ మగును.

మఱియొక విషయము చూడుఁడు. "కమ్మని
జాళువాను బరీక్షించుటకుఁ దగిన యొఱగల్లువంటి
చెక్కిళ్లు" అని వర్ణించునపుడు "కమ్మని జాళువా"యను
మేలిమిబంగారపుఁ బ్రసక్తి యేల కల్గినది? మేల్మిబంగార
మును బరీక్షించు తాయిమాత్రమే నల్లని వర్ణమును, స్నిగ్ధ
తయుఁ గలిగియుండి తక్కువజాతి బంగారమును బరీ
క్షించు తాయి కీగుణము లవసరము లేదని ధ్వనించును
గదా! అట్లైనచో "కమ్మనిజాళువాన్" అనుపదముల
ప్రయోజన మేమి?

ఇంకొక విశేషము. రెండవపాదమం దిర్జుమని
మోవి, కెంపును గోవఁజాలు సమర్థత గలదిగా వర్ణింపఁ
బడినది. ఇక్కడ కెంపుకంటె మోవియం దాధిక్యము
కనఁబడుచున్నది. మూఁడవపాదమందు రూపసంపద
వలరూబరుని ధిక్కరించుచున్నది. ఈరెండుపాదముల
యందును 'ఉపమానముకంటె నుపమేయ మాధిక్యము
గలదిగా వర్ణింపఁబడినది. ఈక్రమమునుబట్టి మొదటి
పాదమందలి చెక్కుల టెక్కు తన కుపమానముగాఁ
దీసికొనఁబడిన పదార్థముకంటె నాధిక్యముగలదిగా నుండ
వలెను. కావున చెక్కుల కుపమానముగాఁ దీసికొనఁబడిన
దని చెప్పఁబడిన నికషోపలముకంటె చెక్కు లధిక కాంతి
గలిగినవని చెప్పవలసియుండును. ధర్మారావుగా రొసఁ
గిన వ్యాఖ్యానమున నిట్టి యాధిక్యము కానరాదు. ఒక
ప్పుడు పరీక్షించుట యాధిక్యసూచక మందురేమో!
చెక్కులు బంగారమును బరీక్షించుటకుఁ దగియున్నవి
గాని నికషోపలమును బరీక్షించుటకుఁ దగియుండ
లేదు. కావున ధర్మారావుగారి వ్యాఖ్యానము ప్రకా
రము చెక్కులయం దాధిక్యము సూచింపఁబడక తుల్యత
మాత్రమే సూచింపఁబడును. ఇక్కడకూడ నైక్యము
చెడుచున్నది. పైని వివరించిన విషయములనుబట్టి చూచి
నచో మొదటిపాదమున కీక్రిందివిధమున నర్థము చెప్ప
వచ్చును. "కమ్మని జాళువానునైతము లక్ష్యముచేయక
రాచుకొనిపోవుటకు సమర్థతగల చెక్కుల టెక్కుగల
వాఁడు. అనఁగా చెక్కుల తళుకుబంగారపుఁ దళుకు
కంటె నధికమైనదని యర్థము."

---

## కోయిల్‌కొండ కోట చిత్రములు (చూ. కల.)



౧. కోయిల్‌కొండ కోట

# తిక్కన యుద్యోగపర్వముపైఁ జర్చ

కొణిదెన బాలకృష్ణయ్యగారు

చ. పలికిన కబ్బపుంబలుకు ప్రాబలుకట్ల ప్రమాణమేకదా
తెలుఁగున; వర్చ లొందునట దేవరపెట్టియ గంటముల్; స్వహ
స్తలిఖిత పత్రఖండములు దండనమస్కృతి గాంచువం టహో
వెలసిన వేల్పుకాక పృథివిం గవిమాత్రుఁడె తిక్కయజ్వరాట్."

నల ఉగాదిసంచిక (వసురాయకవి)

"దుర్విమర్శముచేసి ప్రజల బుద్ధి చెడఁద్రోవఁబెట్టుట—రసహీనము లైన కావ్యములు వ్రాసి వారి శ్రమపెట్టుట, యీ రెంటిలో మొదటిదే యెక్కువ యనర్థకరమని "పోప్పు" గారు చెప్పినారు"

గ్రంథవిమర్శతత్త్వవ్యాసము (కూచి నరసింహంపంతులు)

భారతి ప్రకటోత్పత్తి పుష్య, మాఘ మాసముల సంచికలయందు "తిక్కనయుద్యోగపర్వము" అనువిమర్శన మొకటి వెలువడినది. శాదూరి లక్ష్మీనరసింహారావు పంతులుగారు దానికిఁ గర్త. అందలి ముఖ్యాంశము లివి.—

౧. తిక్కన మూలము ననుసరించినచోట నైనను తన పద్యము పూర్తికానిపట్టుల వ్యర్థపుమాటలు పెట్టినాఁడు. అవి యనర్థములైనవి.

౨. తిక్కన భావమును స్పష్టముగాఁ దెలుపునట్లు వాక్యము రచింపఁజాలఁడయ్యెను.

౩. ఆతనికి (తిక్కనకు) సంస్కృతభాషాపాండిత్యము లేదు.

౪. తిక్కనభాషాంతరీకరణము వ్యాసమూలమునకు, స్వభావమునకును విరుద్ధముగ నున్నది.

౫. తిక్కన పాత్రౌచిత్యము చెఱచినాఁడు.

౬. తిక్కన ప్రమత్తుఁడైనాఁడు.

౭. నా (విమర్శకుని) యీ తెలుఁగుసేఁత పద్దెములు జూడండి.

ఇవిగాక నింకను ప్రక్షిప్తగ్రంథభాగములను గుఱించి కొందఱయ్య లెవరో యన్నట్లు వ్రాసిరి. ఆయయ్యలలోఁ గేతవరపు వేంకటశాస్త్రిగా రొకరు పరిగణింపఁదగియున్నారు ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికయందుఁ గాక, వీరి యుద్యోగపర్వవిమర్శనముతోఁ బాటు శాస్త్రిగారి భారతప్రక్షిప్తవిషయమును గుఱించినవ్యాసము పుష్య-మాఘ మాసముల భారతీసంచికలయందుఁ బ్రకటితమైనది. కావున విమర్శకాగ్రేసరులగు నరసింహారావుగారు ప్రక్షిప్తవిషయమై దానికిఁ బ్రత్యుత్తర మీయవలసినబాధ్యత వహింతురుగాక.

మఱియుఁ దిక్కనయాంధ్రీకరణము సంక్షేపమని, సంగ్రహమని, సంకుచితమని, దిగవిడుపులు గలదియని విమర్శకులు పలుసార్లు వ్రాసిరి. ఇది చాల ప్రాఁతపడినమాట. పాడి పాట. పలువురు విద్వాంసు లివ్విషయమును చిరకాలముక్రిందట నాంధ్రలోకమునకు వెల్లడించి కవిత్రయకృతాంధ్ర భారతప్రాశస్త్యమును బహుముఖంబులఁ బ్రస్తుతించిరి. కావున నప్రస్తుతముగ నిద్దానిని విమర్శకులు చర్వితచర్వణమొనర్చి గ్రంథబాహుళ్య మొనర్చుటలోఁ బ్రయోజనములేదు. ఆంధ్రమహాభారతసంక్షేపవిషయమును జర్చించి చిరకాలము క్రిందట నభిప్రాయములు వెల్లడించియుండిన పండితప్రకాండుల సిద్ధాంతములు జదివినచోఁ బంతులుగారి కివ్విషయమునఁ గలిగిన సంశయములు డిందు పడియుండెడివి. ఇఁక ముఖ్యవిషయములఁ జర్చింతము.

1. వ్యర్థపుపదములు, అనర్థములు.

ఈ సందర్భమున విమర్శన మీ క్రిందివిధమున నున్నది.—

"మూలమున నున్న పద్యమునకు మాఱుగాఁ బ్రత్యేకాంధ్రపద్యము చేసినచోట నయినను మూలము ననుసరింపక మూలములోని కొంతభాగముమాత్రము తన పద్యములోఁ బెట్టి తనపద్యము పూర్తికాకున్నఁ దిక్కన తన పద్యభాగములో వ్యర్థపు మాటలు పెట్టినాఁడు. కొన్ని చోటుల నమ్మాటలు అనర్థములుకూడ నైనవి. ఈ క్రింది పద్యములు చూడుఁడు:—

శ్లో. య ఈర్ష్యః పరవిత్తేషు, రూపే వీర్యే కులాన్వయే।
సుఖసౌభాగ్యసత్కారే తస్య వ్యాధి రనంతకః॥
(మూలము)

క. పరులధనమునకు విద్యా
పరిణతికిం దేజమునకు బలమునకు మనం
బెరియఁగ నసహ్యపడును
న్నరుఁడు తెవులు లేని వేదనం బడు నధిపా.
(తిక్కన)

వ్యాసమూలముయొక్క యర్థము నేను దెనిఁగించిన ప్రకారము —

"గీ. పరులకుల-గోత్ర-సౌఖ్య-సౌభాగ్య-వీర్య
రూప-సత్కార-ధనముల-రేంపు గాంచి
యోర్వలేకుండువాఁ డెవ్వఁడుర్వి వాఁడు
మందు లేనట్టి వ్యాధిచేఁ గుందుచుండు."

విత్తము, రూపము, వీర్యము, కులము, అన్వయము, సుఖము, సౌభాగ్యము, సత్కారము ననుగుణము లెనిమిది మూలశ్లోకమునఁ గలవు. ధనము, విద్య, తేజము, బలము నను నాల్గుమాత్రము తిక్కనగారి కంద పద్యమునఁ గలవు. మూలమునఁగల యాఱుగుణములు లోపించి, రెండు క్రొత్తగుణములు గలిగి తిక్కనపద్యము కన్పట్టుచున్నది. కావునఁ దిక్కన, మూలము ననుసరించి తెనుఁగుపద్యము రచింపనమకట్టి యట్లు చేయంజాలక, మాతృకయందలి పదముల వదలి క్రొత్తమాటలు పెట్టి పద్యమురచించి పులిమి పుచ్చె" నని విమర్శకులు సూచించిరి. మఱియు నీమూలనపదములు వ్యర్థములని తేల్చిరి. మూలపదముల నన్నిఁటిఁ దమగీతమునఁ గూర్చితి మనిరి. కావునఁ దిక్కనసోమయాజిచేఁగాని కవితాశిల్పమున దాము తీర్చి దిద్దితి మను పంతులుగారి యభిప్రాయము దీనివలన స్పష్టమగుచున్నది. కావచ్చును. పాండిత్య మను నది యొకరి స్వత్వముగాదుకదా!

"మూలమునఁగల ప్రత్యక్షరమునకు మాఱక్షరము వేయుట యుభయకవిమిత్రుని సంకల్పముగాదని యాంధ్ర భారత పరిశోధకు లెఱింగిన విషయము. ఉభయ భాషలయందలి మెఱుఁగుల నేర్చికూర్చి యౌచితికి, భాషా సంప్రదాయమునకు, దేశకాలపాత్రములకుఁ దగురీతిఁ గవితాకన్య నలంకరించుటయే కళావిదుఁడగు నమ్మహనీయుని యాశయము. కావునఁ బై పద్యము మూలపద్యమునకు మాఱుగా నన్నిపదములతో రచించుట తిక్కన యుద్దేశ్యము కానేకాదు. ప్రపంచమున నొకనిపై నింకొకనికి, ధనము, విద్య, తేజము, బలము నను కారణములవలననే యసూయ జనించుచుండును. "విద్యా వివాదాయ, ధనమ్ మదాయ" యను నార్యోక్తినిఁబట్టి ధనమువలెనే విద్యయుఁ బరుల కోర్వలేమిఁ గలిగించు ననియు, నదిగాక ధనముకంటె ముందుగ విద్య పేర్కొనఁబడుటవలన రెండవదానికంటె మొదటిదానియందే మాత్సర్యము గలిగించు శక్తి విస్తరించియున్నదనియుఁ దోఁచుచున్నది. అసూయాజనకమగు "విద్య" యనునది మూలమున లేదు. పైగా మూలమునఁగల "సత్కారము" అనునది యీర్ష్యాకారణములగు గుణములలోఁ జేర్పఁదగనిది. సంస్కృతశ్లోకమున గుణములన్నిఁటిఁ దెలుపు పట్టిక యొకటి వెల్లడింపఁబడినది.* అది సంస్కృతభాష గావున నెట్లు చెప్పినను వినువారికి గంభీరముగనే యుండునట్లుండును." అని బ్ర. శ్రీ. శ్రీపాదకృష్ణమూర్తిశాస్త్రులుగారు వ్రాసియుండిరి. తిక్కన యుచితజ్ఞుఁడు. అందువలనఁ దా నాపట్టికఁ దెలుఁగుఁ గవనము కావున నిందుఁ జొప్పి నిచ్చఁగొనలేదు. సంస్కృతమున లేనిది, తప్పక

* ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక, ౨ సంపుటము.

చేర్పఁదగినదియును "విద్యను" చేర్చి మూలము నలంక
రించుపద్ధతిఁ గంధము రచించినాఁడు. మూలమునఁ గల
గుణము లన్నియుఁ దెలుఁగుపద్యమున లేవనుట
యుఁ బొసఁగదు. మూలమునఁ గల విత్తము, సుఖము,
సౌభాగ్యము, సత్కారము లనునివి ధనమునందును,
రూపము, కులము, అన్వయము ననునవి తేజమునందును,
వీర్యమనునది బలమునందును దిక్కనపద్యములో నిమిడి
యున్నవి. తిక్కన వ్యర్థపదము లుదాహరించెనని వ్రాసిన
విమర్శకుల నూతనపద్యమున మూలమున లేనివి "రేపు
గాంచి, ఉర్వి, కుందుచుండు" నను వ్యర్థపదములు దొరలి
మూలాతిక్రమణ మొనర్చినవి. ఇదియుఁగాక వీరిపద్య
మునఁ దిక్కనార్యుని పద్యమునఁ గల సరళత, మనోజ్ఞ
గతి, సందర్భశుద్ధియుఁ గానరావు. "రోయక్క లేకుండువాఁ
డెవ్వఁ డుర్వివాఁడు" అను గీతతృతీయచరణము పద్యము
యొక్క గమనికకు వికారము గల్పించుచున్నది. కావున
నిందు సారలేశమును గన్పట్టదు. నాల్గు డకారములు
మాత్ర మున్నవి. తిక్కనార్యుని కవనమాధురికిఁ దవిలి
"గతానుగతికోలోకః" అనుసామెతకు గుఱికాఁబడుపండి
తులగు పంతులుగారి పద్యము బింబప్రతిబింబన్యాయమున
వారి కింపు నింపఁ గలిగినను ప్రాఁతపద్దెమునకు సాటియగు
ననుట కవకాశము లేదు. తిక్కనార్య పదప్రయోగ మిప్ప
ద్యమున సార్థకముగాని నిరర్థకముగాదు. ఆయన సంస్కృ
తానుసరణమునకు యత్నించ లేదు. సంస్కృతమునను న్న
భావమును దెనుఁగునఁ జారుతరముగ తెరువునఁ జిత్రించి
నాఁడు.

## తెవులు లేని వేదన

"పరులధనమున" కనుపద్యమున విమర్శకుల కిం
కొక ప్రమాదము, తిక్కనగారిది కానవచ్చెనఁట! కావున
వారు దాని నిట్లు ఖండించిరి. వారి వాక్యము లీక్రింద
పొందుపఱచుచున్నాము:

"మఱియు దాను వర్ణించిన నాలుగు గుణములను
సహింపనివాఁడు "తెవులులేనివేదన" పడునని తిక్కన
చెప్పినాఁడు. ఇందు సారస్య మేమిగలదు? తెవులున్న
వేదనకే సుప్రసిద్ధముగా మందుండఁగా తెవులులేనివేదన
కుండదా? కావున నివ్వేదన నివారింపఁదగ్గదియే యగును.
.........దీనిసారస్యము చూడుఁడు" ఇ దెంతవఱక
సహేతుకమో విమర్శింతము.

మూలము:—"తస్య వ్యాధి రనంతకః."

తిక్కన:—"అన్నరుఁడు తెవులులేని వేదనంబడు"

విమర్శకులు:—"మందు లేనట్టివ్యాధిచేఁ గుందు
చుండు"

అని యున్నవి. సంస్కృతమున "అనంతకః" యని
యున్నదానినిఁ గ్రొత్తపద్యమున "మందు లేనట్టి వ్యాధి"
యని విమర్శకు లనువదించిరి. దానినిఁ దిక్కన "తెవులు
లేనివేదన" యనెను. తారతమ్య మరయుదము. శరీరము
నకు సంభవించు రుగ్మత లన్నిఁటికి నాయుర్వేదము
చికిత్స నుపదేశించును. మానసికంబగు రోగమునకు మందు
లేదు. కావుననే "మనోవ్యాధికి మందు లేదు", "మనో
వ్యాధి మంచము పట్టించు" ననుసామెతలు లోకమున
వ్యాపించియున్నవి. మనుజుని యారోగ్యమును గోల్పుచ్చి,
యతనియొక్క నిత్యకృత్యముల నొనర్చుకొను శక్తిని
క్షీణింపఁజేసి, యాహారనిద్రలు మాన్పి, యలజడిఁగూర్చి
స్థూలదేహమును గృశింపఁజేసి కుందించునది వ్యాధి. దీనికి
మందు గలదు. దీనివలనఁ గలుగు బాధ నాతఁడు వివరించి
చెప్పి చికిత్సఁ బొందఁగలఁడు. కాని మనోవ్యాధి
యట్టిది కాదు. ఉత్సాహశక్తి క్షీణించుటయే దీనికి ముఖ్య
కారణము. ఇది మానసికమైన తెవులు. దీనికి మందు
లేదు. కాని వ్యాధియను పేరుమాత్ర మున్నది. తెవులుండి
వేదనఁ గల్పించుజాతిలో నిదియుఁ జేర్పఁదగినది.

మందులేనివ్యాధి బాధితుఁడై పంతులుగారి పద్య
ములోఁ జెప్పఁబడినాతఁ డుత్సాహశూన్యుఁడు గానఁ
గూర్చుండి లేచుటకు శక్తిలేనివాఁ డగును. వాఁడట్లే
కృశింపవలసియుండును. అట్టివాఁడు "పరులధనాదిక"
ముల యౌన్నత్యమునుగాంచి మనంబెరియ నేమియుఁ
బ్రతిక్రియఁ జేయఁజాలఁడు. కావున దుర్యోధనాదులకుఁ
బాండవులపైఁ గల యసూయామాత్సర్యముల నొకనెపము
పెట్టి వివరించుసందర్భమున ధార్తరాష్ట్రులను మనో
వ్యాధిచేఁ జిక్కుచుండి మంచములు బట్టినవారితోఁ బోల్ప

తిక్కన కుదిరితముగఁ దోఁపదయ్యెను. కావున వారిని తెవులు లేని వేదనపడెడివారితో నుపమించి యుక్తియుక్తముగ నర్థవంతముగఁ బద్యము రచించియున్నాఁడు.

తెవులు లేని వేదనపడువాని హృదయమున మున్ముందుగ నసూయ స్థావర మేర్పఱచుకొనును. పదఁపడి తన్మూలమున మత్సరాశక్తి యుదయించును. అందువఁ గామక్రోధాదికళ్ళనుషట్కము బలవంతమగును. మన జాని కార్యరంగమున తిరికించును. ఎన్ని కార్యములఁ జేని యుఁ జేయించును. అసూయాగ్రస్తుని మదికి శాంతి యొకప్పుడు నుండదు. ఒకని గొప్పతనము జోర్వలేక వానిని జయించినను హృదయము పదిలపడదు. ఇంకొకని పైఁ బరువెత్తఁజేయును. ఇటుల నరిషడ్వర్గమునకుఁ జిక్కి మదోన్మత్తుఁడై ధర్మోల్లంఘనాదిక దౌర్జన్యము లొనర్చుచుఁ బాపము పండఁ దనచే బాధింపఁబడినవారి చేతులలోఁ దగుల్కొని ప్రాణములఁ గోల్పడును. ఇది తెవులు లేని వేదన ననుభవించువాని స్థితి.

కావునఁ 'బరులధనము'లను కందమున వ్యర్థములు గాని, అనర్థములైనవిగాని పదములు లేవని విమర్శకులకు మనవి. 'మందు లేనట్టి వ్యాధిచేఁ గుందుచుండు' నను క్రొత్తపద్యములో వాక్యము ప్రకరణానుకూలముగ లేదు. అందుఁ జమత్కృతియు శూన్యము. తిక్కన పద్యములోని "విద్యాపరిణతి, తెవులు లేని వేదన" యను వాక్యములు సమంజసములై ప్రకరణానుసరణములై యున్నవి.

2. తిక్కన భావమును దెలుపు వాక్యము రచింపఁ జాలఁడయ్యెను.

శ్రీకృష్ణునిఁ గౌరవసభకు రాయబారిగఁ బంపఁ దలంచి పాండవు లాతనితోఁ దమ యభిప్రాయములు చెప్పిరి. అనంతరము ద్రౌపది

"ఉ. నెట్టన యిట్టియల్క మది
నిల్పితి రక్కసశాలి [illegible]
గట్టినయట్లు పెద్దయును
గాలము దీనికి నాఁటు చెన్నుఁడుఁ
బుట్టను దుష్టనిగ్రహము
పూని జగంబులు కాచునట్టి తోఁ
బుట్టువు నీవుఁ దేజమునఁ
బోల్చినభర్తలు గల్గ నచ్యుతా!"

అని పల్కినది. దీనియందు రెండాక్షేపణాంశములు విమర్శకులు సూచించిరి. అవి చదువరులకు సులభగ్రాహ్యములగుటకుఁ దెంచి వ్రాసిరి. అందొకటి—

ఒడిలోఁ జిచ్చుగట్టికొనుట.

దీనినిగురించి విమర్శ యిట్లున్నది: "ఇందుఁ దిక్కన యుపమానవాక్యము నాకు సమంజసముగా లేదు. ఒడిలోఁ జిచ్చుగట్టికొనుట సహజము కాదు. అట్టి పని వెఱ్ఱివాఁడు చేయును. అట్టిపని తన్నుఁ జేసినవానినే నాశము చేయును.........ఒడిలోఁ జిచ్చుకట్టికొనుట యవశ్యమైనపనిగాని వశమైన పనిగాదు............... కావునఁ దిక్కనయుపమ సరికాదు. ఆతఁడు వ్యాస మూలము నన్వయించుకొనుటలోఁ బొరపడినాఁడు."

ప్రత్యక్షముగ నొడిలోఁ జిచ్చుకట్టికొనుట యవశ్యమైనపనియే యగును. ఒడిలోఁగట్టిన చిచ్చువలె హృదయమున నలుకనిల్పుట వశమైనది కాకపోదు. ఒడిఁగట్టిన చిచ్చు వస్త్రమును దహించి శరీరతాపము నెట్లు గావించునో, అటులనే మదినావేశించిన యలుక మానసము నెరియించి తన్మూలమున దేహతాపము గల్పించఁగలదు. ఇది పోలికగాని నిజముకాదు. వానికిఁ "బిడుగువంటి వార్త చెవిఁబడినది", "నీమాట వినఁగానే నాకు అఱికాలిమంట నెత్తికివచ్చినది" మున్నగువాటిలో నీయొడిలోని చిచ్చుపోలికయును జేరినది. ఇవ్వాక్యములు విషయనిష్ఠురతను బ్రకటించుచు నందువలనఁ గర్తృహృదయము నావేశించిన యనంతతాపమును తెల్పక చెప్పుచుండును. దీనికిఁ "గొంగలిలోఁ దలఁగోకికొనుట" యను సామెతతో సాదృశ్యము లేదు. ఉన్నదని విమర్శకులు పలికినను దాన విశేష మెద్దియును లేదు.

కౌరవ పాండవసంఘర్షణమునఁ బుట్టిన విపత్పరంపరలఁ దనపాలు వచ్చినవాని ననుభవింపుచు ద్రౌపది తన్మూలమునఁ గలిగిన యలుకను ఒడిఁగట్టిన చిచ్చువలె

మనమునఁ దాల్చినదై ధరించినది. ఇది యలుకరూపము గొన్న చిచ్చు. ఇదియటు సంపూర్ణకౌరవవినాశము, నిటు ధృష్టద్యుమ్న, అభిమన్యు, ఘటోత్కచ, ఉపపాండవాంతము గావించిగాని చల్లారదయ్యెను. ధృతరాష్ట్రునివలని సంరక్షణమునఁ బాండవు లన్నంతదనుకఁ గౌరవపాండవులకుఁ బాయరాని పొత్తుగలిగి ధుర్యోధనాదుల దౌష్ట్యమున కోర్చియుండుట పాండవులకుఁ దప్పనిసరి యయ్యెను. కావునఁ బాండవులకుఁ గౌరవసౌదర్యము కొంతవఱకుఁ దలఁకొకొన్న ట్లుండఁగలదు. కౌరవులు కౌరవులు. వారి సాహచర్యము ద్రోసిపుచ్చ స్వతంత్రులుగాని. పాండవులు బాధనమభవింపవలసినవారు. సౌదర్యసంబంధము తలఁకొకొనుట. కావున నిట్టిని కర్తృమాధ్యమువలన వచ్చునదికాదు. సహజముగ తప్పనిసరిగఁ బ్రవర్తిల్లుచుండును. కాఁబట్టి తిక్కనార్యుని యుపమానము ద్రౌపదియొక్క మానసికవ్యవస్థను చక్కఁగఁ దెల్పుచున్నది. సాదృశ్యముగాని, నిక్కముగ నిప్పు నొడిగట్టుకొనుటకాదు. అది వెల్లివాఁడును చేయఁడు. తిక్కనయుపమానము సహేతుకము; రసపుష్టిఁ గలిగి యౌచిత్యశోభితమై యున్నది. తిక్కనభావము తెలిసికొను టలో విమర్శకులు పొరఁబడిరి. వ్యాసమూలము తిక్కన యన్వయించుకొనలేకపోయెననుట సాహసము. అతఁడు మూలమును జక్కఁగఁ దెలిసికొని విషయమును గ్రహించి యవల స్వతంత్రరచనలఁగూర్చి యాంధ్రావళికి బోధనము గూర్చినాఁడు. "చిచ్చుపెట్టింగట్టితి" నని సాధారణపద్ధతిని ద్రౌపదిచే ననిపించలేదు తిక్కనసోమయాజి. "రక్కసశాల్మిఁ జిచ్చుపెట్టింగట్టినయట్లని నిష్ఠురభణితి నామె కోపానల స్వరూపమును వెల్లడించి యుంచెను. రాచబిడ్డ కావుననే యిటుల గ్రోధోద్రేకపూరితవాక్యముల నాడినది. ఇచటఁ దిక్కన పాత్రోచితమగు వాక్యముల జాతీయముగఁ జిత్రించియున్నాఁడు. ఇదే రెండవ యాక్షేపణమును దెలిసికొందము.

## అవాచికవాక్యదోషము

ఇవ్విషయమునఁ బంతులుగారి వాక్యము క్రింద వ్రాయుచున్నాము. వీరు "సెట్టనయిట్టియల్క" యను పద్యమునందలి యుత్తరార్ధమును విమర్శించి యాక్షేపించిరి:

"మఱియుఁ దిక్కనపద్యములోని యుత్తరార్ధములో వాక్యసందర్భము సరిగాలేదు. దుష్టముగా నున్నది.........అది తిక్కన స్వతంత్రించి చెప్పించిన వాఁడు. అట్లు చెప్పించినాఁడని మన ముపేక్షింతమన్న నాతని వాక్యములో నవాచిక వాక్యదోషము గలదు. ఏలననఁగా, జగంబులు కాచునట్టి తోఁబుట్టువ నీవును, తేజమునఁ బొల్చెడు భర్తలును బ్రతికియుండఁగా నా కోప మెన్నఁటికిని నాఱదని ద్రౌపది చెప్పినట్లున్నది." అని.

ఈపద్యమును అన్వయించుకొనుటలో విమర్శకులు తప్పటడుగువైచిరి. పద్యమును గొంత తలక్రిందులొనర్చి యిం దవాచ్యమున్న దనిరి. అట్లుగాక యుత్తరార్ధమును బూర్వార్ధములో నన్వయించిన వారి కట్టిశంక యంకురింపఁజాలదు. ఎట్లన.—

"అచ్యుతా! మహానుభావుఁడవగు నీవును, వీరసంపన్నులగు భర్తలును గల్గియున్నారుకావున రక్కసశాల్మలిఁబూని,చిచ్చుపెట్టిఁ గట్టినట్లు, సెట్టన యిట్టియల్కను మదిఁ దాల్చితిని. ఏలనన, ఎప్పటికైనను మీరు శత్రునిర్మూలనం బొనర్చి నాయల్కను దీర్చి హృదయశాంతిఁ బ్రసాదింతు రను నాస యుండుటచేతనే. ఈయల్కను జాలకాలమునుండియు ధరించియున్నను దీనికి నాఱు టెన్నఁడును బుట్టునట్లులేదు. పుట్టదుకూడను. కారణము ధర్మరాజాదులు సంధిగావించికొన నుద్యుక్తులై యన్నదమ్ములంద (పాండవులు, కౌరవులు) ఏకము కాఁబోవుచున్నారు గావున." ఇట్లన్వయించుకొనుటలో విపరీతము లేదు. పంతులుగారిపద్యములోని "అన్న దుశ్శాసనునిదైన శ్యామభుజము" అనుదానిని " అన్నరైన దుశ్శాసనుని యొక్క నీలవర్ణము భుజము" నని యన్వయించుట యెట్లుండునో తిక్కనపద్యమునకు బంతులుగారు కల్పించిన యర్థ మంతే సరసముగ నున్నది. తిక్కనపద్యములఁ గల భావగాంభీర్యము తెలిసికొనఁ బ్రాల్మాలి పంతులుగారు, మూలభావమును దనపద్యమున రచింపఁ దిక్కనకు శక్తి లేదనుట సమంజసముకాదు.

విమర్శకులు తిక్కనపద్యమునందలి ద్రౌపదీపాత్ర మునుగురించి "..........నవ్వాక్యము తిక్కనకుఁ బరిచితురాండ్రై) కొండవీటిసీమయువతులలో నొక పల్లెటూరిది యాడఁదగిన మోటుమాట..........భర్తకుఁ బరిచర్యచేయువిధము రుక్మిణీదేవి కుపదేశించిన మహాపతివ్రత......ద్రౌపదీపాత్రవృత్తౌచిత్యము (తిక్కన) చెఱచినవాఁడు" అని యాక్షేపించి వ్రాసిరి.

కావచ్చును. తిక్కన యాంధ్రుఁడు. కొండవీటిసీమ తెలుఁగుదేశమునకుఁ దిలకము. రచించునది యాంధ్రభారతము. ఆంధ్రులు చదివి సంతసించుటకు. అంతయుఁ బరిశుద్ధమగు నాంధ్రత్వమే. భావమునందుగాని, పద్ధతియందుఁగాని సాంకర్యవిరహిత మగు కాలమునకుఁ జెందినవాఁడు తిక్కన. కావున నాంధ్రక్షత్రియకాంతనే మానసికపీఠిఁ గల్పించికొని ద్రౌపదీపాత్రను జిత్రించియుండును. మోటుమాటలకేమి లెండి. నాగరకంపుఁ బలుకుబడి పాశ్చాత్యవేషభాషల కలవడిన బంగాళాదేశస్థులనుండి కాకినాడమీఁదుగ నెఱవుగఁ దేఁబడినదేకదా మన కిప్పుడు! అందుకు మన మహంకరించుట హాస్యాస్పదము. "స్వస్థానవేషభాషాభిమానులు సత్పురుషులు."

ద్రౌపదీదేవి రుక్మిణీదేవికి భర్తకుఁ బరిచర్య చేయువిధ ముపదేశించెనా? ఎప్పుడు? ఎక్కడ? ఏసందర్భమున? ఇంతదనుక సత్యాద్రౌపదీసంవాదము దెలిసికొనియుంటిమిగాని యిది తెలియరాలేదు.

తిక్కన ద్రౌపదీపాత్ర వృత్తౌచిత్యము జెఱచినవాఁడని ప్రాఁతపద్యము నధిక్షేపించి వ్రాసిన పంతులుగారిపద్యమున ద్రౌపదిపాత్ర మెటులఁగన్పట్టునో తిలకింపుఁడు. విమర్శకుల సంస్కృతానుసారియగు పద్యము— మక్కికి మక్కి:

"అన్నదుశ్శాసనునిదైన శ్యామభుజము
తెంచి పచ్చడిపచ్చడి చేసి నాదు
కొంటెరొంబుటను పెట్టినఁగాక కృష్ణ
యెక్కడిది శాంతి బాధైన హృదయమునకు"

ఇది నాగరకంపుమడులఁ గడుచెడంగను డింబున మోటుమాటలులేక యున్నదని వారి తలంపు. అయినను రసహీనము. తిక్కన రాచబిడ్డచేతఁ గొండవీటి మోటుమాట లాడించెనని వ్రాసిన పద్యము. ఈ "పచ్చడి పచ్చడి" బడికిఁబోవని పిల్లకాయలను తలిదండ్రు లను మాట. "ఓరీ! అల్లరిమానవుగా, మీ పంతులుతో చెప్పి పచ్చడి పచ్చడి చేయిస్తా"నని బాలకుల దండించుచుందురు. ఒడ్డోలగంబునఁ బలువురు పెద్దలసమక్షమున ద్రౌపది యిట్లు "పచ్చడి పచ్చడి" యను "చప్పిడి చప్పిడి" వాక్యములాడుట క్షత్రియాంగన కౌచితి కానేరదు. స్త్రీగావునఁ బచ్చడిమాటఁ బల్కించిన సహజముగ నుండునని తలంచిరి కాఁబోలు. శ్రీరామరామ! ఎక్కడి తిక్కనపద్యము, ఎక్కడి పచ్చడిపద్యము! హస్తిమశకాంతరము. అవసరమగునోట్ల నెల్లఁ దిక్కన సంస్కృతము నలంకరించుచు, మించుచు నౌచితిఁ బాటించినాఁడు. కాని పాడుచేయలేదు. పంతులుగారికి రెండు సంశయములు దోఁచిన యీపద్యము నిదివఱకు సుప్రసిద్ధులగు దండిసుంట సూర్యనారాయణశాస్త్రులుఁ, చెదలవాడ సుందరరామశాస్త్రులు పఠించి తాత్పర్యము వ్రాసియున్నారు, పరిశీలింపుఁడు.—

1. "నిప్పును జెఱఁగునఁ గట్టినట్లు ఈమహాకోపమును బహుకాలము వ్యర్థమైన యోర్పువహించి మనస్సులో నిలిపియుంటిని. లోకంబుల నుద్ధరించువాఁడవు నీవు తోఁబుట్టువవలె నుండియు పరాక్రమశాలులగు భర్తలుండినను, ఈకోపాగ్ని యొన్నటికిని ఆఱకున్నది" అని తాత్పర్యము. 'చిచ్చుచెంగట్టిన యట్లు అల్కను మదినిల్పితిని' ఇట ఉపమాలంకారము. ఉత్తరార్ధమునందు విశేషోక్త్యలంకారము. "కారణము సమగ్రముగా నున్నను కార్యము గలుగమి" దాని లక్షణము.

## వ్యర్థపదప్రయోగము

"గీ. నెలఁతజూదంబు పానంబు వేఁట పలుకు
[illegible]

1. మహాభారతము, ఉద్యోగపర్వము, ఆ. 3, ప. 74.

సొమ్ము నిష్ప్రయోజనముగ వమ్ముసేఁత
యనెడు సప్తవ్యసనములఁ జనదుతేసుల"

అను తిక్కనపద్యముపై విమర్శన మిట్లున్నది:

"ఈపద్యము చదివికొని యిందు మూఁడవపాదములోని "నిష్ప్రయోజనముగ" నను విశేషణముచూచి "వమ్ముసేఁత" యనఁగా వ్యయముచేయుట యని యర్థము చేసికొని బహుజనపల్లి సీతారామాచార్యులుగారు శబ్దరత్నాకరమను తమ తెనుఁగునిఘంటువులో "వమ్ము" శబ్దమునకర్థము వ్యయమని చెప్పినారు.........నిష్ప్రయోజనముగ వమ్ముసేఁతయని తిక్కన ప్రయోగించినపుడు సప్రయోజనముగ వమ్ముసేఁత కూడ నుండునని యాశయముచేసికొని "వమ్ము"నకు వ్యర్థమని యర్థమయ్యేని సప్రయోజన మెట్లగునని యాశంకచేసికొని "వమ్ము"నకు వ్యయమని యాతఁడు చెప్పినాఁడు...... తిక్కన యనావశ్యకముగఁ బ్రయోగించుటచే నింత దోసలు పుట్టినది" అని.

శబ్దరత్నాకరమున "వమ్ము" శబ్దమునకు "వ్యయ" మను నర్థ మిచ్చుటను కానరాదు. ఇట్టులుండ "వమ్మునకు వ్యయమని యాతఁడు చెప్పినాఁడు" అని నరసింహారావుగా రెట్లు వ్రాసిరో దురూహముగనున్నది. ఇందుపై విమర్శకులు గావించిన చర్చయంతయు నిట్టి "వ్యయ" మను నర్థముపై నాధారపడియున్నది.

కావునఁ దిక్కన వ్యర్థపదప్రయోగ మొనర్చెననియు, నర్థాని నాధారముగఁ గొని నిఘంటుకారులు తప్పుత్రోవఁ ద్రొక్కిరనియు నరసింహారావుగారు వ్రాయుట సత్యదూరమగు నంశము. తిక్కనపద్యము వ్యర్థపదభూయిష్ఠమని వక్కాణించి విమర్శకులు వ్రాసిన నూతన పద్యము:—

"కల వేఁడిల వ్యసనోదయ
ములయిన దోషములు వాని భూపతి విడువఁ
వలయుఁ బతి పాడుకొనినను
నల వానిని జెఱచు నిత్య మని యెవి యంటే".

ఇందు "వ్యసనోదయములైన దోషము లేడును భూపతివిడువవలయు" నని రచించిరి. భూపతిగాక మిగిలినవా రాచరింపఁదగినవా? అను సంశయమున కెడ మిచ్చుచున్న దీపద్యము పూర్వార్ధము. నాల్గవపాదమందలి "అల, అంటే" యనునవి పాదపూరణమునకై స్వీకరింపఁబడినవి. సప్తవ్యసనముల వివరించు వీరి పద్యమునందలి "కలధనములు పాడుసేఁత" యనునది యుక్తియుక్తముగ లేదు. కలధనములు పాడుసేయవలెఁగాని, లేనిధనములు పాడుసేయు టెట్లు సంభవించును? కారణము ధన మభావమైనపుడు కార్యమగు పాడుసేఁత కాధారము శూన్యముగదా? తిక్కనపద్యమున వ్యర్థపదప్రయోగము లేదనియు, విమర్శకుల క్రొత్తపద్దె మెబ్బిషయము నఁ దిక్కనపద్యములను మించఁజాలదనియు నిందలి ఫలితార్థము.

3. తిక్కనకు సంస్కృతభాషాపాండిత్యము లేదు. దీనికి లక్ష్యముగ విమర్శనమున నీ క్రిందిపద్యము నుదాహరించిరి.

"జ్ఞానము కేవలకృప న
జ్ఞానికి నుపదేశవిధి ప్రకాశము సేయం
గా నది సకలధరిత్రీ
దానంబునకంటె నధిక తరఫలద మగున్."

ఉద్యోగపర్వవిమర్శనము జేయుచు వీ రీపద్యము శాంతిపర్వమునుండి గ్రహించిరి. దీని నాధారముగఁ గొని తిక్కనకు సంస్కృతభాషాపాండిత్యము లేదని సాధింపఁగడంగిరి. ఈప్రకరణమునందలి విమర్శకుల వాక్యము లివి:

"ఇది తిక్కనభారత శాంతిపర్వములోని పద్యము. ఇందు రెండవపాదములోఁ గాకును జ్ఞాకును యతిమైత్రి పడ్డది. ఈమైత్రి కాధారమైన లక్షణ మెందును గానిపింపదు. సంయుక్తాక్షరమైన "జ్ఞా" లోని మొకయక్షరమైనను "గా" కు సవర్ణమైనదికాదు. పామరులుమాత్రము "జ్ఞా"లోని జకారము గకారముగా నుచ్చరించుచున్నారు. "జ్ఞాన"మును "గ్జ్ఞాన" మని యుచ్చరించుచున్నారు. తిక్కనకు సంస్కృతభాషాపాండిత్యము లేదనియును, జ్ఞానశబ్దములోని సంయుక్తాక్షరము పూర్వము పామరులు వ్రాయుచుండునట్లు "గకార ఞకారాకార

ములు"గా వాతఁడు కూడ వ్రాయుచుండువాఁడనియు, వానికి సంస్కృతభాషాపాండిత్యము లేదనుదాని కాతని యీపద్యములోని యతిమైత్రి యొక నిదర్శన మనియును గడపపట్టణవాస్తవ్యులును, నాంధ్రగీర్వాణ మహాపండితులును నగు నామిత్రులు కీర్తిశేషులు కందాళ దాసాచార్యులుగా రానడుమ నాతోఁ బలికిరి. ఆయ నతోనే చేకీభవించుటకు సాహసింపనుగాని తిక్కన యీప్రయోగము ప్రమాదవశ మనుచున్నాను."

దాసాచార్యులుగారు చెప్పియుండవచ్చును. కాని నరసింహారావుగారివంటి విమర్శకులు తగిన నిదర్శనములులేక విశ్వసించి రాద్ధాంతము సేయు టెంతవఱకు సమంజసమో తెలియరాదు. జ్ఞానశబ్దమును గకార ఇకారాకారములుగాఁ బామరులు వ్రాసినవ్రాఁతలు, శాసనములు, ప్రాఁతప్రత్తులు మున్నగునవి తిక్కనకుఁ బూర్వముండినవిగాని, సమకాలమునందలివిగాని యున్నట్లు తొలుకొల్త సిద్ధాంతపఱచి యలఁ దిక్కన రచనకు దానిని సాదృశ్యముగఁ జూపి, యూపై వాతఁడు గీర్వాణభాషాపాండిత్యము లేనివాఁడని స్థాపించిన నొప్పిదమగును. మఱియు నాచార్యులుగారివలన విన్న తిక్కనార్యుని "జ్ఞ" "క" యతివిషయికమగు నీసమస్యను దాసయ్యగారి జీవితకాలములోనే విమర్శకులు వెల్లడించియుండిన వారు దానినెట్లు సమర్థించియుండెడివారలో!

"జ్ఞా" "కా" యతికి లక్షణ మెందును లేదని పంతులుగారి యభిప్రాయము. ప్రయోగ శరణ్యములగు శబ్దము లాంధ్రమున నెన్ని లేవు. అపరవాణీస్వరూపులగు మహామహులు, ఋషులు నగుకవిపుంగవులు రచించిన కవితల ననుసరించి లాక్షణికులు లక్షణములు దీర్ప నారంభించిరా? లక్షణములు మార్గముఁ జూపఁ దరువాతఁ గవనమును కవులు సాగించిరా? దీనిని పర్యాలోచించి పంతులుగారు సంశయనివృత్తిఁ గావించుకొననగును. తెలుఁగున సమస్తప్రయోగములకును, లక్షణములకుఁ గవిత్రయభారత మాదర్శ మని యాంధ్రదేశమంతయు మాఱుమ్రోఁగుచుండఁ బంతులుగా రిట్టి పద్ధతి నవలంబింపఁ గారణము మృగ్యము. ఇవ్విషయమును సాధించి తెలిసికొనఁజాలకఁ దిక్కనను విమర్శకులు పామరుఁడనియు, దాసాచార్యులుగారు సంస్కృతము రానివాఁడనియు ననుట ప్రమాదముగాని యన్యముగాదు. పంతులుగారి లేఖిని యింతటితో శాంతి వహింపలేదు; అప్పకవిపై కుఱికినది. కాశీపట్టణమున గంగాఘట్టమునఁ గూర్చుండినవాఁటి యప్పయ్యదీక్షితులవారి యాడిన గోఁచిని బ్రశంసించి యాఁటనుండి తిక్కన యొనర్చిన సంజయరాయబారమును దర్శింపఁజన్నది. ఈ "జ్ఞ" "క" యతిని గుఱించి పెక్కుమంది పండితులు చర్చించియున్నారు. కావున వారి యభిప్రాయములను దిగువఁ బొందుపఱచెదము.—

## విశేషవళులు

"జ్ఞా" "కా" యక్షరముల విశ్రమములను విశేషవళులందురు. ఈవిశ్రమమునుగుఱించి[1] "ఛందశ్శాస్త్రమున నేను గనిపెట్టిన నూతన విషయములు" అను వ్యాసమున లేకుమళ్ల రాజగోపాలరావుపంతులుగారును, [2]"ఛందోవిమర్శన" మనువ్యాసమునఁ బారనంది రామశాస్త్రులుగారును వ్రాసియున్నారు. వీరికిఁ బూర్వము వేమూరు వేంకటకృష్ణమ్మశెట్టిగారు ముద్రింపించిన భారతమును, దత్పీఠికను కీర్తిశేషులగు [3]పూండ్ల రామకృష్ణయ్యపంతులుగారు విమర్శించుచు నం దీవిశేషవళినిఁగూర్చియుఁ జర్చఁ గావించిరి. గ్రంథవిస్తరమైనను జదువరుల యుపయోగార్థ మాచర్చ నీక్రిందఁ బొందుపఱచెదము. విమర్శకుల వాక్యముల కవి ప్రత్యుత్తరము లగుఁగాక.—

"క. 'జ్ఞానము.....................
..............................
..............................
............ఫలదముగా' (శాంతి)

౧. ఆంధ్రపత్రిక విరోధికృత్ సంవత్సరాది సంచిక. పుటలు ౫౮, ౬౦.
౨. ఆంధ్రపత్రిక రౌద్రి సంవత్సరాది సంచిక పుటలు ౧౨౫-౧౨౪.
౩. అముద్రితగ్రంథ చింతామణి మయూఖము, సం. ౧౫ (౧౯౦౨) పుటలు ౧౫, ౧౬.

అనుపద్యమునందు రెండవపాదమునొక్క యతిం గూర్చి వీరు సంశయించి జ్ఞానను, కానను యతి చెల్లదని టీక ౮౬-వ పుటలో నిర్ణయించియున్నారు. అప్పకవిమార్గము వీరికి రుచింపలేదు. ఇంక వీరిమాట లెవరికి రుచించునో చూతము. అప్పకవియును

'తే. గీ. ప్రౌఢకవులు కొందఱు జ్ఞకారంబునకును
బ్రహ్మవర్గంబు తొలియక్కరములు వాళ్లు
నిడుదురు ప్రబంధముల నొక్కయెడ విశేష
వళులనుచు సోమయాజులు వాడుకొనఁగ.'

అని వ్రాసిన పద్యమును టీకాకారు లొప్పపడ రైరి. జ్ఞానను కానను చెప్పుటను యతి లేదఁట. మఱియు "జ్ఞానికి నుపదేశవిధిఁ బ్రజనితము సేయంగా" నని యొక పాఠ మగపడుచున్నదఁట. ఇందువలన వీరు జ్ఞానను కానను యతి నొప్పపడరైరి. విశేషవళులని యప్పకవి చెప్పియే యుండెను. ఏమిచెప్పినను వినువా రెవ్వరు? "తమ కంపు తమ కింపు; పరుకంపు తమకుఁ జంపు" అను సామెత చెవుల కామెతకాకపోవునా? ఈటీకాకారులు "ధృతరాష్ట్రునందును బుత్రులు వ్యసనము" అను పద్యమును గూర్చి "తగణ" అనుట తగదని పైవిధముగా సాధించిన స్థలమునందు "ఇట్టి ప్రయోగము లింకెక్కడనైన నుండెనేని వాని కీప్రయోగ మాధారమగును" అను వీరి మాత్రము వీరేల యిచ్చుట నన్వయింపరు? లాక్షణికులందఱుఁ దిక్కనమతమే గ్రహించిరి. ప్రక్రియా ఛందస్సున యతిప్రాసముల యుదాహరణము లనుశీర్షికక్రింద నిట్లు వ్రాయఁబడియున్నది.—

"ద్విపదము. కంధరఖండార్ధ ఖరకాలకూట
గ్రంథిలకంఠుఁడు జ్ఞానయోగంబు."

ఇందు రెండవపాదమున జ్ఞానను గానుకు యతి చెప్పఁబడి యున్నది. ఇంతియకాక ప్రప్రథమమున ముద్రింపఁబడిన వీరిభారతములో వీరు మార్చినట్టి "ప్రజనితము సేయంగా" ననుపాఠము లేదు. శ్రీమాన్ నేలటూరు పార్థసారథి అయ్యంగారు ప్రకటించిన భారతము శాంతిపర్వతమున ౬౧౭ పుటలోను "ప్రకాశము సేయంగా" ననియే యున్నది. కానఁ "బ్రజనితము సేయంగా" ననుపాఠము సరసముగాదని నిర్ణయించెదము."

మఱలఁ బైఁజెప్పిన రామకృష్ణయ్యగారే,

* "జ్ఞానను గానను యతియున్నదను విషయము నేము పైన ౧౫-వ పుటలో వ్రాసియుంటిమి. ఈవల మఱికొన్ని లక్షణగ్రంథములలో నీయతి నంగీకరించియున్నట్లుగఁ దెలియవచ్చినందున వానినెల్ల నిటఁ బ్రకటించుచున్నారము. ౧౯౩౬ సం॥లో వ్రాయఁబడినట్టి ఛందోరత్నాకరమున ౬-వ పుటయందు "సీ. గజముఖరక్ష యజ్ఞపరిరక్షణ సకాండధర విలసిత మందార దామ" అని విశేషయతి యనుశీర్షికను వ్రాయఁబడినది. మఱియుఁ బాపిశెట్టి వెంకటస్వామికవిచేత వ్రాయఁబడిన ఛందశ్శాస్త్రమునందును "సీ. జ్ఞానను కఖగఘల్ గడియ విశేషంబు" అని వ్రాసియున్నది. మఱియు నీ ౧౯౦౨ సం॥మునఁ బ్రకటింపఁబడినట్టి "ఛందోలక్షణమణి" యందును ౯-వ పుటలో నీయతి యంగీకరింపఁబడి యున్నది" అని వ్రాసిరి.

పండితవర్యు లిట్లు ఏకకంఠ్యముగఁ బల్కిన వాక్యములఁ జూచియో, చూడకయో విమర్శకు లిట్లు వ్రాయుట పొరఁబాటు. ఇఁకఁ దిక్కనయొక్క పాండితీవిభవమునుగూర్చి యాతని సమకాలికుఁడగు కేతనకవి వ్రాసినపద్యము నొకదాని నిట నుదాహరించి యివ్విషయము ముగించెదము.—

"క. అభినవదండి మనుమభూవిభు
సభఁ దెనుఁగున సంస్కృతమునఁ జతురుండై తా
నభియుకవి మిత్రనామము
త్రిభువనముల నెగడ మంత్రితిక్కఁడు దాల్చెన్."

అను పద్యమొకటి తిక్కనార్యుని పాండితీగరిమకు నిదర్శనమన్నఁ జాలును. సమకాలికుఁడు కేతనవాక్యములకన్న దాసయ్యగారి యూహలుగాని, విమర్శకుల గాథలుగాని తిక్కనవిషయమునఁ బ్రమాణములు కాఁజాలవు. పంతులుగారి విమర్శనము సవ్యాజమని స్పష్టమగుచున్నది.

* అముద్రితగ్రంథ చింతామణి మయూఖము, సం ౧౫. పుట ౨౩.

విమర్శనమునందలి యప్పయ్యదీక్షితుని గోఁచి యూఁకినగాథ, కొంకిపిటిసీములోని పడఁతిపద్యోదపైఁ దమ్మిలంపురసము స్రవించినకథ, "ఆకువారితోఁ గతిన ముగ మాటలాడుట నాస్వభావముకాదిచే" యను నాత్మస్తవము, వసభ్యములై, పనికిరానివై గ్రంథబాహుళ్యమును గలిగించినవి. ఇప్పటికి వీరి విమర్శమునందలి పూర్వభాగమును ద్రచ్చి తత్వమూలయఁ గంటిమి. ఈ పూర్వభాగమునందలి రెండుపద్యములు వీరిమిత్రులవలనఁ జర్చలోకివచ్చినట్లు గానవచ్చుచున్నవి. వారు తెలుపు నంతదనుక నీసంశయములు వీరికిఁ గలుగవనుట స్పష్టము. మఱియు నీపూర్వభాగమున విమర్శింపఁబడిన పద్యములన్నియుఁ బండితులు విమర్శించి సమర్థించి ప్రకటించి యున్నవియే.

ఇట్లు తిక్కనకవి నధిక్షేపించువ్యాజమున దమ గ్రంథముఁ బ్రకటించుకొనఁదలంచి వీరివిమర్శనమునకుఁ గడంగిరని తేలుచున్నది. కావున్నఁ దమకవితకుఁ దిక్కన కవితకుఁ దారతమ్యము నిరూపించి యాదరించుభాగ్యత యాంధ్రపాఠకావళిపై నుంచఁ దిక్కనపద్యమును ద్రోసి రాజన్నచోట "నా తెనుఁగునేత, నా తెలిఁగింపు, మూలము ననుసరించిన నాపద్యము" లని వీరు ప్రకటించుట సంభావ్యము కానేరదు.

---

## ఉదంతము

కొంపెల్ల జనార్దనరావు గారు

నాపునీత జీవనము స్వప్నములు విరిసి,
దివ్యలావణ్యములు ప్రభాతిల్లు నీమ
నోజ్ఞభూతికి వెలుఁగులు వోమువెట్టె,
నీమహామూర్తి వలపులు నిండికొలువ!

నీ స్వయంవంచితము కనీనికల మెఱఁపు
విసరిపుచ్చు లేములకు కంపిలుచు, నాప్ర
సార మశ్రువార్ధితఁ గని బోరుకలఁగె;
నీవు నీతృష్ణలదవుల నిలిచి, జాలి
రేకమసకలు తెఱచి కోసిక నిలిచి.

నాప్రసారము భీకరాంధతమసమ్ము
లై మొఱసికొని నాజీవ నాంధ్యమును
అడుగడుగు రేఁగు ప్రశ్నము లెడల నీవు
మునిఁగి లోలోన నీలోకములె సుఖించి.

నాప్రసారము విధురకాంతము, ప్రచండ
తాపహాము శాపమై నీసమస్తమునకు,
తన ప్రధూమించు ప్రణయసంతపన భరమె
పోసెడిదో యేమొ;—నాతొలుపూజ కదలి,-
అణువణువు నాకు భద్రతమై వెలింగి,-
నాయెద పవిత్రతలు నిండి, నామహత్త్వ
ములు వినిద్రములై, సర్వమునకు నొకమ
హాంత మయివెల్గు మంగళార్థ్యతయె గోచ
రించి, నాప్రసారము తానివర్తిల్లకున్న!

ఇపుడు నా యీవినూతన సృష్టి భాగ్య
ములు తరంగిల్లు త్రిజగత్పవిత్రత దివ్య
తీర్థముల,-నీకు మదిలోన తిరుగుడు వడి,
స్మృతిపథమ్ముల నా తమాశీఃప్రసార
చోదనములను యాత్రలు సురిఁగి వచ్చి,-
మునుక లిడి పోవుచుందు వప్పు డపు డీవు;
భూతమునె దిద్దికొన తలఁ పోడికొనుచు.

# 'నేను'

(ఒక దృశ్యము)

నటుండు

నాంది:

"ఏనెవండనో చెప్పవేమోయీా, కుమార!"
శారదా సుప్రసన్న విజ్ఞానభిక్ష
మూసిపెట్టిన నీకొంగుమూట విప్పి
విప్పఁగలవేమొ చూతుమీా వెఱ్ఱిచిక్కు!
దివ్యమందాకినీ స్రవంతీపథాల
పుణ్యభాగీరథీతీర పులినసీమ
నిత్యగోదావరీ తటనిగమవాటి,
చిక్కుప్రశ్న యిదొండువచ్చినది నేడు!

* * *

[గౌతమిలో ఒకపడవ; పడవలో ఒకతల్లి; తల్లి యొడిలో చిన్ని]

చిన్ని

అమ్మా! అమ్మా! ఎంతసేపూ యీాపడవలోనే?...పోదాఁవే—ఆకొండల్లో యేఁవిటో...

తల్లి

ఆగు, తల్లీ! ఈమూాడుమైళ్లూ పోతే మన వూరొస్తుంది.

చిన్ని

వూరురావొద్దే—మనఁనే పోదాఁవే వూరి దగ్గిరికీ. అదుగో, ఆగట్టునేపడి, చేలోగుండా, పెసరకాయలు తింటూా, పరిగెత్తుకు పోదాఁవే—రావూ?

తల్లి

అదేనమ్మా; మనం నడవకుండా, కాళ్లు నొప్పెట్టకుండా, యీాపడవే తీసుకెళ్తుందమ్మా వూరికీ...నిద్రపోరాదూ?

చిన్ని

ఆపడవ్వాళ్లుపాడే జోల నాకు బాగుండ్లేదే!

తల్లి

వాళ్లేదో పాడుకుంటున్నారు, నీకెందుకూ? అది నిన్ను జోకొట్టాని కనుకున్నావ్?...నేను పాడేదీ?

చిన్ని

వినమ్మా: ఆచెట్లు చక్కగా పాడతయ్యే; అక్కడో పూమంచె కట్టమన్రాదూ నాన్నని? మనఁ యిద్దరం పొద్దూకలూ ఆడుకోవొచ్చూ...

తల్లి

మనవూళ్లో అలాంటి చెట్లనోన్నివున్నాయమ్మా—

చిన్ని

మనపొలంలో వున్నాయ్—

తల్లి

కావాలిసి నన్ని!

చిన్ని

అయితే వాటికి పాటలు రావూ? ఇలాఁ పాడ్లేవేం?

తల్లి

పిచ్చిపిల్లా!.........

*  *  *

విహంగి

ఓదివ్యగంగాతటోపాంత మోహినీ!
శోకాంతవాహినీ!
ఓదారుణానిలాత్యుగ్ర కల్లోలినీ!
అుగ్రకల్లోలినీ!
ఓనైవతాశాని యోగితస్వైరిణీ!
యోగీంద్రకారిణీ!

*  *  *

చిన్ని

ఎవర్నే పిలుస్తుంది?

తల్లి

ఎవరే, కుంకా? నీకేవన్నా దయ్యంపట్టిందేఁ విటే?

చిన్ని

దయ్యం సరేలే; నన్నొదిలేయ్!

తల్లి

ఎందుకూ?

చిన్ని

నా కొళ్లు తిరుగుతుంది; ఊకొస్తుంది.

తల్లి

నీళ్లమీదుంటే అంతేనమ్మా! పొద్దాకేలో పలే ఫూరికి చేరతాంగా?

చిన్ని

ఊఁహుఁ. నన్నొదిలెయ్!

తల్లి

ఎందుకే?

చిన్ని

పొద్దుటి చద్దెన్నఁవంతా కక్కొచ్చేస్తుంది చూడూ.

తల్లి

అరగలేదుగాఁవాలమ్మా పాడుకూడూ...

చిన్ని

ఇలా కదలకుండా కూచోబెడితే యెట్టా అరుగుతుందీ? పంతులమ్మ చెప్పలేదూ పరిశ్రమ చెయ్యాలని?

తల్లి

ఏం చేస్తావే?

చిన్ని

అట్టా ఆబల్లకట్టుమీదికి పోయి ఆడుకుంటా—

తల్లి

ఎట్టాపోతావూ? నీళ్లల్లో పడిపోతావ్.

చిన్ని

ఇవన్నీ నీళ్లే—ఎటు చూసినా నీళ్లే. ఇంతేనా యిహా? పొద్దుగూకిందాకా, చీకటిపడిందాకా యీ బెత్తెడు పడవలోనే యిరుక్కోవాలమ్మా! అవన్నీ చూడూ, హాయిగా యెట్టా ఆడుకుంటున్నయ్యో! రెండుపుడతలు, ఒహదాన్నొహటి తఱుముకుంటూ, చెట్టుచుట్టూరా గబగబా పాకిపోతున్నై—నేనింతేనా యిహా? చీకటి పడిందాకా, నిద్రపోయిందాకా, యింతేనా? ఈ చిన్నపడవలో, ఎందుకమ్మా నన్నుంకట్టేశావూ? తప్పించుకోలేనూ? వుండు...నిద్దరొస్తే, యింకేవుందీ? యివ్వన్నీ

చూడనుగా; ఏఁవీ తెలీదుగా; ఎక్కడికి పోతా
నోగూడా యెరగనుగా! అందాకా—అమ్మా!
యిటుచూడు: నన్ను వొదిలెయ్యవే. పోనీ,
ఆవొడ్డుదాకా—కాదులే, ఆపడవ అంచు
దాకా పోయి, యిప్పుడే వొస్తా పరిగెత్తుకోని—
అమ్మా! యీపడవ పోనేపోదేం? కదల
కండా వుందేఁవే? పోతుందీ? లోపలకూ
చుంటే అట్టాగే వుంటుందా? అంచుకుపోతే
ఆకదల్టం తెలుస్తుందిగా? వొస్తావుండు—

[వొదిలించుకోని, చివరకు పోతుంది]

బాగుంది; అమ్మా, చూడూ: ఆగడ్డిమీద
కాకులన్నీ వొరసగా కూచోని కథలు చెప్పు
కుంటున్నై. నేనుగూడా వింటూ, కూచోనీ.

[పడవఅంచున, నీళ్లల్లో కాళ్లాడిస్తూ కూ
చుంటుంది.]

* * *

విహంగి

నవనవ పులకిత
నళినీ రంజిత
నయన వికాసము
నాదేనా?
వియత్త లాంగము
నాదేనా?

సలలిత మధుకర
చంచల మృదుగళ
సంగీతగతులు
నాకొరకా?
భృంగీ నాట్యము
నాకొరకా?

విరాగసంధ్యా
పరాగ మందిర
నిరోధ మార్గము
నాకేనా?
పరాధికారము
నాకేనా?

* * *

చిన్ని

బలేబలే: అది దేవభాషటే అమ్మా?

తల్లి

ఏడిశావ్—అంత చివర వూగుతూ కూచోక.
పడిపోతావ్, ఇలారా!

చిన్ని

పడిపోతా, పడిపోతా; చల్లగా వుంటుంది
గాదూ అక్కడా? తలనిండా మునిగితే హా
యిగా వుంటుంది గాదూ? యెండా చలీ రెండూ
కొడుతూ వేఁవిటమ్మాయిక్కడ లేకపోతేనూ?

తల్లి

ఒసేయ్, వోసేయ్! నీకేల చపరబుద్ధే? ఇలా
రా, నాతల్లీ!

[ఆదుర్దాతో లేచిరాబోతుంది; పడవవూ
గుతుంది.]

పడవమనిషి

ఆగు: ఎవరమ్మా ఆఁవె! మధ్యనే కూచోండి;
పెద్దవాళ్లు అటూయిటూ కదిలారంటే, దోనె
వొకతట్టు వొరిగిపోయి బోల్తాకొట్టుతుంది;
మనదేం స్టీమరా, పాడా? కదలొద్దుసుమండీ,
జాగ్రత్త!

తల్లి

అయ్యో! అయ్యో! నాపిల్ల నీళ్లల్లో పడు తుందేవో! (కదల్లేదు)

పడవమనిషి

అమ్మాయిని పిలవండి—

తల్లి

అయ్యో! అదరాదు—మీాలో మంత్రవైద్యు లెవరన్నా వున్నారండీ?—వొసేయ్, చిన్నీ!

చిన్ని

అమ్మా! అమ్మా! నువ్వుగూడా రావే! మనంవే, యీాపాడు పడవనే, వొదిలేసీ, అట్టా యీాదు కుంటూాపోదాం. ఆగట్టుచేరిందాకా, చూాశా వ్వా, అప్పుడప్పుడే కప్పలన్నీ వొచ్చి, మన చెవుల్లో రహస్యాలు చెప్పిపోతుంటై...ఆమిరప తోటల్లో చూాశావ్, గట్టుగట్టున పాడుకుం టూా పరిగెత్తుతున్నై చూాడూా అరకలు...... అన్నీపాటలే? అందఱూా పాటగాళ్లే!...బలే! బలే! చల్లగాలి వస్తుందే: నువ్వింకా ఆచీకట్లో బడి కొట్టుకుంటూావేవే, ఇలా రాక? అబ్బ! ఈగాల్లో యేంవిటోనన్ను మెల్లెగా నెట్టేస్తుందే యెక్కడికో? ఆమబ్బులు చూాడూా, అవిగూాడా పడవలేగాంవాలి, వాట్నిగూాడా యీాగాలే మెల్లగా చుట్టలుచుట్టలుగా నెట్టేస్తుందే? వాటితోపాటు నన్నూా నెట్టేస్తుంది. అదిగో వొకమబ్బు కొండచాటుకుపోయింది; ఇంకోటి; వాటితోపాటు నేనుగూడ పోతే? ఆవల యేంవుం దో చూాడాలనుందే; నువ్వుగూాడా రావు?

తల్లి

అమ్మో! నాపిల్ల కేంవిటో పూనింది. ఆరేళ్ల న్నారాలా—వెధవ పడవ పోతేపోయింది; [పోబోతుంది.]

పడవమనిషి

పడవేగాదు, పడవతోపాటు నువ్వూవిపోతావ్. ఇందులోవున్న ప్రాణాలన్నీపోతైయ్, జాగర్త! నీకేంవన్నా పిచ్చా యేంవిటి? ఎవరమ్మా నువ్వూ?

చిన్ని

అమ్మోయ్! ఆకలివేసిందంటే మళ్లీ లోపలికి రావాలి సొస్తుంది; నీదగ్గిరికి రావాలిసొస్తుంది; అందుక నిప్పుడే పోయ్యేదీ?...వరికంకులు చూా డూా, వూరికే తలకాయ లూాపుకుంటున్నయ్ ...పాపం, పిట్టలు గాంవాలే,వాటి నూరికేనెత్తి మీాద మొట్టిపోతునైనయ్; ఉండూాచెప్తా!

* * *

విహంగి

నీరజాంత
ర్నిలయవాసీ!
చారువైదిక
శక్త్యుపాసీ!
రార, మాావినువీథి, తేనెలు
జారుచున్నవిరా;
స్వర్నది
పారుచున్నదిరా......
ఈ జగత్స్ర
ష్టిని, వినోదవి

రాజితాంత
ర్నాటకాక్షులు
మూసికొంటివిరా,
పున్నెము
వోసుకొంటివిరా.....

భక్తినైశి
త్యార్థశక్తి వి
రక్తిమూర్తి
ప్రాభవంబున
మనసు నిలుపుమురా
నాశ్రుతి
పనస గలుపుమురా......

* * *

చిన్ని

ఏవిటో...వాడెవడో, నాక్కావాలి; ఆడు కోటాని కెక్కడెవ్వరూ లేరుగా! ఆ అబ్బాయి యెవరో!......అమ్మా! తప్పకుండా పోతానే, ఆకొండమలుపుకి; నల్లగావుండే, ఆకొండ చూశావ్వా, అక్కడెవరో ఆడుకుంటారుట, నేనుగూడా పోతానమ్మా; సాయంకాలమైనా ఆడుకోకుండా యింట్లో కూచోటం నేవిటి ఖర్మం?

తల్లి

తల్లీ! తల్లీ! నీకు పిచ్చెత్తింది, యిలారామ్మా! ఎక్కడికి నన్ను చూడకుండా అటుపోతావ్?

చిన్ని

నిన్ను చూస్తూనే వుంటానే! అక్కడికి పోయి నా, నీకు నేను కనపడనేమోకాని, నేను నిన్ను చూస్తూనే వుంటానే! నీదగ్గిర్నించీ ఆమబ్బుల్ని చూసిందాన్ని, వాటిదగ్గిర్నించీ నిన్ను చూ ళ్లేనూ? నాకోసం హార్మోనీ కొనిపుంచుతావు గాదూ? ఆపాటలన్నీ నేర్చుకొచ్చి దానిమీద పాడతా! పంతులమ్మకు సెలవు చీటీ నాన్ననూ రాయమంటావుగాదూ?...బలే! బలే! నువు రావుగాదూ? నీఖర్మం!......

తల్లి

అయ్యో! అయ్యో!...నీపడవ కాలా!......

* * *

నటుడు

ఇందేదో ధ్వనియించుచున్నది గదో
యీ, తెన్గుబిడ్డా! అఖం
డేందుస్ఫూర్తికి వన్నెదిద్దగల నీ
యీసోదరీరత్న మా
నందాంభోధితరంగ డోలికల ము
న్కల్ గొన్న పాపంబు ని
న్నొందం బోవకమున్న దూక జనరా
దో రక్షణోద్యోగివై?
నీవు పున్నెంబు గట్టుకొన్నావు, నీవు
నావతో పని తీర్చుకొన్నావు, నీవు
త్రోవ గనుమూసి పోదునన్నావు, నీవు
కేవలము నాకలోకమన్నావు, నీది!

---

## ౧౽

ఆశ్రమము తయారాయెనుగాని అహోబలుఁడు దానిచే చిక్కులపాలాయెను. తలుపులను తీసినచో మఱి పడవు. ఎటు లెటులో మూసినచో మఱి రావు. గద్దె మీఁద కూరుచున్నచో మఱిలేచుట కష్టము. లేచినచో మరి కూరుచుండుట కష్టము.

అది యాశ్రమముగనుక అందు పిట్టలును, పాములును విరోధములేక నివసించెను. వానిని హింసింపక బాలురు బయట నివసించుచుండిరి.

ఇది యిటు లుండఁగా పండుగు ప్రలయములు కలిసివచ్చినటులు గ్రామము లోనికి స్కూళ్ల యిన్‌స్పెక్టరు వచ్చెను. పంతులుగారి కానాఁ డహోబలుని యింట వారము. ఇన్‌స్పెక్టరుగారికిఁగూడ నచటనే వారము.

వీరవెంకమ్మ మెల్లగా వాకిటిలోనికిఁ జని జవానును బిలిచి ఇన్‌స్పెక్టరుగారిపేరు, ఊరు, హోల్ మకాము, జీతము, సంతానము, ఈమొదలగు విషయము లన్నియుఁ గనుఁగొనెను. మెల్లగా కాఫీకి నీళ్లుపెట్టి రెండిండ్ల పెత్తనము చేసి లోనికి వచ్చి ఇన్‌స్పెక్టరును జూచి 'నాయనా! సదాశివా! నీ వెవరో యనుకొంటిని, మాపుట్టింటివారువిస్సావఝులవారే నాయనా! నీ కెందఱు కూఁతుండ్రు? కొడుకు లెందఱు? భార్యను పిల్లలనుగూడఁ దీసికొనిరాక ఒంటరిగా వచ్చితివి?' అనెను.

ఇన్‌స్పెక్టరు మితరీతిగా ప్రత్యుత్తరము చెప్పెను. వీరవెంకమ్మ లోని కేఁగి కాఫీతెచ్చి యిచ్చి 'నాయనా! నాకుమారుఁడు స్కూల్ ఫైలో యేదో, ఆఅవక్లాసు కాఁబోలు, ప్యాసయి కూరుచున్నాఁడు. గాంధిగారి మాట విని బడి మాని అదిగో ఆదొడ్లో ఆశ్రమము కట్టినాఁడు. అక్కడ ఒక బడిట! దానినిఁ గూడఁ జూచి పో. అది తప్పో ఒప్పో నాకు తెలియదు నాయనా!' అనెను.

'ఇపుడే చూచి వచ్చెద' నని అతఁడు కాఫీ త్రావెను. మిగిలినది చాటుగా జవాను త్రావెను. దానిలో మిగిలినది పంతులు త్రాగి ఇన్‌స్పెక్టరు ముందులకు వచ్చెను.

'ఈక్రొత్తబడిలో నెందఱు పిల్ల లున్నారు?'

'గ్రామములో పనిలేని పిల్ల లందఱును ఇచటనే యున్నారు.'

'గ్రాంటుకొఱకు మనకు దరఖాస్తు పెట్టుకొనలేదేమి?'

'ఇది స్వదేశీబడి కాదు; విదేశీబడియుఁ గాదు. ఇ దొకరకము.'

'అనఁగా?'

'ఈబడిలో పుస్తకములు లేవు. పుస్తకవిద్యలో నహోబలుఁడుగారికి నమ్మిక తక్కువ. ఇచట భజన చేయుదురు. వీరికి భక్తి మెక్కువ. ఇచట బొమ్మలు గీయుదురు. కళల మీఁద మక్కువ.'

'ఇతనికి గ్రాంటు అక్కఱలేదా?'

'అక్కఱ యుండకపోవచ్చును.'

ఈసంభాషణ మయినపిదప ఇన్‌స్పెక్టరు గడియారము చూచి దుస్తులు ధరించెను. కనులకు జోడు పెట్టుకొనెను. ప్రేపబెత్తము చేతఁ బుచ్చికొనెను. చెప్పులు తొడుగుకొనెను జవాను ముందు ముందు నడచెను. ఇన్‌స్పెక్టరు వెనుక నడచెను.

'దారి యెక్కడికి తీయుమ'ని సెలవు?'

'ఆశ్రమములోనికి.'

పంతులు వీరవెంకమ్మను జూచి 'ఇన్‌స్పెక్టరుగారు మీపుట్టింటిపేరివారని నీ కెటులు తెలిసె నమ్మా?' అని యడిగెను.

'జవాను చెప్పెను నాయనా!'

'ఇన్‌స్పెక్టరుగారికి గారెలు చాల ఇష్టమని జవాను చెప్పినాఁడు విన్నారా?'

'అటులనా? ఒబ్బట్లు చేయఁదలఁచితిని. గారెలు గూడఁ జేయుదును.'

'మంచిది. మీయింట వడియములు అప్పడములు పెట్టినారా?'

'వెనుకటి వారమునాఁడు నీకు తినిన గుఱుతు లేదా?'

'అమ్మగారూ! నేను బడిలోనికి వెళ్లి మరల వచ్చెదను.'

'మంచిది నాయనా!'

జవాను మునిముం దేఁగి ఆశ్రమములోపల నీరు ఎత్తి పోయుచున్న అహోబలుని గవాక్షమునుండి చూచి 'ఏమయ్యా! ఇన్‌స్పెక్టరుగారు దయచేసినారు' అనెను.

తనపనిలోఁ దాను మునిఁగి తేలుచు అహోబలుఁడు 'మంచిది' అనెను.

ఈ 'మంచిది' జవానుకు చెడ్డ దాయెను. ఇన్‌స్పెక్టరంతవాఁడు స్వయముగా చూచుటకు రాఁగా బడిపంతులు 'మంచిది' అని గూడ వేసికొనుటయా! చేతులు కట్టుకొని యెదురుగా వచ్చి నిలుఁబడి గజగజలాడుచు నీళ్లు నములుచు చేతులు నులుముకొనవలసిన విధి కాదా? అర్ఘ్యపాద్యము లీయనక్కఱ లేదా? అహోబలుని ఔదాసీన్యము తనంత వానికిఁగూడ పరువుకాదు. తా నెవఁడు? 'ఇన్‌స్పెక్టరుగారి' జవాను!

ఆజవాను తనబిళ్లను ఎదురొమ్ముమీఁద తిన్నగా సవరించుకొనుచు 'నీకు గ్రాంటు వలదటయ్యా?' అనెను.

ఈప్రశ్నకును ప్రత్యుత్తరము బడయక అతఁడు వెను దిరిగిపోయి 'అయ్యా! ఇది స్వదేశీబడి' అనెను.

ఇన్‌స్పెక్టరు మాటాడక చుట్టునున్న ఆవరణమును జూచుటకు బయలు దేఱెను. కట్టవ

లోని ఛాయావృక్షములు ధీరులవలె తల లెత్తుకొని నిలువఁబడియుండెను. జీడిమావిళ్లు జవానులవలె వంగివంగి సలాములు చేయుచుండెను. కలేచెట్లు ఈఁటెలవారివలెఁ దవ్వులకుఁ గొట్టెను. పెడలపూలు ముక్కుద్రాళ్లు వోసి దాపులకు లాఁగుకొనియెను.

ఇన్‌స్పెక్టరు ముదముఁగొని ఆశ్రమద్వారముకడకు వచ్చెను. తలు పింకను తెఱవఁబడియుండలేదు. గౌరవలోపము లేకుండుటకు జవాను కొంచె మధికారమును బ్రయోగింపఁ జూచెనుగాని దొరకనుసన్నచే ఔదాసీన్యమును అలవఱించుకొనఁ దొడఁగెను.

ఇన్‌స్పెక్టరు ఆకట్టడమును క్రిందనుండి మీఁది కొకతూరి చూచి నివ్వెరపడెను. దాపీడు రోజీనా లెక్కచూచికొని పట్టుకొనిపోయి యెన్నినాళ్లో కాలేదు. చూపఱను భయపెట్టుటకుఁ బోలె ఆగోడలు మీఁదిమీఁదికి దుముకుచున్నట్టులుండెను. గవాక్షములును, తలుపులును మూయఁబడియున్నను ఆశ్రమగర్భములోనికి పిట్టలు రెక్కలు జాడించుకొనుచుఁ బరువెత్తుచుండెను. వాస్తుపురుషునకు కన్నులగు గూండ్లలో నొకటి చిబుకము మీఁదను మఱియొకటి పెడతలమీఁదను అమరియుండెను. సింహద్వారము ఈక్రింది పాటను అభినయించుచుండెను.—'ఓ చెలియా! ఓమగువా! నే తాళలేనే!'

ఇట్టి కట్టడపుఁ దలుపు దట్టఁబోయి ఇన్‌స్పెక్‌టరు వాతరోగివలె కాలిని వెనుకకుఁ బీఁకుకొనియెను.

'తేలు కుట్టినదా అండీ?'

'లేదు.'

'పక్షవాతము—'

'ఆ, కాదు.'

జవాను తెల్లఁబోయెను. ఇన్‌స్పెక్టరు కొంచెము నడచి దక్షిణపుగోడ గవాక్షముకడ నిలువఁబడెను. అది మూయఁబడియుండెను. లోపలినుండి పెద్ద ధ్వని వినఁబడుచుండెను. అతఁడు వంగి గూటిక్రిందఁ జూచెను. ఏదో కలుగు! దాని యుపయోగమును శంకించుకొని అతఁడు పరీక్షించుచుండెను. అంతలో గూడతో నీరు తోడు చప్పుడు వినఁబడియెను.

ఇన్‌స్పెక్టరు జవానును బిలిచి 'దీనిలోపల నూయి యున్నదా?' అని యడిగెను.

'లేదుగాని ఒకచోట చీలమండలలోఁతు నీరును మఱియొకచోట మోఁకాలిబంటి నీరును గలదు. వేసఁగిలో చల్లగానుండుటకు చిన్నచెఱు వేమేని కట్టించిరేమో యనుకొంటిని.'

ఇంతలో ఒక గూఁడెఁడునీరు ఆకలుగు చివరకు వచ్చి అతిథి ముఖము నవమానపఱచుట నెందులకనియో కట్టిన పనివాని నేర్పరితనమును పాడొనరించుట యెందులకనియో మరల లోనికే పోయెను.

మరల ఛటాత్కారము. ఊ రెగిరిపోవునంత చప్పుడేకాని బయటికి వచ్చెడి నీ రొకదోసెఁడు.

ఇన్‌స్పెక్టరు కిది యెంతయు నగమ్యముగా నుండెను. అతఁడు ద్వారముకడ కరిగి 'అయ్యా! తలుపు తెఱపుఁడు' అని యాచించెను.

ఒకపిలుపునకు బదులు లేదు. పిలుపు మీఁద పిలుపుగా నాలుగయిదు పిలుపులకు 'ఆ' యను ప్రత్యుత్తరము వినఁబడెను.

'తలుపు ?'

అహోబలుఁడు తలుపుల కానుకొని ప్రయత్నించి ప్రయత్నించి గడియ తీసి మెల మెల్లగా నటునివలెను, కవాతు చేయువానివలెను తప్పుకొనఁ దొడఁగెను. వెనుకకు బరుగెత్తు వెఱ్ఱి వానివలె రెక్కలు గబాలున విడఁ దొడఁగెను. అహోబలుఁ డాంజనేయునివలె వెనుకకు దుమికి, జాతి వెనుకగోడ కానుకొనెను.

అహోబలుని ప్రయాణపు మంచమును ఇన్‌స్పెక్టరుగారికొఱకుఁ బఱచి నీటిచెంబులను దాని క్రిందఁ బెట్టి జవానుకు పొగాకు సంపాదించి రోఁజుకొనుచు వచ్చి పంతులుగారు ఇన్‌స్పెక్టరుగారి ప్రక్క చేతులు జోడించుకొని లా అండ్ ఆర్డరులను పరిపాలించుచు నిలువఁబడిరి.

ఇన్‌స్పెక్టరును జూచి అహోబలుఁడు లోనికి ఆహ్వానించెను. అతఁడు భయసంభ్రమములతో లోని కడుగిడెను. అతని వెను వెనుకనే జవాను. జవాను వెనువెనుకనే పంతులు.

ఇన్‌స్పెక్టరు అహోబలుని జూచి యిటులనెను 'తెఱచుటకు ఒకయేనుఁగుబలమును ఉపయోగింపవలయుచో నిఁక మూయుటకెంతబల ముపయోగింపవలయునో!'

అహోబలుఁడు నవ్వి 'లోపలికి దయచేయుఁడు' అనెను.

తాను ఇన్‌స్పెక్టరుకడ వేచియున్నటులు తెలుపుటకు ఇంతవఱకును పంతులుగారికి సందు దొరుకలేదు. ఇపుడు దొరుకఁగా నిటులనెను. 'పనివాఁడు ఈ తలుపులను బిగించిననాఁడు గడియబెట్టుటకు ఊరేఁడుమంది పోగయిరి. ఈతలుపున కొకగడయు, ఆతలుపున కొకగడయు పోటీపెట్టి పదుగురు పదుగురుతలుపులు త్రోసి నొక్కిపట్టుకొనిరి. ఒకతలుపు ద్వారబంధమున కొకబెత్తెఁ డెడముగను మఱియొకటి జేనెఁ డెడముగను బోయెను. త్రోయఁగాఁ ద్రోయఁగా నొకపెద్ద చప్పుడు మొదలాయెను. గ్రామమునందలి కుక్కలేకావు, పందులేకావు జంతుజాల మంతయు పోగాయెను. తీవ్రవేదనతో, గూండ్రింపులతో, కొండకేకలతో తుదకు తలుపులు పడెను. ఇఁక గడియబెట్టుట కొకఁడు భయపడుచు భయపడుచు బోయి ప్రక్కగడల లెస్సగా పరికించి వెనుకముందాడి గడలవారిని హెచ్చరించి దిగ్గన వేయఁ దొడఁగెను. అది పడుట కియ్యకొనక గోండ్రుపెట్టెను. గడలవారు గోండ్రునకు భయపడి పట్టువదలిరి. గడియవయిచువాఁ డిపుడు ఆసుపత్రిలో కోలుకొనుచున్నాఁడు లెండు!' అనెను.

ఇన్‌స్పెక్టరు అహోబలుని జూచి 'నేను నిర్భయముగా లోనికి రావచ్చునా?' అనెను.

జవాను వెంటనే యిటులనెను 'అయ్యా, ఇది సీమెంటు చప్టా కాదు. నాఁచు చప్టా. దీనిలో గుంటలు చెలమలు చెఱువులుగూడ నున్నవి! అదిగోఁ బయికిఁ జూడుఁ డ'ని నివ్వెరపడెను.

ఇన్‌స్పెక్టరు క్రిందుమీఁదులు చూచి ముందరికాలు వెనుకకుఁ బెట్టి వెనుదిరిగి గబగబ వాకిటిలోనికి వచ్చి యొక నిట్టూరుపు విడిచెను. జవానును పంతులును భయపడి ఇన్‌స్పెక్టరుకడకుఁ బాఱిరి.

పంతు లిటు లనెను 'ఈయూరిలో యమ బ్రహ్మలు—

'యమబ్రహ్మ లేమిటండీ? మయబ్రహ్మలు కాదా?' అని జవాననెను.

'ఆ, ఇరువురు! ఒకఁడు దావీదు, రెండు, సుబ్బన్న. పూర్వము ధర్మరాజునకు మయుఁ డేకట్టెను. ఇపు డహోబలుఁడుగారికి దావీదు సుబ్బన్నలే కట్టిరి.'

'గ్రామములోనివారిపట్ల ఆమాత్ర మభిమానము వల దటండీ?' అని యనుచు అహోబలుఁడు వెలికివచ్చి దాపున నున్న చెట్టుక్రింద కూరుచుండుటకుఁ జాఁప పఱిచెను.

ఇన్‌స్పెక్టరు వెఱ్ఱిచూపుతో పదిగజములు వెనుకకుఁ బాఱి 'దీని నెందులకుఁ గట్టించితిరి?' అని యడిగెను.

'ఇది యొక పాఠశాల!'

'బాలురనుమాత్రము దీనికి పదిగజముల యెడమునఁ గూరుచుండఁ బెట్టఁడు. యముఁ డొక్కొకమా టొక్కొక ప్రాణమే కొనును; ఇది యొక్కమాటే పలువుర ప్రాణములఁ గొనును'

'వడిగనే మరమ్మతు చేయింతును.'

'మరమ్మతా? పడఁగొట్టి మరలఁ గట్టించుటయే దీనికి మరమ్మతు. మఱియు దీనిని బడగొట్టింప నక్కఱలేదు. నేఁడో రేపో తనంతటఁదానే పడిపోవును.' అని యిన్‌స్పెక్టరు పలుకుచుఁ బలుకుచు అహోబలుని చేయి పట్టుకొని పదిగజముల దవ్వులాఁగుకొనిపోవు లోపల ఆయాశ్రమపు తూర్పుగోడ పెళపెళమని భూశయన మొనరించెను.

## ౧౭

ఇన్‌స్పెక్టరు భుజించి నిదిరించెను. సాయంకాల మయిదుగంట లయినతరువాతి బడిని బరీక్షింప బయలుదేఱెను.

కొందఱు బాలురు వాగులలోను, పసుల పాకలలోను దాఁగిరి. కొందఱు అటకలమీఁది బోనపు పెట్టెలలో దాఁచిన లాగుచొక్కాలు ధరించిరి. కొందఱు అహోబలుని యిల్లు తొంగి తొంగి చూచుచు అటు, ఇటు, నడయాడఁ దొడఁగిరి.

బడి నేఁడు నిండిన యేటివలె నుండెను. నేఁడు రమారమి నలుఁబది యేండ్ల యీడుగ

లవారు మొదలుకొని నాలుగేండ్ల యీడుగల వారి వఱకును గల విద్యార్థులచే బడి కిటకిట లాడిపోవుచుండెను.

నలుఁబదేండ్లవారి ముచ్చట కొంచెము ఇచట చెప్పఁదగియున్నది. వా రసలు కూరఁగాయలు అమ్ముకొనువారు. వారు ఇపుడు 'డట్' ప్రత్యయమువలె సంఖ్యాపూరకులు, వా రీనాఁడే యీబడిలోనికి వచ్చిరి. ఈ నాఁడే పండితులవలె బడిని విడనాడఁగలరు. ఈనాఁడుమాత్ర మిచట ముడ్డి మోపుటకు ఎనిమిదణాలు కూలిసేర్పాటు చేసికొని బడిలోనికి వచ్చిరి.

ఇన్‌స్పెక్టరుగారు తమ సనాయనిశాసీలతో వచ్చి కుర్చీలోఁ గూరుచుండిరి. వారు ముక్కాఁకలు తీరినవారు. వారు లోఁగడ కఠిన పరీక్షలు చేసిచేసి విసివిరి. ఇపుడు స్థాలీపులాకముగా పరీక్షలు చేసిపోవుచుందురు. వారు కనులకు జోడుపెట్టుకొని బాలురవంక నొకసారి ముఖము త్రిప్పిరి. బాలురందఱును మెఱుమును చూచినటు లయినదిగాని వృద్ధబాలురు మాత్రము ఇన్‌స్పెక్టరు గారికి తమ కౌతుకమునే స్వాగత మొనరించిరి.

'పంతులూ! హాజరుపట్టీ యేదీ?' అని ఇన్‌స్పెక్ట రడిగెను.

'పంతులు హాజరుపట్టీని చేతులతోఁ బట్టుకొని నిలువఁబడెను.

ఇన్‌స్పెక్టరు తీసికొని తెఱచి 'పుల్లయ్యా' అని బిగ్గరగా అనెను.

ఈపుల్లయ్య వృద్ధబాలుఁడు. అతఁడు తడఁబడెను. పంతులు అతనిని కఱకుగాచూచెను. పుల్లయ్య పెదవులు కొఱికికొని 'పంతులు చెప్పిన మాట మఱచాను' అని గొణుగుకొని తుదకు ('పెంట-పెంట-సార్') అనెను.

వెంటనే పంతులు 'ప్రెజెంట్ సార్' అనెను. వృద్ధబాలు రందఱును నవ్వి 'ప్రెజెంట్ ప్రెజెంట్' అని అనిరి. పిదప ఇన్‌స్పెక్టరు 'రామయ్యా' అనెను.

ఈ వృద్ధబాలురలో రామయ్య యనువాఁ డొకఁడును లేఁడు. రమణయ్య యనువాఁడు కలఁడు. అసలు రామయ్య ఊరికి పోయెను. 'శేషమువలన గుఱుతు' దవులు నని తలఁచి 'రామయ్యా'అని పిలువఁగనే 'ప్రెజెంట్ సార్' అని చెప్పుమని పంతులు రమణయ్యకుఁ జెప్పెను. కాని రమణయ్య ఇన్‌స్పెక్టరుభూతము ముం దది యంతయు మఱచెను.

వృద్ధబాలు రొకరిమొగ మొకరు చూచుకొని 'మాలో రామయ్య యెవరూ లేరండీ' అనిరి. పంతులు రమణయ్యను చూచెను.

'వా టీ జట్?' అని ఇన్‌స్పెక్ట రనెను.

అపుడు రమణయ్య 'అపుసెంట్ సార్' అనెను.

'అపుసెంటు కాదు; 'ప్రెజెంట్ సార్' అని పంతు లనెను.

రమణయ్య 'ప్రెజెంట్ సార్' అనెను.

తరువాత ఇన్‌స్పెక్టరు కనులజోడు సర్దు కొని అతిగంభీరముగా పంతులుగారి మోము తిలకించి 'వేంకటేశ్వరరావ్' అనెను.

ఎవరును మాటలాడకముందే పంతులు 'ప్రెజెంట్ సార్' అనెను.

పిదప ఇన్‌స్పెక్టరు హాజరు పట్టీలోని పేళ్లన్నియు చదువుచుండఁగా పంతులు 'ప్రెజెంట్ సార్' అని చెప్పఁ దొడఁగెను. తుదకు ఆపరీక్ష ఆఖరాయెను. ఇన్‌స్పెక్టరు కొంచెమునే పటిటు చూచి 'పంతులూ! ఈయేఁడు పంచాంగము చూచితివా?' అనెను.

'చిత్తము.'

'వృశ్చికవృద్ధియెంత?'

'పదమూఁడు.'

'తన్నాశము?'

'ఒకటి.'

'మంచిది' అని ఆ యిన్‌స్పెక్టరు బాలురకు మార్కులు వైచి ఆకాకిత మచటఁ బెట్టి వాకిటిలోనికి వెళ్లెను. పంతులు ఆకాకితమును జూచుచుండఁగా సతనిముఖ మంతయు కలకలలాడుచువచ్చెను.

వెంకయ్య యను బాలుఁ డొకఁడు లేచి 'మేష్టార్! నేను ప్యాసయినానా?' అని యడిగెను.

'ఆ ప్యాస్.'

'నేను?' అని వెంకటరామయ్య అడిగెను.

'ప్యాస్.'

'నేను నేను నేను' అని బాలు రందఱడిగిరి. 'ప్యాస్ ప్యాస్ ప్యాస్' అని పంతులు ప్రత్యుత్తరించెను. అడుగనివారు వృద్ధబాలురు. కాని 'మే మింకి వెళ్లవచ్చునా?' అని వారడిగిరి.

'ఉండుఁ డుండుఁడు' అని పంతులు వేలితో సైగచేసెను. ఇన్‌స్పెక్టరు వడివడిగా లోనికిఁ బరువెత్తుకొని వచ్చి 'ఊరు తగులఁబడిపోవుచున్నది, ఊరు తగులఁబడిపోవుచున్నది; ఇక్కడ పెద్దపెద్ద పిల్లలున్నారు, వెంటనే చల్లార్పుఁడు, పరుగెత్తుఁడు, పొండు' అని యఱచి చెప్పుచుండఁగా ఆబడి యంతయు శూన్యమయిపోయెను.

ధూమవాలము ఊరంతయుఁ జుట్టుకొనియెను. రత్నగర్భ పగిలి వెలికిఁ గ్రక్కు రత్నములవలె స్ఫులింగములు దోఁచెను. స్ఫోటశబ్దముతో లేచిన పన్నగరాజు పడగలవలె మంటలు లేచెను. ధూమశిఖావచూడమగు నామహాజ్వాల భూమ్యాకాశములకు నిచ్చెన కట్టెను.

పసువులు తోఁకమట్ట లెత్తుకొని యిండ్ల చుట్టు తిరుగాడఁ దొడఁగెను. పిల్లలు తల్లుల కాళ్లకు సంకెల లయిరి. ఇండ్లన్నియు కొల్లగొట్టఁబడినటులు వాకిండ్లు సామానులతో నిండెను.

మంట లార్పుకొనుట మాని యెవరికి దొరకిన సామాను వారెత్తుకొని పోఁజొచ్చిరి.

గ్రామము నంతయు అగ్ని అరాచక మొనరించెను. బ్రాహ్మణు లగ్నిసూక్తములు పఠించి ఆజ్యము నాహుతి చేయఁగడగిరి. అగ్ని దేవుఁడు వారిభక్తి కానందించి వారిహస్తములను స్పృశించి యాలింగనముఁ జేసికొనరాఁ దొడఁగెను.

పలువురు తెల్లఁబోయి చూచుచుండిరి' ఆఱుపుటకుఁగాని, తడుపుటకుఁగాని యొకఁడును ప్రయత్నింపఁ దలఁచుకొనలేదు.

అపు డహోబలుని బడిలోని బాలురందఱు చేతులతో కుండలు తీసికొని బయలుదేఱిరి. చెఱువుకడనుండి యిండ్లవఱకును ఇరువదేసి గజముల కొక్కొక్కనివంతున నిలువఁబడిరి. కుండతరువాత కుండ, కుండ తరువాత కుండగా నీరు వచ్చి పడుచుండెను.

ఇన్‌స్పెక్టరు ఆపిన్నవారి నియతిని జూచి యాశ్చర్యపడెను. బజారులలో బేజారుపడి చూచుచుఁ జూచుచు నిలువఁబడియున్న పెద్దవారు వారిని జూచి 'ఓరీ! మీకు ప్రాణముల మీఁద ఆశ తీఱినదఁట రా!' అని విముఖులను గావింపఁ దొడంగిరి. ఇన్‌స్పెక్టరునకు కసి పుట్టెను. 'అమ్మ పెట్టను పెట్టదు; అడుగుకొని తిననయినను తిననీయదు' అనునటులు మీరు చేయకపోవఁగా చేయువారినిగూడ చీలఁదీయుదు రేమయ్యా? ఈపిన్నవారిని జూచిన మీకు సిగ్గగుట లేదయ్యా? చాలుఁజాలు, మీరుగూడ కడవలఁ గొనిరండు' అని ఇన్‌స్పెక్టరు ఆపెద్దవారిని హెచ్చరించెను. 'అగ్ని దేవుని ఆగ్రహము చల్లాఱవలయునుగాని మనచేతులతో ఆర్పవచ్చునండీ? ఆర్పఁగలమటండీ?' అని ఆపెద్దలు ఇన్‌స్పెక్టరుకు సుద్దులు చెప్పిరి.

'భక్తిశాస్త్రమునుండి వచ్చిన యీవాసన సోమరుల నందఱను పట్టుకొనియున్నది. ఇది యెటనుండి పుట్టెనో ఎచటనెచట వ్యాప్తమాయెనో ఎచట నెలకొనెనో యేరి కెఱుక? ఛీఛీ! ఈగ్రామ మిఁక దగ్ధ మగుఁగాక!' అని ఆయిన్‌స్పెక్టరు ఒక కడవఁ గైకొని యహోబలుని బడిలోఁ జేరెను.

అహోబలుఁ డొకయింటిమీఁదినుండి మఱియొకయింటిమీఁదికి దుముకుచు కడవలెత్తి నీరు దిమ్మరించుచుండెను.

బడిలోని వృద్ధబాలురు కావళ్లు బుజములమీఁద నిడికొని ఊడనిఁ బాడుచుండిరి. ఇన్‌స్పెక్టరు వారిని జూచి "రామయ్యా! కడవ బట్టుకొనక కావడి బట్టుకొని పాఱిపోవుచుంటివా? రా! రమ్ము!" అనెను.

'నేను రామయ్యనుగాను, రమణయ్యను'

'రమణయ్య వయినను రావచ్చును.'

'ఇఁక నాకు బడితో పనిలేదండీ!'

వీ రిటులు సంభాషించుచుండఁగా మిగిలిన వారు దారిలో నున్న వస్తువులను కావడించి కొనిపోయిరి. రమణయ్యయు మాయమాయెను.

అగ్నిహోత్రుని యార్భాటము సవలోకించుచు పలువురు కాపులు తిరుగాడుచుండిరి.

ఇన్స్పెక్టరు సైపఁజాలక 'ఏమయ్యా! చెఱువా దూరము కాదు. నీరా శూన్యము కాదు. మీరా అశక్తులు కారు. ఆ పిన్నవారలఁ జూడుఁడు! వారేమి చేయుచున్నారో మీరా పని చేయఁజాలరా?' అని ప్రార్థించెను.

'నరకకుండమువలె తగులఁబడుచున్నది. రండురా నాయనలారా బయటికి' అనఁగా 'మీరు రాకున్నారు. పైఁగా మమ్ముఁగూడ అందులోఁ బడి చావ మందు రటండీ మీ రెంత ఇన్స్పెక్టరుగా రయినను?' అని వా రందఱును దొంగతనమునకు సందుగొందులలోఁ జొరఁబడిరి.

'ముదుసలి చచ్చె, ముదుసలి చచ్చె' అని ఆర్తనాదములు వినఁబడెను.

ఆ ముదుసలి నేలలో డబ్బు పాతిపెట్టుకొనెను. ఎవరయినను ఎత్తుకొని పోదు రని అతఁడు దానిమీఁదఁ గూరుచుండెను. ఇల్లు కూలెను.

'దేవుఁడు తగులఁబడుచున్నాఁడు, దేవుఁడు తగులఁబడుచున్నాఁ' డని మఱియొక గంభీరనాదము ఉప్పతిల్లెను.

అందఱును 'దేవుఁడు దేవుఁడు' అని యఱచి దేవాలయము కేసి పరుగిడఁదొడఁగిరి.

అహోబలుఁ డిటు లఱచెను — 'దేవుఁడు అదాహ్యుఁడు. మునిముందు ఈ సారి దేవుని బయటికిఁ దీయుఁడు.'

ఈ యఱుపులతో అందఱును ఆఁగిరి. అహోబలుఁ డింటిమీఁదినుండి దుమికి కూలిన యింటిలోఁ జొఱఁబడెను. అతనివెంట అతని బడిలోనివారు కొందఱు చొఱఁబాఱిరి.

పొగ నలువంకల నలముకొనెను. మెల్లగా అగ్ని పరివేష్టించెను. భూదేవి రక్తము క్రక్కుకొనుచున్నదా యనునటులు పెద్ద మంట లేచెను.

'అహోబలుఁ డగ్నికుండమునఁ బడె'నని ఘోషపుట్టెను. దాపుననే మఱియొక ఘోష యిటులు వినఁబడెను — 'దేవుని దీయఁబోయి వీరవెంకమ్మగారు దేవళములోపూఁడిపోయెను'

ఆశ్రమవాసులలో కొందఱు ఇంటిలోపలను మఱి కొందఱు దేవాలయగర్భమునను ప్రవేశించిరి. కొంతసేపటికి ముదుసలితో నహోబలుఁడును, దేవవిగ్రహముతో వీరవెంకమ్మయు వెలికి వచ్చిరి. వారియొడలు కొంచెము కాలెను. ఉత్సాహపూరితు లగు ఆ పిన్నవా రందఱును అంతటితో నాఁగక వరుణదూతలవలె నీరు కుమ్మరింపఁదొడఁగిరి. రమారమి ఒకగంటలో మంటలు చల్లాఱఁదొడఁగెను. ఇన్స్పెక్టరు ఆశ్చర్యముగా వారి నందఱను దిలకించెను.

ఊరిబయటికి లేచిపోయిన స్త్రీలును, శిశువులును మరలి రాఁగడఁగిరి. పాఱిపోయిన భీరువులును, సోమరులును, పెద్దకాఁపులును దిరిగి వచ్చిరి. అపటున చట్ట నక్కియున్న పాలేళ్లు వాకిండ్లముందు కానిపించిరి. గృహ

స్వాములు లేని యిండ్లలోని వెండిబంగారులు పాలేళ్ల పాలాయెను. కాలుచున్న ధాన్యరాసులను కొందఱు ఆర్పఁదొడఁగిరి.

చీఁకటిపడెను. ఆఱుచున్న మంటలు అగ్నిదేవుని అసంతుష్టములగు ముఖములవలెఁ గానవాయెను. కమిలిపోయిన భూదేవత యూరుపులవలె పొగలుచూపట్టెను.

అలసిన వా రందఱును శయ్యలపయి చేతులను గాళ్లను పాఱవయిచి నిదిరించిరి.

అహోబలుఁడును, ఆశ్రమవాసులును పోయినది పోఁగా మిగిలిన దిక్కులేనివారి ఆస్తిని కాపాడుటకు ఆరాత్రి యెల్ల వంతులు వేసికొని గస్తు తిరిగిరి.

మఱునాఁటి ప్రొద్దున ఇన్స్పెక్టరు ఆలోచించుచుఁ గూరుచుండెను. వెనుకటి నాఁటి ప్రొద్దుటి అహోబలుఁడు వేఱుగను, మాపటి అహోబలుడు వేఱుగను, వెనుకటినాఁటి ప్రొద్దుటి వీర వెంకమ్మ వేఱుగను మాపటి వీరవెంకమ్మ వేఱుగను అతనికిఁ దోఁచెను. ప్రొద్దుటి అహోబలుఁ డోబయ్య. మాపటి యహోబలుఁ డహోబలుఁడు; ప్రొద్దుటి వీర వెంకమ్మ యెంకమ్మ. మాపటి వీర వెంకమ్మ వీరవెంకమ్మ. అహోబలుఁడు మనుష్య దేవతను బ్రతికించుకొని వచ్చెను. వీరవెంకమ్మ ఈశ్వరుని బ్రతికించుకొని వచ్చెను. ఈ రెండు సాహసములను ఇపుడు మనోనేత్రమునఁ జూచుచున్న ఇన్స్పెక్టరుశరీరమునందలి ప్రతి రోమమును నిక్కపొడిచెను.

అతఁడు కలమును కాకితమును చేతఁగొని వార్తాపత్రికలకు ఇట్లు వ్రాసెను:

"నేను శివాగ్రహారమున ఎలిమెంటరీ బడిని పరీక్షింపఁబోతిని. అచట అహోబలుఁడు గారిచే స్థాపింపఁబడిన ఆశ్రమమును జూచితిని. నేను చూచుచుండఁగనే ఆశ్రమపుగోడ విఱిగి పడెను. ఆ సాయంకాలమున గ్రామము తగులఁబడెను. అహోబలుఁడుగారును, వారిజనని వీరవెంకమ్మగారును, ఆశ్రమ బాలకులును మంటలలో దుమికి చాలఁ బ్రాణములను కాపాడిరి. మంటలలో మునిఁగిన మనుష్యుని అహోబలుఁడును, దేవవిగ్రహమును వారితల్లియు బయటికిఁ దెచ్చిరి. ఇంత సాహసము ఎన్నఁడును నేను కని విని యుండలేదు.

ఇపు డీ యాశ్రమమునకు ధన మత్యావశ్యకము. చేతు లున్నవా రందఱును చందా లొసఁగవలెను. ఇపుడు చేయుదానమే దానము—"దాతవ్య మితి యద్దానం దీయతే ఽనుపకారిణే—"

అని వ్రాసి అహోబలుని చిరునామాతో ముగించెను. సర్కారువారికి మఱి యొక విన్నపమును తయారుచేసి అహోబలుని కొఱకు ప్రతీక్షించుచుఁ గూరుచుండెను.

స్నాన సంధ్యా ద్యనుష్ఠానము లొనరించిన పదఁపడి అహోబలుఁడు ఇన్స్పెక్టరు గారికడకు వచ్చి ధన్యవాదము లొనరించెను. ఇన్స్పెక్టరు అహోబలుని వీఁపు తట్టి తాను వ్రాసిన విన్నపముల నమోనాలను జూపెను.

అహోబలుఁడు సంతసించి యిటులనెను: "త్యాగశీలు రెవరేని యిచటికివచ్చి పనిచేయుట ఆవశ్యకముగా నున్నదిగాన అట్టి ప్రార్థనగూడ మొకటి విన్నపమునఁ జేర్పఁగోరుచున్నాను."

ఇన్స్పెక్టరిటులనెను—"ఈచిన్నపల్లియకు ఎవరువచ్చి పనిచేయుదురు? అది అనావశ్యకము."

అహోబలుఁ డిటు లనెను—"కాదు; ఆప్రార్థనగూడఁ జేర్పుఁడు."

"ఎవరు వత్తురని మీరనుకొన్నారు?" అని ఇన్స్పెక్టరు ఒత్తి పలికెను.

"దైవ మెవరిని ప్రేరించునో వారు వత్తురు" అని అహోబలుఁ డనెను.

ఇన్స్పెక్టరు నవ్వుకొని అనిష్టముతో అహోబలునిమాట దానఁ జేర్చెను. పిదప నతఁడు అహోబలుని ప్రశంసించి పీరవెంకమ్మ కడ సెలవుగొని మఱొకబడిని బరీక్షించుటకు గ్రామాంతర మరిగెను.

౧౮

ఈ విన్నపము ప్రకటింపఁబడిన నెలవఱకు అహోబలుఁడు నోరుకట్టుకొని యుండెను. పిదప నొకనాఁడు 'నాకు మనియార్డరు లేమైనను రాలేదా?' యని తపాలాజవాను నడిగెను. 'రాలేదు' అని అతఁడు బదులాడెను.

మఱుతడవ తపాలావాఁడు రాఁగానే అహోబలుఁడు 'మనియార్డరు రాలేదా' అని యడిగెను. 'రాలేదండీ' అని వాఁడు ప్రత్యుత్తరించెను.

ఇట్టి ప్రశ్నోత్తరములు అహోబలునకును తపాలావానికిని విసువు విరామము లేక జరుగఁ దొడఁగెను. కాని తుదకు ఉత్తరము చెప్పుటలో తపాలావానికి కష్టము కలుగఁజొచ్చెను.

ఇది యిటులుండఁగా నొకనాఁడు తహసీలుదారు వచ్చెను. రెవిన్యూ ఇన్స్పెక్టరు వచ్చెను. ఊరివా రందఱును అహోబలుని కడకు వచ్చిరి. అహోబలుఁడు లోలోపల నానందించెను. అందఱును గలిసి చేతులు కట్టుకొని తహసీలుదారువారి దర్శనమున కరిగిరి.

అహోబలుఁడు తహసీలుదారునకు నమస్కరించెను. అతఁడు తల యూఁచెను. పిదప నహోబలుఁడు రెవిన్యూఇన్స్పెక్టరునకు నమస్కరించెను. అతఁడు ప్రతివందనము చేసెను. గ్రామస్థు లందఱును తహసీలుదారుగారికిని రెవిన్యూఇన్స్పెక్టరుగారికిని దండప్రణామము లాచరించిరి.

తహసీలుదారుగా రిటులడిగిరి —'అహోబలుఁ డెవరు?'

'నేను.'

'మీగ్రామమున నష్టపుమొత్త మెంత?'

'సరి యయిన లెక్క తెలియలేదు.'

'అంత లెక్కలేనిపని యేల చేసితివయ్యా? పోనీ; సుమారు?'

'ఏఁబదిరెండిండ్లు ధనధాన్యములతో దగ్ధమయిపోయిన. సుమారు నాలుగువందల మందికి అన్నము లేదు.'

'అన్నము లేకున్న సరకారువారు చేయునది సున్న. ఎవనియన్నము వాఁడు తిన వలయును. కాలిపోయినవి పెంకుటిండ్లా, పూరిండ్లా ?'

'పూరిండ్లు.'

'పూరిండ్లకు ఇంత హడావడియా? దీనికి అర్జీలు, విన్నపములు వగైరాలా? లోకమున ఎన్నెన్ని గ్రామములు తగులఁబడుటలేదు? సరికాని ఇఁక ఇట్టి పిచ్చిపిచ్చి అర్జీలు పెట్టకుఁడు. బంజరులోని తాటాకు కొట్టుకొనుటకు ఆర్డరు వేసెదను. ఇండ్లు కప్పుకొనుఁడు.'

అహోబలుఁ డీమాటలకు తెల్లఁబోయెను. ఎటులెటులో ధైర్యము తెచ్చుకొని 'కలప లేనిదే ఆకు లెందులకు ?' అనెను.

'కొండంత దేవరకు కొండంత పత్రి నెవరు పెట్టఁగలరు? కలప తెచ్చుకొనుఁడు; ఆకు లిచ్చెదము' అని తహసీలుదారుగారు మఱొక మకామునకు బయలుదేరిరి.

రెవిన్యూఇన్‌స్పెక్టరును, జవానులును రక కూరుచుండలేదు; చాటుగా చేయి జాఁపిరి. తహసీలుదారువారి సిబ్బంది యంతయు కొలఁదిసేపటిలోనే వెళ్లిపోయెను.

సరకారువారు చాల సాయము చేయఁగలరని అహోబలుఁ డనుకొనెను. కనీసము కలపయయినను ఈఁగల రనుకొనెను. కాని వా రిచ్చునవి ఆకులు.

ఈ యాఘాతముతో అహోబలుఁడు ఛాయనుండి సత్యపు ఎండను కొలచుచు చూడఁగలిగెను. దరిద్రుల స్థితిని ఆలోచించుచు ఇంటికి మరలుచుండఁగా తపాలాజవాను ఎదురుగా వచ్చుచుండెను. అతఁ డహోబలుని జూచి నిలువఁబడియెనుగాని అహోబలుఁ డతని జూడను లేదు; ఏమియు నడుగను లేదు.

తపాలావాఁ డిటు లనెను—"అయ్యా! రానియపుడు 'మనియార్డరు వచ్చెనా? మనియార్డరు వచ్చెనా?' యని యడిగితిరి. వచ్చినపుడు మాటాడరు."

అహోభలుఁడు తలయెత్తి 'మనియార్డరు వచ్చెనా?' అని యడిగెను.

'వచ్చెను.'

'ఎంత?'

'ఒక అణా.'

అహోబలుఁడు తెల్లఁబోయి చూచుచు నిలువఁబడిపోయెను. తపాలావాఁడు మనియార్డరు ఫారము చేతి కిచ్చెను.

సహాధ్యాయుఁడు వెంకటరావుచే అది పంపఁబడియెను. అహోబలుఁడు దానిని బాగుఁ జూచుచు ఆలోచనోన్ముఖుఁ డాయెను.

తపాలావాఁడు ఇటు లనెను—'దీనికొఅకు ఎన్నోనాళ్లనుండి వాచారించుచుండితిరే! చేవ్రాలు చేయ రేమి?'

అహోబలున కీమాటలు వినఁబడలేదు. నిర్నిమేషమయిన యతని చూపు తపాలావానికి అక్కజము కలిగింపఁగా నతఁ డిటు లనెను—'వాపసు చేయనా?' అహోబలుని

కీ మాటయు వినఁబడలేదు. వాదసుచేయుట కును పుచ్చుకొనుటకును సమయమనే అతఁడుండెను.

కొంతవడికి 'దైవప్రేషితము తృణమయినను కణమయినను స్వీకరింపఁదగినదే' యని యతనికిఁ దోఁచెను. వెంటనే యిటులనెను —

'కలము కలదా?'

'కలదు.'

అహోబలుఁడు కలముఁ గొని వ్రాలొనరించి అణా తీసికొనియెను.

తపాలావాఁడు చేయి జాఁపి 'బహుమతి దయచేయరా?' అని నవ్వెను.

అహోబలుఁడు జేబు తడిమి రూపాయ తీసియిచ్చెను. తపాలావాఁడు తీసికొని నిర్విణ్ణత చెందెను.

పిదప పదిరోజులలో తపాలావాఁ డహోబలుని జూచి నమస్కరించి 'అయ్యా! మనియార్డరు' అనెను. అహోబలుఁ డతనిని జూచి యూరకుండెను. తపాలావాఁడు మనియార్డరు ఫారము చేతి కిచ్చెను.

పూర్ణచంద్రరావు నూఱు రూకలంపెను. దానిని జూడఁగనే అహోబలుని కను లశ్రువులు కురిసెను.

తపాలావాఁ డీతూరి యేమియు నడుగలేదు. అనంతర మొక నెలకు తపాలావాఁడు వచ్చి అహోబలునితో 'అయ్యా! తమ కొక వేయిరూకలు ఇన్సూర్ వచ్చిన' దని చెప్పి పోయెను. అహోబలుఁడు వెంటనే సమీప గ్రామమున నున్న తపాలాకచేరికి నడచిపోయెను.

ఆ యిన్సూర్యరు సీతయనుదానికడనుండి వచ్చెను. అహోబలుఁ డాపేరు చూచి యాఁగిపోయెను. పోస్టుమాస్టరతనిని జూచి 'ఏమండీ! అటులు చూచుచున్నారు?' అనెను. 'నాకుఁ గొంచెము వ్యవధి కావలయును. తీసికొనుటయో త్రిప్పి పంపుటయో కొంచె మాలోచించి కొనవలయును' అని యహోబలుఁ డనెను. 'మంచిది. ఆలోచింపుఁడు' అని పోస్టుమాస్టరనెను.

అహోబలుఁడు వాకిటఁ గూరుచుండి యాలోచించెను. ఆలోచించి యాలోచించి సీత వసుమతియని తలపోసెను. 'అగుదో వెంకటరావు — అణాకును, పూర్ణచంద్రరావు నూటికిని, వసుమతి వేయికిని సంఖ్యామాత్ర భేదముకాని యీవిలో నేమియు తేడా లే'దని యనుకొని కొంచె మాలోచించెను. 'మొదటి దానము నన్ను ఉపహసించెను. రెండవది నన్ను అభినందించెను. మూఁడవది నాతప్పు నాకుఁ దెలిపెను.' అని యనుకొనెను. పిదప మెల్లగా లేచి గవాక్షముకడ కరిగి 'అయ్యా! పుచ్చుకొందును' అనెను.

పోస్టుమాస్టరు వ్రాలు చేయించికొనెను. అహోబలుఁడు సీల్లు పరీక్షించి విప్పి చూచుకొని హాసన్ముఖముతో గృహోన్ముఖుఁ డాయెను.

నాఁటి సాయంకాల మహోబలుఁ డొక చిన్నసభ చేసెను. వచ్చిన రూపాయలు చూపెను. కలశకొలకు అందఱకును సమముగా పంచిపెట్టెను. గ్రామము తగులఁబడుచుండఁగా భయఁపడి పాఱిపోయినవారును, సోమరులై చూచుచునిలువఁబడినవారును, దొరకినసొమ్ము దోఁచుకొని పోయినవారును మిగిలినవారును ఆధనమును సమముగా ననుభవించిరి.

దీనితో నహోబలునకు పైబరువు కొంత తగ్గెను. పిదప మూఁణ్ణాళ్లు యోచించి ఒకచీటి వెంకటరావునకును, మఱియొకటి పూర్ణచంద్ర రావునకును ఇంకొకటి సీతకును ఈరీతిగా తయారుచేసెను:—

“వెంకటరావుగారి సన్నిధిని, నమస్కారములు.

తమ యుపహాసమువలననే నా కీమాత్రపు తెలివితేటలు కలిగెను. మీదానమును మనఃపూర్వకముగా గ్రహించితిని. ఎల్లపుడును ఇట్టి యుపహాసముతోడనే నన్ను విమర్శింతురని ఆసింతును.

పూర్ణచంద్రరావుగారి సన్నిధిని, నమస్కారములు.

మీదానమును చేతులొగ్గి గ్రహించితిని. పలువురు దరిద్రనారాయణులను మీ రారాధించితిరి. కాని నాకు ఇసుమంతయేని పరిహాస భిక్ష నిడరయితిరి.

సీతగారి సన్నిధికి.

పలువురు దరిద్రుల చేతులతో మీదానమును గ్రహించితిని. మీదానమును మా యాశ్రమమున శిలాక్షరము చేయుటకు అనుమతింపఁగోరుచున్నాను. ఇంత గొప్ప యీవి యిచ్చిన మీ సలహాలను మెలఁకువతో ననుసరింతును. ఇంకను మీసాయ మపేక్షితము”.

ఈమూఁడును తయారయిన పిదప టపాలోఁ బడుట కాలస్యము కాలేదు. వెంకటరావు కడనుండియు, పూర్ణచంద్రరావు కడనుండియు ప్రత్యుత్తరము రాలేదు కాని సీతకడనుండి వెంటనే యీప్రత్యుత్తరము వచ్చెను:

“అయ్యా!

పాదాభివందనములు. నాపేరునకు ‘గారు’ తగిలింపవల దని మనవి. నే నొకరి దాసిని. మా యేలికసాని తమకు ధనము పంపవలసినదని యానవెట్టఁగా నే నంపితిని. తమ చీటికి ప్రత్యుత్తర మీదిగువ:

మీ సహస్రబాహువులకును స్వాగతము. నాదానమును శిలాక్షర మొనరింప నే నొల్ల.

తమరు ఇంకను నాసాయ మపేక్షించితిరి. ఇంకొక వేయిరూకలు పంపుచున్నాను.”

అహోబలుఁ డీచీటిని, వేయిరూకలను అందుకొనెను. రూకలు దాఁచెను. వెంటనే యిటులు ప్రత్యుత్తరించెను:

“తమ రూకలు నిలువచేసితిని. త్యాగపూర్వకమగు సేవయు, ధనమును మాకు అత్యావశ్యకములు. విశేషించి ధనము. తాము

ఈ రెంటికిని సమర్థ లని గంపెడాసతో నున్నాను."

దీనికి వెంటనే యిటులు జాబు వచ్చెను: "మీ కోరికలో మొదటిదానిని నేను కొలఁదియో గొప్పయో నెఱవేర్పఁగలను. మీ గ్రామములోని నిఱుపేదలకు పరులొసఁగు ధనమే అత్యావశ్యక మని నమ్మునెడల మీ రింకను మాయలోనే యున్నారుగాని సత్యములో లేరు. మఱియు మీ గ్రామచరిత్ర మంతయు మీ రవగతము చేసికొనలే దనుకొందును."

అహోబలుఁ డీచీటిని జూచికొని దీర్ఘాలోచన మొనరించి యిటులు ప్రత్యుత్తరము వ్రాసెను:

"తమ చీటిలోని మాటలను కొన్నిఁటి నెఱిఁగికొంటిని. నే నెట్టి మాయలో నుంటినో తెలియఁజాలను. మా గ్రామచరిత్రము మీ రెటు లర్థము చేసికొంటిరో తెలుపఁగోరెదను."

ఈ యుత్తరము వెంటనే టపాలోఁ బడెను గాని ప్రత్యుత్తరము వచ్చుటకుఁ గొంచె మాలస్య మాయెను.

## ౧౬

కొడుకున కింకఁ బెండిలి కాదని వీరవెంకమ్మ దిగులు పెట్టుకొనెను. అన లామె 'భోలా విశ్వనాథ' కాని కోడలిముచ్చట మాత్రము నాలుకమీఁదికి రానీదు. అహోబలుఁ డొకనాఁడు ఉత్తరములను పరికించుకొనుచుండఁగా దాపునఁ గూరుచుండి తల్లి కంట నీరు పెట్టుకొని యిటులనెను—"నాయనా ఆనాఁటి యగ్రహార మీనాఁటికి మాన్యమాయెను. చెట్టంతి కొడుకవు చీమంత అయి పోవుచుంటివి. ఇల్లుగూడ నీకు ఆశ్రమమే కావలసియున్నదా?"

అహోబలుఁడు తాను పరికించుచున్న ఉత్తరములను క్రిందనుంచి విశాలమగు ముఖముతో విప్పారిన కన్నులతో 'అమ్మా! వరహాలవంటి మాటయంటివి. ఎవరి యిల్లు ఆశ్రమ మగునో వారు ధన్యులుకదా!' అనెను.

వీరవెంకమ్మ కనుఁగొనలనుండి రెండశ్రుబిందువులు క్రిందికి జాఱెను. అహోబలుఁ డది చూచి—"అమ్మా! కొలఁదిరోజులలోనే"—అని వాక్యమును సమాప్తి చేయకమునుపే వీరవెంకమ్మ అందుకొని 'కోడలు వచ్చునా?' అనెను.

'రావచ్చును.'

వీరవెంకమ్మ యేనుఁగెక్కెను. 'కోడలెవరు? వసుమతియా మఱొకతెయా?' ఈ మొదలగు ప్రశ్నములతో నామెకు పని లేకపోయెను. కోడ లనిన కోపించు కుమారుని నోరినుండి 'కోడలు రావచ్చు'నను మాటయే యామెకు సరిపోయెను. వీరవెంకమ్మ 'వేయేండ్ల ఆయుస్సు' అని దీవించి నగుమొగముతో వంటింటిలోనికిఁ జనియెను.

తపాలావాఁడు రెండు ఉత్తరములను తెచ్చియిచ్చెను. అహోబలుఁడు ఒకటి విప్పి చూచుకొనెను:—"మీ .. పరిగ్రహించుచో నాకడ నొక కన్య కలదు."

ఈవాక్యము చదువుకొనుచుండఁగా తన కనులయెదుట వసుమతి నిలిచి యున్నటు లాయెను. అతని శరీరము రోమాంచిత మాయెను. కొంతసేపు మనస్సునం దానందించి యతఁడు 'అమ్మా!' యని పిలిచెను:

'ఏమి నాయనా?'

'స్కూల్సు యిన్‌స్పెక్టరుగారు తమకూఁతు నిత్తు మని వ్రాసినారు.'

ఈమాట వినఁబడఁగానే వీరవెంకమ్మకును వసుమతి గోచరించెను.

'నాయనా ! తొందరగా ఆలోచించుకొనుము' అని లోని కరిగెను.

అహోబలుఁడు రెండవచీటి విప్పెను. అదొక పెద్ద బుక్ పోస్టు. అది సీతకడనుండి వచ్చెను:

"నా యుత్తరమును మీరు శాంతముగ" పరికించినందులకు వందనములు. సిదప.

మీ గ్రామమున జనాభా రమారమి—౧౭౦౦

| | |
|---|---|
| తురకలు | ౫౦ |
| నిమ్నజాతులు | ౩౦౦ |
| అక్షరజ్ఞానము కలవారు | ౨౦ |
| చదువుకొనువారు | ౮౧ |
| స్త్రీలు | ౯౦౦ |
| పురుషులు | ౮౦౦ |
| నలుబదికి యిరువదికి నడుమవారు | ౭౦౪ |
| ఇరువదికి లోపువారు — | ౬౦౪ |
| ముప్పొద్దులు తిండిగలవారు | ౪౦౧ |
| ఒకపూటమాత్రము ,, | ౭౦౧ |
| తిండిలేనివారు | ౮౧౦ |
| ఆయకట్టు ఎకరములు | ౧౩౧౪ |
| ఊరి మొత్తపు ఋణము రూ. | ౨౦౦౦౦౦ |
| పంట, సుమారు, పుట్లు | ౧౦౦౧ |
| తాకట్లు | ౯౦౦ |
| పార్టీలు సుమారు | ౮ |
| అమలులో నున్న వ్యాజ్యములు | ౯౧ |
| వానికిసంబంధించిన జనము (స్త్రీలు, పురుషులు) | ౬౦౦ |
| స్త్రీలు | ౧౧౦ |
| పెంకుటిండ్లు | ౪ |
| పాకలు | ౭౯౨ |
| పెద్దబాటలు | ౦ |
| సందులు | ౩౬ |
| పాడుపడిన దేవళము | ౧ |
| గ్రామదేవతల ఆలయములు | ౮ |
| ఏటేట బలి యీయఁబడు జంతువులు | ౭౦౦ |
| చెఱువులు | ౧ |
| బావులు | ౦ |
| విషూచి వ్యాపించు ఋతువులు | ౨ |
| మశూచి ,, | ౧ |

ఇట్టి మీ గ్రామమును పదివేలతో దానమిచ్చినను ఎవరును పరిగ్రహింపరు. సంఖ్యలో భేదమే కాని హిందూదేశమునందలి గ్రామ చరిత్ర మంతయు నొకటియే యని తెలిసికొనఁ గలము.

మీ గ్రామమును ఏటేట పదిపంక్రాంద పర్యాయములు దొంగలు దోఁచికొందురు;

వారిని బట్టుకొనుట కెవరికిని సాహసము చా లదు. మూఁడునాలుగుసారులు గ్రామము దగ్ధ మగును. ఎవరును ఆర్పఁజాలరు. చెఱువులో నీరు పురుగులమయము. దానిని బాగుచేయు టకు బదులు దానిచుట్టు అందఱును రోఁత చేయుదురు. వానలు పడునపు డూరంతయు మురిగిపోవును. ఎవరును శుద్ధి చేయరు. విషూచీ మాశూచికలతో ఏఁటేట నేఁబదిమందికిపైఁగా నశింతురు. దానికి సరియగు వైద్య మవలంబిం చుటకుబదులు పశువులప్రాణములుతీయుదురు.

రైతును పాలేరు నమ్మఁడు. పాలేరును రైతు నమ్మఁడు. ఏరువాక పున్నమరెన్నాళ లున్నదనఁగానే పాలేరు చెప్పక చాలించు కొనును. రైతు మూన్నాళ్లల గింజలు బిగియఁ బట్టుకొని యుండును. దీనితో రైతులకును పాలేళ్లకును అంతులేని అంతఃకలహము.

మాగ్రామమున తురకలయిండ్లు సుమారు పది. జనాభా ముప్పది. చదువు సున్నకును తక్కువ. ఎవరికిని నవాజు రాదు. కాని మత ద్వేషము లెస్సగా వచ్చును. మిగిలినవారికిని వీరికిని ఎడ్డెమనిన తెడ్డెము. ఈద్వేషమును ఎవ రును మైత్రిలోనికి పరిణమింపఁ జేయఁజాలరు.

పంట సుమారు ౯౦౦ పుట్లు. వ్యయము పోను నికరపు ఆయము సుమారు (నేఁటి వెల లచొప్పున) ౪౦,౦౦౦. ఆయములో వడ్డీ క్రింద పోవలయునది 30,౦౦౦. మిగిలినదానిని పంచుచో తలకు సాలుకు ఏడురూపాయలు పడలేదు.

నిఱుపేదలయినను పెండ్లికి వ్యయింపవల యునది ఆయమునకు నాలుగు రెట్లు.

సాఁబాలు జనులు పాటుపడరు. పరుల గుండెలమీఁదనే వారి కాలు. కూరఁగాయలు కష్టించి పండించికొనరు. అప్పు లెగవేసియయి నను కొని తిందురు. పశుపోషణమునకుఁగాని, పశువృద్ధికిఁగాని పాటుపడరు. పాడిమాత్రము కావలయును. పురాణము వినరు. చతుర్ముఖ పురాణమునకు 'సిద్ధము.' ఇచ్చ వచ్చినటులు వ్యయింతురు. ఖాతా వ్రాయరు. ఇంటికిమూఁడు రోగిశయ్యలు. మందులకును పథ్యపానములః కును బదులు దండలకు ముడుపులు. ఇదియం తయు నజ్ఞానమూలకము.

ఇట్టి గ్రామములు భరతఖండమున వేలకు వేలు. వీని నన్నిఁటిని ధనము త్యాగమొన రించి యెవఁడు బాగుచేయఁగలఁడు? ఎవనికి సరిపడు ధనమును వానిచేతనే వుత్పత్తి చేయిం పవలయు నని మీకుఁ దోఁచుట లేదా?"

అహోబలుఁ డీనివేదికను జదివికొని 'నేను కూపస్థ మండూకమను' అనుకొనియెను. 'లోఁ గడ వ్యయమొనరించిన ధనములోఁ జాలపాలు దుర్వ్యయ మొనరించితి' ననుకొనెను. అతఁ డాయుత్తరమును చదివికొని చదివికొని ఆనం దముచే జడత్వమును,ఆలోచనచే చలత్వమును పొందఁ దొడఁగెను.

'మా గ్రామచరిత్ర మింత నమగ్రముగాఁ దెలిసికొనిన యీామె వసుమతిగాక మఱెవతె?'

అని అనుకొనెను. బాగుగా యోజించి యిటులు వ్రాసెను:

'మీరు నాయజ్ఞానమును బాపితిరి. మీరు నన్ను స్వీకరించుచో నేను మీవాఁడను. మీరు నాపొరపాటులను దిద్ది లోఁగడనే క్షమించితిరి. ఇఁక క్షమింపు మని యడుగనేల?

నన్ను ధనము గోరితిరి; నేను నిరాకరించితిని. నేను కోరితిని; మీ రిబ్బడిగా నొసఁగితిరి. మీరు మా కతిథు లయితిరి. నేను వెడలనడిచితిని; నేను మరల నిపుడు కోరితిని. మీరు అనుగ్రహించితిరి.

మరల మీరు నా మనో దేవతగను, గృహ దేవతగను ఈ యింటిని అధిష్ఠింపఁ గోరుచున్నాను.

పెక్కు కాకితములు పాడుచేసి తుదకీ యుత్తరమును వ్రాయఁగలిగితిని".

సీతకడనుండి వెంటనే యిటులు జాబు వచ్చెను:"మాయేలిక యిటులు వ్రాయమనెను:

మీయుత్తరము చేరెను. తాము సజ్జనులని నాకుఁ దెలియును.

లోకసేవయే ప్రధానముగాఁ బెట్టుకొని జీవికను నిర్వహింపవలయు నని మీరు తలఁచుచో నేను మీ 'గృహదేవతగా' రాఁజాలను. నాకును లోకసేవయే పరమావధి.

ఇట్టి మనకు లోకసామాన్యమగు దాంపత్యము పనికిరాదు. పతనము లేని యలౌకిక దాంపత్యమును అభిలషింతురేని నేను మీమిత్రమను."

అహోబలుఁ డీయుత్తరమును జదివికొని యుప్పొంగెను. వెంటనే వంటింటిలోనికిఁ జని "కోడలు రాఁగలదు" అనెను.

'ఏకోడలు ?'

'వసు—'

వీరవెంకమ్మ ఆశ్చర్యముతో స్తంభించి పోయెను. ఆనందగద్గదమగు నామెకంఠము నుండి 'అమ్మ! నే నిఁక కాశివెళ్లెదను' అనెను.

'మన యిల్లే కాశి.'

'కాకేమి ?'

అహోబలుఁడు వెంటనే యిటులు ఉత్తరము వ్రాసెను:

"ప్రియమిత్రమునకు.

ఇఁక మనకు ఉత్తరప్రత్యుత్తరములతో ఆలస్యమేల !"

ఈయుత్తరము అందుకొనినపిదప వసుమతి తన మందుల కార్ఖానా నంతయు వాసుదేవరావువశ మొనరించెను. అపు డపుడే పెరిఁగిపోవుచున్న తన ప్రాక్టీసు నంతయు కట్టిపెట్టెను. ఒక రిద్దఱు రోగులనుమాత్రము విడిచిపెట్టి వెళ్లుటకు వీలు కలుగక పోయెను.

సర్దుపాటు లన్నియు అయినపిదప నొక నాఁడు వసుమతి 'సీతా! అమ్మ యెచట నున్నదో చూచి వత్తువా ?' అనెను.

'తులసి ముందు.'

వసుమతి మెల్లగా తల్లికడ కరిగి నిలుచుండి 'అమ్మా! రేపు అత్తవారియింటికి వెళ్లుటకు శుభలగ్నము.' అనెను.

'కలదమ్మా?'

'కాదు. ఈయుత్తరములు చూడుము.' అని అహోబలుని యుత్తరములు కొన్ని యిచ్చెను. సోమమ్మ వానిఁ జదివికొని నగుమోముతో 'అమ్మ! నే నిఁక కాశికి వెళ్లెదను' అనెను.

'మన యిల్లే కాశి.'

'కాశియే నాయిల్లు.'

ఆమఱునాఁడు రాధయు వాసుదేవరావును వసుమతియు సోమమ్మయు సీతయు శివాగ్రహారమునకు పయనమయిరి.

వీరవెంకమ్మయు నహోబలుఁడును వినయవిధేయతలతో అందఱను ఉపచరించిరి.

అహోబలునియందు అత్యంతాభిమానముగల గ్రామస్థులందఱును సందుల మొగలన్నియు మావితోరణములతోడను, అరఁటిస్తంభములతోడను అలంకరించి గ్రామమునంతయు మంగళమయము మొనరించిరి.

గ్రామమంతయుఁ బదిరోజులు వేడుకలతో కలకల లాడిపోయెను. వీరవెంకమ్మయు సోమమ్మయు 'భాయి అనఁగా భాయి' అనుకొని కుమారుని కూఁతును ఒప్పించి కాశీ కరిగిరి. వాసుదేవరావు పని మానుకొని వసుమతి ప్రాక్టీసును తాను సాగింపఁబోయెను. రాధయు నతనితో నరిగెను.

అహోబలునకును వసుమతికిని గ్రామసంస్కారణముకొఱకు కేంద్రముల నేర్పాటు చేసికొని కర్మయోగ మారంభించుటకు అటుపిదప ఎంతో కాలము జాలము కాలేదు.



# కృతజ్ఞత

సన్నిధానము సూర్యనారాయణశాస్త్రి గారు

ఎండకుఁ బ్రాపు నోసంగెడు ఘనులు లేమి
వాడివఱుగయి నిలువెల్లఁ బోఁడి తఱిగి
ప్రాణముల నన్నిటిఁ బిగఁబట్టి యొక్క
మొక్క బిక్క మొగంబయి పొగులుచుండె.

తినసమీపంబుగాఁ బోవు జనము నెల్ల
మర్మరారావములఁ బ్రతిమాలుచుండు
వారి కాభాష రామినో? తగిన శ్రద్ధ
లేమినో? దానిగొడవ నాలింప రెవరు.

పాప మద్దాని దీనభావంబుఁ గాంచఁ
బ్రార్థనాహ్వాన మర్మరధ్వని వినఁగను
దఱుఁగుకొనిపోవఁ గడు పశ్రుసరులు రాల
దాని బ్రదికింపవిధియని తలఁచినాఁడ.

ఎరువుఁ దోలించి పాదుచేయించి చుట్టు
జలముఁ బోయింప రేపు మాపులఁ జిగిర్చి
నాల్గు దినములఁ గ్రొంగ్రొత్త నలువు వెలయఁ
గళ దిరిగి లాఁతి మొక్కగాఁ గానిపించె.

ప్రాణములు దేఱుకొని కొంత బలము పట్టి
ప్రమానుగట్టి ప్రతిక్షణం బా నగంబు
దనఋణంబును దీర్పంగఁ ద్వరితపడుచు
నవలు గొనలును దగ వేసికొనుచుఁ బెరిగె.

సమయ మనుకూలపడ యథాశక్తి నదియుఁ
బత్రపుష్పఫలంబుల భక్తివడక
నొసఁగలు, శాఖాకరాంజలి నునిచి మూర్త
మగు కృతజ్ఞత నాఁగ నర్పణము సేసె.

నీవ యిచ్చితి వీమేను నీదకాని
నాది కాదేది కావలె నన్నుఁ దండ్రి!
బానసేసెద నన్నుఁగోసి తీసికొనుము
అనుచు భ్రమరస్వనంబున వినిచె మరియు.

తనదు సర్వస్వమును నాకె ధారవోసి
బ్రదికినన్నాళ్లులును గాలవశత నొంది
కట్టెయై కాలి బొగ్గయి కట్టకడకు
నుసినుసిగ నయ్యు నయ్యది నన్నె కొలిచె.

---

## ౧

౧౭౩౮ క్రీ. శ.

సాయంత్రమైంది.

అక్కడ మకాముస్నాడు నాదిర్షా. లక్షాయాభై వేల సైన్యం సింధునదిపొడుగూతా విడిసింది. అర్ధగంటలో గుడారాలన్నీ తయారయాయి. గుఱ్ఱాలని కట్టేసి మేత వేసారు. అప్పుడే వంటశాలల్లోంచి పొగ రాస్తోంది. నది చాలా విశాలమైపోయి సముద్రంమల్లే అవుపడేచోట సుల్తాన్ డేరాలు వేసారు. నాలుగు సుల్తాన్ సొంతం కోసం; ఐందాముప్పై ఆయన స్త్రీలకోసం. అహమద్షా, అక్బరలీ మొదలైన సుల్తాన్ అంతరంగికమంత్రుల పది కొండుడేరాలు ఆయనడేరాకి రొండువేపుల కొంత దూరాన వేసారు. ఒకగంటకు పూర్వం అడవిజంతువులకి స్థావరంగా వుండిన సింధునదీతీరం మనుష్యావాసమైపోయింది. నాదిర్షా వేలిసంజ్ఞమీద నడిచిపోయే మహాపట్టణ మది.

చైత్రమాసమైనా శాలువల్ని వొదల్చేటం లేదు చలి. వసంతమాసంతో పూగిపోతోన్న అక్కడి వనాలు, చల్లని పిల్లగాడ్పులు గంధర్వ క్రీడావిహారాలకి యోగ్యమైన కాశ్మీరదేశ వైభవాన్ని చవిచూపిస్తోన్నాయి. మావిడిచిగుళ్లు చిగురుటాకుల లాలిత్యంతో తలనూగిపోతోన్నాయి. కోకిలలు తమ “కూహూ” ల మూలాన హిందోళరాగంలో మెఱుపించే శక్తి వుండటం నిజమేనంటున్నాయి.

ఐదుగడియల రాత్రైంది. దినమంతా ప్రయాణభారంచేత డస్సిపోయిన సైనికులంతా విశ్రాంతి గొంటూన్నారు. అక్కడక్కడ కొందరు యువకులు సారాయి త్రాగుతూ వెన్నెల వెలుగులో ‘ఖాబాబ్’ ఆడుతున్నారు. గుఱ్ఱా లప్పుడప్పుడు సకిలిస్తోన్నాయి. సుల్తాన్ డేరాలో బంగారుముక్కాలుపీటమీద లాంతరొకటి పెద్దకాంతితో వెలుగుతోంది. గుండ్రనిదిండ్లమధ్యబడ్డ సన్ననిపరుపుమీద, అక్బరలీ మరియాదగా కూచొని వినయంగా మాట్లాడ్తోన్నాడు సుల్తాన్తో. రెండుపరుపులమీద పరువబడ్డ ముఖమల్ పరుపులో మెత్తనిపట్టుగొప్పన్న దిండ్లమధ్య వంకరగా వొరిగి కూచొని హుక్కా పీలుస్తోన్నాడు సుల్తాన్. పర్షియా దేశాన్ని ఆక్రమించుకున్న రష్యాదేశీయుల్ని తరిమేసేప్పుడు లభించిన అందకత్తె లందరికన్నా అధికురాలైనామె సుల్తాన్ వెనక కూచొని పంకా విసర్తోంది. అఫ్ఘానిస్థానపురాజు తన వినయవిధేయతలని వ్యక్తపరుచడానికి కానుకగా సమర్పించిన సౌందర్యరాశి సుల్తాన్కు కుడిభాగాన కొంతదూరాన కూచొని తాంబూలంమడుస్తో తనసౌందర్యమంతా కదిలిపోగా ఆయన కందిస్తోంది. పర్షియాదేశం సొంతం తన స్వాధీనం అయాక ఆ దేశాన్నంతా కొల్లగొట్టించాడు, ప్రపంచంలో అందరికన్నా సౌందర్యవతియైన యువతి కావాలని. లభించింది షిరాజీ. ఆషిరాజీ ఆయనకి దగ్గిరగా రొండుమచేతిక్రింద వుండి హుక్కాగొట్టాన్ని అందిస్తోంది. ముట్టితే మాసి, వాసన మాస్తే వాడిపోయే ఆమె నాజూకుదేహాన్ని ఫిరంగి గుండ్లకుకూడా వెరువని తనవక్షంమీద వొంచుకొన్నాడు. ఆయనరొండుమచేతివేళ్లు ఆమె వెంట్రుకల్లోతిరిగుండ్రని భుజాల్తో, ఆడుకుంటోన్నాయి ఆతనికి తెలీయకుండానే. అక్బరలీకి తనుమాసే దృశ్యమేమీ అర్థమవడంలేదు, విద్యాగంధం లేనివాళ్లు తాము తిట్టుకునే తిట్లకి అర్థం తెలిసికోనట్టు.

“ అతడు సంధి కోరాడని చెప్పి యింతదూరం వొచ్చాక వూరికే తిరిగిపోవటం వుచితం కాదు. అదీ కాక యిక్కణ్ణుంచే మనం వెళ్లిపోయామంటే నేను భయపడి వెళ్లిపోయానని తనప్రజల్తో చెప్పడానిగ్గూడా వెనకాతీయడు. ”

జవాబేమీ చెప్పకుండా నేలవేపు చూస్తో ఆలోచిస్తోన్నాడు అక్బరలీ, సర్వసంగపరిత్యాగం

గావించిన తాపసికి తనజీవితమంతా తపస్సనందు ధార బోయటంలోనే వుంది బ్రహ్మానందం. పకలేచ్ఛల్లో కామేచ్ఛ అధికంగావుండే నరుడాధికి ప్రవరాఖ్యుడిలాంటి యిష్టపురుషుడితో సౌఖ్య మొందటంలో వుంది బ్రహ్మానందం. కాని ఉత్తమక్షత్రియుడి కా బ్రహ్మానందం వైరికిరీటాన్ని తనకాలితో తన్నటంలో తప్ప వేరేచోట లేదు. నాదిర్షా యిప్పు డనుభవించే బ్రహ్మానందంలో శత్రువుపై పగ సాధించాకదా అనే సంతోషంకూడా ఐక్యమైంది. అందుచేతే ఆతని విశాల నేత్రాలు మెరిసిపోతోన్నాయి. ఒకప్పుడు తనని పరిహసించిన ఢిల్లీసార్వభౌము డిప్పుడు తనపాదాలదగ్గిర శరణార్థి పడున్నాడు. కాని సుల్తాను కిప్పు డొక గొప్పవిషమస్థితి సంభవించింది. ఢిల్లీపైబడి శృంగారమైన ఆపట్టణాన్ని ధ్వంసంచేసి పగతీర్చుకోడానికాతనిఅంతరాత్మ ఒప్పదు. శరణుకొచ్చినవాడిపై దండెత్తడం పచ్చినపాపమని వాదటం. అట్లాకాక యిక్కడినుంచే తిరిగిపోతే ఆమొంగల్ రాజు తనని పరిహసించినందుకు పగతీర్చుకోటం యెట్లా? అక్బరలీకికూడా యేమీ తోచటం లేదు. సుల్తాన్ తీవ్రంగా ఆలోచిస్తోన్నాడు. చివ్వున ఆయన కేదో ఆలోచన తట్టింది.

"ఢిల్లీ కెళ్లాలి."

"వెళ్లి ?"

"ఢిల్లీప్రజలందరిముందు మొంగల్ సింహాసనాన్ని మూడురోజులధిష్ఠించి తిరిగి రాజ్యాన్ని మొంగల్ రాజుకిచ్చేసి మన దేశం వెళ్లి పోవటం. దీనివల్ల ఆతనికి పరాభవం కలిగించినవాళ్లమవుతాంకూడా."

"ఆయన ఒప్పుకుంటే ?"

"యుద్ధం."

౨

జేరాముహామల్ పరదా పక్కకి తొలిగింది. ఆయుధపాణియైన ఆగాబాషీ వంగి సలాంచేసి నుంచున్నాడు.

'ఏమి' అన్నట్టు ఆతనివేపు చూసాడు సుల్తాన్.

"ఢిల్లీ చక్రవర్తి తమకు కానుక పంపారు."

"ఏ మేమిటి ?"

"ఒకమణుగు ముత్యాలు, ఐదేమనులు, యిరవై గుఱ్ఱాలు, పదిమంది సుందర యువతులు."

"చీకటైపోయింది. ఏనుగల్ని గుఱ్ఱాల్ని పొద్దున చూడొచ్చు. తక్కినవాట్ని చూడ్డానికొస్తోన్నా నిప్పుడే, సిద్ధంగా వుంచు"

ఆగాబాషీ వంగి సలాంచేసి వెళ్లిపోయాడు. ఆహారసీకన్యము తవనక్షంమీదనుంచి లేపి తనుకూడా లేచాడు సుల్తాన్. అక్బరలీకూడ లేచాడు. మాట్లాడకుండా యిద్దరూ బైటికెళ్లారు.

పక్కడేరాలోకి సుల్తాన్ అక్బరలీతోకూడా వొచ్చేవరకు ఆపదిమందిబురకాస్త్రీలను వరుసగా నుంచోబెట్టాడు ఆగాబాషీ. అక్బరలీ, ఆగాబాషీ దూరంగా నుంచున్నారు. సుల్తాన్ మొదటామె దగ్గిరికొచ్చి బురకా తియ్యమన్నాడు. విధి లేక మెల్లిగా తొలగించి తల కిందికివాల్చి నుంచుంది. ఆబురకాని పూర్తిగా యూడ్చేసి కాలినుంచి తలదాకా చూసాడు యెగాదిగా. ముఖాన్ని పైకెత్తి దీపంవెలుగులో చూసాడు. నిపుణుడైన శిల్పిచేత చెక్కబడ్డ దంతపుబొమ్మలాగుంది. వరుసగా తక్కినవాళ్లందర్నీ యిట్లానే పరిశీలించాడు. ఒకాళ్లకన్న ఒకా రెక్కువసుందరంగా వున్నారు. వాళ్లంతచెడ్డగా లేరన్నట్టు ఆకళ్లనుంచీ, మెరిసిపోయే ఆనల్లనిగడ్డంమున్న యెఱ్ఱగా కదిలే ఆపెదిమలనుంచీ తృప్తి వ్యక్తమవుతోంది. ఆ యువతుల్ని తనయిష్టమొచ్చినట్టు పరిశీలిస్తోన్నాడు,గుఱ్ఱములకు లక్షణాలని పరీక్షించినట్టు. అవసర మనుకున్న ప్రదేశాల్లో లేశమాత్రం జంకకుండా గుడ్డని తొలగించి చేతితో తాకి చూస్తోన్నాడు. పంకొమ్మిదేళ్ల అరబుయువతో వొకామెనిగురించి అనుమాన మేదో కలిగితే అక్బరలీని వెళ్లిపొమ్మని ఆమెగుడ్డలన్నీ విడిపించి లాంతరు దగ్గిరకి తెచ్చి వెలుగులో ఆమెదేహాన్నంతా పరీక్షించా. డామె కంటినుండి కారే అన్నీళ్ల నేమాత్రం లెక్కచేయకుండానే.

చివరకి పొడుగ్గా నుంచున్న యువతి దగ్గరికొచ్చి సహజమైన కంఠస్వరంతో బురకా తియ్యమన్నాడు. తియ్యలా. మళ్లీ ఆజ్ఞాపించాడు. అయినా తియ్యలా. ఉగ్రుడయాడు. వాదిర్షా ఆజ్ఞ అమల్ గావటాని కాలస్యమే. తనే యీడ్చిపారేశాడు బురకాని. ఆమె తల కిందికి వాల లేదు. పైకెగరేసి గర్వంగా, ధైర్యంగా నుంచుంది. ఎత్తైన ఆ ముఖంలో ఎదురుబడే స్వభావం స్పష్టంగా తాండవమాడుతోంది. ఇంచుమించు సుల్తా నెత్తుం దామె. ఆతని చూపులు క్రమంగా మెరిసిపోయే ఆమె దేహపు ఉన్నత ప్రదేశాలపైనుండి జారుతున్నాయి. ఒక్కొ చూపులో అసాధారణమైన ఆ మెఅంగసౌందర్యం యౌవ్వనం ఆతని కాశ్చర్యం కలిగించాయి. ఒళ్లు పులకరిత్తింది. మళ్లీ పైకి చూసాడు. స్త్రీలలలిత దేహాకృతిని సరళిచెట్లకు పోల్చి వాళ్ల కంఠమాధుర్యాన్ని 'బుల్ బుల్' స్వరాల కనువర్తించే తనదర్బార్లోని కవుల స్త్రీ వర్ణనంతా అసంతృప్తికరంగానే తోచిం దాతని కా ముహూర్తాన. చూపుసైతం జారిపోయే ఆమెనున్నని కట్టని పట్టుకోపోయాడు. ఆమె తనకుడిచేత్తో



"కట్టపట్టుకో!పోయాడు......సుల్తాన్ పై లేపింది."

బొడ్లోంచి మెరిసిపోయే చిన్నకత్తి నూడదీసి సుల్తాన్ పై లేపింది. ఆగాబాషీ పెద్దగా అరిచి ముందుకు పరుగెత్తాడు. పచ్చని చెట్టునిసైతం బూడిదచేసే కూల్చే ఆతీక్ష్ణమయిన చూపులు ఆమె కళ్లల్లోకి గురిపెట్టాడు సుల్తాన్. ఆమె అట్లాగే ఆగింది. తనచెయ్యి ముందుకు జాచి, "ఇటివ్వు" అన్నాడు. ఎత్తిన ఆమెచెయ్యి వణికింది. "ఇవ్వు" అన్నాడు, గట్టిగా పళ్లుబిగబట్టి. సాధారణ గర్భిణీ స్త్రీ దగ్గిర గనక వుంటే ఆ వొక్క శబ్దానికే గర్భపాతం గావాలిసింది. ఆకత్తి నట్లే ఆచేతిలో పడేసి తల కిందికివాల్చి నుంచుంది. రెండు నీటిచుక్కలు చెంపలమీదుగా జారుతున్నాయి. కాని అవుపడనీ లేదు. ఆకత్తిని తననడుంకట్టులో వుంచుకొని వొక్కసారి మళ్లీ కిందినుంచి పైకి చూసాడు. ఆగాబాషీ వేపు తిరిగి మెల్లిగా నడుస్తో "ఎవరీమె?"

"మొంగల్ మహారాణీ దగ్గిరి అంతరంగిక స్త్రీ. రాజపుత్రకన్య. సితార."

సుల్తాన్ వెళ్లిపోయాడు.

## 3

తనడేరాలో సుల్తాన్ ఢిల్లీ ప్రయాణాన్ని గురించి ఆలోచిస్తో యిటూఅటూ పచారుచేస్తోన్నాడు. ఇతరులెవరూ లేరు. దాసివొకత్తె వచ్చి సలాంచేసి, "ఈ రాత్రి యేడేరాలో పడుకుంటారు" అని అడిగింది. ఆలోచించాడు. తాత్కాలికంగా తనవెంటున్న వందా ముప్పైమంది నందర్నీ తలుచుకున్నాడు. లక్షలద్రవ్యం వ్యయపరిచి దొంగతనంగా పట్టితెప్పించిన ఆంగ్ల సుందరి జ్ఞాపక మొచ్చింది. ఆమెదగ్గిరికి పోవా లనుకున్నాడు. కాని తక్షణమే వొద్దనిపించింది. "ఇక్కడే పడుకుంటా" నన్నాడు. దాసి వెళ్లింది. ఆవలింత లొచ్చాయాయనకి. దుస్తులువిప్పుతోంటే నడుంపట్టాలోంచి చిన్నకత్తి కిందపడ్డది. ఎత్తి చూసాడు. వజ్రాలు చెక్కున్నాయి దానికి. మళ్లీ సితారా జ్ఞాపక మొచ్చిందిల అకత్తిపిడివేపు చూస్తో ఆమెసాహసాన్ని, అందాన్ని తలుచుకున్నాడు రెండు నిమిషాలు. దా న్నొకమూ

లొచ్చాయి. కాని వాట్ని ముట్టుకోలా సితార. తెల్లారి మళ్లీ పళ్లెరాలొచ్చేవరకు ఆకలిచేత పేగులు మాడిపోతోన్నాయి. అవంటకాల్లోంచి వొచ్చేవాసన రెండు ముక్కలు తినడానికి పురికొల్పింది.

మూడు రోజులు గడిచాయి. మధ్యాహ్నం, సాయంత్రం తిండిపదార్థాలు తెచ్చేదాసీలు తప్ప వేరు మనుష్యాకారం అవుపళ్లేదు. రాత్రవడంతోటే సుల్తాన్ వొస్తాడేమో నని భయపడేది. కాని ఆయనకి జ్ఞాపకముంటేనా అసలు!

ఆవుదయాన యేమీతోచక డేరా కిటికీదగ్గిర నుంచుంది. అవలివే సాహసిద్దీ నుంచున్నాడు. దూరాన సైనికులసం సాహటి వలయాకారంగా నుంచుంది. మధ్యోహాడు గోధుమరంగు గుఱ్ఱాన్ని పట్టుకోనుంచున్నాడు. ఒకరితరువాతొకరొచ్చి దాన్ని యెక్కడానికి ప్రయత్నిస్తోన్నారు. కాని అది ఆకాశాన్ని అందుకోడానికేమోనన్నట్టు యెగిరెగ్గి అందర్నీ పడేస్తోంది. సుల్తాన్ పక్కన నుంచోని అట్లా పడిపోయేవాళ్లని కోపంగా చూస్తోన్నాడు. చివరకి "ఆగా, మవ్వ" అన్నాడు సుల్తాన్. ఆగాబాషీ యెక్కాడు. గుఱ్ఱం యెగిరింది. రెండుకాళ్లమీద లేచి నుంచోడం ఆరంభించింది. అంకోడిలోంచి కాలుజారి పడిపోయాడాగా. సుల్తా వాతన్ని వొక్కతన్ను తన్నాడు. బెత్తం తెమ్మన్నాడు. తెచ్చారు. తానే స్వంతంగా యెక్కాడు గుఱ్ఱాన్ని సుల్తాన్. బెత్తం విరిగేట్టు కొడుతోన్నాడు దాన్ని దెబ్బమీద దెబ్బ. గుఱ్ఱానికి వొళ్లంతా పగిలి నెత్తురు దుముకుతోంది. ఎన్నోసార్లు పడిపోయింది, కావాలని. కాని దాంతోకూడా మళ్లీ లేచాడు సుల్తాన్. ఎగిరియెగిరి అలిసిపోయింది. డేరాలచుట్టంతా పరుగెత్తింది. ఇంకా కొడ్తోన్నాడు. చివరకి నోట్లోంచి తెల్లనినురుగు రావటం మొదలెట్టింది; పడిపోయింది. మళ్లీ లేవలా. అప్పుడు వొదిలాడు దాన్ని సుల్తాన్. ఇదంతా చూసి పెద్దనిట్టూర్పు విడిచింది సితార. వొళ్లంతా చెమటలు కమ్మాయి. "సుల్తానుకి లొంగం దేది!" అన్నాడు సిద్దీ.

## ౪

ఢిల్లీ చేరింది సైన్యం. ఢిల్లీప్రజ నెవర్నీ యేమ నొద్దని ఆజ్ఞాపించాడు సుల్తాన్. కాని సైన్యం ఢిల్లీ చేరిన రెండుఝాముల్లోపలే సుల్తాన్ సైనికులు ఢిల్లీ స్త్రీలను బలవంతంగా చెరుస్తోన్నారనేవార్త బైల్దేరింది. ఢిల్లీప్రజలంతా సుల్తాన్ సైన్యంమీద తిరగబడ్డారు. చాలామందిని చంపారుకూడా. ఇదంతా మొగల్ చక్రవర్తి కుట్ర అనుకున్నాడు సుల్తాన్. యుద్ధాని కాజ్ఞ అయింది. యుద్ధాని కేమాత్రం సిద్ధంలేని ఢిల్లీప్రజలు కొన్నిఘడియల్లో చెల్లాచెదరైపోయారు. ఎంతో సుందరమైన మిద్దెలు, మేడలు తగులబెట్టబడ్డాయి. స్త్రీలూ పిల్లలూ యెందరో అగ్నిపాలయారు. చేతికి దొరికిన ద్రవ్యాన్నంతా అపహరించారు, సుల్తాన్ సైనికులు. చివరకి మొగల్ చక్రవర్తినిసైతం చెరబెట్టారు. రాణిని సుల్తాన్ స్త్రీలలో దాఖల్ చేశారు. మూడు రోజు లిట్లానే వుంచాలన్నాడు సుల్తాన్, ఢిల్లీసింహాసనంమీద కూచోని.

సితారడేరాలోకి మామూలుప్రకారం భోజనం తెచ్చారు మధ్యాహ్నం. పళ్లెరాన్ని అక్కడ పెట్టి నలువేపులా చూసిం దాదాసి. తనబొడ్డులోంచో చీటీ తీసి చప్పున సితారమీద పడేసి వెళ్లిపోయింది. ఏంఘోరం రాసాడో దాంట్లో నని భయపడ్డది. వొణికేచేతుల్తో విప్పిచూసింది. రాణి వుంగరం మొహరుంది. పాప మామెకేంతెలుసు సితార స్థితి! సితార సుల్తాన్మీద సర్వాధికారం చలాయిస్తోం దనుకొం దామె. అందుకనే అట్లా రాసింది. ఇట్లా నిర్బంధింపబడి తన సౌందర్య యౌవనాలని బలవంతాన కోల్పోతోందని ఆమె కేంతెలుసు? సుల్తాన్ తనని అవమానపరచకుండా రక్షించమంది. ఢిల్లీరాణి సితారాని తన చిన్నిచెల్లెలికన్నెక్కువ గారాబంగా పెంచింది. చక్రవర్తి దురుద్దేశాన్నుంచి యెన్నోసార్లు రక్షించింది, తానెన్నోకష్టాలపాలై. అట్లాంటి దయామతల్లికి సితార యేమిస్తే యేమవుతుంది! ఏవిధంగా ఆమె ఋణం తీర్చుకోగల్దు! తనని రక్షించమని రాసింది.

ఆరాత్రి భోజనం తరువాత సుల్తా నొచ్చాడు డేరాలోకి. సితార భయపడ్డది బాధిస్తాడేమో మోహం చేత అని. కాని ఆమెని ముట్టుకో సైతం ముట్టుకోలా; రాణీవిషయంకూడా మాట్లాళ్లా. జ్ఞాపక మున్నట్టే లే దాయనకి. ఆమె మాట్లాడకున్నా ఢిల్లీ విషయా లెన్నో చెప్పాడామెతో తనే. చివరకి నిద్రపోయాడు. సితార దూరాన కూచుంది నిద్రరాకుండడంచాత. మధ్య రాత్రి దాటింది. హఠాత్తుగా సితారా కేదో అనుమానం కలిగింది. సుల్తాన్ పరుపువెనకాల యెవరో వున్నట్టనిపించింది. లేచి మెల్లిగా అవేపు నడిచింది. నల్లనాకార మొకటిఅవుపడ్డది. ఆవ్యక్తి మెరిసిపోయే కత్తితో నిద్ర



పోతోన్న సుల్తాన్మీద పడుతోన్నాడు. సితార "ఆవ్వున" కేకేసి సుల్తాన్ దేహంమీద పడి అతని దేహాన్ని తన దేహంతో కప్పింది. అయినా ఆ క్రూరుడి కత్తిదెబ్బ సితార యెడమచేతికి తగుల్తో సుల్తాన్ కుడి చేతిని బాగా గాయపరిచింది. సుల్తాన్ "హా" అన్నాడు. తక్షణమే బైటినుంచి పదిమంది సైనికులు పరుగెత్తుకొచ్చి ఆదొంగని అక్కడే అంతమొనర్చారు. సుల్తాన్కి తగిలినగాయం గొప్పది. స్మృతి లేకుండా పడిపోయాడు. రాజవైద్యు డొచ్చి కట్టుకట్టి సితారానితప్ప అందర్నీ బైటపొమ్మన్నాడు.

రాత్రంతా సితార తనకు తెలీకుండానే సుల్తాన్ పక్కన కూచొని ఫంకా విసిరింది. తెల్లారకట్ల చల్లని గాలి వీచేప్పుడు సుల్తాన్ కదిలాడు. కళ్లువిప్పి దిగులు ముఖంతో పక్కన కూచొనివున్న సితారాని చూసాడు. "సితారా" అన్నాడు. కృతజ్ఞతను వొలికించే ఆవొక్కమాటతో సితారహృదయం నీరైపోయింది.

ఆతనిగండం తప్పిందిగదా అనే సంతోషంకూడా దానికి తోడైంది. తన యెడమచేత్తో ఆమెచేతిని దగ్గిరకి లాక్కొని "ఆనాడు నన్ను చంపడానికి సాహసించినదానివి యీవా ళెందుకు రక్షించా" వన్నాడు. ఆమె అతనివక్షం మీద తనదేహాన్ని ఆనించి అతని పెదిమల్ని ముద్దెట్టుకుంది. తన యెడమచేత్తో ఆమె నట్లానే పట్టుకొని "నాహృదయానికి ప్రేమనేర్పావు సితారా" అన్నాడు.



# వీర పూజ

జీ. జాషువగారు

ఇలను భరింపనై పెరుఁగు నేనుఁగుపిల్లలవంటి పాండుపు
త్రులు, గరిడీలలో గురునితోడఁ బరిశ్రమ చేయుచుండఁగా
మొలకమెఱుంగు చన్నుఁగవ మోసల గగ్గురుపాటు పూని, కొఁ
గిలి యిడినట్టి దిగ్విజయగేహిని ఢిల్లికి, నీకు, సేమమా?

తళుకుంగత్తుల యుక్కుపుప్పొడులు చిందన్ దాఁకు కౌరవ్యసే
నలతోఁ బోరు కిరీటిపుత్రుఁడు, ప్రచండంబైన తేజంబునన్
జలజ వ్యూహముఁ జీల్చి, చిక్కువడి, ప్రాణత్యాగమున్ జేయ గు
బ్బలు పొంగన్ దలఁబ్రాలువోసితివి రంభా! యెంత పుణ్యాత్మవో!

ధరణిం గ్రుమ్మరు వింతభాస్కరుఁడు, రాధాపుత్రుఁ డా నాఁటి సం
గరభూమిన్ బహువీరసైనికశిరఃకాండంబుఁ జెండాడుచో
అరుణుండుం గనుసన్న సేయఁగ, విషాదావాప్తితో నీకుఁ జె
చ్చెర యుప్పొంగిన చేఁపుఁబాలకు చెమర్చెన్ రాలు, కుంతీసతీ!

కదలెడు పండుటాకువలె కార్ముకముం ధరియించి, క్రీడికే
ల్గదలుపనీక యమ్ములు వెలార్చి, వహ్నిశిఖాచయంబు నాఁ
బొదలినవాఁడు, మూఁడుజగము ల్దలక్రిందులు సేయఁజాలు మా
ముదుసలిబ్రహ్మచారి పడిపోయిన భూములు పూజనీయముల్.

లీల ననేకమానవ కళేబరముల్ నులివెచ్చనెత్తుటన్
దేల, నఖండచండకిరతేజుఁడు పార్థుఁడు గాండివంబుతో
నాలములో నటించు సమయమ్మున నింద్రుని వేయికన్నులన్
రాలిన మోదబాష్పములు రత్నములై నిలిచెం బయోధులన్.

నెఱికురులమీఁద బంగారు నీలమణులు-వెలయుచందాన నెమిలికన్నులు చలింప
వెన్నుఁడు రథంబు నడిపిన వీరభూమి-స్వచ్ఛమానస గంగమ్మ సంచరించు.

---

# కేశవపనమ్

చంద్రపట్ల రామరావుగారు

౧

"ఊరుకో, ఏమిటి మరీ బొత్తిగానూ. పెద్దదానవవుతున్నకొద్దీ మంకుతనంకూడా ఎక్కువైపోతోందే! బాగాఉండదు, ఊరుకో. ఎవరేనా విన్నా, నవ్విపోగల్రు." అంటూ మందలిస్తోంది తులిశమ్మ, సుకుమారీ దేవిని.

సుకుమారీ దేవి రూపెత్తిన దుఃఖరాశిగా ఓమూల పడిఉంది. తులిశమ్మకి పాపం పురుషసంతానమైనా, స్త్రీ సంతానమైనా ఈ ఒక్క సుకుమారే. ఏం చేస్తుంది? కన్నకడుపు! నిజానికి సుకుమారిని నిర్బంధం చెయ్యడం ఆవిడకూ ఇష్టంలేదు. ఐతే పూర్వాచారం బలీయం. బంధుకోటి యావత్తూ రోదనంతోటీ-గర్జనలతోటీ పెంకు లెగరగొట్టేస్తున్నారు.

"చెపితే వినాలి. రాత ఎవరూ తప్పించలేరు. మహా మహా దేవతలకే తప్పిందికాదు. ఆడపుట్టుక పుట్టాక అన్నీ అవమానాలేనమ్మా, ఓర్చుకోవాలి." అంది ఓ గంగాభాగీరథీ సమానురాలు.

"చూశావో ఓవిడా! ఎంతమంది దుయ్యబట్టుకొన్నారోనూ. ఎందుకింక, శిగేసుకోనా-పూలు ముడుచుకోనా, జుట్టు ఉండిమాత్రం ఏం ప్రయోజనం! చెప్పగానే లేచొస్తే ఎంత చక్కగా ఉంటుంది." అందొక వయసుచెల్లిన ముత్తయిదువ.

ఇంతలో పెనుగాలికి కొట్టుకొనే మహావృక్షంలాగా, చేతులు ఊపుకొంటూ, జనాన్ని తోసుకొని వీరభద్రుడు పూనినవాడికిమల్లే ఒస్తున్నాడు శాస్త్రులుగారు. ఆయన్నుచూసి ఆడవాళ్లంతా ఒత్తిగిలారు. పెద్ద హంగామా చేస్తూ, ఉరుముతూ, సుకుమారిని చేయిపట్టుకొని ముందుకు గుంజి "పద పద ఆఁ ఆండ్రబ్బ! చవడలు ఎక్కనీసేవాడు లేక." అంటూ ఈడ్చుకుపోవడం మొదలుపెట్టాడాయన. సహజకోమలమైన స్త్రీహృదయం ఈదృశ్యానికి ద్రవించిపోయింది. ఆత్మీయులైన స్త్రీలంతా రోదనం చేశారు. తులిశమ్మ కడుపు తరుక్కుపోయింది. "నాకూతురో-నాకూతురా" అంటూ సుకుమారిని కావిలించుకొని ఏడుస్తోంది. ఈరోదనమంతా ఎందుకు? ముందు జరగబోయే ఆదారుణకర్మకు - నాగరికత పేరజరిపే ఆరాక్షసకృత్యానికి- కేశవపనానికి. అంతేగాని, అసలే భర్తపోయి దుర్భరమైన దుఃఖంతో విలపిస్తూ పడిఉన్న అభాగినిని దౌర్జన్యంగా ఈయన ఇలా ఈడ్చుకుపోతూన్నందుకు కాదు. ఎవరికీ ఈ అత్యాచారం మనసుకు తట్టలేదు. సుకుమారితండ్రి, రాఘవయ్య ఓమూల చేతుల్లో ముఖం కప్పుకొని కూర్చున్నాడు. సుకుమారిమీద ఈగవాలినా సహించలేని ఆతండ్రి ఈదుష్కర్మకు - ఈదౌష్ట్యానికి ఎలా ఊరుకోగలిగాడో తెలియదు. తనకూతురికి జరిగిన

అన్యాయం తెల్సుకొని ఊరికే మథనపడతాడు. ఎందుకు !

తులిశమ్మను విడకీసి గెంటి గబగబా



లాక్కుపోతున్నాడు శాస్త్రిలు, సుకుమారిని. రాఘవయ్య ఈదృశ్యం చూసి నిలువునా నీరై పోయాడు. ఐతేమాత్రం ఏమన్నా చెయ్య గలడా! సుకుమారి ఉచ్చులో పడ్డ లేడిపిల్ల లాగా గింజుకొంటోంది. ఆమె గింజుకొంటున్న కొద్దీ ఉచ్చు మరింత బిగుస్తోం దామెను. ఏం లాభం! ఈగంద్రగోళంలో ఎక్కడనుంచో పిడుగులాగా ఊడిపడ్డాడు, సాంబం. ఏనుగు మీది కురికే సింహంలాగా శాస్త్రిలుమీదకి దూకి గుండెమీద ఓ తాపు తన్నాడో లేదో విరుచుకు పడ్డాడు, శాస్త్రులు, సుకుమారిని ఒది లేసి. ఆపట్టున సుకుమారిని ఎత్తుకొని గదిలోకి తీసుకుపోయి బైట గొళ్లెం పెట్టాడు సాంబం. అయ్యో, అయ్యో! అంటూ అందరూ గోలచేసేశారు. శాస్త్రులు సంబాళించుకు లేచి "ఏమిట్రా అది, సాంబిగా ఒరేవ్" అంటూ సాంబందగ్గరకు నడుస్తున్నాడు. సాంబం గుదికర్ర చూపించి "ఇదిగో ఇలా వొచ్చావా అంటే నీతలకాయ రాంరాం" అన్నాడు.

"పోకిరీ వెధవ, రౌడీ, పచ్చిరౌడీముండా కొడుకు" అంటూ నిలబడిపోయాడు శాస్త్రిలు.

వారూ వీరూ పోగయారు. అందులో కొంచెం పెద్ద లనిపించుకొంటూ తలతిప్పుకొనే వాళ్లూ ఉన్నారు. అన్నారుగిదా వాళ్లు, సాంబంతో, "ఒరేయి, సాంబూ; ఇలా విను. చాలాతప్పురా నాయినా, ఇదికర్మ. మతసంప్రదాయం. ఇలాంటివి, చిన్నతనం, నీకు తెలియదు." అనొచ్చారు. కానైతే, ఎవరూ దగ్గిరకుమాత్రం వెడితే వొట్టు.

రాఘవయ్య అంతా చూస్తూకూడా కిమ్మనలేదు. మనసులో సాంబాన్ని అతను ప్రశంసిస్తూనే ఉన్నాడు.

"ఏమయ్యా! మాట్లాడవు." అన్నాడు శాస్త్రిలు, ఆయన్ని.

"నే నేమీ చెప్పలేనండీ. ఈసాయంత్రం బండికి మాఅమ్మాయిని తీసుకొని మావూరు పోతా." అన్నాడు రాఘవయ్య. అంతే.

"ఏమిటీ; ఎలాగా; ఊఁ! తీసుకుని—... పోతావూ సరే; చూసుకో, రెండోనాటికల్లా ఆంతఃపత్రిక తెప్పించగల."

## ౨

రాఘవయ్య ఒకప్పుడు వీరేశలింగంగారి శిష్యకోటిలో వాడు. వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమానికి అతను దూరంగానే ఉండిపోయాడు. కాని, స్త్రీలకు విద్య అవసరం అన్నదిమాత్రం నచ్చింది.

ఆయనకు లేక లేక పుట్టినపిల్ల సుకుమారి. వేరే పురుషసంతానం లేకపోవడంవల్ల, ఈమెకే లాగూ-చొక్కా తొడిగి, టోపీపెట్టి బళ్లోకి పంపేవాడు. సుకుమారి ఎలాగైతేనేం లోవర్ సెకండరీ పరీక్ష ఐంది. అంతేకాక సంగీతం-సాహిత్యం నేర్పించాడు తండ్రి.

తలిదండ్రుల గారాబం సుకుమారికి ఒక విధంగా మంకుతనాన్ని నేర్పకపోలేదు. ఐతే పెంకెతనం కాకుండా, మృదుత్వంకూడా ఉంది ఆ మంకుతనంలో. సుకుమారి తలిదండ్రుల వాత్సల్యఝరిలోనుంచి ఈదుకొంటూ తిన్నగా హృదయేశుని ప్రణయవాహినిలోకి చేరుకొంది. అనంతమైన విశ్వప్రేమాంబుధికి ఈ రెండూ పాయలే.

సుందరం సుకుమారిని, శివుడు గంగను ధరించినట్టుగా శిరసున పెట్టుకొన్నాడు. పార్వతిలా ఆమె అతనిలో లీనమే అయిపోయింది. పూవుకు పరిమళం సహజసంపత్తు. అలాగే సౌందర్యానికి సౌకుమార్యమున్నూ, తస్మాత్, సుందరానికి సుకుమారి సామేను. ఇలా ఏకీకృతమైన వారిప్రేమవాహిని జగత్తును పావనం చేసింది అనడంలో ఆశ్చర్య మేముంది? సుకుమారి తామరపువ్వు. చంద్రకిరణం ఆమెమీద పడకుండా ఆచ్ఛాదించే తామరపాకు సుందరం.

సుకుమారిలతకూన సుందరవృక్షాన్ని ఆధారం చేసుకొని ఎగబ్రాకింది. ఆ అమృత స్పర్శకే పులకితమైపోయిన ఆవృక్షరాజం ఆమెను గట్టిగా పొదివిపట్టుకొంది. వృక్షం లతకూనమీద తియ్యని ఫలరసాన్ని చిలికింది. లతకూన వృక్షపాదాన్ని మకరందంతో కడిగి, కమ్మనిపూలతో పూజచేసింది. తోడి చెట్లన్నీ అసూయతో రెమ్మ లాడించాయి. అలాగే ఇతరలతలున్నూ మూతిముడిచాయి. అసూయాగ్ని మహాతీవ్రమైందిగా!

ఒకపాడుకాలంన కాలపురుషుడు గొడ్డలి బుజాన్ని పెట్టుకొని రానేవచ్చాడు. ఈ సుందరవృక్షాన్ని ఒక్కవ్రేటు వెయ్యనూ వేశాడు పాపం, ఆ లతకూనకు ప్రాపేదీ ఇంక?

సుందరం ఈపాడులోకంనుంచి తరలిపోయాడు. నిరంతరమూ ప్రేమవర్షించే ఆ మూర్తి లేకపోయాక సుకుమారి బ్రతుకు ఎందుకు? మబ్బులులేని ఆకాశం వైపు తలెత్తుకు చూసే చాతకపక్షి మాదిరి ఆమె నలువైపులా శూన్యదృష్టులతో చూస్తుంది. ఏముంది! మిగిలిందల్లా ఆపాపపుస్మృతి! మగనితో తాను ఏకాంతంగా కూర్చుని చేసిన సరససల్లాపాలు- ఆడినప్రణయక్రీడలు- అనుభవించిన ఆనందం ఒక్కొక్కటి తలపుకు వొచ్చినపుడల్లా ఆమెహృదయంలో ఒక్కొక్కతూటు పడుతోంది. ఇదంతా యాతనా

మయజీవితం. స్త్రీకి ఇంతకంటే బాధ మరి ఏముంది?

విగతభర్తృకయి దుర్భరమైన చింతలో కుమిలికుమిలి ఏడుస్తూఉండగా, ఛాందసులు ఆచారంపేరిట చేసే దురాగత మొకటి.

"నాసుందరం ఈనా వినీలకేశపాశాన్ని, చేతుల్లో నిమురుతూ, 'సుకుమారీ! ప్రేమ పాశంలా ఉన్న నీజడతో నన్ను బంధించి వెయ్యి' అనేవాడు. 'గౌరవర్ణమైన నీముఖం మీాద ముసురుకొని నీతలకట్టు సుకుమారీ! గౌరీశంకరశిఖరాన్ని ఆవరించిన వినీలజలద పంక్తిలా ఉంది.' అని వర్ణించాడు. అలాంటి-నాథర్తకు ప్రేమాస్పదమైన ఈజుట్టు గొరిగించేదాకా అల్లాడిపోతున్నారే" అనుకొని కన్నీరుగార్చింది సుకుమారి.

"ఏమైనా సరే, పెద్దలంతా పోగై నా కంఠం నులిమేసినా సరే తలతీసేసుకోడానికి నేనొప్పను." అని నిర్ధారించుకొంది.

"నేను చేసినదోష మేముంది? హృదయపూర్వకంగా ప్రేమించి-ఆరాధించుకొన్న భర్త నన్ను వొదిలిపోయాడు. అందుకని ఆ జన్మాంతమూ అపవిత్రమూర్తిని తల్చుకొంటూ ఇలా పడేఉంటాను. నాథర్త పోయినందుకు నాకు శిక్షా! ఏం న్యాయం! తలకొట్టివేయడంకంటె తలకట్టు గొరగడమే దారుణమైన శిక్షగదా! అలాంటి దండన ఇవ్వడానికి నేను చేసిన తప్పేమిటి? నాథర్తతో నాకు ప్రాప్తించిన ఆభరణాలూ-మంగళ సూత్రాలూ ఎలాగా విసర్జించేశాను. పుట్టుకతో నాకు ఏర్పడిన శిరోజాల్ని ఖండించివెయ్యడం ధర్మమవుతుందా? చెప్పరేం? స్త్రీకి తలవెంట్రుకలుకూడా ఒక అవయవమే. అంగవిచ్ఛేదన పొందగలిగేటంత మహాపాపం నేనేం చేశాను? నాథర్తమరణానికీ-నా కేశఖండనానికీ సంబంధ మేమిటి? ఒకవేళ జుట్టు అవినీతికి కారణమంటారా? 'తలలు బోడులైన తలపులు బోడులా!' అని మీాకు తెలీదు? హృదయంలో పుట్టే సచ్చింతలకుగాని దుశ్చింతలకుగాని వెంట్రుకలు కారణ మవుతాయా? ఒకవేళ నామనసులో దురూహ మొలకెత్తుతుం దనుకోండి, దాన్ని మీారు ఛేదించివేయగల్రా? చెప్పండి." అంటూ నిర్భయంగా ఎదిరించి పల్కింది. చిన్నతనంలో ఏర్పడిన మంకుతనం ఇంతవరకూ అణిగిఉండి ఇపుడు రేకెత్తింది.

నడుములు కట్టుకొన్న పూర్వాచార పరాయణు లంతా సుకుమారి అడిగిన ప్రశ్నలకు జవాబు చెప్పలేకపోయారు. "ధర్మశాస్త్రం ఇలా విధించింది. ఉల్లంఘించకూడ దమ్మా!" అనడమేగాని అంతకంటె మరి చెప్పలేకపోయారు.

"దుఃఖభరజీవితమై ఉన్న స్త్రీని బలాత్కారంగా తలగొరిగించి అవమానపరచడానికి శాస్త్రానికిమాత్రం ఏం హక్కుంది? శాస్త్రం మనం ఏర్పరచుకొన్న కట్టుబాటు గదా! అది మనకు చివరకు ముక్కుతాడు క్రింద పరిణమించినట్లైనా దాన్ని బుద్ధిపూర్వ

కంగా మనం పరిహరించడానికి హక్కు వుంది. మన ప్రేలుతో మనకన్ను పొడుచుకోం" అంటే నోళ్లుబంది.

ఛాందసులకు ఒక్కటే మూర్ఖవాదన.—

"యస్మిన్ దేశే య ఆచారః
పారంపర్యక్రమాగతః,
శ్రుతిస్మృతివిరోధేన
సదాచార స్స ఉచ్యతే."

అని ఏదేశంలో ఏఆచారం శ్రుతిస్మృతివిరోధం లేకుండా పరంపరానుక్రమంగా వస్తోందో, అదే సదాచారం అని దీని కర్థం. కానైతే వారు తీసుకొన్న గోతిలో వారే పడతారు. ఏ ఆచారం శ్రుతి స్మృతి విరోధం లేకుండా వస్తోందో, అదే సదాచారం అన్నప్పుడు, ఇది శ్రుతి స్మృతి విరోధమే ఐన పక్షంలో పూర్తిగా నిషిద్ధమే అవాలి.

శంకరాచార్యులవద్దనుంచి రాఘవయ్యకి ఆంక్షపత్రిక వొచ్చింది.—"సుకుమారికి శిరోముండనం చేయనందుకుగాను వెలి"అన్నారు.

ఈలోగా రాఘవయ్య శ్రుతిస్మృతిపురాణాదులన్నీ గాలించాడు, ఈకర్మ ఎక్కడైనా విధించి ఉందేమోనని. ఎక్కడాలేదు. అనేక కర్మలు-చివరకు విధవావివాహానికికూడా కర్మ-మంత్రం ఉందిగాని కేశవపనానికి మంత్రమూ చెప్పలేదు, కర్మాచెప్పలేదు. కాబట్టి అది లౌకికమని తేలింది. "దీనికి వేదంలోనుంచిగాని స్మృతిలోనుంచిగాని ప్రమాణాం చూపినట్లయినా నా కూతురుకి శిరోముండనం చేయిస్తాను. లేకపోతే లేదు." అని బహిరంగంగా ప్రకటిస్తూ శంకరస్వాములవారికి కూడా వ్రాశాడు. దీనికి ప్రత్యుత్తరం లేకపోయింది. పైగా ఆంక్ష మరింత బాధ తెచ్చిపెట్టింది.

మంగలి పిలిస్తే పలకడు. చాకలి బట్టలు ఉతకడు. గొల్లది చల్ల పొయ్యదు. బండివాడు బండికట్టడు. దాసీమనిషి మానుకుంది. ఊళ్లో ఎవరూ మాట్లాడరు. అబ్బా ఎంతకష్టం! సంసారికి వెలికంటె క్రూరమైన దండన ఉండదు.

రాఘవయ్య సవాలుచేస్తూ ఇలా ప్రకటించాడు, ఆంధ్రపత్రికలో: "సరియైన ప్రమాణాలు చూపకుండా శంకరస్వాములవారంతటి యతీంద్రులు క్రూరంగా-అనాలోచితంగా ఆంక్షయిచ్చారు. నాకుమార్తెకు శి 'ముండనం చేయలేదన్నదే వారుచేసిన దోషారోపణ. ఐతే వేదంలోగాని స్మృతిలోగాని ఈకర్మకుమంత్రంగాని కర్మగానికనిపించదు. నా ఉద్దేశ్యంలో పురుషులు స్వార్థపరతతో ఏర్పరచిన రాక్షసాచారమని అనుకొన్నాను. ఇప్పుడైనా సరే, పండితులు ఏధర్మగ్రంథంలో చూపుతారో చూపండి. అక్రమంగా వెలివేసి గృహస్థుని బాధించడం అన్యాయం- పిరికితనమున్నూ. పైగా, చూడండి.—

'సర్వాన్ కేశాన్ సముద్ధృత్య
ఛేదయే దంగుళద్వయమ్,
ఏవం నారీకుమారీణాం
శిరసో ముండనం స్మృతమ్.

న స్త్రియాః కేశవపనం
సదూరే శయనాసనమ్,
నచ గోష్ఠే వసే ద్రాత్రౌ
నదివా గా అనువ్రజేత్.

నదీషు సంగమేచైవ
అరణ్యేషు విశేషతః,
న స్త్రీణా మజినం వాసో
వ్రతమేవ సమాచరేత్.'

అని పరాశరస్మృతిలో స్పష్టంగా ఉంది. అనగా, 'స్త్రీలకుగాని-బాలికలకుగాని ఎక్కడైనా ముండనం విధించినట్లైతే జుట్టుఅంతా వొదిలి, చివర రెండుఅంగుళాలుమాత్రం కత్తిరించాలి. బ్రహ్మచర్యాదివ్రతాల్లో స్త్రీలకు కేశవపనం ఎక్కడా లేదు.'

పరాశరస్మృతి ప్రామాణ్యం కాదంటారా?—

'కృతేతు మానవా ధర్మా
స్త్రేతాయాం గౌతమాః స్మృతాః,
ద్వాపరే శాంఖలిఖితాః
కలౌ పారాశరాః స్మృతాః.'

కాబట్టి కలియుగంలో పరాశరస్మృతికే ప్రాధాన్యం ఇచ్చారు. అందుచేత

'స్మృతి ర్వేదవిరోధేతు
పరిత్యాజ్యా యథా భవేత్,
తథైవ లౌకికం వాక్యం
స్మృతిబాధే పరిత్యజేత్.'

'వేదానికి విరోధంగా ఉన్న స్మృతి ఏవిధంగా పరిత్యజింపతగ్గదో, అదేవిధంగా స్మృతికి విరోధంగా ఉన్న ఆచారమున్నూ విడువతగ్గదే.'

3

అర్ధరాత్రి. కారుచీకటి. ఊరంతా మాటుమణిగింది. కాని, రాఘవయ్యగారింట్లోంచి నిద్రాదేవత లేచిపోయింది. వెలికాదూ, మరి, రాఘవయ్యకి!

రాఘవయ్యకి నాలుగురోజుల్నుంచి జ్వరం. వైద్యుడు, పిలుస్తే "మీకు వెలికాబట్టి రాను" అన్నాడు. మందూ మాకూ లేక జ్వరం క్షణక్షణాభివృద్ధి పొందుతోంది. దైవం మీద భారంవేసి ఊరుకోవలిసొచ్చింది. బంధువులు ముందే దూరమైపోయారు. ఐతే, సాంబం మట్టుకు హనుమంతుడులాగా కూడానే ఉన్నాడు.

తులిశమ్మ అతని కాళ్లదగ్గిర కూర్చుని దుఃఖిస్తోంది. సాంబం "వైద్యుణ్ణి చావగొట్టి ఈడ్చుకొస్తాను" అంటున్నాడు కోపాతిరేకంతో. సాంబంచేయిపట్టుకొని రాఘవయ్య అన్నాడు.—

"నాయినా! మొగపిల్లలు లేనిలోటు తీర్చావురా! అంతే చాలు. సాహసంమట్టుకు చెయ్యకు. వెలికి జడిసి సుకుమారితల ఎలా గొరిగించనూ."

"మీ ప్రాణంకంటేనా!" అంది తులిశమ్మ దుఃఖంతో.

ఈమాటలు సుకుమారి వింది. మెల్లిగా దొడ్లోకి చక్కా పోయింది, కళ్లనీళ్లు గుక్కుకుంటూ.—

"నాతండ్రికంటె నేను ఎక్కువకాదు. ఆకులులేని మోడులాగా నేను ఉండిమాత్రం ఎందుకు? నామూలాన్నిగదా నాతండ్రి ప్రాణ విసర్జనం చేయవలిసొచ్చింది. ఛీ! నే నెందుకు! నేనే పోతే నాతండ్రికి ఈబాధలే ఉండవు. సంఘం చేసే దుర్ణయానికి నేనే బలి అవడం మంచిది. ఓఛాందసులారా! శాస్త్రమని వంక పెట్టి అభాగినుల గొంతులు కొయ్యండి.

సంఘమా! వక్రాచారాలు నిర్మించి నిరపరాధుల కన్నీళ్లు వరదలుకట్టించు....

అన్యాయం-అక్రమం ఐన దుష్టాచారానికి తలఒగ్గేబదులు ఆత్మార్పణం చేయడం మంచిది.......

ధర్మానికి ప్రతికూలమైన ఆచారమని తెలిసుండీకూడా మొండిపట్టు పట్టి నన్ను అవమానించాలని చూస్తున్నారు, ఛాందసులు.

స్త్రీప్రపంచం ఎన్నాళ్లు ఇలా కళ్లుమూసుకొని ఉంటారు!

నాముక్తాత్మ గాలిలో కలిసి అణువణువుకీ ఈదుష్టాచారాన్నిగూర్చి బోధిస్తూ ఉంటుంది.

నేను—సంఘాన్ని ఎదిరించిన నేను, ఇక ఉండను. నాతండ్రికి వెలికూడా ఉండదు.— అబ్బా!—నిండుప్రాణాన్ని......పరమేశ్వరా! మన్నించు—" అంటూ సుకుమారి నూతి గోడమీద నిలబడి విలపించింది.

ఉత్తరక్షణంలో నూతిఅడుగున గుభేల్ మని ధ్వని.

---

## హ తా శ

పురిపండా అప్పలస్వామిగారు

చీకటి ధూళులబ్డి బడి నశించు హిమాంబుకణాల నేరికో
లేక శ్రమించు నక్క కనికరింపదు యామిని నా ప్రవాస బా
ధాకుల జీవితాంకము నిశాంత దరిద్రమె ఇం దోకప్పుడుఁ
సోకవు కౌముదీ హాసన శోభలు సౌరభగాన లేశముల్.

---




## భూమి అప్పు

కె. జె. ఆర్. పాట్నాయకుగారు

ఒకనాడు ఒకనక్క పొలాలంతా తిరిగి కడుపునిండా పీతలు తిన్నది. మితిమీరడం చేత పాపం కడుపునొప్పి కలిగింది. అటూయిటూ దొర్లుతూ బాధపడుతూంది. అప్పుడు ఆ త్రోవను ఒకకోమటి భుజముమీద మూటకొంచుకొని వెళ్తున్నాడు. అతణ్ణి చూసి "ఓ కోమటినేస్తం! కడుపునొప్పి బాధ పెడుతున్నాది. చిన్న సొంటిముక్క ఇస్తావా నీకు చాలాపుణ్యం ఉంటుంది"అని అడిగింది. అందుకాకోమటి "పొద్దున్నయిఉందోయి. ఏంవిబేరం లేదు. దమ్మిడీ ఉంటే చూద్దు. ఇస్తాను" అన్నాడు.

"నా దగ్గిర దమ్మిడీ లేదుకద! ఏలాగునోయ్".

"ఓస్! భూంవిని అప్పు అడగరాదూ!"

*  *  *

"ఓయ్! భూంవీ! భూంవీ!ఒకదమ్మిడి ఉంటే ఇస్తావా! రే పిస్తాను".

"అయితే ఇదిగో నోయ్."

అని భూమి దమ్మిడి యిచ్చింది. దానితో సొంటిముక్క కొనుక్కొని తిని నక్క బాధ తీర్చుకుంది.

మర్నాడొచ్చింది. భూమి నక్కను చూచి "ఏదోయి నక్కా! నాదమ్మిడీ" అని అడిగింది.

"ఉండవోయి! రే పిస్తాను".

ఆమర్నాడు తిరిగీ భూమి "ఈవాళ యిస్తానన్నావు. నాదమ్మిడి ఇయ్యవోయి, నక్కా" అని అడిగింది.

"రేపు ఎవరినయినా అడిగి యిస్తాను తప్పకుండాన్న."

మరునటిరోజున అక్కడ ఉంటే భూమి అడుగుతుందని చాలాదూరం పారిపోయింది నక్క. కాని అక్కడా వదలలేదు భూమి. ఈమోస్తరుపుగా వారం పదిదినా లయినాయి. ఆనాడుకూడా భూమి అడిగితే ఇస్తానంటూ దూరంగా పారిపోయి ఆనక్క ఒక పొదటిలో దూరిపోయింది. అప్పు డొక పుడక కంటికి గుచ్చుకుంది. గుడ్డికన్ను అయిపోయింది.

అప్పుడు తిరిగీ భూమి "ఏంవోయి ఎన్నాళ్లయింది తీసుకెళ్లి. ఇప్పటికే ఇవ్వకపోతే ఏలాగ! ఈవాళ ఇస్తే నేకాని కాదు"అని గట్టిగా దబాయించింది.

అందుకు నక్క కోపంతో "ఎవరువోయ్ నువ్వు? ఏంటి అడుగుతున్నావు? నీకేం మతిపోయిందా?" అంది.

"ఏంవోయ్! సొంటిముక్కకి అని దమ్మిడి నాదగ్గిర అప్పుతీసుకున్నావుకదా! అది అడుగుతున్నాను."

"అయితే, నువ్వుమంచినక్క కిచ్చేవా?"

"నేను మంచినక్కకే యిచ్చినాను."

"ఆలాగ! ఏం పెద్దమనిషివోయి నువ్వు! చూడుమరి. నేను గుడ్డినక్కనుకదా, నన్నడుగుతున్నావు. ఆదేటి ధర్మంవోయి. వెళ్లి దేని కిచ్చేవో దాన్నడుగు." అనింది నక్క. కథ కంచికీ, మనమింటికీ.

---

## వెళ్లేటప్పుడు వెంటరాదు

శ్రీమతి కల్పాకం త్రిలోకసుందరమ్మగారు

ఒకానొకప్పు డొకపూరియం దొక కోటీశ్వరు డుండెను. ప్రతిదినము పడకనుండి లేచినదిమొదలు మరల రాత్రి పడకపయి పండుకొనువరకు అతడు తనధనముమీదవచ్చు ఆదాయమును లెక్కజూచుకొనుటతో గడుపు చుండేవాడు. ఇంకను ధనమునుకూడబెట్టవలెనన్న ఆశచేత తరుచు అన్నపానములనుకూడ మానివేయుచుండేవాడు. ఇట్లు కొన్నిసంవత్సరములు గడచినవి.

ఒకప్పుడు భగవంతునికి వానిపయి జాలి కలిగినది. వానికి తనయందు భక్తి కలుగునట్లు చేయతలచి యాచకబ్రాహ్మణునివలె వేషముచు ధరించి వానియింటిగుమ్మమువద్ద నిలువబడి యుండెను. కోటీశ్వరు డాయనను గురించి విచారింపకయే తనపనిని తాను చూచుకొనుచుండేవాడు. ఈవిధముగ పదిదినములు గడచినవి. వానిదృష్టిమాత్రము ఆబిచ్చపు బాపనిపయికి మరలినది కాదు. ఇక 'ఇదికా' దని మరునాడు కోటీశ్వరుడు ఏటికిపోయి స్నానముచేసి వచ్చుచుండగా బ్రాహ్మణుడు వానికి త్రోవలో ఎదురుపడినాడు. 'అయ్యా, పదిదినములనుండి తమయింటివాకిట కాచికొని యుంటిని. తమయనుగ్రహము కలుగకపోయినది. నా కొకకోరిక గలదు. అది మీవలన నెరవేరునని నమ్మియున్నాను' అని వానితో నన్నాడు. వానికి ఆబ్రాహ్మణునిపయి కొంచెముదయపుట్టినది. 'నీకోరికను తెలుపుము' అన్నాడు. అపుడు బ్రాహ్మణుడు 'అయ్యా! నాతల్లిదండ్రులు పరలోకమున నున్నారు. వారు కట్టుకొనువస్త్రములు చినిగిపోయియున్నవట. వానిని కుట్టుకొనుటకయి నన్నొక సూదిని పంపుమనిరి. మీరు గొప్పవారు. మీరు వెళ్లేటప్పుడు దానిని తీసికొనిపోయి యివ్వగలరు. ఇది మీకు చాలసులభమయిన పని' అని తనచేత నున్నసూదిని కోటీశ్వరుని చేత పెట్టెను. అపుడు వాని కొకయాలోచన

కలిగినది. ఏమని? 'మనము పోవునపుడు మన శరీరమే మన వెంట రాదుగదా! ఈసూదిని ఎట్లు తీసికొనిపోయి యివ్వగలను' అని. అంతట వానికి జ్ఞానోదయ మయినది. వెంటనే ఆ యాచక బ్రాహ్మణుని పాదములపయిబడి 'మహాత్మా, నీవు యాచకుడవు కావు. న న్నుద్ధరింప వచ్చిన భగవంతుడవు. నీమహోపదేశమువలన నాయజ్ఞానము నశించినది. నాకు ధనముతో పని లేదు. మోక్షమును ప్రసాదింపుము' అని వేడుకొనెను. మాయారూపధారియగు భగవంతుడు 'అట్లే' యని పలికి మరిగిపోయెను. కోటీశ్వరుడు వెంటనే సన్న్యాసమును పుచ్చుకొని కొన్నాళ్లకు మోక్షమును పొందెను. కథ కంచికి; మనం ఇంటికి.

---

## అటునుంచి నరుక్కురమ్మన్నాడు

తులసి లక్ష్మీనారాయణమూర్తిగారు

పూర్వం ఒక పాదుషాగా రుండేవారు. ఆయనకు భార్యమీద మిక్కిలి ప్రేమ. ఆమె కోరిన కోరిక లన్నీ తీర్చుచుండువాడు. ఒకమారామె గర్భవతియై యుండగా నీ కున్న కోరిక లన్నీ చెప్పమన్నాడు. సాధారణంగా గర్భిణీ స్త్రీలకు తినుబండారములందును, చిత్రమైన వస్తుదర్శనమందును, పురాణశ్రవణాదులందును ప్రీతి వుంటుంది. ఆప్రకారం మన బీబీగారు తినుబండారాలుకాని, వస్త్రభూషణాదులు కాని, తీర్థయాత్రలుకాని ఏమీ కోరలేదు. 'నా కొ క కో రి క వుం ది తీ రు స్తా రా' అన్నది. 'తప్పక తీరుస్తా' నన్నాడు పాదుషా. 'నేను 'చాలనేవ'అకు మనుష్యుల్ని బలివేస్తుంటే చూడాలని వుంది. అల్లా చేయించ'మన్నది బీబీ. దానికి పాదుషాకూడ భార్యయందలి ప్రేమ చేత 'ఇది త గు నా? తగదా' అని ఆ లో చిం ప క 'స రే' న న్నా డు. వెంటనే మంత్రి కాజ్ఞాపించాడు. ఆమరు నాడు మధ్యాహ్నం కొంతమంది మనుష్యుల్ని రా ణి గా రి యెదుట నుంచాడు మంత్రి. ఆవిడ కుర్చీమీద కళ్లు మిటకరించు కుంటూ కూర్చుంది మహానందంతో ఆభయంకరదృశ్యాన్ని చూడ్డానికి. అంతట్లోకి వధించేవాడొచ్చాడు యమభటుడులాగ. వధింపబడే జనాన్ని వరుసగా నిలబెట్టేడు. ఖడ్గహస్తుడై మొదటి కొచ్చాడు. ఆ మొదటివాడు కోమటి. ఏ అభిప్రాయంతోటో ఇల్లాగన్నాడు తలారి వానితో: 'ఎల్లాగైనా నఱుకుటతప్పదు. అటునుంచి నరుక్కొద్దూ' అని. 'సరే, ఎట్లయినా ఒకటేకదా'అని తలారి అటుప్రక్కవారిని నరుకుట ప్రారంభించాడు. తలకాయలు కొబ్బరి పుచ్చిల్లాగ ఎగిరిపోతున్నాయి. బీబీఆదృశ్యాన్ని రెప్పవాల్చకుండా చూస్తోంది. కొంత సేపటికి రాళ్లుకూడ కరిగే ఆఘోరము ఆమెహృదయాన్ని క రి గిం చిం ది. ఇంక చూడలేకపోయింది. 'చా'లంది. అప్పటికి మనకోమటి

మాత్రం మిగిలిఉన్నాడు. ఈమాట విని పరమసంతోషంతో వెళ్లిపోయాడు కోమటి. కాబట్టే ఇప్పటికికూడ మనవాళ్లు ప్రసంగంలో 'అటునుంచి నరుక్కురమ్మన్నాడు, ఎందుకైనా మంచి'దని సామెతగా వాడుతూంటారు.

కథ కంచికి; మనం ఇంటికి.

---

# తాను ఒకయింటి అల్లుడే

శ్రీమతి జ. రామాబాయమ్మగారు

ఒక పట్టణమున నొకరాజు మంత్రినిగని "రేపు నీవు వచ్చునపుడు రెండుప్రాణులను దీసుకొనిరమ్ము. అందొకటి చేసినమేలు మరచునది, రెండవది చేసినమేలు ఎన్నటికిని మరువనిది అయియుండవలెను. ఈ రెండును లేకున్న నిన్నురితీయించెద"నని సెలవిచ్చెను. ఆ మంత్రి కేమియుతోచక యింటికిపోయి విచారించుచుండెను. అపు డాతని కూతురు పోయి "నాన్నా మీ రేమి ఖిన్నులై యున్నా"రని యడిగెను. తండ్రి "అమ్మా ఏమియులేదు; యథాప్రకారముగనే యుంటి" నని చెప్పి చివరకు రా జిచ్చిన యాజ్ఞ తెలిపెను. అది విని కుమార్తె 'దీని కింత యాలోచన ఎందులకు? రెండు నేను జెప్పెదాన. మీరు సభలోని కేగునపుడు మీ అల్లుని, మనయింటి కుక్కను దీసికొని పొండు' అని నచ్చజెప్ప నమ్మతించియు, కొంచెము అనుమానించెను. 'ఇది న్యాయము గాదు; నే నల్లుని తీసుకపోయి 'వీడు కృతఘ్ను' డంటినా 'యిట్టివా డుండరా'దని యురితీయు మనును. అట్లయిన నీవు విధవవు కావలసివచ్చునే' అనెను. 'మీ కేమి భయములేదు. అంతవట్టు వచ్చెనా, 'మీరునుగూడ నొక యింటి అల్లుడే, నేను నంతియే. అందరికి ఈ కృతఘ్నత యుండు' నని తెల్పు' మని కూతురు చెప్పెను. మరునాడు సభలోనికి మంత్రి ఈ రెండుప్రాణులను తీసుకొనిపోయెను. రాజు 'ఏవీ, నీతోచెప్పిన ప్రాణు' లన, మంత్రి అల్లుని, కుక్కను రాజు నెదుటబెట్టి 'రాజా! ఈకుక్కకంటె నధికవిశ్వాసమును కృతజ్ఞతయు కలది వేరొకటి లేదు. ఎప్పుడును తన్ను పెంచినవారిని విడువదు. రెండవ ప్రాణి అల్లుడు. అల్లునికంటె నధికకృతఘ్నుడు లోకములో లేడు. అత్తమామలు తమప్రాణము లన్నియు బెట్టినను నింకను తనకు గొఱతయే చేసినారనును. విశ్వాసము ఇంతయైన లేదు.' అనిచెప్పగా రాజు 'నిజమే అల్లు డట్టివాడే! ఎవరురా ద్వారముకడ! ఇట్టివాని నురితీయు' డని సెలవిచ్చెను. అంత మంత్రి చేతులు జోడించుకొని 'మహాప్రభూ! నేనును, తమరును నొక యింటి అల్లుండ్రమే' యని మనవిచేయ రాజు పక్కున నవ్వి యాతనికి బహుమాన మొసగి పంపెను. కథ కంచికి, మనం ఇంటికి.

---

## నళిని మధుకరుని భయపెట్టుట

శిరోమణి వారణాశి గంగాధరశాస్త్రిగారు

మధుకరవృత్తిఁ బూని బ్రతిమాలఁగ నట్టులె యంచు నిన్నుఁ బ్ర
ప్రథమమునందు మత్సదనభాగము చేరఁగనిచ్చినందు కీ
విధమున నెన్నిరెయో వెతల ప్రేఁగఁగనయ్యెను నెవ్వరైనఁ దా
మధికవిషాదఖిన్ను లయినప్డు తలంత్రు నిజావివేకమున్.

బంభర నీమృదుగానము-సంభావన సేసి మిగుల సరసుఁడవని నీ
కంభోజవసతి నొసఁగితి-దంభాత్ముఁడ వనుచు మొదటఁ దలఁపఁగనైతిన్.

సరసమకరందసౌరభము జల్లు వికస్వరపంకజావళిన్
పరుషతఁ బూని క్లేశపఱుపంగను జూచెదు త్రొక్కి-వైచె దీ
వరయ నొకింతయున్ మృదుతరాంగులఁ గన్గొనునట్టిరీతి బం
భర! భవదీయకృత్యము లవాచ్యము లింక నిన్ సహింతునే.

మధుపా! నీదగు క్రూరకృత్యములు వేమా రాత్మ చింతించి శా
పథసంచారిని నిన్ను దీవ్రతరశాపం బిచ్చి శిక్షించెఁ "బ్రాం
త ధరన్ జేరిన నాశ మొందెదవనుచున్" గాకున్న నీ వేల స
త్ప్రథితామోదసువర్ణవల్లరిసమీపం బేఁగ వేవేళలన్.

ఇఁక నిన్నున్ దయఁ జూచినన్ ఫలము లే దిందిందిరా! నేఁడు తా
వకకృత్యంబుల నెల్ల మత్ప్రియునితో వాక్రుచ్చి నీ పీఁ ప్రపం
చకమం దెచ్చట డాఁగినన్ గొని ప్రదోషాన్ సరోజాతకో
రకబందీనిహితాత్ముఁ జేతు వినుమీ! రాజీవినీవాక్యమున్.

---



చందసో ఆనన సుందరరుప హై ఉజల అంగ విభూతి రమావే
అంబర ఛీన కోపీన లసే వతిక సీస అనూప జటా ఛిటకావే
భరీ వియోగ లియే రహు జోగమే రాగకే రంగ నహీ సుఖ పావే
రాగ మల్లారకీ నేతమల్లారికో రాగనీ హుమోహు నామ కహావే.

[ఈ.రాగచిత్రము : దివాన్ బహదూరు గోవింద్ దాసు చతుర్భుజదాసుగారి యనుమతిని.]




# కదలెడు బొమ్మలు, 3

కొ. నరసింహాచారిగారు

### ఆడెడు పాము

ఆడెడుపామును చేయుట మిక్కిలి సులభమైనది. దీనిని అట్టముక్కలతోగాని, సీసామూతలు అనగా కార్కులతోగాని చేయవచ్చును.

### అట్టముక్కల పాము

18 అంగుళముల నిడివియు, 2 అంగుళముల వెడల్పును గల ఒక గట్టి అట్టముక్కను తీసికొని దానిని చిత్రము A యందలి విధముగా, ఒకకొన కూచిగాను, రెండవకొన మధ్యభాగమునకన్న కొంచెము వెడల్పు తక్కువగాను ఉండునటులను కత్తిరించవలెను. పిమ్మట అట్టముక్కను 8 లేక 9 తునకలుగా కత్తిరించవలెను. ప్రతిముక్కయందును చిత్రము B 1వ ముక్కయందు గుర్తించిన a. b. c. d. అనుచోట్లయందు సూదితో రంధ్రములను చేయవలెను. తర్వాత 1, 2, ముక్కలు తీసికొని 1వ ముక్కయందలి c. d. రంధ్రములకు, 2వ ముక్కయందలి e. f. రంధ్రములు సరిగా నుండునట్లు పట్టుకొని, గట్టిదారముతో చిత్రము D యందు చూపబడిన 8 వంటి కుట్టుతో కుట్టవలెను. అప్పుడు ఈరెండు ముక్కలును, తలుపుకీలువలె ఒకదాని కొకటి ఆధారముగా తిరుగగలిగియుండును. ఈరీతిగా చిత్రము C యందుండువిధమున తక్కిన అన్నిముక్కలను ఒకదాని కొకటి కట్టవలెను. కత్తిరించబడిన ముక్కలవరుస తప్పిపోకుండుటకు అన్నిముక్కలను అంకెలతో గుర్తించుకొని ఆదేవరుసను వాటిని కుట్టుట మంచిది. ఇంతవరకు తలలేక పడగతప్ప తక్కిన భాగము, తోకవరకు ఏర్పడిన దగును. పిమ్మట ఒక సన్నని తగరపురేకుతునకను దీసికొని దానిని E యందలి విధముగ కత్తిరించవలెను. దాని యందలి D భాగమును, F నందువలె పాము యొక్క నోటి భాగమును తెలుపుటకుగాను వంచవలెను. E యందలి b b భాగములను వెనుకకు G యందువలె వంచుకొనవలెను. ఇట్లు వెనుకకు వంచబడిన రెండు b b భాగముల మధ్యనందునందు చిత్రము C యందలి పాముయొక్క 1వ తునకను చొప్పించవలెను; తర్వాత 1వ తునకయందలి a b రంధ్రములకు సరిగా రేకుయొక్క b b భాగములందుగూడ x y అను రెండు రంధ్రములను

చేసికొని రేకును అవగా పడగభాగమును మొదటి అట్టతునుకకు, చిత్రము H, b యందలి విధమున కుట్టవలెను. పిమ్మట నొక సన్నని కాగితమును పాముశరీరముపై నదికించినయెడల కుట్టిన భాగములు మరుగుపడియుండి పాము కుడి ఎడమలకు పడగనున్న, శరీరమునున్న కదలించ గలిగియుండును.

కార్కు లతో పామును చేయుట

అట్టముక్కలతో చేయబడిన పాము, లావులేక పలకగా నుండుటవలన అంత స్వాభావికముగ కనుపించదు. కార్కు ముక్కలతో చేయబడిన పాము లావునుగలిగి స్వాభావికముగా కనుపించును.

ఒకదానికన్న నొకటి కొంచెము సన్నముగా నుండు కార్కుల (Pieces of cork of graded size and thickness) ను 10 లేక 12 ను తీసికొనవలెను. (చిత్రము 1.) ప్రతిముక్కయొక్క రెండుకొనలను, J 2 యందలి రీతిగ పలకగా, వాడియగు కత్తితో కోసికొనవలెను. తర్వాత ప్రతిముక్కయందును a. b. c. d. అను రంధ్రములను, పూర్వము అట్టముక్కలయందు చేసినవిధముగ చేయవలెను.












(J—abcd.) తర్వాత కార్కుముక్కల నన్నిటిని వాటి పరిమాణపు వరుసలో, ఒకదాని కొకటి K యందలివిధముగ కట్టివేయవలెను. కట్లు 8 వలెనే యుండవలెను. పాముయొక్క పడగను ముందుచెప్పినవిధమున నేచేసి మొదటి కార్కుముక్కకు కుట్టవలెను.



---

## పాత పాటలు

సంపాదకుడు: నేదూరి గంగాధరంగారు

### ౨౯

ఆదివారమునాడు వొక్కపొద్దున్న
ఆబోతు జన్మించు ఆవుగర్భాన
శుక్రవారంనాడు వొక్కపొద్దున్న
సూరన్న జన్మించు తల్లిగర్భాన.

### ౩౦

రాచవారక్కమ్మ రమణ ముద్దులది
బుట్ట చంకపెట్టి పువ్వులేర వెళ్లు
చూసేడు పాపభర్ముడు వేసేడు కన్ను
నావంటి ఆడతోడు లేదటర నీకు
ఆడతోడులేకేమి ఆలిలేకేమి.

### ౩౧

సీతమ్మశ్రీరాము ఆతోవ వెళ్ల
సీతకు దిగినవి ఒరిదబ్బముల్లు
'తియ్యవోయి రామన్న తియ్యవోయి ముల్లు'
'ముల్లేల తీస్తును యీమూకలోను
కాలేల యెత్తుదును కన్నవారిలోను
చెయ్యేల యెత్తుదును చెల్లెళ్లలోను!'

### ౩౨

బంగారుకడియాల భామరో నీకు
ప్రేమతో కృష్ణుడు పెనిమిటా నీకు.
ఆరళ్లగోపమ్మ అత్తంట నీకు

### ౩౩

వీరభద్రునిసేవ వింతైనసేవ
నాతికోరుకొండ సరసన్నసేవ.

### ౩౪

ఇల్లాలు భద్రమ్మ యిల్లలికితేను
వీధిలో అమ్మాయి పూబంతులాడు
ఒకటాడు రెండాడు వంగపండాడు
నీళ్లలో అమ్మాయి నిమ్మపండాడు
దారిలో అమ్మాయి దబ్బపండాడు.

### ౩౫

సువ్వని నేనొక్కపో ఓసితేను
చుక్కలు పిక్కటిల్లు సూరన్నకదలు
అన్నని నేనొక్కపో ఓసితేను
ఆకాశం తల్లడిల్లు ఆరాము గదలు.

### ౩౬

సుబ్బరాయుడిషష్ఠి, చూసొద్దాం రండి
అరచేతిలో బువ్వ, అమ్మ నాకుగవ్వ
భోగముదాని కొప్పు, విప్పిన వాసనగప్పు
చిత్తముంటె వొప్పు, సత్తువుంటె మెప్పు
పొత్తు గోరిన తప్పు, మత్తులెల్ల విప్పు.

### ౩౭

గట్టుమీద కోడి గవ్వల కోడి
తొక్కితే తొంబై పిల్లలకోడి
అప్పలార తప్పలార గట్టిగ మూయండి. ౧

పందిరిమీద పువ్వుల కోడి
పదహారుకుచ్చులు మింగినకోడి. ౨

పిట్ట పిట్ట భాయ్
పికిలిపిట్ట భాయ్
నెత్తిమీది కుండతీసి
నెలకొట్ట భాయ్. ౩

కట్టంలోని కొర్ర పిండి
కొడుదునా బుక్కుదునా. ౪

సూదిదారం చుక్కలగుడ్డ
కట్టుకో దాచుకో. ౫

బిందిమీదబింది వరహాలబింది
బింది బింది బింది. ౬

ఉసిరిచెట్టుమీద పసిరిపాము
లే లే లే . ౭

చింతచెట్టుకింద చీమలపుట్ట
టక్కుటిక్కుటిక్కు. ౮

గువ్వ గూడెక్కె రాజు మేడెక్కె. ౯



# భూమియొక్క ఆకర్షణశక్తి

కీ. శే. శ్రీమన్మహోపాధ్యాయ, కల్లూరి వేంకటరామశాస్త్రిగారు

మామిడిపండు, తాటిపండులోనైనవి చక్కఁగా పండి చెట్టుయొక్క ముచ్చికపట్టు వదలినప్పుడు, అయ్యవి తమంతతామే క్రిందికి వచ్చి నేలపైని నిలిచి యుండుటను మనము చూచుచున్నాము. బంతిమొదలైన వస్తువులు ఎగురవేయఁబడినప్పుడు అవి భూమిపై పునకు వచ్చుట సహజముగా నున్నది. అట్టివస్తువులు ఆకాశమందు నిలుచుటనుగాని, మఱియొకవైపునకుఁ బోవుటను గాని మాని నేలపైపునకే వచ్చుటకు కారణ మేమి యనఁగా మన జ్యోతిశ్శాస్త్రములో నిట్లు వ్రాయఁబడినది.—

"శ్లో. ఆకృష్టశక్తిశ్చ మహీ తయా యత్
ఖస్థం గురు స్వాభిముఖం స్వశక్త్యా,
ఆకృష్యతే త త్పతతీవ భాతి
సమే సమంతా త్క్వపత త్వియం ఖే."

(భాస్కరాచార్యులవారిచే రచింపఁబడిన సిద్ధాంతశిరోమణిగోళాధ్యాయము.)

భూమికి ఆకర్షణశక్తి సహజముగా నున్నది. కావున నట్టిశక్తిచేతను ఆకాశమందలి బరువుపదార్థమును తాను లాగుకొనుచుండఁగా దానిం దెలిసికోలేక లోకులు 'వస్తువు పడుచున్నది' అని స్థూలదృష్టితో వాడుచుండిరనియు, భూమిని ఆకర్షించునట్టి వేఱొక పదార్థము లేనికారణంబున తానుమాత్రము (భూమి) ఏవైపునకు పడకుండ గగనమందే స్థిరమై యున్నది యనియు పైశ్లోకంబునకు నర్థము. ఇట్లు భాస్కరాచార్యులులోనైన మన పూర్వులచేతనే భూమికి ఆకర్షణశక్తి యున్నట్లు స్పష్టముగా చెప్పఁబడినది.

ఇట్లు లుండఁగా సర్ ఐసాక్ న్యూటన్ అనునట్టి యొకానొక యాంగిలేయ దేశపండితుఁడు తన తోఁటలో, ఏపిల్ పండు (Apple) పడినపుడు లేఁ బ్రాయమువాఁడై నను దానికిం గారణము విమర్శించి భూమికి ఆకర్షణశక్తి యున్నదియని సూక్ష్మదృష్టితో గ్రహించినాఁడనియు, అంతకుమును పు దీని నెవ్వరు నెఱుంగరనియుఁ గొందఱు చెప్పుదురు. న్యూటన్‌దొరవారు ౧౬౪౨ క్రీస్తువత్సరంబునఁ బుట్టి ౮౫ సంవత్సరములు జీవించి ౧౭౨౭-వ క్రీస్తువత్సరమున మృతినొందినట్లు తెలియుచున్నది. అనఁగా న్యూటన్ ఇప్పటికి (౧౯౦౫ క్రీ. శ. సం. మునకు) ౨౬౩ సంవత్సరముల క్రిందట పుట్టెను. ఇంకను భాస్కరాచార్యులవారి జననం బన్ననో,

"శ్లో. రసగుణపూర్ణమహీ (౧౦౩౬) సమ
శకనృపసమయే, ఽభవ న్మమోత్పత్తిః,
రసగుణవర్షేణ(౩౬) మయా
సిద్ధాంతశిరోమణీ రచితః."

అన్న శ్లోకంబువలన ౧౦౩౬ శాలివాహనశకవత్సరంబున నైనట్లు స్పష్టమగుచున్నది. మఱియు తనకు ౩౬ వత్సరముల ప్రాయమైన కాలంబున భాస్కరాచార్యులు సిద్ధాంతశిరోమణిగ్రంథమును రచించెననియు తెలియుచున్నయది.

"శ్లో. గతోబ్ధిదిననందై (౮౦౪)ర్మితే శాకకాలే
తిథీశై (౧౧౧౫) ర్భవిష్య త్యథాంగాక్షసూర్యైః
(౧౨౫౬.")

అని అధిమాసాదినిర్ణయప్రకరణంబులోని లుప్తమాసప్రస్తావనలో గణితాధ్యాయమందు భాస్కరాచార్యులవారే తన కాలంబునకు వెనుకను ౮౦౪-వ శకవత్సరంబున ఒకలుప్తమాసము సంభవించెననియు, తిరిగి లుప్త

మాసము ౧౧౧౫-వ శకాబ్దంబున రాఁగలదనియుఁ జెప్పి యందునంగూడ ౧౦౩౬ వ శాలివాహనశకవత్సరంబున లేక ౧౧౧౫-వ క్రీస్తువత్సరంబున భాస్కరాచార్యుల వారి జనన మున్నట్టు స్పష్టమగుచున్నది. పైగ్రంథమును బట్టి చూడఁగా భాస్కరాచార్యులవారు ఇప్పటికి (౧౯౦౫ క్రీ. శ.) ౭౯౦ సంవత్సరములక్రిందట పుట్టి నాఁడని విశదమగుచున్నది. కనుక న్యూటన్‌దొరవారు పుట్టకముందే మన యార్యులు భూమికి ఆకర్షణశక్తి యున్నది యని కమంగొనినట్టు తెల్లమైనది. ౭౯౦ అబ్దంబులకు ముందుపుట్టిన భాస్కరాచార్యులవారు ౨౬౩ సంవత్సరములక్రిందట జనించిన న్యూటనుదొరవారి శాస్త్రంబులవలన భూమికి ఆకర్షణశక్తి యున్నదియని నేర్చుకొని వ్రాయుట తటస్థింపదుగదా! ఒకవేళ భాస్కరాచార్యులవారు తమతర్వాతను ౫౨౭ (౭౯౦-౨౬౩) సంవత్సరములకు పుట్టఁబోవునట్టి న్యూటన్‌దొర వారి మనస్సులోని యంశము దివ్యదృష్టిచేత గ్రహించి లిఖించినాఁడేమో!

---

## శ్రీశ!

'కవిరాజహంస'

క్షీరాబ్ధి దాఁగుటే క్షేమంబుగాఁబోలు నను బాలపాపను దనుపకుండ,
పాముపైఁ దూఁగుటే భద్రంబుగాఁబోలు ననుఁ బాపజాతిని మరుపకుండ,
ఖగముపై నేగుటే సుగమంబుగాఁబోలు నను నీచపక్షిని బనుపకుండ,
ఆకుపై నూఁగుటే యభయంబుగాఁబోలు-ననుఁ జిన్నిపూపను నిముపకుండ,
మిన్నడుగువారి నాఁగుటే మేలువోలు-నన్నడుగువంకఁ దేర్పఁగా నెన్నకుండ,
గుండెసిరి చలికేఁగుట గుట్టువోలు నండఁ గనలేని ననుఁ బ్రోవకుండ శ్రీశ!

కనువిప్పకుండఁగాఁ గాఁపువెట్టితిఁగాని తలఁపులోఁ దిలకింపఁ దప్పనైతి,
చెవిద్రిప్పకుండఁగా సెలవువెట్టితిఁగాని మదిలోన నాలింప మానవైతి,
పల్లెత్తకుండఁగాఁ బట్టఁబట్టితిఁగాని మనసులోఁ బలికింప మఱవనైతి,
కైమోడ్పకుండఁగాఁ గట్టఁ గట్టితిఁగాని యెడఁదలోఁ బూజింప విడువనైతి,
సంతరించిన నామనోభ్రాంతినైన-వెలుపలను లోపలను నీవె కలసిమెలసి
వెలసియున్నావు నీ వన్నట్లు వేయోసర్లుఁ-గని విని నుతించి సేవింతుఁగాక శ్రీశ!

---

# బుద్ధఘోషుఁడు

శరణు రామస్వామిచౌదరిగారు

బౌద్ధవాఙ్మయమున సుప్రసిద్ధసన్యాసులు, మేధావంతులు, మహాపురుషులు పెక్కండ్రు, గలరు. అందు బుద్ధఘోషుఁడుకూడ నొకమహా మేధావి, సుప్రసిద్ధబౌద్ధభిక్షువు. ఇట్టి మహానుభావులు ప్రతి యుగమునను ఏకొలఁదిమందియో యుందురు. ప్రాచీన కాలమున, దంతకథలవలన ఇట్టిమహాపురుషుల జీవిత చరిత్రములు తెలిసెడివి. మహనీయుల జీవితములలో లౌకికవిషయములుకూడఁ దెలిసికొనవలయునని యుత్సహించుట మానవస్వభావము. వాల్మీకికాళిదాసాది మహాకవుల చరిత్రము తెలియఁగఁగోరని భారతీయుఁ డుండునా? భారతదేశమహాఋషులవలె తెలింగియుఁ దమ గొప్పతనమును కప్పిపుచ్చు మనుజుఁడు ప్రపంచమున నే దేశమున నుండఁడు. తా మెఱింగిన ధర్మసూత్రములను, విజ్ఞానరహస్యములను, ప్రపంచమున వెదఁజల్లుటయే వారి కర్తవ్యముగ భావించిరి. మానవసేవయే వారి పరమావధిగ నెంచిరి. వారి జీవితానంతరము వారి నామము ప్రపంచమున నుండుట వారి కిష్టము లేదు. వారు చేసిన పవిత్రసేవయే యీభౌతికప్రపంచమున మిగిలినది. అదియే వారిని చిరస్మరణీయులుగను, కీర్తికాయులుగను జేసినది.

భారతదేశమున పలువురు మహాత్ములవలెనే మన బుద్ధఘోషుఁడుకూడ తనజీవితచరిత మెచ్చటను లిఖించి యుండలేదు. పాశ్చాత్యదేశములందు మహాపురుషుల చరిత్రములు కడుసులభముగ లభించును. మనదేశమున సంపాదించుట బహుకష్టము. బుద్ధఘోషుఁడు పెక్కు సద్గ్రంథములను రచించెను. ఇట్టి గ్రంథరాజములు చూచుటతోడనే శరీరము పులకించును; హృత్కమలము వికసించును; జ్ఞానజ్యోతి ప్రకాశించును. ఈధర్మములు పఠించి, జీర్ణముచేసికొని, ఆచరించిన నిశ్చయముగ మానవుఁడు పాపపంకమునుండి విముక్తుఁడై, జీవితమును సార్థకముచేసికొని ఈశ్వరసాన్నిధ్యముఁ జేరును. ఇట్టి పుణ్యపురుషుల భౌతికశరీరములతోఁ బాటు పవిత్రోపదేశములను విన లేదని మనము కుందుచుండుట సహజము. ఆయనచే రచింపఁబడిన గ్రంథములనుండియే ఆయనజీవిత చారిత్రకాంశములు లభించినవి. ఆయన బౌద్ధగ్రంథములకు వ్రాసిన భాష్యములు పఠించి గ్రహించుట సామాన్యమానవులకు సాధ్యముకాదు. గొప్పగొప్ప పండితులే గ్రహించుటకు కష్టపడెదరు. మన బుద్ధఘోషుని జీవిత చరిత్రము దంతకథలలో బహుస్వల్పముగనే లభించినది. ఈ పవిత్రహృదయుని, పుణ్యపురుషుని చరిత్రము, ఆయనగ్రంథములను సాకల్యముగఁ బరిశీలించి "గ్రే" అను పాశ్చాత్యవిద్వాంసుఁడు "బుద్ధఘోసుప్పత్తి" యను నామమునఁ బుస్తక మొండు ప్రకటించెను.

"మహిన్ద"యను బౌద్ధసన్యాసి భౌతికశరీరమును విడచినతరువాతనే బుద్ధఘోషుఁడు ప్రసిద్ధికెక్కిన బౌద్ధ భిక్షువు. అవతారపురుషుఁడు, లోకపూజ్యుఁడు, ప్రపంచ కల్యాణసంధాయియునైన బుద్ధుఁడు ఏపవిత్రవృక్షచ్ఛాయల జ్ఞానజ్యోతిని పొందెనో, ఆబోధివృక్షమున కనతి దూరమున "ఘోషగ్రామ" మొండు గలదు. ఆకాలమున నందాప్రాంతమున "సంగ్రామఁ" డను క్షత్రియయోధుఁడు రాజ్యముచేయుచుండెను. ఆరాజపురోహితుఁడు సద్బ్రాహ్మణవంశజుఁడగు "కేసి". ఆపురోహితుని సతీమణినామము "కేసిని". బౌద్ధధర్మగ్రంథములు కొన్ని సింహళభాషలో నుండుటచే మన దేశప్రజ లందున్న ధర్మముల నెఱుంగుటకుఁ గష్టపడుచుండిరి. భారతబౌద్ధభిక్షువులలో చాలమంది ఏమహాపురుషుఁడు జన్మించి సింహళభాషయందున్న ధర్మములను దేశభాషయగు మాగధిభాషకు తర్జుమాచేయునాయని నిరీక్షించుచుండిరి. ఇట్లుండ నొకనాఁడు కొందఱు బౌద్ధసన్యాసులు "తవతిన్స" స్వర్గమునందున్న ప్రతిభావంతుఁడైన దేవేంద్రఘోషుఁడను దేవతచెంత కరిగి తమ మనములలోఁగల వ్యాకులతను జెప్పుకొనిరి. వీరి కోరిక నెఱిఁగి ఆమహానుభావుఁడు పాపపంకిలమైన

మర్త్యలోకమున జన్మించిన పలుబాములపాలు కావలసి వచ్చునని చెప్పియు, లోకకల్యాణమునకై ఆ బాధల సహించి బుద్ధభగవానుని ధర్మములను ప్రపంచమున నుపదేశించుటకు సిద్ధముగ నున్నానని సహర్షముగఁ బలికెను. సద్బ్రాహ్మణుఁడగు కేపికి ఒక బౌద్ధసన్న్యాసి 'నీవు ఆత్మశుద్ధి గలవాఁడవై భోగవిలాసములతో నొకవారము దినము లుండుము. నీ కొక మహామేధావియు, లోకపూజ్యుఁడును అగు పుత్రరత్నము జన్మించును' అని చెప్పెను. ఆవిధముననే యాభూసురుఁడు కాలము గడపెను. సరిగ ఏడవదినమున ఘోషదేవుఁడు కేపినీగర్భమునఁ బ్రవేశించెను. ఆమె నిండుచూలాలై పదియవ మాసమున బ్రహ్మతేజ మొప్పు కుమారరత్నమును గనెను. ఆబ్రాహ్మణోత్తముఁ డమందానంద కందళితహృదయుఁడై పుత్రుని జన్మోత్సవము గావించెను. శాస్త్రోక్తముగఁ బండితుల విచారించి బాలునికి ఘోషుఁడని నామకరణము గావించిరి. ఈపుత్రరత్నమును జననీజనకులు గారాబముగ సాకుచుండిరి. బాలుఁడు కడు మేధావి. సప్తవర్షప్రాయముననే నాలుగువేదములు పఠించెను.

బాలుని జనకుఁడగు కేపిపండితుఁడు తన ప్రభువునకు వేదాభ్యాసము చేయుచుండెను. ఒకనాఁడు రాజుదగ్గరకుఁ బాఠముచెప్పుటకు వెడలుచు తన ప్రియసుతునిగూడ వెంటఁ దీసికొనివెళ్లెను. పాఠసమయమున ఒక భాగము చెప్పుట కష్టతరమై యాలోచించి రేపు చెప్పెదనని ప్రభువుకడ సెలవుగైకొని నిజగృహమునకుఁ జనెను. కుమారుఁడు ఈజటిలప్రశ్న గ్రహించి, తండ్రితో గృహమునకుఁ జని ఒకపుస్తకముమీఁద వ్రాసి తండ్రిపుస్తకములకడ నుంచెను. తదుపరి తండ్రి తనకు సందేహము గలిగిన కఠినప్రశ్నకుఁ బ్రత్యుత్తరము అయాచితముగ వచ్చుట లభించుట చూచి ఆశ్చర్యచకితుఁడై 'ఎవరు దీనిని వ్రాసిన'దని ఇంటిలోనివారినందఱ నడిగెను. తన ప్రియసుతుఁడే వ్రాసినదని తెలిసికొని పరమానందభరితుఁడై వానిని దగ్గరకుఁ దీసి పలువిధముల గారవించెను. ఇంతటితోఁ దృప్తిఁజెందక తన రాజుదగ్గరకుఁ గుమారుని దీసికొనివెళ్లి జరిగిన వంతయు విన్నవించెను. చక్రవర్తి బాలుని బుద్ధికుశలతకు ఆనందపరవశుఁడై గాఢాలింగనము గావించుకొని శీర్షమును ముద్దిడి 'బాలుఁడా, నిన్ను నాపుత్రునిగ స్వీకరించెద' ననెను. బాలునికి ఒకగ్రామముగూడ బహూకరించెను.

బాలుఁడు క్రమముగ సమస్తశాస్త్రములు పఠించి తన బుద్ధికుశలతను లోకమునకు వెల్లడిచేసెను. ఈయన దినమునకు ఆరువేలశ్లోకములు కంఠస్థముఁ జేసెడివాఁడు. ఒకనాఁడు కేపిపండితుఁడు తన మిత్రుఁడగు నొక బౌద్ధసన్న్యాసిని భిక్షకు పిలచెను. భోజనసమయమున ఆసన్న్యాసిని మామూలుగఁ దనపుత్రుఁడు కూరుచుండు ఆసనమున కూర్చుండఁజేసెను. కుమారుఁ డిదిచూచి క్రుద్ధుఁడాయెను. 'నేను గొప్ప వేదాధ్యయనతత్పరుఁడను. ఈ సామాన్యమానవుని నా యాసనమున ఎఱింగియుఁ నాజనకుఁ డెందులకుఁ గూర్చుండఁజేసెను?' అని మనమున చింతిలుచు అతిథిని దూలనాడెను. 'ఈయనపాండిత్యము భోజనానంతరము పరీక్షించిచూచెద' నని మనమునఁ దలఁచెను. భోజనానంతరము ఆసన్న్యాసిని 'నీకు వేదజ్ఞానముగాని లేక అన్యమతజ్ఞానముకాని కలదా?' అని ప్రశ్నించెను. ఆభిక్షువు సహర్షముగ 'వేదములు, అన్యమతగ్రంథములు కూడ చూచితి' నని ప్రత్యుత్తర మొసఁగెను. ఘోషుఁ డాపండితుని వేదములు వినుపింపఁ గోరెను. ఆయన నాలుగువేదములు ఆమూలాగ్రముగ, అనర్గళధారగా వినుపించుచు అచ్చటచ్చటఁ గల కఠినభాగములకు వ్యాఖ్యానముఁగూడ గావించెను. ఈయన అసమానవేదపాండితీ ప్రకర్ష కాశ్చర్యచకితుఁడై 'మహాత్మా! తమ మతగ్రంథములలోఁగూడఁ గొన్ని భాగములు విన మనము ముత్సహించుచున్నది. దయతో వినిపించెదరా?' యని ప్రార్థించెను. దాని కాపండితుఁడుగూడ సంతసమునఁ దమ ఉత్తమమతగ్రంథములగు అభిదమ్మ, కుశలదమ్మ, అకుశలదమ్మ, అవ్యాకతదమ్మ మొదలగు గ్రంథములలోని కొన్నిభాగములు వినుపించెను. ఈమతధర్మముల ప్రభావమును, మాహాత్మ్యములను విని ఘోషుఁడు ముగ్ధుఁడాయెను. మతస్థాపకుఁడగు బుద్ధభగవానుని లీలలు గానముచేసి పరవశుఁడై ఇహలోకమును మఱచెను. 'మహాత్మా! మీమతము పవిత్రమైనది. మీరు ధన్యులరు.

మీమతస్థాపకుని నామము ప్రపంచమున సువర్ణాక్షరములతో దేదీప్యమానముగఁ బ్రకాశించును. మీప్రభావము నెఱుఁగక మీయెడ నేఁ జేసిన యపకృతిని మఱచి క్షమించుఁడు. ఈయనాథుని రక్షింపుఁడు. ఇదే నా ప్రార్థన' యని పలువిధములఁ బ్రార్థించెను. ఆపండితుఁడు వదనమున దరహాస మెలరఁగ 'నీబోఁటి బాలుఁడు ఎఱుఁగక చేసినవానికి క్షమాపణ అక్కఱలేదు. లెమ్ము!' అని బుజ్జగించెను. ఘోషుఁడు 'మీమతము ఎవరైనను స్వీకరించుటకు వీలగునా?' యని ఆసన్యాసి నడిగెను. అందు కాయన 'గృహస్థులకు వీలు లేదు. సన్యాసులు మాత్రమే స్వీకరించుట కర్హు'లని జవాబొసంగెను. ఈబాలుఁ డప్పుడు తన జననీజనకులచెంత కరిగి, 'మానవులు బుద్ధభగవానుని మత మవలంబించినఁ బ్రపంచమునఁ గల సర్వదుఃఖములను పోఁగొట్టుకొని ముక్తి జెందెదరు. కాన నేను నామతమున సన్యాసాశ్రమము స్వీకరింపఁగోరెద. సెలవిండు' అని వేఁడెను. వా రందులకు సమ్మతింప లేదు. 'తమ మిత్రుఁడగు ఈభిక్షువుదగ్గఱ బౌద్ధధర్మముల నధ్యయనముచేసి మరల గృహస్థాశ్రమమును స్వీకరించెదను. అనుజ్ఞ నిండు' అని తలిదండ్రులఁ బ్రార్థించెను. వారందుల కియ్యకొని తమ పుత్రునికి విద్యాదానముఁ జేయ ఆసన్యాసిని ప్రార్థించిరి. ఆ సన్యాసి సంతసముగ బాలుని శిష్యునిగ స్వీకరించెను.

కుశాగ్రబుద్ధియగు ఈబాలునికి అనతికాలముననే బౌద్ధధర్మగ్రంథము లన్నియు సాంగోపాంగముగ బోధించెను. ఈమతగ్రంథరాజము లన్నియుఁ బఠించినతరువాత వేదములు వీనితో సరిపోవునాయను సందేహ మాబాలునికి జనించెను. బౌద్ధమతగ్రంథములు చదువుటతోనే తృప్తినొందక ఈపుణ్యపురుషుఁడు మతప్రచారము జంబూద్వీపమునం దంతటను గావించి ధన్యుఁడాయెను. అన్నిచోట్లను విపక్షులను శాస్త్రార్థమున ఓడించెను. ఈయన సంచారముచేయుచు నొకనా రొక బౌద్ధాశ్రమమునకు వచ్చెను. అచ్చట వేలకొలఁది బౌద్ధసన్యాసు లుండిరి. వారి గురువు "రేవతుఁ" డను పరివ్రాజకుఁడు. శాస్త్రార్థమున ఈయనతో నెగ్గువా రరుదు. ఒకనాఁడు ఘోషుఁడు కొన్ని మంత్రము లుచ్చరించుచుండెను. రేవతుఁడు విని 'అపస్వరముగఁ బల్కుచుంటి వేల' యని మందలించెను. తన పర్యటనమున శాస్త్రార్థచర్చలో ఓటమి నెఱుంగని ఈబాలునికి కోపమువచ్చి 'అపస్వరము గా'దని వాదించి, తన పాండిత్యమును వెల్లడింప, ఆయనను బలుప్రశ్న లడిగెను. రేవతుఁ డన్నిటికి వెంటవెంటనే ప్రత్యుత్తరము లొసఁగెను. పిమ్మట నాపండితోత్తముం డాఘోషుని, 'నీవు చాల ప్రశ్న లడిగితివి. నే నొక ప్రశ్న నడిగెద చెప్పెదవా?' అని అడిగెను. 'నీప్రశ్నకు జవాబొసఁగుట ఒకలెక్కయా' అని అతఁడనెను. రేవతుఁ డపుడు చిత్తయమక (చిత్తముయొక్క అధ్యాయ) మునం దొక ప్రశ్న నడిగెను. ఎంతసేపాలోచించినను ప్రత్యుత్తర మొసంగఁజాలక తన యసమగ్రజ్ఞానమును గ్రహించి, 'నన్ను తమ శిష్యసంఘమునందుఁ జేర్చుకొనుఁ'డని ఆపండితుని ప్రార్థించెను. ఆయన సంతసమున స్వీకరించి సహజమేధావియగు నీబాలుని నసమానపండితునిగఁ జేసి, బౌద్ధధర్మపండితోత్తముఁడగు వీనికి బుద్ధఘోషుఁడని నామ మిడెను.

ఒకనాఁడు బుద్ధఘోషుఁడు ఏకాంతముగఁ గూర్చుండి 'పాండిత్యమున నే నెక్కువా? నాగురువా?' అని ఆలోచించుచుండెను. సూక్ష్మగ్రాహియగు ఆగురు వది గ్రహించి, 'శిష్యా, ఇట్టి యాలోచనలు చేసిన పాపకూపమునఁ బడెదు' వని మందలించెను. అతఁడు తన తప్పును తెలిసికొని క్షమింప గురువును వేఁడెను. గురువు 'క్షమించితిని. నీవు సింహళమునకుఁ జని అచ్చట భాష నభ్యసించి అందున్న ఉత్తమబౌద్ధధర్మగ్రంథముల మాగధిభాషయందు వ్రాసి ప్రజల కుపకారముచేయు' మని యాజ్ఞాపించెను. ఆయాజ్ఞ పాలించుట కొప్పుకొని తండ్రిని బౌద్ధమతమునందుఁ జేర్చుటకు ఈదేశమున నుండుట కనుజ్ఞ వేఁడెను. దానికి గురు వంగీకరించెను. బుద్ధఘోషుఁడు తన గృహమునకు వచ్చెను. తండ్రి మిథ్యావాది. కుమారుని 'గృహస్థాశ్రమ మెపుడు స్వీకరించెద'వని యడుగుచుండెను. 'ఆలోచించుచున్నా'నని కుమారుఁడు జవా బొసంగుచుండెను. కాని నిరంతరము తండ్రి నెట్లు బౌద్ధమతావలంబకుని జేయుదు నాయను నాలోచనానిమగ్నుఁ డగుచుండెను. తన పాండిత్యప్రభావమువలన బౌద్ధ

ధర్మమహిమలను దండ్రికి చక్కఁ జెప్పి బౌద్ధమతమును స్వీకరింపఁజేసెను. పిమ్మట తండ్రి ఎన్నఁడును కుమారుని గృహస్థాశ్రమమును స్వీకరింపుమని అడుగలేదు. కుమారుని ప్రతిభకు సంతసించి తన జన్మము సార్థకమైనటుల భావించి తృప్తిఁజెందెను. తరువరి బుద్ధఘోషుఁడు తన గురువు నాజ్ఞ దండ్రి కెఱుకపఱచి సెలవుగైకొని సింహళద్వీపమునకు వెళ్లి అచ్చట భాష నభ్యసించి, అందున్న ఉత్తమ బౌద్ధధర్మగ్రంథము లనతికాలముననే దేశభాషయగు మాగధియందు రచించి, తన జన్మమును సార్థకముచేసికొని, బౌద్ధసాహిత్యమునఁ దన నామము చిరస్థాయిగఁ జేసికొని ధన్యచరితుఁ డాయెను.

---

## వరికుంచె-రామచిలుక

ఉప్పులూరి సీతారామస్వామిగారు, బి. యల్.

వెదకివచ్చితి విట కేల వెఱ్ఱిచిలుక
దాతలెందరో పురమున దనరుచుండ
లోభమేలనె వరికుంచెలోనిగింజ
వాడియగు నీదుముక్కుకు వాంఛితంబె.

నన్నగిల లేదుగాని వసంతశోభ
ఫలభరమ్మున వృక్షముల్ పైకితలల
నెంకనుంజూడు మెత్తలేదిపుడుగూడ
కాకినిను గింజ కాసించగల మదేమొ.

బుతుఫలంబుల వెన్నియో మతియెలేదు
కంఠశోషమ్ము లెంతయో కమ్మదనము
చేతనింపిన నేలనే చిలుకనీవు
వడ్లగింజకు నింతగా వాంఛనిడితి.

మందబుద్ధులు దెలియరు మర్మమిందు
యహహా, దెలిసెను నీవిట కరుగుకతము
నీదునామమ్ముతో మమ్ము నేర్పుతోడ
రామ్ముదలపంగ నెంచితో రామచిలుక.

రామనామంబు నాల్కపై రహిచెలంగ
పాపపుంజంబులన్నియు బారిపోవు
సుగుణపుంజము నివసించు సుస్థిరముగ
ననుచు దెలుపంగ వచ్చితివమ్మ చిలుక!

---

# ఆత్మానురాగము

సూరి రామసుబ్బరాయశాస్త్రిగారు

"ఆత్మవత్సర్వభూతాని యః పశ్యతి సపశ్యతి"

సర్వభూతముల నాత్మవలెఁ జూచువాఁడే నిజముగాఁ జూచుచున్నాఁడు. సర్వభూతముల నాత్మవలెఁ జూచుటయనఁ దనయందుఁ గల మమకారమును సర్వభూతములందును జూపుటయని భావము. "ఆత్మన్" శబ్దమునకుఁ "బరమాత్మ, జీవాత్మ, బుద్ధి, తాను" అను భిన్నార్థములు సందర్భానుసారముగ స్వీకరింపఁబడు చున్నవి, వీని పరమార్థమునందుఁ "బరమాత్మ" యను నర్థమే సిద్ధించును. తదితరము లన్నియు నేతదంతర్భూతములగును. జ్ఞానసంపన్నుఁడు తనయందుఁ బరమాత్మను గనుఁగొనుచున్నాఁడు. పరమాత్మ సర్వవ్యాపి యగుటచేఁ దనయందుఁ జూచు పరమాత్మను సర్వభూతములందుఁ జూచుచు స్వపరభేదభావశూన్యుఁడై మెలఁగుచున్నాఁడు. ఇదియే "తనయందు నిఖిలభూతములందు నేకభంగి-సమహితత్వంబున జరుపువాఁడు" అని చెప్పఁబడినది. కావున సర్వసమత్వభావము గలిగి భూతదయాపరత మెలఁగుటయే "ఆత్మవద్దృష్టి" యనఁబడుచున్నది.

సృష్టియందు జీవులకుఁ బరస్పరానురాగము ప్రకృతిసిద్ధమైయున్నది. "సఖ్యం సాప్తపదీనం" అను వాక్యమిందులకు నిదర్శనము. సప్తపదమితకాలమున నన్యోన్యసఖ్య మేర్పడుననుటచేఁ బరస్పరసఖ్యమేర్పడుట కత్యల్పకాలమే చాలునని యర్థము. ఇట్టి సఖ్యము లేకుండినను నొకజీవి పొందుచుండు కష్టముఁ జూచి యింకొకజీవి సహింపఁజాలదు. ఇందుల కేమి కారణము? సర్వభూతాంతర్వర్తియగు నాత్మ యొక్కఁడగుటయే. కావున నన్యజీవహింస యనఁగ నాత్మహింసయే యగును. ఆత్మహత్యకంటె వేరొండు మహత్తరదోషము లేకుండుటచే "అహింసా పరమో ధర్మః" అని చెప్పఁబడినది. భూతదయను నిర్దేశించు నహింసాశబ్దమునకు నాత్మానురాగమనియే యర్థము. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి" ఇత్యాదిశ్రుతివాక్యములు నిట్లే సమన్వయింపఁదగియున్నవి.

పరమహింసకులగు కిరాతాదులుసహితము స్వజనమునం దనురాగముఁ జూపుట లేదా? కాని వారియందుఁ బ్రబలములైన రజస్తమస్సులు క్రూరకర్మాచరణముఁ బ్రేరణచేసి సత్త్వరూపమగు ననురాగమును గప్పిపుచ్చుచున్నవి. అట్లు ప్రబలములగు రజస్తమములు బహుసత్త్వోపకరణములచే నడఁగింపఁదగియున్నవి. మనుజుఁడు భుజించుపదార్థము సప్తధాతుపరిణామమును బొంది తుదకు శుక్రమగుచున్నది. ఇదియే బుద్ధియునగును. కావున మానవుఁడు గ్రహించుపదార్థములయొక్క సత్త్వరజస్తమోగుణాధిక్యముఁబట్టి వాని బుద్ధియందును దద్గుణాధిక్యము గల్గుచున్నది. కావుననే "తస్మాత్సర్వప్రయత్నేన శుక్రమగ్నించ రక్షయేత్" సర్వప్రయత్నములచే శుక్రాగ్నుల రక్షింపవలయుననుచు నాహారాదినియమము చేయఁబడినది. శుక్రమును రక్షించుట యన బుద్ధి సత్త్వప్రధానమగునట్లుఁ దగు నాహారము గ్రహించుట. అగ్నిరక్షణ మన, మితభోజనాదికముచే జఠరము దీప్తివంత మగునటుల చేయుట. ఈ శుక్రాగ్నులందును శుక్రమునకే ప్రాధాన్యమీయఁబడినది. ఇదియే గుణకర్మవిభాగము నగుచున్నది. కావున రజస్తమముల నణఁచు సత్త్వగుణసంపాదనమునకై సర్వదాయత్నించుటసత్పురుషునికిఁ గర్తవ్యమైయున్నది. శుద్ధసత్త్వాత్మకంబగు నాత్మజ్ఞానముచే నాముష్మిక సుఖము లభించునని చెప్పఁబడుచుండఁ దత్సహాయంబగు నిహమునందు సర్వకార్యసాధనమగు ననుటకు సంశయంబు లేదు. శత్రువశీకరణమునందిది మహామన్య మంత్రము. కాని శత్రుఁ డెంతతె బోధకుఁడైన దన్నివారణమున నంతకాలప్రయాసము లధికములగును. మహాత్ముఁడగు గాంధి యీ యాత్మతత్త్వమునే మూలముగా గ్రహించెను. సత్యకార్యాచరణదీక్షయందు సత్త్వప్రధానమగు నహింసా

ప్రతము సర్వదా సహాయకారియైయుండును. కాని భగవంతుఁడు సహితము భక్తుల నెన్నివిధములఁ బరిశీలించును? భారతీయుల యహింసాతత్త్వ మెంత ప్రబలమైనదియుఁ బ్రపంచమునం దంతటను బ్రచురము కాఁదగియున్నది.

మనుజుఁడు పుత్రమిత్రాదులఁ బ్రేమచే నాలింగనముచేసికొనుచున్నాఁడు. ఈ యాలింగనమునకును బ్రేమమునకును నెట్టిసంబంధము కలదు? — "సయ ఏషోఽన్తర్హృదయ ఆకాశః, తస్మిన్నయం పురుషో మనోమయః, అమృతో హిరణ్మయః" — హృదయాంతరాళమున నున్న యాకాశమునందు మనోమయపురుషుఁడు కలఁడని శ్రుతిప్రమాణము. నరములకుఁ గేంద్రము (Nervous Centre) శిరస్సయినను ధీస్థానముమాత్రము హృదయమే యగును. కావున హృదయమే యాత్మస్థాన మగుచున్నది. మానవుఁడు తాఁ బ్రేమించిన పుత్రమిత్రాదులకును దనకును నభేదమును భావించుచున్నాఁడు. తద్వియోగమును సహింపఁజాలక సర్వదా సాన్నిధ్యమును గోరుచున్నాఁడు. ఇంతటితోఁ జాలక ప్రేమాతిశయముచే నాలింగనముచేసికొనుచున్నాఁడు. అభిన్నములుగ భావించు వారి యాత్మలైక్యము కాఁ గోరుటచే పునఃపునఃపరిష్వంగముల నపేక్షించుచున్నాఁడు. భౌతికశరీరములు హృదయాంతరాళస్థములగు నాత్మలకు సన్నిహితత్వము కలుగకుండఁ జేయుటచే నెన్నిసారులు కౌఁగిలించుకొనినను తనివి నొందకున్నాఁడు. ఇట్లు కేవల దారాసుతాదులందుఁ గల్గుప్రేమము మోహమనఁబడుచున్నది. సర్వభూతములందు నిట్టిప్రేమమును జూపువాఁడే జ్ఞానియనఁబడును. తదన్యుఁ డజ్ఞాని యగును. ఇక్కారణముననే యన్యులగు స్త్రీపురుషులు పరస్పర సహాయాపేక్షచే నేకకార్యాచరణమునందుఁ గలసి మెలసి వర్తించుట మొదలగు విధానము శాస్త్రమున నిషేధింపఁబడుచున్నది.

---

## కలలు

అడివి బాపిరాజుగారు, బి. ఏ., బి. యల్.

౧

ఎవరికోసం మేలుకొలుపులు పాడుకొందూ
ఎవరికోసం బొమ్మలన్నీ పులుముకొందూ,
ఎవరికోసం లేపితలపుల తేలిపోదూ,
ఎవరికోసం, ఎవరికోసం?

౨

ఎవరో నాహృదయాన్ని తలుపులు తట్టినారు;
ఎవరో నాచూపుల్లో మమతలు పాడుకొనిరి;
ఎవరో నాకంఠాన రాగం తీవలెత్తిరి;
ఎవరో, ఎవరో, ఎవ్వరో!!

౩

ఇరువురము లేకుండ తలుపులు తీయరంటా!
ఇరువురము రాకుండ దీపిక లెత్తరంటా!
ఇరువురము పూజల్లు చేయక
చూడబడదట దివ్యపీఠం!

౪

నువ్వు నాచేబట్టి నడిచిన నన్ను నేనే విడువ
చేసితి
నీపలుకుతో పాటల్లు పాడితి చుక్కకాంతులె
శ్రుతులుపోయే!
నవ్వులో నీనవ్వుకలుపుచు నాట్యమైతిని లోనె
లోనె!!

---

చెన్నరాజధానియందు ౧౯౩౯-వ సంవత్సరము అక్టోబరు ప్రారంభము మొదలు డిసంబరు తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

అపక్వశాకాహారాద్వయితసిద్ధాంతము — బి. సుందర గోపాలరావు.

దేహము-ఆరోగ్యము—జి. సోమన్న.

మానవశరీరశాస్త్రము, పాఠశాల ఆరోగ్యము—జి. వెంకటానందం.

## కథలు—ఐతిహాసికములు, పౌరాణికములు

కర్ణుడు—దేవరాజసుధి.

ధర్మరాజాశ్వమేధము—పి. విశ్వేశ్వరశాస్త్రి.

భాగవత కథావళి—పి. యోగానందకవి.

విశ్వామిత్రచరిత్రము—పి. శ్రీరాములురెడ్డి.

సంగీతభక్తప్రహ్లాద—యస్. బసివిరెడ్డి.

సప్తర్షులు—సి. మాణిక్యశర్మ.

సుచరిత్ర, భా. ౧, ౨—కె. విశాలాక్షమ్మ.

## —కల్పితములు

కథాకల్పవల్లి—కె. నారాయణమూర్తి.

తెనాలిరామలింగనికథలు—డి. యస్. రావు.

దశకుమారచరిత్రము—యస్. లక్ష్మీపతిశాస్త్రి.

## —చారిత్రకములు

ఆంధ్రరాజులు—కె. భావయ్య.

భాసనాటకకథలు, భా. ౨—యం. సూర్యనారాయణ శాస్త్రి.

## కల్పము

విఘ్నేశ్వరపూజావిధానము—(ప్ర) యస్. వేణుగోపాలమొదలి, మదరాసు.

## కావ్యములు

శ్రీమద్వాల్మీకి రామాయణమ్, (సటీ) భా. ౧, ౨, ౩, ౪—(ప్ర) జి. కృష్ణమూర్తిశర్మ, మదరాసు.

## గణితశాస్త్రము

గణితశాస్త్రము—వి. శ్రీనివాసాచారి.

నానాగణితసాధకము, భా. ౧, ౨—యం. రామయ్య.

సులభగణితము—జి. లక్ష్మీపతి.

సూత్రగణిత ముక్తావళి—యస్. చిరంజీవులు.

## గేయములు

ఆనందకృష్ణచర్యలు—ఎ. సుబ్బరావు.

కీర్తనలు, భా. ౧—యస్. ప్రకాశదాసు.

కీర్తనలు, భా. ౧—సి. రంగనాయకమ్మ.

జ్ఞానసుందర కైవల్యము—వెంకటలక్ష్మమ్మ

నల, హరిశ్చంద్ర, సావిత్రీ, అనసూయ చరిత్రకీర్తనలు—కె. వెంకటరామయ్య.

బ్రహ్మజ్ఞాన తత్వకందార్థములు—జి. రాఘవయ్య.

బాణాసురయుద్ధము అను ఉషా కల్యాణము—యస్. రామయోగికవి.

భగవద్గీతా వేల్పుమాట—ఎ. నారాయణదాసు.

శ్రీ భక్తజనానంద రామాయణము—బి. పల్లయ్యదాసు.

శ్రీ రామాయణకీర్తనలు—యస్. ఎ. నరసింహాచారి.

సత్యజ్ఞానానంద సీసార్థదరవులు—కె. వెంకయ్య.

స్త్రీలపాటలు—ఆర్. కామేశ్వరరావు.

హరిభజనకీర్తనలు—సి. వీరభద్రుడు.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ.—అధ్యాయము. అను.—అనువాదము, అనువాదకులు. ప.—పద్యము. ప్ర.—ప్రకాశకులు. భా.—భాగము. వ.—వచనము. సం.—సంపాదకులు. సటీ.—సటీకము

### చరిత్ర

హిందూదేశచరిత్ర, తరగతి ౫—ఆర్. శేషగిరిరావు, పి. అప్పరావు.

### జీవితములు

తెనాలిరామకృష్ణచరిత్రము—యం. పెదశేషగిరిరావు.
నెపోలియను బోనోపార్టీ జీవితము, భా. ౧—జె. వెంకటజగన్నాథరావు.
సార్వభౌములు—క. భామమూర్తి.

### జ్యోతిషశాస్త్రము

గ్రహతంత్రము—ఆర్. వి. గోపాలరావు.
గ్రహస్ఫుటగణిత స్వబోధిని—వరరుచి.
జ్యోతిషశాస్త్ర సంగ్రహము—వి. రామమూర్తి.
ముహూర్తఫల సర్వస్వము—పి. వెంకటసుబ్బరావు.
శ్రీరామునిజాతకము—పి. సాంబమూర్తి, వి. లక్ష్మీనరసింహం.

### దండకము

దశావతారదండకము—క. శేషాచారి.

### నవలలు

కాలసర్పము—ఎ. సోమేశ్వరరావు.
కొండపల్లి ముట్టడి—శేషాద్రిరమణకవులు.
చంపకమాలిని—ఎ. రాజమ్మ.
ఛిన్నహస్తము, భా. ౧—(ప్ర) పి. లక్ష్మణస్వామినాయుడు, రాజమహేంద్రవరము.
ధర్మపాలుడు, భా. ౨—వి. సత్యనారాయణశాస్త్రి.
నీలవేణి—యం. శ్రీరామచంద్రమూర్తి.
నీలాపనింద—డి. వెంకటశివరావు.
పతితపలిని—పి. రామచంద్రరావు.
మాయామయి, భా. ౩—క. రంగయ్య.
విమలానందము—వి. లలితాంబ.
విషాదసంసారము—ఎ. తిరిణయ్యసిద్ధాంతి.
విహంగవిజయము—జి. టి. కృష్ణశాస్త్రి.

### నాటకములు

కాటమరాజు—పి. సుబ్బరావు.
దానబలి—డి. సీతారామరాజు.
పెద్దాపురము ముట్టడి—బి. పట్టాభిరామయ్య.
మయూరధ్వజ నాటకము—క. అశ్వత్థరావు.
మల్లికామారుత ప్రకరణము, అం. ౧ - ౬—వడ్డాది సుబ్బారాయడు.
రామదాసు—బి. నారాయణరావు.
లంకాదహనము—ఎ. శేషగిరిరావు.
వాల్మీకి—క. గోపాలరావు.
శ్రీకృష్ణలీలలు—వి. సత్యనారాయణమూర్తి.
శ్రీరామ పట్టాభిషేకనాటకము—పి. సుబ్రహ్మణ్యకవి.
సావిత్రీనాటకము—యస్. సచ్చిదానందశాస్త్రి.

### నీతి

మహాభారతనీతికథాసంగ్రహము—పి. చిదంబరశాస్త్రి.
సుజ్ఞానబోధిని, భా. ౧, ౨, ౩—పి. శ్రీరాములురెడ్డి.

### పరిశిష్టము

అధ్యక్షుకోపన్యాసము—డి. కృష్ణమూర్తి.
అవధానముక్తకము—బి. వి. భగవద్రామానుజాచారి.
ఆండాళ్ తిరుకల్యాణము—యస్. కూరత్తాళ్వార్ అయ్యంగారు.
ఆంధ్రవాచకబోధిని, తరగతి ౪—క. నారాయణమూర్తి.
ఆంధ్రవాచకము, ఫారము ౪—యం. రామరావు.
కమలావాచకములు, తరగతులు ౨, ౩, ౪, ౫— యస్. కామేశ్వరరావు.
కాఫీకల్లుసంవాదము—టి. యస్. రామస్వామిఅయ్యంగారు.
కోరుట్లకళాశాలాభ్యుదయము—యస్. కృష్ణశతావధాని.
క్రీడాభిరామము—వల్లభామాత్యుడు.
గోరక్షణధర్మప్రకటన—(ప్ర) యం. మహానందయ్య, నంద్యాల.
గృహలక్ష్మీమోక్షమార్గము—యస్. పార్వతమ్మ.

జయచంద్ర చంద్రశేఖావిజయము—బి. కోటీశ్వరరావు.
జయశాలకోరువుట్ల శతావధానములు—యస్. కృష్ణమాచారి.
జనార్దనస్మృతిగీతావళి—పి. వెంకటరామరెడ్డి.
జన్మనిగ్రహపద్ధతులు — (ప్ర) నియోమాల్ తూపియస్ లీగ్, మదరాసు.
పంచతంత్రసంగ్రహటిప్పణము—యమ్. లక్ష్మీనరసింహం.
పారిశుద్ధ్యము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
పురాణపాఠములు, తరగతి ౧—యం. సూర్యనారాయణశాస్త్రి.
పెద్దబాలశిక్ష—(ప్ర) యస్. వేణుగోపాలమొదలి, మదరాసు.
ప్రణయసారథము—కె. గోపాలరావు, హెచ్. రామలింగశాస్త్రి.
ప్రపంచవంచకుల మోసములు—సి. పిచ్చయ్యశాస్త్రి.
మతిపంచపదీపిక—యస్. మునిసామి ముదలియార్, మదరాసు.
మలయాళసద్గురుస్మరణామృతము—యస్. వరదదాసు.
మాత్రారాధన—వి. వాసుదేవశాస్త్రి, వి. అద్వైతబ్రహ్మశాస్త్రి.
మానసరాజహంసము—ఏ. సోమకవి.
మూడవతరగతి క్రొత్త తెలుగువాచకపుస్తకము—యస్. భూషణం.
యాత్రికుని ప్రయాణము—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
రామావాచకములు, తరగతులు ౬, ౭, ౮—జి. దామోదర మొదలియారు, పి. యస్. రామశర్మ.
రీసెటిల్ మెంటును గూర్చిన ఉపన్యాసము—యస్. జగ్గరాజు.
లోకాభిరామాయణము—ఐ. సత్యనారాయణవర్మ.
వధూవరుల ఆత్మహత్య—బి. కోటీశ్వరరావు.
వ్యాసమంజరి—జె. మృత్యుంజయాచారి.
సివిక్సుపాఠములు, తరగతులు ౨, ౪, ౫—బి. లక్ష్మీనారాయణశాస్త్రి.

## ప్రకృతిశాస్త్రము

సృష్టిపరిశీలనావాచకములు, తరగతులు ౧, ౨, ౩—చ. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ.

## ప్రబంధము

రసికజనమనోభిరామము—కె. తిమ్మకవి.

## ప్రహసనము

ట్రయినింగు ప్రహసనము—డి. రామమూర్తి.

## భూగోళశాస్త్రము

కర్నూలుజిల్లా జాగ్రఫీ—యస్. లక్ష్మీనరసయ్య.
భూగోళవాచకము, పు. ౧—డి. సత్యనారాయణమూర్తి.
నరసాపురముతాలూకా భూగోళము, తరగతి ౩—బి. కృష్ణమూర్తి.
నెల్లూరుజిల్లా భూగోళము, తరగతి ౪—సి. యోగానందకవి.
విశాఖపట్టణముజిల్లా భూగోళము—యం. సత్యనారాయణ.

## మతము—హిందు

ఆర్షాచారవిచారిణి—థ. అప్పలాచారి.
దేవునిగురించి మంచిమాటలు, పురుషసూక్తము—సి. జి. జయరామఅయ్యర్.
భస్మధారణవైభవము—యం. వీరరాఘవశాస్త్రి.
వివాహతంత్రము—ఆర్. వి. గోపాలరావు.

## —ఇతరములు

కుష్ఠరోగుల మిత్రుడు— (ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.
జ్ఞానామృతము—పెత్రూస్ రోకిలస్.
పరిచారకుడైనయేసు—(రెవ) జాన్ డి. మిసెస్ కెన్స్.
పరుగెత్తెరోస్టై—(ప్ర) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

పెద్దజ్ఞానసంక్షేపము— జె. ఆలన్.
పేరాసగల రాముడు—(ప్ర) క్రిస్టియన్ లిటరేచరు సొసైటి, మదరాసు.
ప్రశ్నోత్తరప్రకాశిక—యం. జేండ్.
మాదిరిచొప్పన— జె. వెబ్.
వేదశాస్త్రవివరణ— జె. ఆలన్.

## మాహాత్మ్యము

శ్రీపాణికేశ్వరమహాత్మ్యము—ఆర్. శేషగిరిరావు.

## మీమాంసాశాస్త్రము

ఆంధ్రమీమాంసార్థసారము—కె. గోపాలకృష్ణమ్మ.

## రాజకీయములు

ఆంధ్రవీరప్రబోధము—యస్. వరదదాసు.
స్వరాజ్యఢంకా—యస్. వరదదాసు.

## విమర్శనము

శ్రీ మహాభారతచరిత్ర నిరాకరణము—యస్. కృష్ణమూర్తిశాస్త్రి.

## వేదాంతశాస్త్రము

పరతత్వకావ్యము—అల్లిసాహెబు, బి. శివప్ప.
శ్రీశుష్క వేదాంతతమోభాస్కరము—శ్రీ మళయాళస్వామి.
సుప్రబోధం—శ్రీ మలయాలస్వామి.

## వైద్యశాస్త్రము

అనుభవచికిత్సాదర్పణము—వి. యల్. మునయ్య.
ఆయుద—టి. సీతాపతిరావు.
జ్వరము—(ప్ర) క్రిస్టియన్‌లిటరేచర్ సొసైటి,మద్రాసు.
ప్రసవములలో ప్రథమసహాయము—యు. రామరావు.
బృహద్వైద్యరత్నాకరము—పండిత వెంకటాచార్య.

## వ్యాకరణశాస్త్రము

తెలుగువ్యాకరణసంగ్రహము—కె. రంగయ్య.
తెలుగువ్యాకరణ సంగ్రహము—యస్. యం. శేషయ్య.

## వ్యాపారము

భారతదేశీయ వ్యాపార శుల్క విధానసమస్య—డి. లక్ష్మీనరసింహం.

## శతకములు

మురారీశతకము—వి. శ్రీనివాసరావు.
వైశ్యసేవాసదనశతకము—డి. వెంకటస్వామిగుప్త.
శ్రీ దీక్షితశతకము—యం. నరసింహశర్మ.
శ్రీ రామలింగేశ్వర శతకము—కె. సదాశివయ్య.
శ్రీ సంతాన వేణుగోపాలశతకము — వి. వెంకటరమణయ్య.
శ్రీ సోమేశ్వర శతకము—బి. నాసలయ్య.

## సాంఘికము

పురాతన సాంఘికపరిస్థితులు—కె. రంగాచారి.

## సారస్వతము

శ్రీ నాథవైభవము—యం. లక్ష్మీనరసింహశర్మ.

## స్తోత్రము

శివకేశవస్తోత్రమాల—యస్. వెంకటఅప్పారావు.

## హరికథలు

భీష్మచరిత్రము—ఎ. నారాయణదాసు.
మార్కండేయచరిత్రము—ఎ. నారాయణదాసు.
హరిశ్చంద్రోపాఖ్యానము—ఎ. నారాయణదాసు.

---



కన్యాకుమారి

(స్నానఘట్టము, కుమార్యాలయము)

ఛాయాచిత్రకారుడు: యం. కె. రంగస్వామి అయ్యంగారు.



జనార్దన దేవాలయము

(వరకల)

ఛాయాచిత్రకారుడు: యం. కె. రంగస్వామి అయ్యంగారు



౧. గోపాలస్వామ్యాలయ గోపురము, గోపాలపురము
(పండరిపురమువద్ద)



౨. గోపాలస్వామ్యాలయము, గోపాలపురము
ఛాయాచిత్రికారుడు: ఎ. దామోదరంగారు.

# బ్రహ్మ యుగవర్ణనము

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు

జనమేజయుండు వైశంపాయనున కిట్లనియె.—

పరమమునీంద్ర! నీకరుణఁ బంకజనాభమహాత్త్వతత్త్వసం
భరితము నద్భుతంబు నగు పౌష్కరసర్గ మెఱింగితిఁ సవి
స్తరముగ సాంఖ్యయోగముల తత్త్వము తేటపడంగ వ్యాసవా
క్పరిచితమైన బ్రహ్మయుగవర్ణన మింక ననుగ్రహింపుమీ.

అనుటయు మౌని యిట్లనె ధరాధిప! సుస్థిరచిత్తవృత్తివై
వినుము త్రికాలసత్యము నవేద్య మచింత్య మనామరూపవ
ర్తనము నఖండమైన పరతత్త్వ మొకండు సదాత్మకంబు తాఁ
దనకు నిమిత్తమై యవిదితస్వపదంబగుఁ దా ననాదిగా.

అదియె పరాత్పరుండు పరమాత్ముఁడు పూరుషుఁ డాద్యుఁ డంచుఁ బ్రాఁ
జదువులు పల్కు నవ్విభుఁడు సర్వజగంబు సృజింతు నేను నా,
ముదమున బ్రహ్మభావమును బొంది యహంపదవాచ్యుఁడయ్యె న,
ప్పదమునఁ బంచభూతములు భౌతికముల్ జనియించె నెల్లెడన్.

అరయ నతం డహమ్మనుట యప్పదమందు సమస్త మీచరా
చరజగ ముప్పతిల్లుటయు నన్నుతికెక్కు స్వభావమంచు, న
ప్పురుషుఁడె నైజమాయ జగముల్ గలిగించియు నిండియుం దదం
తరచరుఁడయ్యు ద్రష్టయయి తాఁ గనరాక వెలుంగుజ్యోతియై.

మును వివరించినట్లు మునుమున్న తదీశ్వరమాయచే జనిం
చిన వియదాదిభూతములఁ జేవయు లావును గల్గు పృథ్వి నీ
టనుబడి మున్గిపోవుచుఁ గటా! పయినుండఁగఁ గోరి క్రింది కిం
కను దిగజాఱుచుంటి గతి కల్గదొకో నను నుద్ధరింపఁగన్.

అనుచును మొఱ్ఱవెట్టఁ బరమాత్మ తదార్తరవంబు విన్నచో
ప్పున నె వరాహరూపమును బూని తటాలున దూఁకి యర్ణవం
బున నడుగంట మున్గి తన పోటగు కోఱలఁ బట్టి యెత్తి భూ
మిని బయి నిల్పి తా నధిగమించెను వెండియు బ్రహ్మభావమున్.

అట్టి బ్రహ్మమయంబు దివ్యంబునైన - తేజ మాకాశసంజ్ఞ నలింపఁబడియె
నాపరబ్రహ్మ తైజసరూప మలర - సర్వభూతపితామహసంజ్ఞ వడసె.
నాఁటఁగోలెను బ్రహ్మమానసము బలిమి - నేఁటిదనుకను ధర యట్లు నిలిచియుండెఁ
దాదృశజ్ఞానయోగమే ధర ధరించు శేషకూర్మాదులని ప్రశంసింపఁబడియె.

ఇమ్మగ నట్లు నిల్చిన మహీసతి మధ్యముఁ జీల్చివచ్చు నీ
రమ్మునఁ గల్గినట్టి వివరమ్మున మేరువుపొల్చె దాని య
గ్రమ్మున సూర్యమండలము గ్రాలెఁ బ్రభాకరమౌచు దానిమ
ధ్యమ్ముననుండి వెల్వడె సుధామయకాంతుల సోమబింబమున్.

ఉమయనఁగ బ్రహ్మవిద్య మాయమనుగూడి - సోముఁడనఁగ సనాతనధామభూతుఁ
డైన యాబ్రహ్మ తన్మండలాభిమాని - బ్రాహ్మణాధ్యక్షుఁ డగుచును బరఁగె నట్లు.

ఆసోముని యాననమున - శ్వాసం బక్షరమయంబు సర్వార్థసము
ద్భాసకమగు తేజంబున - భాసిల్లుచు వెడలె వేదవాఙ్మయ మగుచున్.

మఱియు నాత్మస్వభావ సంభవములైన - యాచతుర్వేదముల యర్థ మాత్మఁ దలఁచి
యాధిదైవికనిర్మాత యావిధాత కడఁగి యాధ్యాత్మికార్థసంఘటన కపుడు.

సలిలము మాంసశోణితవసాప్రముఖంబులు, భూమిచర్మ మె
మ్ములు, గగనంబు కర్ణములు మున్నగుచిల్లులు, పావకంబు క
న్నులు, పవనంబు ప్రాణములునుం గలిగింపఁగ ముఖ్యకారణం
బులుగఁ దలంచె దివ్యుఁడగు పూరుషు నొక్కని జీవసంజ్ఞునిన్.

ఆసనాతనపురుషుఁడే యట్లు జీవ పురుషుఁడై యింద్రియంబులఁ బొందుకతన
నాత్మతత్త్వంబు మఱచి మాయావశుఁడయి మసలుచుండు శరీరాభిమానియగుచు.

ఆతఁ డెంతకు నిజసత్య మరయలేఁడొ యంతదనుకను సంసార మాశ్రయించి
పూర్వపూర్వానుగతకర్మ భోక్తయగుచు జననమరణప్రవాహ సంచలితుఁ డగును.

ఇంద్రియంబుల నిర్జించి యెపుడు యోగ - శక్తిచేఁ దన్నుఁదాఁ గనఁజాలు నతఁడు
సకలబంధంబు లప్పుడె సడలిపోవ - బ్రహ్మభావంబు గాంచి కైవల్య మొందు.

ఇయ్యది నిఖిలవేదాంతసునిశ్చితంబయిన పరమాద్వైత సిద్ధాంతంబు........

ఆది సవ్యక్తుఁడై యట్లు వ్యక్తరూప - మలర నావిర్భవించినయట్టి పంచ
భూతమయుఁడైన యాదివ్యపూరుషుండె - బ్రహ్మ పరమాత, స్రష్టనాఁ బరఁగుఁ జుమ్మి.

ఆతఁడు దివ్యపూరుషసమాఖ్యఁ డట్లు నిజదివ్యకాంతివి
ద్యోతితమేరుపృష్ఠముననుండి సనాతన మాత్మతేజమున్
జేతమునందు నిల్పి గురునిష్ఠఁ దపం బొనరించెఁ దానసం
ఖ్యాతసమంబు లాత్మజనితాగమతత్త్వపరాయణాత్ముఁడై.

అతని తపమున కునికిపట్టయినయట్టి - యతివిశాలంబు రమణీయమైన మేరు
శిఖరమే బ్రహ్మలోకమై చెన్నమీఱె - నతఁడు నట్లుండి సృష్టి చేయందలంచి.

తాన యానందలీల ద్వంద్వంబుగాఁగ - నలరి క్రీడించి యవ్యక్త మక్షరంబు
నైన తన తేజమున నభివ్యక్తపఱచి - క్షరమయంబు త్రిలోకసర్గంబు మఱియు.

బ్రహ్మవిష్ణుమహేశ్వరాహ్వయము లలర - సకలభౌతికజగదధిష్ఠాన మఖిల
కారణంబును సర్వకార్యంబు నగుచు - విశ్వరూపంబు ధరియించి వెలసె నంత.

తొలి వెలసిన వేదంబుల - నలుమొగములఁ దాల్చినట్టి నలువముఖమునం
గలిగిరి బ్రహ్మోక్తవిధుల్ - వెలయింపఁగఁ జాలునట్టి విప్రులు తొలుతన్.

బ్రహ్మముఖమున జనియించి బ్రహ్మ మెఱిఁగి-బ్రహ్మపారాయణ మొనర్చి బ్రాహ్మవిధుల
నాచరించుట బ్రాహ్మణు లైరి వారు-వారె పురుషార్థముల కాలవాలమైరి.

బ్రహ్మములు లీనమైయుండు బ్రహ్మమందు-బ్రహ్మములయందు లీనమై బ్రహ్మ ముండు
ననెడి పరమార్థ మెఱుఁగు బ్రాహ్మణుఁడె బ్రహ్మవేత్తనా వేదవేత్తనా వినుతి కెక్కు.

......ఎల్లవిద్యలకు శీర్షంబైన వేదచతుష్టయంబు బ్రహ్మయజ్ఞాంగంబై పరిఢవిల్లు. తాదృశయాగంబునఁ బ్రవర్తిల్లుచు నింద్రియంబుల నిగ్రహించి యంతరరివర్గంబు నిర్జించి సాధనచతుష్టయసంపన్నుండై యమనియమాద్యష్టాంగయోగంబున స్వాత్మతత్త్వానుసంధానంబు గావించు బ్రాహ్మణుండు సర్వబంధవిముక్తుండై పునరావృత్తిరహితుండై శాశ్వతంబైన బ్రహ్మభావంబు గాంచు నిట్లు సత్త్వాతిరేకంబున సకలఫలత్యాగపూర్వకంబుగ నఖిలవేదోక్తకర్మంబు లాచరించుచు నిర్వికల్పసమాధిని బరబ్రహ్మానంద మనుభవించు సమయంబె బ్రహ్మయుగంబనఁబడు.

(మదీయ భవిష్యపర్వములో నుండి)

---





రంజాన్ ఫకీర్

చిత్రకారుడు : మహమ్మద్ గౌసు మొహియుద్దీన్ గారు, గుంటూరు.



## కాగితాలమిల్లు భవిష్యత్తు........?

రాజమహేంద్రవరమున గోదావరీపుష్కరముల సమయమున కాగితాల మిల్లులో ఏర్పాటుచేయబడిన స్వదేశీప్రదర్శనము తత్కర్తల సమయస్ఫూర్తికి విజయపతాకగా నున్నది.

ప్రదర్శనముయొక్క సంపూర్ణ ప్రయోజనము సిద్ధించుటకప్పుడు చేయవలసినయేర్పాటు లింకను కొన్ని గలవు; గాని చేసినవిమాత్రము సామాన్యమైనవి గావు.

అయితే ఆప్రదర్శనము కాగితాల మిల్లులోగాక మఱియొక ప్రత్యేకస్థలమున ఏర్పరుపబడవలసియున్నది. ఏమంటే? అనేకలక్షల ద్రవ్యముతో నిర్మింపబడి, అతి ప్రయాసమీద నిలుపబెట్టబడిన ఆంధ్రుల యేకైకోత్కృష్టప్రయత్నమగు కాగితాలమిల్లు కుంభకర్ణునివలె గాఢనిద్రలో మునిగియుండుట ఆప్రదర్శనమునకు దారుణాఘాతముగా నున్నది.

"ఏటికొప్పాక (విశాఖపట్టణంజిల్లా) వారు ప్రతిదినమును ప్రదర్శన-ఆవరణమునందు బొమ్మలను కొయ్యతో తయారుచేసి, రంగులువేసి అమ్ము"చుండుట, "ప్రతిదినము, ఉదయము మొదలు సాయంత్రమువఱకు స్త్రీలు ప్రదర్శనపు హాలులో ఏర్పాటుచేయబడిన ఎత్తయిన తిన్నెపై నూలువడుకు"చుండుట ప్రేక్షకులకు తత్పరిశ్రమలయందు ఆదరము, అభిమానము, తన్మూలమున దేశీయవస్తువులమీద ప్రీతి కలిగించుచుండినచో, కాగితాలమిల్లు ఆయాదరాభిమానములను, సాముదాయికమగు నాప్రీతిని పూర్వపక్షముచేయునదిగా నున్నది.

వాస్తవముగా, తత్ప్రదర్శనమున ప్రదర్శింపబడిన ఖద్దరువస్త్రములు, చీరవాలు మున్నగు ఫర్నిచరు, దంతపుసామానులు, రాగిగ్లాసులు, సిరాలు, పెన్సిళ్లు మున్నగు వస్తువులు మనుకారమును రేకెత్తించుచు హృదయోత్తేజకముగా నున్నవి; గాని శూన్యహృదయ మగు కాగితాలమిల్లు ఆమనుతేను తుడిచిపెట్టివేయుచు హృదయఖేదనము గావించుచున్నది.

అయినదేమో అయినది. క్లిష్ఠభూయిష్ఠమైన మిల్లు పూర్వచరిత్ర విస్మృతాఖ్యవర్తమునబడి మునిగిపోవు గాక; గాని దినదినము వేలకొలది దేశీయుల నాకర్షించిన యీప్రదర్శనము మిల్లుయొక్క భవిష్యత్తును లేదో వంతముగ చేయగలదా?

గమనింపవలసిన విషయ మిదీ. "ప్రదర్శనముయొక్క సంపూర్ణ ప్రయోజనము సిద్ధించుటకు అప్పుడుచేయవలసిన యేర్పాటు లింకను కొన్నిగల"వని పైని చెప్పినదిందుకే.

అన్ని తరగతుల—అన్ని రకముల స్త్రీ పురుషులు ఆబాలగోపాలముగ నీప్రదర్శనము చూచియున్నారు. గాని వారి హృదయములలో కాగితాల మిల్లునుగురించి యిట్టి మననము ప్రారంభముకానిచో నీ ప్రదర్శనము వాస్తవముగా మామూలుబజారే గాని యిందు విశిష్టతయేమియు కనుపడదు.

## గోదావరీపుష్కరము

ఇది మొన్ననే ముగిసినది. మఱల పండ్రెండు సంవత్సరముల కిదివచ్చును. అప్పటికి దేశ మనేకవిధముల మారియుండునని తలచుట కవకాశములు గలవు.

ఇది పండ్రెండుదినముల పర్వము; గాని సిద్ధాంతుల భిన్నప్రతిపాదనముల ననుసరించి యీసంవత్సరము పదునెనిమిదిదినము లైనది. అయితే జులై ౧-వ తేదీ

మొదలు ౧౨-వ తేదీ వఱకును మాత్రమే అధికసంఖ్యాకులు దీని నాచరించిరి.

గోదావరి పొడుగునను అద్దరివా రద్దరిని, ఇద్దరివా రిద్దరిని పితృదేవతల నుద్దేశించి తీర్థశ్రాద్ధములు పెట్టుటయే యీసమయమున జేయవలసినపని; గాని శాస్త్రమునకు వ్యతిరేకముగ వసేకు లద్దరివా రిద్దరిని, ఇద్దరివా రద్దరిని స్నానశ్రాద్ధాదికములు నిర్వర్తించిరి. వితంతువులుగూడ చాలమంది స్వయముగ పిండప్రదానము గావించిరి.

ఎక్కడ జూచినను అంధపరంపరయే; ఎక్కడ జూచినను గతానుగతికత్వమే; విచక్షణత ఎక్కడను గన పడలేదు. యాత్రాపరులు ఖర్చుచేసిరి. పురోహితులు, అర్చకులు గడించిరి. ఇంతే.

కన్నులున్న వారికి శాస్త్రచోదితములగు ధర్మము లకు సంఘ మెంతదవ్వునకు బోయినదో కనబడినది. "మనము ఋషుల సంతతివారమే గాని వా రేర్పరచిన ధర్మము కాదు, మనము చేయుచున్నది." అని చక్కగా తోచినది.

ఇట్టి సన్నివేశములను జూచి పూర్వాచారవాదు లెంతయైన దిద్దుకొనవచ్చును; గాని వారి కా శ్రద్ధ లేదు; ఆదృష్టియు లేదు. ఈశాస్త్రాతిక్రమణము చూపి, పరిణామసిద్ధాంతము బోధించి సంస్కర్తలు సంఘమును సదాచారముల దెసకు మరలించుట కెంతయైన ప్రయత్నింపవచ్చును; గాని వారును ఆ ప్రయత్నమున లేరు.

ఆసమయమున వర్తకులుగూడ మంచిలాభములను సంపాదించిరి. అయితే స్వదేశీప్రచారకసమితి (జై యింకియర్ లీగు) వారు వర్తకుల దృష్టిని, ప్రజల దృష్టిని దేశీయవస్తువులమీద లగ్నము చేయుటకు కొంతవఱకును ప్రయత్నములు సాగించిరి. ఇది యొక్కటే పుష్కర సమయమున నెఱిగి చేసిన మంచిపని.

వైదికమార్గాభిమానులగు బ్రాహ్మణుల పతనము నకుమాత్ర మిది పరమనిదర్శనముగా నున్నది. ఏమంటే! గతపుష్కరమునందుకంటె ఈపుష్కరమున ప్రజలలో కర్మశ్రద్ధ తగ్గినది. వైదికధర్మములమెడల భక్తి సన్నగిల్లినది. బ్రాహ్మణులయందే యీమార్పు స్పష్టముగా కనబడినది. కాలము గడచినకొలది దీని కింకను వినాశమేగాని బలము కలుగునని చెప్పుట కేమియు అవకాశములు కనబడవు.

---

శ్రీ జయపురాధీశ్వరులయిన

# శ్రీశ్రీశ్రీ శ్రీవిక్రమదేవవర్మ మహారాజుగారి

## ౭౮-వ శుభజన్మదివసము

శ్రీకరము, ముఖలింగపురీ ముఖబహువిమలసుక్షేత్రముల కాకరము, సుతీర్థ
సంగమైన కళింగదేశంబునందు, వంశధారా నదీతీరవాసమున సు
ఖాలకూటమై తగు పర్వతాలపేట, పేటలోని నాయకమణి సాటిగాఁగఁ
దేజరిల్ల, శ్రీ విక్రమదేవవర్మ ధారుణీధవుఁ డచట నుద్భవము గాంచె.
ప కలికి పెద్దదగుచుఁ బర్లాకిమిడికిఁ గాంతుఁడగు గౌరచంద్రాఖ్యగజపతి పెద
రాణి యయ్యె, నా శ్రీసువర్ణమణిదేవి మొదటి సంతానముగఁ గన్న పిదప నాలు
గేండ్లు నందనుం డొదవని హేతువునను, కృష్ణచంద్రదేవప్రభుం డీశ్వరునకు
మ్రొక్కి, మారేడు దళముల మూడు ఱేకులందుఁ బంచాక్షరి లిఖించి, యట్టి లక్ష
పత్రముల, స్వర్ణకృత శతపత్రములను శ్రద్ధమెయిఁ బూజ సలిపి, పూజాఫలంబు
గాఁగ, రేఖాంబికాశుభ గర్భశుక్తిజనిత మహాక్తికఫలముగాఁ గనిన యట్టి
ధీరశాలి శ్రీవిక్రమదేవవర్మ నృపతిమౌళి యెుబువదినాలుగేండ్ల క్రింద
నవతరించిన శుభజన్మదివస మిదియ.

సత్యనియమంబునం దన సాటి యైన
యల హరిశ్చంద్రుఁ డేవంశమందుఁ బొడమె, రాజధర్మంబునం దనతో జత యగు
నట్టి శ్రీరాముఁ డేవంశమందుఁ బుట్టె, వర్ణనీయమౌ నా యినవంశమందు
శ్రీ జయపురంబు నేలిన రాజవరుల కాది యగు వినాయకదేవు నన్వవాయ
మున ద్వితీయవిక్రమ దేవజనవిభుని ద్వితీయనందనుండగుచు నుతిం బడసిన
కృష్ణచంద్రదేవప్రభు నేకపుత్రుఁడై వెలసిన శ్రీ విక్రమదేవవర్మ-
మనుజవిభుఁ డన్వయక్రమమార్గముననుు, దొరతనమువారి సమ్మతిఁ దొరకినట్టి
శ్రీ జయపురంబునకు మహారాజుగఁ దగె, ఈనృపతి యెుబువదినాలుగేండ్లక్రింద
భువిని బుట్టిన శుభజన్మదివస మిదియ.

పదునెనిమిదివందల యెుబువదియుఁ దొమ్మి-
దవదయిన క్రైస్తవశకాబ్ద మాటకు సమమైన శుక్లనవమి జ్యేష్ఠమందు బహుళ

పక్షమునఁ జతుర్థీ రవివాసరమున దేవనిభుఁడు శ్రీవిక్రమ దేవవర్మ
ధరణివిభుఁడు భువిఁ సముద్భవమునొందె.

రాశిలగ్నము మేషమై క్రాల, నచట -
గురుఁడు, మూఁడిట రవియు శుక్రుఁడును బుధుఁడు,నాల్గిటఁ రాహువు, నయిదింటంగుజుండు,
నెనిమిదిట శనియుఁ, బదింటనిందు కేతు;లంశులగ్నముఁ మేషమైయలరుచుండ
గా మిథునమందు శుక్రుండుఁ, గర్కటంబు నందుఁ గేతువుఁ, గన్యను జందురుండు
వృశ్చికంబునఁ గుజుఁడు శనైశ్చరుండు మఱియు బుధుఁడును గురుఁడును, మకరమందు
రాహువును, గుంభ రాశిని రవియుఁదనర; జన్మకుజదశా శేషంబు సరిగ గణన
సలుప నాల్గేండ్ల యైదుమాసముల యిరువ దాఱు దివసంబు లీశుభమైనజన్మ
పత్రికంబట్టి యాయువుం బరమసుఖతతిం బడయుచు శ్రీవిక్రమదేవవర్మ
నృపుఁడు నూఱేండ్లు జయపురం బేలునట్లు రాధికాలోలుఁడైనట్టిమాధవుండు
పూర్ణకరుణతో నిరతంబుఁ బ్రోచుఁగాక ! ఈశుభదినంబు వచ్చు నూఱేండ్లదనుక !

జయపురము,
అంగీరస సం. జ్యేష్ఠ. బ ౮ బుధవాసరము.

—సెట్టి లక్ష్మీనరసింహము

| | | | |
|---|---|---|---|
| | ల గు | | ర బు శు |
| | రాశి | | రా |
| చ కే | | | కు |
| | శ | | శ |

| | | | |
|---|---|---|---|
| | ల | | శు |
| ర | | | కే |
| రా | | | |
| | కు బు గు శ | | చ |

స్వస్తిశ్రీ శుక్లనామసంవత్సర జ్యేష్ఠ బ ౮ రవివాసరము.
ధనిష్ఠా ౨ యచరణము: కుజమహాదశా శేషసం. ౪ మా. ౫ ది ౨౬ ములు.



దొమ్మరాట

ఛాయాచిత్రకారుడు : బి. యస్. రాయుడుగారు.



త్రాటిపై బైసికలు త్రొక్కుట

E. N. P.



ప్రాతర్విహారము

ఛాయాచిత్రకారుడు : బులుసు కామేశ్వరరావుగారు.



పొగయోడపై విలువిద్య

E. N. P.

# అచ్యుత దేవమహారాయల కొళింజవాడి తామ్రశాసనము

(శ. ౧౪౫౫) యస్. వెంకటరమణయ్యగారు, యం. ఏ., పి. హెచ్. డి.

ఈ తామ్రశాసనమును నాయొద్ద విజయనగర చరిత్రము పఠ్యసించిన శిష్యులు శ్రీయుతులు ఆర్. రాజగోపాలన్, యం. ఏ., కృష్ణమూర్తి, యం. ఏ. గారలు తమ స్వగ్రామమగు కొళింజవాడిఅగ్రహారము లో నొక బ్రాహ్మణునికడనుండి తీసి నాయొద్ద కంపిరి. ఈశాసనము నాదగ్గరకు వచ్చి దాదాపు ఒకసంవత్సర మైనను, తీరుబాటు లేకపోవుటచేత ఇంతకాలమువఱ కును ప్రకటించుటకు వీలయినది కాదు.

ఈశాసనమునం దున్న రాగిరేకులు—ప్రస్తుతము మన పిల్లవాండ్రు పాఠశాలలో వ్రాయ నుపయోగించు స్లేటుపలకల పరిమాణము గలవి—ఏడు. ప్రతిరేకునకును పైభాగము విలువంపుగ నున్నది. ఈవిలువంపుభాగము నసే రేకుల నన్నిటిని, కడియమును దూర్చుటకు అను కూలమైన, గుండ్రమైన రంధ్రము కలదు. కాని నాయొ ద్దకు వచ్చునప్పటికి ఈశాసనమునకు సంబంధించిన కడి యము గాని, దానిపై తాపటముజేసియుండు ముద్రిక గాని లేవు. అ వేమైనవో తెలియదు. ఒక్కొక్క రేకుయొ క్క నిడివి, మధ్యభాగమున ౧. అ ౧.౩ అంగుళములు. అంచులయందు నిడివి ౧౦.౨ అంగుళములు. వెడల్పు ౭.౫ అంగుళములు. ప్రతిరేకుయొక్క అంచులు నాల్గును రేకుయొక్క తలమునకంటె ఎత్తుచేయబడి రేకు మట్టుమ సన్నని దిన్నెలవలె నున్నవి. మొదటిరేకు పైభాగమునను, ఏడవరేకు వెనుకభాగమునను వ్రాత ఏమియు లేదు. ప్రతిరేకుమీదను విలువంపుభాగమునందు రేకుసంఖ్యను దెలుపు తెలుగు-కన్నడపు అంకెలు కలవు. కాని ఏడవరేకునందు అట్టిసంఖ్య యేదియు లేదు. మొదటిరేకుపైని అంకె, తక్కినరేకులవలె గాక, రేకు రెండవప్రక్కన వ్రాయబడియున్నది.

లిపి:—ఇందలి లిపి నందినాగరి. దీనికిని ప్రస్తు తము సంస్కృతగ్రంథములయందలి దేవనాగరికిని భేద మత్యల్పము. ఈలిపి విజయనగరరాయలకాలములో శాస నముల వ్రాతయందు సామాన్యముగ వాడుకలో నుండినది. ఈశాసనములోని అక్షరములు పొంకముగను, లోతుగను చెక్కబడియుండుటచేత ప్రతిఅక్షరమును స్పష్టముగ దెలియుచున్నది. శాసనమును చెక్కినవాడు మొత్తము మీద తనపనిని జాగ్రత్తగ నెరవేర్చినప్పటికిని అచ్చ టచట కొన్నిప్రమాదములు గాన్పించుచున్నవి. రెండవ రేకులో ౭౬-వ పంక్తియందు "నృగనలనహుషాదీన్" అనుటకు బదులు "నృగలహుషాదీన్" అని చెక్కి తరు వాత ప్రమాదవశమున విడిచిన రెండు 'న'లను పంక్తిపైన చెక్కినాడు. మఱియు సదరురేకు ౩౯-వ పంక్తిలో "హిరణ్యాశ్వరథమపి తులాపూరుషం గోసహస్రం హే మాశ్వం హేమగర్భం కనకకరిరథం" అని వ్రాయుటకు మారు "హిరణ్యాశ్వరథమపి తులాపూరుషం గోసహస్రం హేమాశ్వం కనకకరిరథం" అని వ్రాసి, వదలివేయబడిన "హేమగర్భం" అనుమాటను ౪౦-వ పంక్తిమధ్య హంస పాది పెట్టి వ్రాసి దాని మూడుప్రక్కలను అర్ధచంద్రా కారమగు నొకరేఖను వ్రాసియున్నాడు. ఇట్లే మూడవ రేకు ౧౦౪-వ పంక్తిని "అష్టోత్తరశతం యాతే తద్గ్రా మక్షేత్రసంచయే వృత్తిమం" అని ముగించి వాక్యమును సంపూర్ణముసేయక "వేదవేదాంగపారగాః" అని ౧౦౫-వ పంక్తిని ఆరంభించినాడు. కాని వెంటనే తప్పును గ్రహించి ౧౦౫-వ పంక్తికడపట "తో విలిఖ్యంతే" అని వ్రాసి కుండలీకరించి తప్పును దిద్దుకొన్నాడు. మఱియు నాల్గవరేకు ౧౬౭-వ పంక్తిలో "భానుభట్టసుత శ్చాశ్వ లాయనః కాశ్యపాన్వయః లింగయాఖ్యోతి మేధావీ వృత్తి మేకాం" అని శ్లోకమును సంపూర్ణము

సేయక విడిచినాడు. "ఇభాశ్చ్నలే" అని పాఠకులు చదివి శ్లోకమును పూర్తిచేసికొనవలసియున్నది. ఇది గాక ఆరవరేకు ౨౩౬-వ పంక్తియందు "అచ్యుతరాయ సముద్ర"మనుటకు బదులు "అచ్యురాయసముద్రము" అని చెక్కినాడు. అట్లే ఏడవరేకు ౨౭౦-వ పంక్తిలో "అచ్యుతరాయసముద్రవెందు" అనుటకు బదులు "అచ్యు రాయసముద్రవెందు" అని వ్రాసి తరువాత వదలివేయ బడిన "త" కారమును "చ్యు" "రా" లమధ్య సన్నగ నిరికించినాడు. మఱియు మూడవరేకు ౯౪-వ పంక్తిలో "కాళంజవాడి" అన్నమాటకు తరువాత మొదట సేవా వ్రాసి దానిని తుడిచి అతుదుపైపై "గ్రామేణసహ ప్రాచ్యాం" అని చెక్కినాడు.

భాష:—భాషనుబట్టి శాసనమును రెండుభాగ ములుగ విభజింపవచ్చును: మొదటి ౫ రేకులయందును, ౬ వ రేకు ౨౩౫-వ పంక్తి తుదవఱకును, ఏడవరేకు ౨౭౭-వ పంక్తితుదవఱకును శాసనభాష సంస్కృ తము. మొదటిరేకు ప్రథమపంక్తిలోని 'శ్రీగణాధిప తయే నమః' అన్నవాక్యముదప్ప తక్కినభాగము పద్యాత్మకము. ఎక్కువసంఖ్యగల శ్లోకములు అనుష్టు భులు; కాని వృత్తములుగూడ గలవు. ఇందు వచ్చు వృత్తములు శార్దూలవిక్రీడితము, స్రగ్ధర, హరిణి, దోధ కము, మాలిని, వసంతతిలక, పృథ్వి మున్నగునవి. భాష యందు తప్పులు-ఎచ్చటనో తప్ప-లేవు. శాసనలేఖకుడు శాసనగ్రంథమం దంతటను 'త' వర్గచతుర్థాక్షరమునకు బదులు ద్వితీయను, ద్వితీయకు బదులు చతుర్థాక్షరమును వాడియున్నాడు. ఉ.—పంక్తి ౧౬ 'స్థానే స్థానే వ్యథత్త యథావిథి'; పంక్తి ౪౭: 'ప్రతివిధిజలధిశ్రేణికాయో విథత్తే బ్రహ్మాండం స్వర్ణధేనుప్రముఖి'; పంక్తి ౫౬: 'రాజాథిరాజ'; పంక్తి ౬౫: 'వివర్ధతేచ తతోతి చక్రస్య ముదం సమింధేదివాధ సాయంకుమద్రై విధు రుంధే' ఇత్యాది—ఇట్టివి యెన్నియో కలవు. నాల్గవరేకు ౧౩౩, ౧౩౯-వ పంక్తులలోను ఆరవరేకు ౨౩౫-వ పంక్తిలోను 'ఋగ్వేదీ', 'ఋగ్యజుర్వేద' అని అజాదిగా వ్రాయుటకు బదులు రేఫముతోనే "రుగ్వేదీ", "రుగ్యజు ర్వేద" అని వ్రాయబడియున్నది. 'ఎఱ్ఱంభట్టు' అనుటకు బదులు "ఎరఱంభట్టు"అని వ్రాయబడియున్నది. (నాల్గవ రేకు: పంక్తి ౪౨). 'తిమ్మ' అనుమాట మూడువిధము లుగ వ్రాయబడియున్నది: "తింమ" (మొదటిరేకు: పంక్తి ౧౧); "తిమ్మ" (నాల్గవరేకు, ౧౨౫-వ పంక్తి); "తింమ్మ" (ఐదవరేకు: పంక్తి ౨౧౦).

ఆరవరేకు ౨౩౬-వ పంక్తి మొదలు ఏడవరేకు ౨౭౬-వపంక్తివఱకును శాసనభాష కన్నడము. గద్యాత్మ కము. ఇదిగాక శాసనముతుదను ఆకాలపు తెలుగు-కన్నడ అక్షరములతో "శ్రీ విరూపాక్ష" యను విజయనగర రాజులదస్కతును కలదు. ఈశాసనములోని కన్నడభాష యందు కొన్ని లోపములు గన్పించుచున్నవి - 'ముఱిద' బదులు "మురిఁద", అనియు, 'అదఱింద'కు "అదరిఁం ద", 'మూఱు' కు "మూరుఁ" అనియు "నూఱుకు" 'నూరఁనియు' వ్రాయబడియున్నది. దీనికి కారణము నాగరలిపిలో శకటరేఫము లేకపోవుటయే.

శాసనవృత్తాంతము:—ఈశాసనగ్రంథమును ఏడు భాగములుగ విభజింపవచ్చును:—

(౧) పంక్తులు ౧-౪ దేవతాస్తోత్రము.
(౨) " ౪-౭౭ తుళువవంశవర్ణనము.
(౩) " ౭౭-౧౦౪ దానకాలము, దాత, దాన ముచేయబడిన స్థలము మొద లగువాని వివరణము.
(౪) " ౧౦౪-౨౩౫ ప్రతిగ్రహీతలపట్టి.
(౫) " ౨౩౬-౨౭౬. ౩-వ భాగములోని విష యమే (కన్నడమున); దాన మీయబడిన స్థలముహద్దులు.
(౬) " ౨౭౭-౨౯౪ దానపాలనఫలమును వర్ణిం చు మామూలుశ్లోకములు.
(౭) " ౨౯౫-౨౯౯ శాసనగ్రంథకర్త-లేఖకుడు-కడపట శ్రీవిరూపాక్ష యని కన్నడాక్షరములతో రాయలదస్కతు.

(౧) మొదటి నాలుగుపంక్తులయందును గణాధి పతి, శంభువు, వరాహమూర్తి- వీరియొక్క స్తోత్రములు కలవు.

(అ) ౮-వ పంక్తి మొదలు ౭౭-వ పంక్తివఱకును చంద్రవంశమును, తత్సంబంధి యగు తుళువవంశము అచ్యుతరాయల కాలమువఱకును వర్ణింపబడినవి. చంద్రునికి బుధుడు పుట్టెను; అతనివంశమున పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, తుర్వసుడును పుట్టిరి. తుర్వసుని వంశమున తుళువరాజులలో యశస్వియగు తిమ్మభూపతి జనించెను. అతని భార్య బుక్కమ. వీరికి ఈశ్వరరాజు పుట్టెను. అతడు దేవకీదేవిని వివాహము చేసికొనెను. వీరి పుత్రుడు నరసరాజు; ఇతడు రామేశ్వరాదిపుణ్యస్థానములయందు యథావిధిగ షోడశమహాదానములను జేసెను. సంపూర్ణప్రవాహముతో నిండి పాఱుచున్న కావేరికి సేతువు గట్టి శత్రువులకు నదిని దాటి తన్ను నరకుసేయని శ్రీరంగపట్టణపు దొరను పట్టుకొని, మరల ఆరాజ్యము నతనికే యిచ్చివేసెను. కీర్తిస్తంభములను నాటెను. మఱియు చేరరాజును, చోళుని, పాండ్యుని, ఇంకను మధురావల్లభుడగు మానభూషుని, ఉదగ్రపరాక్రమసంపన్నుడగు తురుష్కుని, గజపతిని నిర్జించెను. గంగాతీరము మొదలు లంకవఱకును, పూర్వపశ్చిమభూధరములకు మధ్యను గల దేశముల నేలురాజులచే మ్రొక్కులు గొనెను. అతనికి, దశరథునికి కౌసల్యాసుమిత్రలవలె, తిప్పాజీనాగలాదేవు లను నిరువురు భార్యలు గలరు. అందు తిప్పాజికి వీరనృసింహేంద్రుడును, నాగలాదేవికి కృష్ణరాయలును రామలక్ష్మణులవలె జననమందిరి. వీరనృసింహరాయలు విజయనగరరత్నసింహాసనస్థుడై సేతువుకడనుండి సుమేరువువఱకును, ఉదయాద్రినుండి యస్తాచలమువఱకును వ్యాప్తమైన దేశముపై రాజ్యము సల్పి, కనకసదస్సు, హంపి, కాళహస్తి మొదలగు పుణ్యస్థానములయందు పెక్కుదానములు చేసి దివంగతు డాయెను. పిమ్మట అవార్యవీర్యుడగు కృష్ణరాయమహీపతి భూభారమును దాల్చెను. అతడు కాంచి, శ్రీశైలము, శోణాచలము మొదలగు స్థలములయందు కనకతులాపూరుషాదినానాదానముల నొనర్చెను. రాజాధిరాజ, రాజపరమేశ్వర, వీరప్రతాప, భాషెగతప్పువరాయరగండ, మూరురాయరగండ, పరరాజభయంకర, హిందూరాయసురత్రాణ, దుష్టశార్దూలమర్దన ఇత్యాది బిరుదులు వహించిన ఈమహారాజు నీతిచేత నృగాదులను అధరీకృతులను గావించి పూర్వపశ్చిమభూధరములకును, సేతుశీతాచలములకును మధ్య నుండు భూమిని పాలించి స్వర్గస్థుడాయెను. తరువాత అతని తమ్ముడు అచ్యుతేంద్రుడు గద్దెయెక్కెను. రాజాధిరాజ, పరరాజభయంకర, ఏకైకవీర యను బిరుదులు గల యీరాజు షోడశమహాదానములను గోకర్ణము, చిదంబరము, సంగమేశ్వరము మున్నగాగల పుణ్యస్థలములయందు చేసెను. అతడు నీతిచేత నలనృగనహుషాదులకంటె నతిశయితుడై, రత్నసింహాసనస్థుడై విజయనగరమున నివసించుచుండెను.

తుళువరాజులు క్షత్రియులా?:—అనియే వారి శాసనము లన్నియు ఘోషించుచున్నవి! ప్రస్తుతపుశాసనమున తుళువవంశావతరణ మిట్లు వర్ణింపబడియున్నది.—

అస్తి క్షీరమహా ద్వైపై
    ర్మథ్యమానా న్మహాంబుధేః,
నవనీత మివోద్భూత
    మపనీత తమో మహః.
తస్యాపి తనయ స్తపోభిరతులై
    రన్వర్థ నామా బుధః
పుత్రై రస్య పురూరవా భుజబలై
    రాయుర్ద్విషాం నిఘ్నతః,
తస్యాయు ర్నహుష స్తస్య పురుషో
    యుద్ధే యయాతిః క్షితౌ
ఖ్యాత స్తస్యతు తుర్వసు ర్వసునిధిః
    శ్రీ దేవయానీపతేః.
తద్వంశే దేవకీజాని
    ర్దిదీపే తిమ్మభూపతిః,
యశస్వీ తులుకేంద్రేషు
    యదోః కృష్ణ ఇవాన్వయే.
తతో భూ ద్బుక్కమాజాని
    రీశ్వరః క్షితిపాలకః,
అత్రాస మకుటభ్రంశం
    మౌలిరత్నం మహీభుజాం.
నరసా దుదభూ త్తస్మా
    న్నరసావనిపాలకః,

దేవకీనందనా త్కా మా
దేవకీనందనాదివ. (పంక్తులు ౬-౧౫).

ఇందువల్ల క్షీరసముద్రమున నుద్భవించిన చంద్రునకు బుధుడును, బుధునకు పురూరవుడును, అతనికి ఆయువును, ఆయువునకు నహుషుడును, అతనికి యయాతియు, యయాతికి తుర్వసుడును అతనివంశమందు తులువరాజులలో కీర్తిమంతుడగు తిమ్మభూపతియు, అతనికి ఈశ్వర క్షితిపాలుడును, ఈశ్వరక్షితిపాలునకు నరసరాజును బుట్టినట్లు తెలియుచున్నది.

ఈ వంశానుక్రమణమే కృష్ణరాయవిరచితము నాబను ఆముక్తమాల్యదయందును వర్ణింపబడియున్నది.—
(మా. ఆ. ౧, ౧౯-౩౧.)

కలశపాథోరాశియందు చంద్రుడు పుట్టెను. అతని కుమారుడు బుధుడు: వానికి ప్రజ్ఞానిధియగు పురూరవుడు జనించెను. పురూరవుని పుత్రుడు ఆయువు; అతని కొమారుడు యయాతి. అతనికి యదుతుర్వసులను సుతు లుద్భవమందిరి. తుర్వసుని "వంశంబు తుళువాన్వవాయమయ్యె". అం దనేకులు నృపు లుదయమందిరి. వారిలో తిమ్మరాజు గొప్పవాడై ప్రకాశించెను. ఆతిమ్మరాజునకు దేవకీదేవియందు ఈశ్వరరాజు జననమందెను. అతడు బుక్కమాంబను వివాహమాడెను. వారికి నారసింహేశ్వరుడు పుట్టెను.

ఈరెండు వంశానుక్రమణికలును అల్ప భేదములుగలవైనను మొత్తముమీద సరిపోవుచున్నవి. ఈభేదములు రెండు: (౧) మన తామ్రశాసనమున ఆయువునకు నహుషుడును, అతనికి యయాతియు పుట్టినట్లు చెప్పబడియున్నది. ఆముక్తయందు నహుషుని మాటయే లేదు. (౨) తామ్రశాసనమున యయాతికి తుర్వసుడుమాత్రము పుట్టినట్లు వ్రాయబడియున్నది. ఆముక్తయం దతనికి యదుతుర్వసులను పుత్రు లిద్ద రున్నట్లున్నది. ఈ భేదములు గమనించదగినవి కావు. కావున మన తామ్రశాసనమందును ఆముక్తయందును వర్ణింపబడిన వంశ మొక్కటియనియే చెప్పవచ్చును.

పైరెండు వంశవృక్షములయందును తుళువరాజులు చంద్రవంశజులగు క్షత్రియులని వర్ణింపబడినను, వీరు క్షత్రియులు కారేమోయను సందేహమునకు ఎడము లేకపోలేదు. ఈసందర్భమున మొదట గమనింపదగినది వారి వంశము పేరే. కృష్ణరాయ లేమి, తదాస్థానమునందలి కవి దిగ్గజములలో పెద్దయగు పెద్దనగా రేమి, "వాని(తుర్వసుని) వంశంబు తుళువాన్వవాయ మయ్యె" నని పలికినారు. తుర్వసుని వంశజులు తౌర్వసవు లగుదురు గాని తుళువ లెట్లు కాగలరు? "తుళువ" శబ్దము "తులు" శబ్దోత్పన్నమగు విశేషణము. దానికి అర్థము తులుదేశమున బుట్టినవాడు అని. ఈతులుదేశము పశ్చిమసముద్రతీరమున విజయనగర సామ్రాజ్యములోనికి వశవర్తియై యుండిన యొకకోస్తా. ప్రస్తుతపు దక్షిణకన్నడమండల మీతులుదేశముయొక్క భాగము. కావున తుళువ వంశమునకును తుళురాజ్యమునకును నేదో సంబంధ ముండెనని తలచుట సమంజసము. ఈవంశములో చరిత్ర పురుషులలో ప్రథము డగు తిమ్మరాజు సంపదార్జనమునకై తూర్పుదేశమునకు వచ్చి యచ్చటనే వివాహము చేసుకొని శాశ్వతముగ ఉనికిప ట్టేర్పర్చుకొన్నట్లు తోచుచున్నది.

నరసనాయకుని శాసనములలో నతడు పురాణగాథలలో వర్ణింపబడిన పురూరవోనహుషాదిచంద్రవంశపు రాజుల యన్వయమున బుట్టినట్లు వ్రాసియుండలేదు. అతనిని ఈశ్వరనాయకుని కుమారుడగు నరసణ్ణనాయక, నరసణ్ణ వొడయ లనియే పేర్కొనియున్నారు (E. C. III, D. B. 1. E. C. IV, Gu. 67). క్రీ. శ. ౧౫౦౬, ౧౫౧౩ ల మధ్యకాలమున నందిమల్లయ్య ఘంటసింగయలచే విరచింపబడిన వరాహపురాణమువల్ల పైసందేహము దృఢపడుచున్నది. అందు "నీశ్వరకుమారుం" డగు "నరసవసుధాధీశ్వరుండు తులువకులదుగ్ధాబ్ధిచంద్రుడు" అనిమాత్రము వ్రాయబడినది. అతని వంశావళార మిట్లు రచింపబడియున్నది:—

" ఉ. మిన్నుల మోచి భాగ్యముల
మీఱిన కోటల రమ్యహర్మ్యశోభసం
పన్నత సస్యవాటగరి
మంబుల దోటల వాహవారణా

ధ్యున్నతి గేలిదీర్ఘికల
 నుగ్రభటావలి వన్నెకెక్క వా
రాన్నిధి కాంచి పై దుళువ
 రాజ్యము సంతతవీరభోజ్యమై.

క. ఆ తుళువరాజ్యమున వి
 ఖ్యాతి వహించిరి దిగంతకరికటతటసం
 భూతమదశోషణ వి
 ద్యాతత్పరకీర్తి బెండ్లియాడిన రాజుల్.

ఉ. వారల కగ్రగణ్యుడు ని
 వారితవైరివరూథినీధవ
 శ్రీరమణీవిలాసుడు వి
 చిత్రకళాకుశలుండు తిమ్మధా
 త్రీరమణుండు సంపద వ
 రించె మరాటవరాటలాటగాం
 ధారయుగంధరాది పస
 దః ప్రకటీకృతబాహువీర్యుడై.

చ. అతని శుభాంగనాతిలక
 మైన పవిత్రచరిత్ర దేవకీ
 సతి కృతపుణ్యులం గనియె
 శాంతివసంతుల సజ్జనావన
 వ్రతపరిపాలనానుణప
 రాయణచిత్తుల దుర్మదోద్ధతా
 హితవనదావపావకుల
 నీశ్వరతిమ్మ ధరాతలేంద్రులన్.

క. అందగ్రజుండు కవిజన
 మందారము పతిహితైకమతి మానవతీ
 కందర్పుడు తేజోమ
 ధ్యందినమార్తాండు డీశ్వరాధిపు డుర్విన్.

*    *    *    *

క. బుక్కాంబకు జన్మించిరి
 చక్కనిరూపముల బంచసాయకు లన నెం
 పెక్కిన భుజాబలంబున
 దిక్కరు లన నారసింహ తిమ్మకుమారుల్.

గీ. ఇట్లు తుళువాన్వయాగ్రణి యీశ్వరుండు
 పూర్వజన్మతపఃఫలంబున గులంబు
 ధన్యత వహింప గన్న పుత్రకులలోన
 బ్రథిత గైకొని నరసింహపార్థివుండు."

ఈవంశావతారమందు తుళువరాజులు చంద్రవంశజులని గాని, క్షత్రియులని గాని యెచ్చటను చెప్పబడి యుండలేదు. పురూరవుడు ఆయువు మొదలగు పౌరాణిక నృపాలురు తుళువప్రభువుల పూర్వకులనియును వచింప బడలేదు. ఇంతే కాదు; తుళువనరసరాజునకు అంకిత మీయబడిన ఈగ్రంథమున ఆనరసరాజునకు "పతియైన సాళువనరసింగరాజరాజమాళిపావనాన్వయంబు" గూడ "మొదల" వర్ణింపబడినది. "చంద్రుండు వంశకర్తగా..." వంకి దేవమహీభర్త మొదలు సాళువవంశావతారము విర చింపబడినది. ఇంకను, "తుహినాంశువంశపాథోరాశి మాణిక్య"మని సాళువనరసింహరాజు పేర్కొనబడినాడు.

ఇట్లు సాళువవంశమువారు చంద్రవంశజులని చెప్పుచు, కృతిపతి తుళువదొరల వంశజు డనుటను జూడగా "రాజు పెద్దభార్య పతివ్రత" యన్నట్లున్నది. కావున వరాహపురాణకృతికర్తల మతంబున తుళువ రాజులు చంద్రవంశజులు కారనుట నిశ్చయము. క్షత్రి యులుగూడ గాదని యభిప్రాయ మేమో!

గ్రంథరచనాకాలమప్పుడు సాళువనరసింగరాజు ప్రభుత్వము సల్పుచుండుటచే, తుళువరాజులకు భావి కాలమున సంప్రాప్తము గాబోవు మహదైశ్వర్యపు గాలి యైనను సోకియుండదు. కావుననే అప్పటికి వారి కింకను క్షత్రియుల మనిపించుకొనవలెనన్న బుద్ధియును బుట్ట లేదు.

ఇట్టితలంపు వారికి విద్యానగరసింహాసనము నాక్ర మించుకొన్నప్పటినుండియు కలిగినది. ఇమ్మడినరసింహ రాజును ద్రోహముగ జంపించుటయందు నరసనాయ కుడు పాల్గొనలేదని యొప్పుకొనవలసియున్నను, అతడు సింహాసనము నక్రమముగ నాక్రమించలేదనుటకు వీలు లేదు. వీరనరసింహరాయల రాజ్యారంభమునాటి శాసన ములయం దొకదానిలో నరసనాయకునకు "రాజాధి రా"జను బిరు దున్నట్లు చెప్పబడియున్నది. అందే

యతడు ప్రపంచము నుద్ధరింప ముఖ్యముగ నవతరించిన ట్లున్నది. (E. C. IV, Gu. 67.) ఈశాసనముకంటె ముఖ్యమైనది క్రీ. శ. ౧౫౧౦ ప్రాంతపు కృష్ణదేవ రాయల శాసనము. (E. C. III, D. B. 1.) అందు "నరసణ్ణనాయకుడు స్వభుజాబలముచేత నరపతియొక్క సింహాసనమును, రాజ్యమును, పుడమిని సాధించి స్థిర రాజ్యమును స్థాపించె"నని యున్నది. నరసనాయకుడు "నరపతి"యొక్క సింహాసనరాజ్యాదుల నెప్పుడు హరించెనో చెప్పుటకు వీలుగాదు. రాజ్యము నాక్రమించుకొన్నను చక్రవర్తియొక్క బిరుదులను వహించలేదు. పట్టాభిషేకము చేసుకొనను లేదు. ఈవిషయము తుళువవంశ ప్రశస్తివల్లనే తెల్లమగుచున్నది. వీరనరసింహరాయలు, కృష్ణరాయలు, అచ్యుతరాయలు—వీరు ముప్పురును విజయనగరమందు రత్నసింహాసనస్థులై పుడమిని పాలించినట్లు ప్రశస్తియందు స్పష్టముగ చెప్పబడియున్నది. కాని వీరి పూర్వు లట్లు విజయనగరసింహాసనస్థులై రాజ్యము జేసినట్లు చెప్పబడలేదు. తిమ్మరాజు తుళువరాజులలో యశస్సు గలవాడు; ఈశ్వరరాజు మహీభుజుల మాళిరత్నము; నరసరాజు శూరుడు; గంగాతీరము మొదలు లంకవఱకును పూర్వాద్రి మొదలు పశ్చిమభూధరమువఱకును గల రాజులపై దన యధికారమును స్థాపించెను; కాని సింహాసనము నెక్కి విద్యానగరమందు గాని, వేఱొకచోట గాని రాజ్యము జేసినట్లు గాన్పించదు. కావున తుళువరాజులలో రాజ్యాభిషిక్తుడై మొదట మహారాయ పదము నందినవాడు వీరనరసింహరాయడు. తత్పూర్వు లట్టిపదవి నందలేదు. ఈవిషయము రాయవాచకమునందును సూచింపబడినది. కృష్ణరాయలు తన రాజ్యముపై దండెత్తివచ్చుచున్నాడని రొంజెగి అదిల్ ఖా నన్నమాట: "కర్ణాటకంవారు తుంగభద్రదాటివచ్చిరా యీవరకున్ను: యీశ్వరనాయకుడున్ను, నరసనాయకుడున్ను, వీరనరసింహరాయలవారున్ను యేలినందుకన్నా కృష్ణరాయలవారు యేలేది యేమున్నది." (ఆం.పరి.క.సం. III)అని. వీరనరసింహునితండ్రియు తాతయు ఉత్తనాయకులే. అతడును అతనిసోదరుడును రాయలైరి. కనుక కడపటివారిరువురు పట్టాభిషిక్తులయిన రాజులు. తత్పూర్వులు ఎంత బలవంతులైనను సామంతులే యన్నయూహ కలుగుచున్నది. నరసనాయకుడు క్రీస్తుశకము ౧౫౦౩లో మృతినందెను. అతనితరువాత నతని జ్యేష్ఠపుత్రుడగు వీరనరసింహరాయలు ప్రభుత్వముసేయదొడగెను. తుళువరాజులలో చక్రవర్తిపదచిహ్నములను బిరుదులను వహించుట కితడే ప్రథముడు. ఇతడే తుళువవంశము చంద్రవంశాంతర్గతమని చెప్పుకొనుట కారంభించినవాడు. ఇతని కాలముననే శాసనములయం దగపడు తుళువవంశప్రశస్తి రూపు ధరించినది. అతని శాసనములలో ప్రశస్తి ద్వివిధముగ గాన్పించుచున్నది ప్రథమదశయం దాప్రశస్తి ఈక్రింది విధమున నుండెను:

అజునికి అత్రి; అతనికి చంద్రుడు; చంద్రునికి బుధుడు; అతనికి పురూరవుడు; పురూరవునకు ఆయువు; అతనికి నహుషుడు; నహుషునకు యయాతి; అతనికి తుర్వసుడును జనించిరి. అతనివంశస్థులు కురుదేశమున వృద్ధినొందిరి. తద్వంశజులలో కొందఱు సుగ్రీవునిచే పూజలుగొన్న రఘువంశోత్తముడగు సీతారాము సేవించుటకు కిష్కింధకు వచ్చి యచ్చటి దేశసౌందర్యమునకు మెచ్చి హేమకూటప్రాంతమున వసతు లేర్పఱచుకొని యచ్చటనే నివసింప మొదలిడిరి.

వారిలో తుళువవంశాంబుధిచంద్రుడును, మహాపరాక్రమశాలియు నగు దిలీపు డొకడు. దేవకీజానియగు నతనికి ఈశ్వరుడు పుట్టెను. అతనికి నరసరాజు పుట్టెను. (E. C. X. Gd. 77.)

ఈవంశానుక్రమణికయందు రెండు విషయముల గూర్చి కొంతవిమర్శ కడమున్నది.—

(౧) కురుదేశస్థులు తుర్వసువంశజులగు నరపాలురు కొందఱు సీతారాముని సేవింప కిష్కింధకు వచ్చి యచ్చట నివాసము లేర్పఱచుకొని స్థిరముగ నిలిచిపోవుట మఱి యేశాసనమునను, గ్రంథమునను లేని విషయము. ఇది ఈశాసనముననే కన్పడు నూతనవిషయములలో నొకటి.

(౨) ఈశ్వరనాయకుని తండ్రి దిలీపుడట! అన్ని శాసనములయందును తిమ్మరా జని యున్నది. "ద్వీపే

"తిమ్మభూపతి" యనునదియె దిలీపు డనుటకు కారణమై యుండునేమో!

తుర్వసుని వంశమువారు కురుదేశమునుండి కిష్కింధకు యాత్రార్థము వచ్చి యచ్చట నిలిచిపోయి రన్నకథ తుళువశాసనముల మఱి కానరాదు. ఇది వీరనరసింహరాయల ప్రథమరాజ్యవర్షములనాటి శాసనము గనుక తుళువవంశమును చంద్రవంశమున కతకరించుటకు ప్రశస్తిరచయితల కిదియే ప్రథమప్రయత్నము. ప్రశస్తి చక్కని రూపము సభాపతి యుద్యోగములో జేరువఱకును సుదిరినది కాదు. సభాపతి ప్రశస్తిరచయితల కందఱికి మేలుబంతి పెట్టెను. తరువాతివారు కాపీ వ్రాసిరి.

ఇందువల్ల తుళువవంశపువారు క్షత్రియత్వమును బొందగోరుట వీరనరసింహరాయల కాలమునుండియే యని తెల్లమగుచున్నది. తత్పూర్వమువారి కట్టియిచ్ఛ యున్నట్లగపడదు.

నరసనాయకుని విజయములు :—ప్రస్తుతశాసనమున నరసనాయకుని విజయములు ఈక్రిందిశ్లోకముల యందు చేర్కొనబడినవి:—

కావేరీ మాశు బద్ధ్వా బహులజలభరాం
తాం విలంఘ్యైవ శత్రుం,
జీవగ్రాహం గృహీత్వా సమితి భుజబలా
త్తంచ రాజ్యం తదీయమ్,
కృత్వా శ్రీరంగపూర్వం తదపి నిజవశే
పట్టణం యో బభాసే,
కీర్తిస్తంభం నిధాయ త్రిభువనభవన
స్తూయమానాపదానః॥
చేరం చోళంచ పాండ్యం తమపిచ మధురావల్లభం
మానభూషం,
వీరోద్యదుగ్రం తురుష్కం గజపతి నృపతిం చాపి
జిత్వా తథాన్యాన్.

పై శ్లోకములయందు వర్ణింపబడిన విజయములను రెండు తెగలుగా విభజింపవచ్చును. (౧) అన్యదేశపురాజులను గెల్చినవి, (౨) కర్ణాటరాజ్యాంతర్గతసామంత నృపాలురను గెల్చినవి.

పైశ్లోకములందు వర్ణింపబడిన విజయముల స్వభావమును గుర్తెఱుగుటకు ఆకాలపు చరిత్ర సంగ్రహముగనైన దెలిసియుండవలయును. దక్షిణదేశమున అప్పుడు ప్రఖ్యాతిగాంచిన రాజ్యములు మూడు:

(౧) కుల్బర్గామహమ్మదీయరాజ్యము:—దీనికే బాహమనిరాజ్యమనియు పేరు. బాహమనీసుల్తానులకును విజయనగరరాజులకును చిరకాలమునుండి వైరము కలదు. కావున నీరెండురాజ్యములకును తఱచుగ యుద్ధములు జరుగుచుండెడివి. నరసనాయకుని సమకాలికుడగు బహమనిసుల్తాను నాల్గవమహమ్మదు. ఇతడు సత్వహీనుడగుటచేత ఇతని సర్దారులు ఎవరి స్థానమున వారు స్వతంత్రులైరి. ఈకారణమువల్ల బాహమనీరాజ్యము విచ్ఛిన్నమై ఐదు స్వతంత్రరాజ్యముల కెడమిచ్చెను. ఇవి యెవ్వియనగ (౧) బీదరు (౨) బీరారు (౩) బిజాపూరు (౪) అహమదునగరు (౫) గోల్కొండ యనునవి. నరసనాయకుని కాలమున విజయనగరమునకును బిజాపురమునకును పలుమారు కయ్యము సంప్రాప్తమగుచుండెడిది.

(౨) ఉత్కల రాజ్యము :— ఉత్కళదేశమున గాంగుల యధికారము నణగద్రొక్కి క్రీ. శ. ౧౫-వ శతాబ్దిమధ్య బయలుదేరిన నూతనరాజవంశమును చరిత్రకారులు గజపతివంశ మందురు. ఈవంశస్థాపకుడగు కపిలేశ్వరుడు కృష్ణాకావేరుల మధ్యమున పూర్వసముద్రతీరముననున్న విజయనగరరాష్ట్రమును సర్వమును స్వాధీనము చేసికొనెను. ఇతని యంత్యకాలముననో, తదనంతరమో సాళువనరసింగరాజు గజపతులను కృష్ణకుదక్షిణమునుండి వెడలగొట్టెను, కపిలేశ్వరుని పుత్రుడగు పురుషోత్తమగజపతి మరల కృష్ణను దాటి విజయనగరరాజ్యములోని కొండవీడు, ఉదయగిరి మండలములను లోబరచుకొని యచ్చట యుత్కళులయధికారమును మరల స్థాపించెను. తుండీరవిషయములోని కాంచీపురమువఱకు పురుషోత్తముని దాడి నడచినట్లు చెప్పుదురు; కాని యట్లనుటకు దగిన యాధారములు గానరావు. కృష్ణకు దక్షిణమందున్న సముద్రతీరాంధ్రభూమి యంతయు క్రీ. శ. ౧౫౧౪ వఱకును గజపతుల యధీనమం దుండెననుట నిర్వివాదాంశము.

(3) విజయనగరరాజ్యము:— క్రీ. శ. ౧౪౮౫ లో సంగమవంశ మంతరించెను. చంద్రగిరి దుర్గాధిపతి యగు సాళ్వనుండ నరసింగరాయడు కడపటిసంగమ వంశజుని పారద్రోలి విజయనగరసింహాసనము నాక్రమించుకొనెను. అనేకులు సామంతు లందు కంగీకరింపక నరసింగరాజునకు కప్పముకట్టుట మాని స్వతంత్రులగుటకు ప్రయత్నము సేయదొడగిరి. వీరిని లోబరచుకొనుటకై నరసింగరాజు వీరితో యుద్ధములు సేయవలసివచ్చెను. ఈయుద్ధములయందు దాతనికి ఈశ్వరనాయకుడును నరసనాయకుడును మిక్కిలియు తోడ్పడిరి. నరసనాయకుడు ప్రధానియును సేనాధ్యక్షుడునునై రాజ్యాంగచక్రమును ద్రిప్ప మొదలిడెను. సాళువ నరసింగరాజు మరణించునపుడు అర్భకులగు తన పుత్రుల నిరువురను నరసనాయకునకు స్వాధీనపరచి వారిలో రాజ్యాభిషిక్తుడగుటకు నర్హుడు పెద్దవాడగువఱకును వాని పేర వాఁడు రాజ్యము సేయున ట్లేర్పాటుచేసెను. నరసింగరాజు మృతినందినతరువాత వనేకులకు నరసనాయకుని యున్నతపదవి కంటకముగ దోచెను. దక్షిణదేశపు సామంతరాజులు స్వతంత్రులగుటకు ప్రయత్నములు సేయదొడగిరి. రాజ్యము భిన్నము గాకుండవలయునని నరసనాయకుడు పట్టుపట్టుటచేత, అతనికి పై జెప్పినవారితో యుద్ధము చేయవలసెను. మన శాసనమందు జేర్కొనబడిన విజయములందు కొన్ని యట్టి శత్రువులను గెల్చినవే.

శ్రీరంగపట్టణపు ప్రభువు:—ఇతనితో నరసనాయకు డెప్పుడు యుద్ధముచేసినదియు దెలియదు. సాళువ నరసింగరాయలు సజీవుడుగ నుండగనే నడచెనేమో యనుసంశయమునకు గొంత యెడమున్నది. వరాహపురాణములో ఈశ్వరనాయకుడు "శ్రీరంగపట్టంబు బారిసమరి" నట్లు చెప్పబడినది. ఈశ్వరనాయకుడును నరసనాయకుడును శ్రీరంగపట్టణమును ముట్టడించినది యేకకాలమునందె కావచ్చును. అగునేని అప్పటికి నరసింగరాజు సజీవుడే. నరసనాయకుని సైన్యము శ్రీరంగపట్టణమును సమీపించునప్పటికి కావేరి సంపూర్ణప్రవాహముతో నుండెను. నదియొక్క రెండుశాఖలనడుమనున్న పట్టణమును సమీపించుటకు శక్యముగాకుండెను. కాని నరసనాయకుడు నది కడ్డము సేతువును కట్టించి సైన్యమును దాటించుకొని యవ్వలిదరి జేరి దుర్గాధిపతిని సజీవునిగ బట్టుకొనెను. కాని కరుణించివానిని విడుచుటయే గాక వాని రాష్ట్రమును మరల వానికే యప్పజెప్పెను.

చేరరాజు:—నరసరాజు శత్రుండగు చేరరా జెవ్వరో తెలియదు. మళయాళదేశములోని "కొల్లము" నేలుచుండిన రాజగుటకు కొంత యవకాశము గలదు. క్రీ. శ. ౧౫౦౪-వ సంవత్సరారంభమున "కాయల్" అను రేవుపట్టణమునకు వచ్చిన అల్ఫాన్సో అల్బూకర్క్ అను పోర్చుగీసు నావికుడు ఇట్లు వ్రాయుచున్నాడు: "కొల్లపురాజు న్యాయదృష్టి గలవాడు; శూరుడు. విశేషమగు గుఱ్ఱపుదళమును కాల్బలమును గల్గిన 'నరసింగ' (విజయనగరము) రాజుతో యుద్ధము పొసగినప్పుడు, అతడు అరువదివేల విలుకాండ్రతో వానిని జెదర్చి పరాజితుని జేసెను." (Albuquerque's Commentaries, Vol I. p. 11.) క్రీ. శ. ౧౫౦౪-వ సం.నకు ఇంచుక పూర్వము విజయనగరమున రాజ్యముసేయుచున్న రాజు ఇమ్మడి నరసింహరాజు. ఇమ్మడి నరసింహరాజు పేరునకుమాత్రమే రాజు. వాస్తవముగ రాజ్యము సేయుచుండినదియు యుద్ధములు సల్పుచుండినదియు నరసనాయకుడే. కావున "కొల్ల"పురాజుచే నోడింపబడిన 'నరసింగ' దేశపు రాజును అతడే. నరసనాయకుడు క్రీ. శ. ౧౫౦3-వ సం. లో స్వర్గస్థుడైనట్లు తెలియుచున్నది. కావున "కొల్ల"పురాజు నరసనాయకునితో యుద్ధము తత్పూర్వమే చేసియుండవలయును. క్రీ. శ. ౧౫౦౧-వ సం. నాటిది నాగమనాయకుని శాసన మొకటి రామనాథపురం జిల్లాలోని శివపురియందున్నది. (M. E. R. 16 of 1928-29) ఈ నాగమనాయడు సాళువనరసింగరాయల కాలము నుండియు విజయనగరరాజులకడ నుండిన సర్దారుడు. ఇతని శాసన మంతదక్షిణమున నగపడుటకు కారణము రాయ లితనికి అమర మాగాణిని ఈప్రాంతమున పాలించుటయే. ఈప్రాంతమున నున్న శత్రువులనందరిని నిహతులను చేయకపోయిన నచ్చట విజయనగరసంస్థానాశ్రితుడగు నాయకు డెవ్వడును అమరగ్రామముల ననుభవించియుండజాలడు. కావున నరసనాయకుడు

క్రీ. శ. ౧౫౦౧ లోనో దానికి కొంచెము ముందో దక్షిణదిగ్విజయమును సాగించియుండవలయును.

చోళుడు:—ఇతడు తొండమండలమునకు దక్షిణమునను మధురకు ఉత్తరమునను గల రాజ్యమున కధిపతి. వరదాంబికాపరిణయమున నీచోళుని వృత్తాంతము కొంత గలదు. నరసరాజు తుండీరమండలమునుండి సైన్యముతో చోళదేశమును బ్రవేశించెను. ఆదేశపు రాజు నరసరాజుసైన్యమును ఎదుర్కొని ఉపద్రవము కలుగజేయుచువచ్చెను; కాని నరసనాయకుడు కావేరిని దాటి దక్షిణతటమున విడిసెను. మంత్రులు చెప్పు హితవాక్యములను సరకుగొనక చోళుడు నరసనాయకుని యుద్ధమున నెదుర్కొనెను; గాని యోడిపోయి శత్రువుచే జిక్కెను. తరువాత నరసనాయకుడు చోళుని రాజధానిని బ్రవేశించి, యచ్చట కొన్నిదినము లుండెను. చోళరాజు తప్పించుకొని సముద్రతీరప్రాంతములకు పారిపోయెను. పిమ్మట నరసనాయకు డచ్చటనుండి బయలుదేరి మధురాపురమునకు బోయి యాపురపాలకు డొసంగిన కానుకలను గైకొనెను.

పాండ్యుడు:—పాండ్యు డన్నంతమాత్రముననే అతడు మధురాపురమును రాజధానిగ చేసుకొని పాండ్యమండలము నేలుచుండెనని మన మూహించరాదు. ఏలన, అప్పుడు మధురలో ఇతరరా జొక్కడు రాజ్యము సేయుచుండెను. తిరునల్వేలిమండలములోని తెంకాశినగరము రాజధానిగ పాండ్యు లీకాలమున కొంతదేశమును పాలించుచుండిరి. నరసరాజు జయించిన పాండ్యుడు తత్సంబంధికుడై యుండునేమో! అచ్యుతరాయాభ్యుదయమందు నరసనాయకుడు కోనేటిరాజను నొకదొరను జయించినట్లు వ్రాయబడినది. మధురాప్రవేశము తరువాత ఈవిజయము పేర్కొనబడిన కారణముచేతనే మెం మామిత్రులు రంగస్వామిసరస్వతిగారు సదరు కోనేటిరాజు 'కోనేరిన్ మైకొండన్' అను పాండ్యరాజుగా నుండవచ్చునని యూహించుచున్నారు. కాని, ఈకోనేరిన్ మైకొండ దెవ్వరైనదియును వారు నిర్ధారణ చేయలేదు. కోనేటిరాజును, కోనేరిన్ మైకొండడును ఒక్కరేనా యన్న సంశయము కలుగుచున్నది. ఈవిషయము భావిపరిశోధనమీద గాని నిర్ధారణ చేయుటకు వీలుగాదు.

మానభూషణుడు:—మనశాసనమున నితడు మధురావల్లభుడనియు, ఇతని నోడించియే నరసనాయకుడు మధురను గొనెననియు జెప్పబడినది. నరసనాయకుడు మధురను బట్టుకొన్న విషయము ఆకాలపు గ్రంథములయందును వర్ణింపబడియున్నది. అచ్యుతరాయాభ్యుదయములో,

"కంసం యథా కైటభజి ద్బలేన
సమన్వితః సైనిక మల్లహన్తా,
మదప్రవృత్తం మరవం మథిత్వా
మహీమహేన్ద్రో మధురా మహార్షీత్.
మహేన్ద్రలోకం మరవాయ దత్వా
మధ్యేసమీకం మధురాం స జగ్రహే."

అని యున్నది.

ఇందువల్ల నరసరాజు మధురాపురమును, మరవకులజుడగు తత్ప్రభువును జంపి, కొనెనని తెలియుచున్నది. వానిపేరే మానభూషణుడుగ నుండవలయును. ఈ మానభూషణుడు పాండ్యవంశజుడని యనేకులు దలచుచున్నారు. దీనికి విరోధముగ పారిజాతాపహరణమునందు నరసరాజు "చోళవల్లభునకు సురవధూమనురాధరము లిచ్చి మధురాపురంబు గొని"నట్లు ముక్కుతిమ్మన వ్రాయుచున్నాడు. ఇందువల్ల నొక నూతనసమస్య బయలువెడలుచున్నది. మానభూషుడు మరవకులజుడును, చోళవల్లభుడు నని తేలుచున్నదిగదా? అట్లయిన ఇతడు నరసనాయకునిచే కావేరి తీరమున నిర్జితుడగు చోళరాజగునా? కాదనుటకు కొంత యాధారము గలదు. (౧) మన శాసనమున "చేరం చోళంచ పాండ్యం తమపిచ మధురావల్లభం మానభూషం" అని చోళుడును మధురావల్లభుడును వేర్వేరుగ పేర్కొనబడియున్నారు. (౨) వరదాంబికాపరిణయములో నరసనాయకునిచే నోడింపబడిన చోళుడు పారిపోయెనే గాని చంపబడలేదు. అచ్యుతరాయాభ్యుదయమునను పారిజాతాపహరణమునను మధురప్రభువు నరస

నాయకునిచే నిహతుఁడైనట్లు వ్రాయబడియున్నది. కావున చోళదేశప్రభువగు చోళరాజును మధురావల్లభుఁడును మరవకులజుఁడును మానభూషణనామధారియు నగు చోళ రాజును భిన్నపురుషు లనుమాట పొసఁగుచున్నది. అయి నప్పటికిని ఈవిషయము చక్కఁగ శోధింపదగినది.

తురుష్కుఁడు:—ఈ తురుష్కరా జెవ్వఁడు? ఇతనినిగురించి ఆకాలపు గ్రంథకర్తలు కొంత వ్రాసి యున్నారు.

"పారసీకునకు దుర్భరమానవత్వంబు దొలఁగించె మానవదుర్గసీమ" అని ముక్కుతిమ్మన.

"మహీపతి ర్మానవనామ దుర్గం
శకాధినాథేన సమం గృహీత్వా,
స్ఫుటీచకా రాస్య పున ర్వితీర్య
శర్యాం తథౌదార్య మహార్యచర్యమ్."

అని రాజనాథడిండిముఁడు.

"తతో వినిర్గత్య సత్వర ముత్తరాం హరితం అభి ప్రస్థితవతి మణ్డలీకసార్వే తదీయధామోహమ్నా మసహ మానః శక్రముఖానేకమహీనాయకానుగమ్యమానః కాంభోజబాహ్లీకముఖాతుఖారఖంఖాణ తురగఖింఖాసంప్లుత స్థపుటితధరణీతలోऽపి సురత్రాణః ప్రాణత్రాణపరాయ ణో దుర్గమం మానవదుర్గం తత్ క్షణ మధ్యరుక్షత్.

త్రాసా ద్ద్రుతం మానవదుర్గమధ్యే
కృత్వా సురత్రాణవరాహపాదమ్,*
అముష్య తానుగ్రహధీ స్స ధీరో
గృహీత మబ్ధిం కిల కుంభజన్మనా."

అని తిరుమలాంబ.

ఇందువల్ల నరసనాయకునిచే మానవదుర్గమున పరాజయము నందిన తురుష్కరా జొక సురత్రాణుడు; అతనికిని వరాహపాదుడన్న పేరుగూడ గలదు. సపాదు డని బిజాపురపు సుల్తానును ఆకాలపు హిందూగ్రంథ కర్తలు పేర్కొనియున్నారు. వరాహపాదుడను సుర త్రాణుడును బిజాపురపురాజై యుండునా? అట్లనుటకు కొంత యాధారము గలదు. అరవీటిబుక్కరాజుమనుమ డను అవుకుతిమ్మరాజు మానవదుర్గమున ఏదులఖానుని జయించినట్లు చెప్పబడియున్నది.

"కడిమిమై మానవకడ రణక్షోణి
గడుసరి యేదులఖాను జయించె."

—బాలభాగవతము.

ఈయుద్ధప్రశంస రామరాజీయమునందును గలదు.—

"మానవకడ సవా బూని పోరను బరాజయము నొందించెనే శౌర్యశాలి"

అని. మానవదుర్గముచెంత యుద్ధము సల్పిన విజయనగ రపు సర్దారు లింకను కొందఱుకలరు. రావిళ్ల ఇమ్మడి కొండనాయకుఁడు ఇచ్చట బోరినవీరులలో నొక్కఁడు. సౌగంధికాపహరణ మను గ్రంథమున మానవదుర్గముకడ జరగిన యుద్ధము చక్కఁగా వర్ణింపబడియున్నది.—

" రాజీవతేజుండు రావిళ్ల లింగ
భూజాని కొండభూభుజుడు మోదమున
* * * *
పొదలుచు మానవపురిచుట్టు చేరి
పదరు శేకుల శాహుబలములమీఁద
కొదుకక హరిణంపు గుంపులమీఁద
కొదమసింగము జొచ్చు కొమరు చెన్నొందు
తేజీని చేసన్న ధీయని నూకి
యాజిరంగము జొచ్చి యహితసైన్యముల
గకవికల్ గావించి గద్దించి వరికి
ప్రకటించి తవపేరు వాసివోనీక
నడుటురేవంతుల నొరయు వశీర్ల
పొదలు దునేదార్ల పుడమిపై గూల్చి
హత్తి వెంబడి వచ్చు నవనీశులెల్ల
ఉత్తరంబున వెన్క దండలు వెట్టి
నిరుమెల నలకిన సేదిక్కు గన్న
ధర డొల్లియాడెదు తలలు పై నెగసి

* "వరాహపాదమ్" అనుపాఠము సరియైనదికాదు. ఏ తురకరాజును వరాహపాదు డను బిరుదును ధరించియుండడని నిశ్చయముగ జెప్పవచ్చును.

పడెడు కండలు చెట్టువారు రక్తములు
పొడిపైన యలుగులు బొలియు రాహుతులు
గలిగి యొప్పెడు మహాకదనరంగమున
వలుకు బెళుకును లేక పనిజేయువేళ
వేనూరువెడగాడి వీపున వెడల
గాయముల్ మణిపదకంబులు గాగ
వెక్కసంబున మొనవిరిగిన యలుగు
లక్కజంబుగ దారహారముల్ గాగ
*        *        *        *
ఆ చంద్రతారార్క మగునట్టికీర్తి
భూచక్రమున నింపి పోరిలో వెలసె."

కాబట్టి నరసనాయకునితోగూడ అవుకు తిమ్మరాజు రావిళ్ల లింగయ కొండమనాయకు మొదలగువీరులు మానువదుర్గముకడకు స్వదళములను గూర్చుకొనిపోయి నవాయము నామాంతరముగల యీదులఖానునితో ఘోరముగ పోరి విజయమునందిరి. మానువ చేరొక్కనకపోయినను మహమ్మదీయచరిత్రకారు డగు ఫెరిస్తా ఈ యుద్ధవృత్తాంతమును సంగ్రహముగ దన చరిత్రయందు బొందుపఱచియున్నాడు.

యూసఫ్ అదిల్ ఖానుడు క్రీ. శ. ౧౪౮౯-వ సంవత్సరమున బిజాపురమునందు దన స్వాతంత్ర్యమును బ్రకటించెను. ఇది బాహమనీసుల్తానగు నాల్గవ మహమ్మదు సర్దారులలో నొకడగు కాసింబరీదునకు ఇష్టపడలేదు. "బిజాపురమున రాజ్యమును స్థాపించు నుద్దేశముగల కాసింబరీదు దురుష్కుడు తనస్వామియగు (సుల్తాను) మహమ్మదుషా ముదుకల్ రాయచూరు దుర్గములను యూసఫ్ అదిల్ ఖానుకడనుండి విజయనగరరాయులు స్వాధీనపఱచుకొనుపక్షమున (రాయలకు నవరు దుర్గముల) నిచ్చివేయ నిశ్చయించినాడని యొక లేఖను రాయలపేర వ్రాసెను. అట్లే గోవా, దురియాబార్ (కొంకణము) అను స్థలముల నేలు ప్రభువుగ బహదూర్ జిలానీ అనువానిని యూసఫ్ అదిల్ ఖానునిరాజ్యముపై దండువెడలమని పురికొల్పెను.

"విజయనగరపురాయుల సేనాధిపతియగు తిమ్మరాజు తుంగభద్రను దాటి ముదగల్లురాయచూరు దుర్గములవఱకు గల దేశమును పాడుచేసెను. బహదూర్ జిలాని జంఖండియను దుర్గము నాక్రమించుకొనెను. యూసఫ్ అదిల్ ఖాను ఈశత్రువులను ఎదురొక్కలేనట్టి దుర్బలస్థితిలో నుండెను. కావున అతడు తిమ్మరాజుతో సంధిగావించుకొనిబహదూరుజిలానీని దనదేశమునుండి వెడలనడిచెను." (Brigg's Ferishta, Vol.III, p. 10.)

ఫెరిస్తావ్రాతవల్ల నరసనాయకుడు మానువదుర్గమును షుమారు ౧౫౧౦ వ సం.. ప్రాంతమున జయించినట్లు తెలియుచున్నది. అప్పటి కింకను సాళువనరసింగరాయడు సజీవుడై యుండెను.

గజపతి:—నరసనాయకుడు జయించిన గజపతి యుత్కళనృపాలురయం దొకడు కావలయును. కపిలేశ్వరుడు కాజాలడు; ఏలన, అతడు క్రీ. శ. ౧౪౭౬ ప్రాంతముననే మృతినందెను. అప్పటికి నరసనాయకు డింకను బాల్యదశయందే యుండియుండును. అతడు పోరిన గజపతి ప్రాయశః పురుషోత్తముడో, యాతని పుత్రుడగు ప్రతాపరుద్రుడో కావలయును. నరసనాయకుని యుద్ధకాల మెఱుకపడిన గాని వారిద్దరియందు అతనితో బోరిన గజపతి ఫలానివాడని నిర్ధారణసేయుటకు వీలుగాదు. వరదాంబికాపరిణయమందు నరసనాయకుడు మొదట తూర్పుదిశను గెల్చినట్లు చెప్పబడియున్నది. విజయనగరమునకు తూర్పున కర్ణాటకరాజుల శత్రువుల యధీనమందున్నవి ఉదయగిరి కొండవీడుమండలములే. కావున నరసనాయకుడు తూర్పున గెలిచిన రాష్ట్రము ఈ రెండుమండలములలోకి యొకటివయైనదిగా నుండవలయును. క్రీ. శ. ౧౫౧౪ వఱకును ఉదయగిరికొండవీడు మండలములు గజపతుల యధీనముననే యుండుటవలన నరసనాయకు డీదిక్కున గెల్చిన దేశవిస్తీర్ణ మత్యల్పమనుట నిశ్చయము.

బిరుదులు:—ఇందు బిరుదులు కృష్ణాచ్యుతరాయలకే కలవు. నరసనాయకునకు గాని, వీరనరసింహరాయలకు గాని బిరుదులు లేవు.

కృష్ణరాయల బిరుదులు:—భాషెకు తప్పువరాయరగండ, రాజాధిరాజ, రాజపరమేశ్వర, మూరురాయరగండ,

హిందూరాయసురత్రాణ, దుష్టశార్దూలమర్దన, వీర ప్రతాప. (పంక్తులు ౫౮-౫౯.)

అచ్యుతరాయల బిరుదులు:— రాజాధిరాజ, పరరాజ భయంకర, ఏకవీర. (పంక్తులు ౬౯-౭౦.)

ఈబిరుదులన్నియు తుళువరాజులకు సంగమవంశజులకడనుండి సంక్రమించినవి. వీనివల్ల పైవారి పరాక్రమాదులు తెలియజాలవు. ఇందు రాజాధిరాజ, రాజపరమేశ్వర బిరుదులు బాదామికళ్యాణిచాళుక్యులకు గలవు. తరువాతివారు కొందరీబిరుదులను కదాచిత్తుగ వహించిరి. కాని చాళుక్యులతరువాత వీనిని సామాన్యముగ నుపయోగించినది విజయనగరపు రాయలే.

“ భాషెగెతప్పువరాయరగండ ” విజయనగరపు రాయలకుదక్క మరియెవ్వరికిని లేదు; “హిందూరాయసురత్రాణ” యనునదిగూడ నిట్టిదే; కాని తెలింగాణము నేలిన రెండవకాపయనాయకునికి గల“ఆంధ్రసురత్రాణ” యను బిరుదునకును దీనికి నేదో సంబంధమున్నట్లు తోచుచున్నది. ‘మూరురాయరగండ’ యన్నది పురాతనమైన బిరుదు. ఇది రావువారికి గలదు. “మూరురాయజగద్దళన” అను కాకతీయుల బిరుదు దీనియొక్క రూపాంతరముగా గన్పట్టుచున్నది. ఈబిరు దెప్పుడు వాడుకలోనికి వచ్చినదో, ‘మూరురాయ’ లెవ్వరో తెలుసుకొనుట కవకాశము లేదు. తక్కిన బిరుదులు సర్వసామాన్యమైనవి. శూరుల కందరికి నుండదగినవే.

అచ్యుతరాయల తల్లి:—ఈ శాసనమున నరసనాయకుని కుటుంబము వర్ణింపబడినది. అతడు పెండ్లాడిన భార్యలీక్రిందిశ్లోకమున చేర్కొనబడియున్నారు:

తిప్పాజీ నాగలాదేవ్యోః కౌసల్యా శ్రీ సుమిత్రయోః
దేవ్యోరివ నృసింహేంద్రా త్తస్మా త్పం క్తిరథాదివ.

వారికి చెరియొక పుత్రుడుపుట్టెను:—

వీరౌ విజయినౌ రామలక్ష్మణౌ ఇవ నందనౌ
జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయమహీపతీ.

తరువాత,

కృతవతి సురలోకే కృష్ణరాయే నిజాంశం
తదను తదనుజన్మా పుణ్యక ర్మాచ్యుతేంద్రః,
ప్రకట మవనిలోకం స్వాంశమేత్యారిజేతా
విలసిత హరిజేతా విశ్వదిష్టప్రదాతా.

అని యున్నది. అచ్యుతరాయలుగూడ నాగలాదేవి కుమారుడా? కాడని మన మెఱుగుదుము. అతనితల్లి పేరు ఓబాంబయని అచ్యుతరాయల శాసనములు కొన్నిటివల్ల దెలియుచున్నది. అచ్యుతరాయల తామ్రశాసనముల నన్నిటిని పరిశోధించి చూడగా క్రీ. శ. ౧౫౩౦-౩౮ ల మధ్యకాలపు శాసనములలో నాతనితల్లి పేర్కొనబడ లేదు. తరువాతికాలమునందుగూడ కొండవీడురాజ్యమునకు సంబంధించిన శాసనములలో నోబాంబికప్రస్తావము లేదు. అయితే శ. ౧౪౫౫ కు సరియగు విజయ సం. కార్తిక శుద్ధ ౧౨ ఉత్థానద్వాదశినాడొసగిన చిత్రదుర్గపుసీమకు సంబంధించిన ఒకతామ్రశాసనమున అచ్యుతరాయల తల్లి యగు నోబాంబ పేరు గానవచ్చుచున్నది. అందు అచ్యుతరాయల యితరశాసనములలోవలె “ తిప్పాజీ నాగలాదేవ్యోః” అని నరసనాయకుని భార్యల నిద్దరి నొక్క శ్లోకమున చేర్కొనియుండుటచేత మూడవభార్యయగు నోబాంబికనుగూడ నీసందర్భముననే చేర్కొనుట సమంజసముగ గన్పట్టుచున్నది. శాసనరచయిత యేకారణముననో అట్లు సేయక, “తిప్పాజీనాగలాదేవ్యోః” అను శ్లోకముతరువాత “వీరౌ విజయినౌ” యనుశ్లోకము వ్రాసినాడు. తరువాత,

“తస్మా దోబాంబికాదేవ్యా మచ్యుతేంద్రమహీపతిః
దేవక్యాం దనుజారాతి ర్వసుదేవాది వాభవత్.”

(E. C. XI. Vol. 132.)

అని యోబాంబ వర్ణింపబడినది. ఇట్లు తిప్పాజీనాగలాదేవులనుండి యోబాంబ వేర్పఱచబడినది. ఇంతే కాదు. పంక్తిరథునికివలెనే నరసనాయకునికిని ముగ్గురు సతులుండినను, “తిప్పాజీనాగలాదేవ్యోః కౌసల్యాశ్రీసుమిత్రయోః” అన్నకవి యోబాంబను దశరథుని తృతీయపత్నియగు “కైకయి”తో బోల్చవలసియుండగా నట్లు సేయక,

"దేవక్యాం దనుజారాతి ర్వసుదేవాది వా భవత్" అని యుపమను మార్చినాడు. తిప్పాజీనాగలాదేవులనుండి వోబాంబను వేర్పరచుటకును, పంక్తిరథుడన్నదానిని వసుదేవుడుగ మార్చుటకును గల కారణమేమి? పంక్తిరథుని మూడవభార్యయగు కైకయి యార్జించుకొనిన దుర్యశమే కారణ మగునా?

ఈసందర్భమున విచారించదగిన దింకొకటి గలదు. కృష్ణరాయల దానశాసనములలో గాని, ఆయనచే విరచితమనబడు నాముక్తమాల్యదయందుగాని, ఆయన కితరకవు లంకిత మొసగిన ప్రబంధములయందు గాని, అచ్యుతరాయలయొక్కయు, నతని తల్లియొక్కయు ప్రస్తావనయే లేదు. దీనిని రెండువిధములుగ సమర్థింపవచ్చును. (౧) అచ్యుతరాయలపైని యనూయచేత కృష్ణరాయ లతనిని గాని యతని తల్లిని గాని తన దానశాసనములలోను గ్రంథములలోను పేర్కొనలేదు. అతని యాశ్రితులగు కవులు ప్రభువును సంతోషపఱచుటయే పరమావధిగా గలవారగుటచే వారిమాట ఎత్తకపోయిరి. లేక (౨) కృష్ణరాయలు సింహాసనమున దనకు పూర్వమధిష్ఠించినవారినే పేర్కొనెను. ఈతత్కారణమువల్ల నచ్యుతరాయని పేర్కొనలేదు. ఈసమాధానములు రెండును వీరనరసింహరాయలపట్ల చెల్లవు. తన సోదరుల నెవ్వరిని పేర్కొనవలసిన యవసరమే యతనికి లేదు. అయినప్పటికిని తన కనిష్ఠుడయిన కృష్ణరాయని నాతనితల్లియగు నాగాంబను దన శాసనములయందు పేర్కొని యచ్యుతరాయలనుగాని యతని జననియగు ఓబాంబను గాని ప్రస్తావించలేదు. ఏలనో? ఓబాంబ పుట్టుకయందు కళంక ముండుటచేతనా? అట్టి కళంకమేమియు లేదని యచ్యుతరాయాభ్యుదయమువల్ల విశదమగుచున్నది. ఆమె సూర్యవంశజుడగు రాచిరాజునకు అతనిభార్యయగు రామాంబికయందు బుట్టిన కన్యక. కావున నామె క్షత్రియవంశజాతయే. అయితే వీరనరసింహరాయ లామె నేల పేర్కొనలేదు? ఆమెగర్భమున బుట్టిన యచ్యుతదేవరాయ లేల నామెపేరును దన రాజ్యారంభకాలమునాటి శాసనములలో ఎత్తలేదు? ఈప్రశ్నలు నిరుత్తరములుగ నుండవలసిన ట్లున్నది.

ఇంకొక విశేషము: అచ్యుతరాయల మొదటి యారుసంవత్సరములనాటి శాసనములను జదివిన నాతనికి సోదరు లున్నట్లు దెలియరాదు. అచ్యుతరాయాభ్యుదయము, వరదాంబికాపరిణయము నను గ్రంథములయందు నోబాంబ కొక కుమారు డున్నట్లే వ్రాయబడియున్నది. క్రీ. శ. ౧౫౩౬-౭ లకు పూర్వము అచ్యుతరాయలచే దత్తమైన శాసనములలోగూడ నతనికి సోదరు లున్నట్లు వ్రాయబడలేదు. క్రీ. శ. ౧౫౩౪-౩౫ నాటిదగు ఓబాంబను ప్రప్రథమమున పేర్కొను చిత్రదుర్గశాసనమందు సైతము ఓబాంబికకు అచ్యుతరాయ లొక్కడే పుత్రుడైన ట్లున్నది. కాని శ. ౧౪౫౭ మన్మథపుష్యశుద్ధ ౧౨ (క్రీ. శ. ౧౫౩౫-౩౬) నాటి శాసనమున, "తిప్పాజీ నాగలాదేవ్యోః", "వీరా వినయినా" అనుశ్లోకములవెనుక,

> "రంగక్షితీంద్రాచ్యుతదేవరాయౌ
> రఘూద్వహేణా వివ రామకృష్ణౌ,
> ఓబాంబికాయాం నరపక్షితీంద్రా
> దుభౌ వభూతా మురగేంద్రసారౌ."

అనుశ్లోకము గలదు. (L. R. Vol. 56, మండపల్లి, పుట 587.) ఇట్లే క్రీ. శ. ౧౫౩౭-౩౮-వ నాటి యొక మైసూరుశాసనమున ఓబాంబికయు రంగక్షితీంద్రుడును పేర్కొనబడియున్నారు. (E. C. V, B. L. 197.)

క్రీ. శ. ౧౫౩౫-౩౬ లకు పూర్వకాలమందలి యచ్యుతరాయల శాసనములలో రంగక్షితీంద్రు డేల పేర్కొనబడలేదు? ఈరంగక్షితీంద్రుడు సదాశివరాయల తండ్రి. అచ్యుతరాయలకును, రంగక్షితీంద్రునకు గల మనస్పర్థలవల్ల, అతనిపేర నచ్యుతరాయలు ప్రస్తావించలేదా? ఉండవచ్చును: అట్లయిన క్రీ. శ. ౧౫౩౫-౬ లోమాత్ర మేల ప్రస్తావించెనుకా? ప్రశ్నల కిచ్చుట కష్టముగా జవాబు వ్రాయుచున్నాము. ఇచ్చుట పూర్వచరిత్రను గొంత దడవుట యావసరము:

కృష్ణరాయలు తనపుత్రుడగు తిరుమలరాయలు మృతినందినతరువాత నతడు తిమ్మరసుకుమారుని విషప్రయోగమువల్ల మడిసెనని విని, తిమ్మరసు, నతనిబంధువులను చెరయందు బంధించి తరువాత వారి కన్నుల నూడబీకించెనని న్యూనిజా వ్రాసియున్నాడు. ఇది

నిజము గాదనుటకు దగిన యాధారము లెవ్వియును గాన రావు. తరువాత కృష్ణరాయలు దనపిమ్మట సింహాసనాధిష్ఠాన మొనర్చుటకు దగు నేర్పాటులను జేసెను. రాజ్యకార్యములయందు తనకు జేదోడు వాదోడుగ బనిసేయుచున్న తిమ్మయల్లుడును ప్రధానమంత్రియును నగు నళియ రామరాజునకు దన మరణానంతర మచ్యుతరాయలను సింహాసనము నెక్కించి యాతనికి మంత్రిత్వము సేయవలయునని నుడివియుండెను. తరువాత కొంతకాలమునకు కృష్ణరాయలు మృతినందెను.

అళియరామరాజుకు కృష్ణరాయల యాజ్ఞ మేరకు అచ్యుతరాయలను సింహాసనము నెక్కింప నిష్టము లేదు. కారణ మేమన, రాజ్యమున దనకు పూర్వ మున్నంత పలుకుబడి యుండకపోవచ్చునన్న భయము. కావున నతడు అచ్యుతరాయలసింహాసనాధిష్ఠానమును భంగపఱచవలయునని సర్వప్రయత్నములు చేసెను. కృష్ణరాయలు చనిపోవునప్పుడు ఆయనకు పదునెనిమిది మాసములయీడు గల కుమారు డొక డుండెను. ఈకుమారుని చక్రవర్తియుని ప్రకటించి రామరా జతని పేర ప్రభుత్వము సేయ సమకట్టెను. కాని ప్రయత్నము కొనసాగదయ్యెను. వీలన, చోళమండలమునకు నాయకుడగు సాళువనాయకుడు ప్రధానిరైు యచ్యుతరాయలపక్షము వహించి సింహాసనమును గాపాడుచు రామరాజుప న్నాగమును సాగనీయకపోయెను. అప్పు డచ్యుతరాయలు చంద్రగిరియందుండెను. కృష్ణరాయల మరణవార్తయు రామరాజు యొక్క ప్రయత్నములను నెఱిగి యతడు రాజధానికి బోక తిరుపతియందును కాళహస్తియందును రెండుమారులు పట్టాభిషేకములను జేసుకొని విజయనగరమునకు తిరలెను. కొన్నిరోజులకు రాజధానిని చేరెను. తరువాత రామరాజుతో సంధి యొనర్చుకొనెను. కృష్ణరాయల కుమారుడు రామరాజుపోషణయం దుండుటవలనను, ఆ కుఱ్ఱవాడు సజీవుడై యున్నంతకాలము సింహాసనము నధిష్ఠించుహక్కు వానిదగుటచేతను, అచ్యుతరాయలు రామరాజుతో సంధి కొప్పుకొనవలసివచ్చెను. ఈసంధి షరత్తులప్రకారము అచ్యుతరాయలును రామరాజును సమానాధికారముతో రాజ్యము సేయుట కంగీకరించిరి.

ఇట్లు రాజ్యము మూడుసంవత్సరములు జరిగినది. పిమ్మట కృష్ణరాయల కుమారుడు పరమపదించెను. అటు తరువాత రామరాజును రాజ్యపాలనమున దనతో సమానమైన హక్కు ననుభవించనీయవలసిన యవసర మచ్యుతరాయలకు దీరిపోయెను. కావున నతడు రామరాజును పూర్వమువలె గాక మారుదృష్టితో జూడదొడగెను. తన బావమరదులను సలకము సోదరులకు రాజ్యమును సర్వము నప్పజెప్పెను. ఇది జరిగినది క్రీ. శ. ౧౫౩౩-౩౪ లయందు. ఓబాంబపేరు ప్రథమమున గన్పట్టుచున్నది ఈకాలపు శాసనములోనే.

రామరాజు తాత్కాలికముగ మిన్నకుండవలసివచ్చెను కాని సమయమునకు వేచియుండెను. సమయము నచిరకాలముననే కొరకెను. క్రీ. శ. ౧౫౩౪-౩౫ లో అచ్యుతరాయలు బిజాపుర రాజ్యముపై దండెత్తి రాయచూరును ముట్టడివేసెను. రాజ్యము సంరక్షించుకొనుటకై బిజాపురపుసుల్తానగు మల్లూ అదిల్షా స్వసైన్యముతో నచ్చటికి వచ్చి యుద్ధముచేసెను గాని యుద్ధమున నోడిపోయి సంధిగావించుకొనెను.

అచ్యుతరాయలు కృష్ణాతుంగభద్రల యంతర్వేదులలో తురకరాజుతో యుద్ధము సేయుచున్న కాలములోనే గుత్తిరాజ్యమునందు అల్లరులు రేగెను. అచ్చట తిమ్మనాయడను నమరనాయకుడు గుత్తికోటను స్వాధీనపఱచుకొని అచ్యుతరాయల యధికారమును సాగనియ్యకపోయెను. ఈతిమ్మనాయడే గండికోటప్రభువగు పెమ్మసానితిమ్మా నాయ డగునేని, అతడు రామరాజుమిత్రుడు గాన రామరాజున కీపితూరియందు కొంతసంబంధ మున్నదని నుడువవచ్చును. అచ్యుతరాయ లీపితూరివార్త విని గుత్తికి సైన్యముతో కూడ వచ్చి కోటను పట్టుకొని తదనంతరము తిరుపతికి స్వామిదర్శనార్థము వెళ్లెను. తరువాతి చరిత్ర మంతస్పష్టముగా తెలియుటలేదు. కాని అచ్యుతరాయలు రాజధానికి చేరినపిమ్మట రామరా జాతని బంధించెను. ఇది క్రీ. శ. ౧౫౩౬ లో జరిగినది.

అచ్యుతరాయలను బంధించినవెనుక రామరాజు స్వయము పట్టాభిషేకము జేసుకొనవలయునని ప్రయత్నము జేసెను. కాని రాజ్యములోని దొరలు సామంతు

లందు కంగీకరింపరైరి. రామరాజు మార్గాంతరమున న్వేషింప మొదలిడెను. అచ్యుతరాయల యన్నయగు శ్రీరంగరాయలకు సదాశివరాయలను కొమారు డుండెను. ఈత డంతటి నిర్వాహకుడు గాడు; కాని యచ్యుతరాయల యన్నకొడుకగుటచేత, కృష్ణరాయల కుమారుడు మృతిబందినవెనుక సింహాసనము నెక్కుటకు అచ్యుతరాయలకంటె యతనికే యతిశయముగు హక్కు గలిగియుండెను. స్వయము రాజులుకు వీలు లేకపోయినను, నిర్వాహకుడుగాని సదాశివుని రాజ్యాభిషిక్తునిగ జేసిన నాతనికి ప్రతిగ తాను రాజ్యముసేయవచ్చునని రామరాజు యోజించి సదాశివరాయలు చక్రవర్తియని ప్రకటించి రాజ్యము సేయ దొడగెను.

రామరా జిట్లు రాజ్యము నాక్రమించుకొన్నను అమరనాయకులలో ననేకు లతనికి లొంగక, కప్పము నియ్యక యెదురుదిరిగిరి. వీరిలో ముఖ్యులు దక్షిణరాజ్యములవారు. తన యధికారమును స్థాపించుటకై రామరాజు సైన్యముతో గూడ దక్షిణమునకు పోయి వారిని జయించి కప్పము గొని విజయనగరమునకు తిరిగి వచ్చుచు మార్గమున విజయనగరమునకు దక్షిణ దిగ్భాగమున పోతరించియున్న యమరనాయకుని నెదుర్కొనెను. ఇరువురికిని ఆరునెలలపాటు యుద్ధమైనను రామరాజునకు జయము చేకూరినది కాదు. ఇంతే కాదు. దగ్గరనున్న ధనము వ్యయమాయెను. ధనము లేక యుద్ధము జరుగుట కష్టమాయెను. కావున నతడు విజయనగరమున నున్న తన కార్యకర్తకు రాయబొక్కసమును దెఱచి పైకము పంపుమని నిరూపమును బంపెను. ఆకార్యకర్తయు రామరాజునాజ్ఞమేరకు భండారమును తెరపించెను; కాని యపారమైన ధనమును జూడగనే యతని హృదయము చలించెను. అంతటిధనము తన స్వాధీనమందున్న విజయనగరమును దానే యేలవచ్చునుగదా యని తలచి రామరాజునకు ధనమంపక స్వామిద్రోహము చేసెను. ఇంతే కాదు. అచ్యుతరాయని చెరనుండి విముక్తుని గావించి యతని బావమరదియగు సలకరాజు పెదతిరుమలరాజుతో సఖ్యము నెరపి, ప్రధానిపదమును వహించి రాజ్యచక్రమును ద్రిప్ప మొదలిడెను. కాని వాని యధికారము చాలకాలము సాగలేదు. ఏలన, సలకరాజు తిరుమలరాజు తనిని జంపించి తానే ప్రధానియాయెను.

యుద్ధరంగమున నున్న రామరాజునకు తన కార్యకర్త యొనర్చిన ద్రోహము దెలియవచ్చెను. తత్క్షణమే యతడు తాను పోరుచున్న యమరనాయకునితో నొడంబడిక చేసుకొని విజయనగరమునకు బయలు దేరెను. కాని యాతని గొలుచుచుండిన దొర లొక్కరొక్కరుగ యాతని త్యజించి పో మొదలుపెట్టిరి.

ఇంతలో తురకలు విజయనగరముపై దండెత్తి వచ్చిరి. క్రీ. శ. ౧౫౩౪-౩౫ లో బిజాపురము నేలుచున్న మల్లూ అదిల్ షా స్థానభ్రష్టుడాయెను. అతని తమ్ముడగు ఇబ్రహీంఅదిల్ షా సింహాసనము నెక్కెను. అతడు తనమంత్రియగు నసాద్ఖానునిచే ప్రేరితుడై దండెత్తి వచ్చి విజయనగరమును ముట్టడివేసెను. రామరాజునకీసంగతి దెలియగనే విజయనగరమునకు బోవు నుద్యమము మాని దూరమున నొకకోటకు బోయెను.

తురకల బలము దుర్జయమైనది కాదు; కాని తురకలతో యుద్ధముసేయ నచ్యుతరాయలును రామరాజును వెరచిరి. ఏలన, వీరిలో నెవ్వరైన నొకరు తురకలపై గత్తిదూసిన రెండవపక్షమువారు వారి కాశ్రయమిచ్చి దమ్ము దుదిముట్టింతురన్న భియముచేత. తురకరాజీసంగతి నెఱింగి నిర్భయుడై విజయనగరముద్వారము కడ పీఠాసనము వేసుకొని కూర్చుండెను.

ఇంతలో అహమదనగర సుల్తాను బిజాపురరాజ్యముపై దండెత్తివచ్చెను. అందుచే అదిల్ షా విజయనగరమును వదలిపోవలసివచ్చెను. అతడు అచ్యుతరాయలతోను, రామరాజుతోను సంధిచేసుకొని స్వదేశమునకు తరలిపోయెను. తరువాత రామరాజుతో నచ్యుతరాయలు సంధిచేసుకొనెను. ఈయొడంబడికప్రకారము అచ్యుతరాయలు విజయనగరములో చక్రవర్తిగనే రాజ్యముచేయవలసినది. రామరాజు తన జాగీరులో స్వతంత్రుడై ప్రభుత్వము సల్పుకొనవచ్చును.

అచ్యుతరాయల ఈకాలపుశాసనములలోనే "రంగక్షితీంద్రాచ్యుతదేవరాయా" యన్నశ్లోకము గాన్పిం

చుట. అచ్యుతరాయల శాసనములలో నాతని మాతృ శ్వేష్ఠ భ్రాతల నామములను ప్రవేశపెట్టుటను రాజ ధానియందు జరుగుచువచ్చిన విప్లవములకును నేదో కొంత సంబంధ మున్నట్లు తోచుచున్నది.

(౩) దాత: దానకాలము:—శాసనోక్తమగు గ్రామ మున బ్రాహ్మణులకు దానముచేసిన దాత బాలరాజు. ఇతనిది సూర్యవంశము; చోళాన్వయము (పంక్తి ౨౪౫); కాశ్యప గోత్రము; పెక్కెంద్రరాజకొక్కుత్తుగండ, కటక ఛేదన, పరిపంథిమహీపాలదంతిసందోహకేసరి, కావేరీ వల్లభ, బిరుదావనిపాలానాంబాయిబంది, పరరాజభయం కర, ఇత్యాదిబిరుదులు గలవాడు. ఇతని తండ్రి పేరు చెన్నరాజు. ఇతడు అచ్యుతరాయలతరఫున కొంగు రాజ్యమును (అనగా యిప్పటి సేలముకోయంబత్తూరు జిల్లాలను) బరిపాలించుచుండెను. ఇతడు బ్రాహ్మణులకు ఒక అగ్రహారమును దానముసేయదలచి, నిజస్వామియగు నచ్యుతరాయల మనస్సును సంతోషపెట్టి, ధర్మవేళ యందు విన్నపముజేసికొని అచ్యుతరాయలచేతినుండి ఈతామ్రశాసనమును పుచ్చుకొని, కొంగుధారాపురము నకు తూర్పున అర్ధయోజనదూరమున నున్న కొళుంజ వాడిగ్రామముతోగూడ (దానికి) తూర్పున అమ్రవతీ నదికి దక్షిణముననున్న మూలగ్రామపు ఎల్లరాతికి పశ్చిమ మున నున్నట్టియు, రాయగుళగ్రామమునకు దక్షిణమున నున్నట్టియు అచ్యుతరాయసముద్రము అను నూతననామ ధేయమును బొందిన పుత్తూరితో గూడిన నీలంబేరూరను గ్రామమును ౧౦౭ వృత్తులుగ విభజించి శాలివాహన శకము ౧౪౫౫ సం. కు సరియగు నందన సం. పుష్య శుద్ధ ౧ ఉత్తరాషాఢ మకరసంక్రమణపుణ్యకాలమున (అనగా క్రీ. శ. ౧౫౩౨ డిసెంబరు తే ౨౭ లేక ౨౮ ది నాడు) అమ్రవతీనదీతీరమున హరిశంకరుల సన్నిధాన మున నానాసూత్రగోత్రజులగు బ్రాహ్మణులకు ధారా పూర్వకముగ దానముజేసెను.

ఇందు చర్చించవలసిన విషయములు కొన్నికలవు.

(౧) బాలరాజు చోళవంశజుడనని చెప్పుకొనియు న్నాడు. చోళవంశమున నేశాఖకు చేరినవాడో తెలియదు. పూర్వము చోళచక్రవర్తులు కొంగుదేశమును జయించి తమ యధికారము నచట నెలకొల్పిరి. వీరికి సామంతు లుగ చోళవంశీకులని చెప్పుకొన్న రాజులు కొందఱు కొంగుదేశమును పాలించిరి. వీరికి "కొంగుచోళు"లని శాసనపరిశోధకశాఖవారు నామకరణము చేసియున్నారు. ఈకొంగుచోళుల దొరతనము హొయసలరాజుల కడ పటిదినములవఱకును నడిచినది. తరువాత విజయనగరరాయల కాలమున వీరేమయిరో చెప్పదగిన సామగ్రి యింకను లభిం చలేదు. మన శాసనదాతయగు చెన్నరాజపుత్రుడగు బాల రాజు కొంగుచోళులకు సంబంధించినవాడైన నుండవచ్చును. లేక దేశమంతటను వ్యాపించిన తెలుగుచోళవంశమున బుట్టినవాడైనను నుండవచ్చును. మఱొకశాఖకు జెందినవా డైనను కావచ్చును. ప్రస్తుతస్థితులలో ఇతడీశాఖకు జెందినవాడని చెప్పుటకు వీలుకాదు.

(౨) బాలరాజు దానముచేసిన విధముగూడ గమనింపదగినదే: భూదానమును బ్రాహ్మణులకు జేయ నుద్యమించినవాడు తనంతట తాను అనుకొనిన బ్రాహ్మ ణులను పిలిచి దానముచేయలేదు. తత్పూర్వము సేవ జేసి నిజస్వామియగు నచ్యుతరాయల చిత్తమును సంతో షపెట్టి అతనితో తన యుద్దేశ్యమును మనవిచేసుకొని యతని యంగీకారమును బడయవలసివచ్చెను. ఇంతే కాదు; రాయలచేతిమీదుగ ప్రస్తుతతామ్రశాసనమును గొని అటుపిమ్మట బ్రాహ్మణులకు భూమిని దత్తము చేసెను.

ఇందువలన రాయరాజ్యమున గల భూమికి స్వామి రాయలు గాని అన్యులు గారని తెలియుచున్నది. మండలాధిపతులు నిరంకుశులనియు, వారు తమ యేలుబడిలోని రాష్ట్రమున రాయల కెఱుకలేక యేమి చేసినను చేయవచ్చుననియు కొందఱు తలచుచున్నారు. వారు నిరంకుశులు గారని మన శాసనము రుజువుచేయుచు న్నది. తమమండలములయందు రాయలకు ప్రతినిధులై రాయలు తమ కెంతయధికారము నప్పచెప్పెనో దానినే యములులోనికి దెచ్చుకొనవలసినవారే గాని యంతకు మించి పోవ హక్కు వారికి లేదు. తామేలు భూముల యందు వారికి స్వామ్యము లేదు. ఉండిన బాలరాజు

చేసినట్లు భూదానము చేయదలచినపుడెల్ల రాయలయంగీ
కారము బడయవలసిన యవసరము వారి కుండియుండదు.
మండలాధిపతులనుగురించి అచ్యుతరాయల సమకాలికు
డగు న్యూని జిట్లు వ్రాయుచున్నాడు: రాయలు కొంత
సైన్యము భరించు షరత్తుమీద వీరికి భూములు
నిచ్చువాడు. "షరత్తుప్రకారము అనుకొనినంత దళ
మును వీరు భరించవలయును; అందుకు సంఖ్య తగ్గెనని
తెలిసిన రాయలు వీరిని కఠినముగ శిక్షించును. వీరి
అమరమాగాణులను నగరిలో గలుపుకొనును." మఱియు
అమరనాయకులకు తమ యిష్టమువచ్చినచోట నివసిం
చుటకు గూడ స్వతంత్రము లేదు. "ఈదొరలు మహానగర
ములలోను పట్టణములలోను నుండరాదు; ఏలన, వారు
రాయలచేతి కంపక పోవుదురు; కావున వారు తమనాయక
తనపు భూముల కప్పుడేనియూ రొకప్పుడు (రాయల
యనుమతిమీద) బోవచ్చును.—(Forgotten Empire,
p. 374). ఈపరిస్థితులయందు అమరనాయకులు నిరం
కుశులని తలచుట యెట్లు?

భూమిని వ్యవసాయము సేయురయితులదే
భూస్వామ్యమని కొందఱి మతము. ఎచ్చటనో యొక
మారుమూలయందు దప్ప రాయరాజ్యమం దెచ్చటను
రయితులకు భూస్వామ్య ముండెనని తలచుట కవకా
శము లేదు. న్యూని జీవితమునుగూర్చి ప్రస్తావముజేసి
యున్నాడు. "భూమి యంతయు రాయలది; అమర
నాయకులు భూములను అతడు (కౌలునకు) ఇవ్వగనే
అనుభవించుచున్నారు. వీరు ఈభూములను రైతులకు
ఇచ్చుచున్నారు." "(రైతులు భూమిని సాగుచేసి)పదింట
తొమ్మిదిభాగముల ఫలితమును (నాయకులకు) సమర్పిం
చుచున్నారు. వారికి భూమి లేదు, ఏలన రాజ్యమం
తయు రాయలది." (Forgotten Empire, p. 379).
న్యూనిజు వ్రాసినది సత్యమని ప్రస్తుతశాసనమువల్ల దెలి
యుచున్నది. ఎట్లన, భూదానముసేయ నుద్దేశ్యముగల
బాలరాజు రాయల నడిగి యాతని యంగీకారము వడసెనే
గాని రైతుల నీసందర్భమున దలపెట్టలేదు. భూస్వా
మ్యము రైతులదే యైనపక్షమున బాలరాజు వారి నడిగి
వారి యంగీకారమును బడయవలసియుండెను. అట్లు
సేయక రాయల నడిగి యతనియంగీకారము బడయుటచేత
భూస్వామి యతడని తెల్లమగుచున్నది. అయితే ఈ
శాసనము ౨౬౮, ౨౬౯ పంక్తులలో "ఆగ్రామసీమెయ
కుళవనూ ఆవాడవరనూ కళిదుకొట్టు" అని యున్నదే,
ఆగ్రామరైతులకును నాడు అధికారులకును భూమియం
దు స్వామ్యము లేకున్న దానము జేయునప్పుడు వారి నేల
పిలిపించవలయును? అను ప్రశ్న యొక్కటి బయలుదేర
వచ్చును. దానికి సమాధాన మిది: బాలరాజు వారిని
దానముసేయుచోటికి పిలిపించెనే గాని వారి యనుమతిని
అడగలేదు. వారికి స్వామ్య మున్న వారి నేల దానోద్దిష్ట
మగు భూమిని దానముసేయుటకు అంగీకరింపుడని యడుగ
లేదు? అడుగకపోవుటకు కారణము వారికి భూమియందు
స్వామ్యము లేకపోవుటయే. మఱి వారి నేల పిలువనంపవల
యును? కారణము లేకపోలేదు. దానమునకు పూర్వము
భూస్వామి రాయలు రైతులు ధాన్యాదాయ ధనా
దాయములను అతని ప్రతినిధియగు బాలరాజునకు గాని
యతని తాబేదారులకుగాని చెల్లించుచువచ్చిరి. ఈదా
నమువల్ల భూస్వామి మారెను. రాయలు తనకు దానో
ద్దిష్టమగు భూమియందు గల సర్వహక్కులను బాలరాజు
మూలమున ప్రతిగ్రహీతలకు నిచ్చెను. ఈ విషయమును
దెల్పుటకును, మాఱిన భూస్వాములకు విధేయులుగ నుండు
డని యాజ్ఞాపించుటకును రైతులను బాలరాజు దానము
సేయుటకు పూర్వము పిలిపించినది. 'నాడు' అధికారు
లను రప్పించినకారణము సదరుగ్రామము బ్రహ్మదేయ
మాయెననియు, దానిని తమలెక్కలలో భండారవాడ
గ్రామపట్టికనుండి తొలగించి మాన్యగ్రామ పట్టికలో
జేర్పుడని తెల్పుటకును, నూతనభూస్వాములను వారికి
ఎఱుకపఱచుటకును అని యూహించవలయును.

(౩) బాలరాజు తాను దానశాసనమును "ధర్మ
వేళ" యందు పుచ్చుకొన్నట్లు తెల్పియున్నాడు. 'ధర్మ
వేళ' యన నేమి? అనుదినమును రాయలు చేయవలసిన
కార్యములు సక్రమముగను, సకాలముననుజరుపుటకొరకు
దినమంతయు కొన్ని భాగములుగ విభజింపబడి, యొక్కొక
భాగ మొక కార్యమును సేయుటకు నియమితమై యుండె
డిది. 'ధర్మవేళ' అట్టి దినభాగములయం దొక్కటి. వీర

నరసింహరాయలకాలమున, రాయదినచర్య రాయవాచకమున వర్ణింపబడియున్నది. నామ శీర్ష మైనపిమ్మట రాయలు దేవాలయములనుగూర్చి అయ్యంగార్లను, ఆరాధ్యులను ప్రశ్నించి వారి యుత్తరములను విని తరువాత "ధర్మాసనం ధర్మయ్యను పిలువనం" పెడివాడు. "ఆయన వచ్చి నిలిచి దేవరవారు ఆనతిచ్చినప్రకారం ద్రావిడదేశములోగల అగ్రహారములున్ను, ఆంధ్రదేశం, హొయిసనదేశం, మొరసునాడు, మొల్నాడు, కర్ణాటకం, ఘట్టసీమ, చేర చోళ పాండ్య మగధ మళయాళ ఆదిగాగల అగ్రహారములకున్ను అవధి అటంకము లేక"యున్నవి అని మనవి చేసెను. [ఆం. పరి. ప. సం III] రాయలు ధర్మములనుగురించి విచారించువేళ గావున ధర్మవేళ అయినది. ధర్మము సేయు నుద్దేశ్యముగల అమర నాయకులుగూడ రాయలకు అప్పుడు విజ్ఞాపనముజేసి యతని యనుమతిని బడయవలసియుండెను.

(౪) ప్రతిగ్రహీతలు:—దానమును ప్రతిగ్రహించిన బ్రాహ్మణుల సంఖ్య ౪౬. వారి శాఖలు గోత్రసూత్రములు నామములు వృత్తులు మున్నగువిషయములను ఇందువెంట జతపరచిన జాబితాయందు వివరింపబడియున్నది. దానిని చూచిన ఏయే గోత్రసూత్రములవారికి యెన్ని వృత్తులు లభించినదియు తెలియగలదు.

ఈసందర్భమున నొకవిషయమును విచారించవలసియున్నది. ౧౦౪-వ పంక్తియందు వృత్తుల సంఖ్య ౧౦౭ అని తెల్పబడినది. ౨౬౧, ౨౬౨ పంక్తులలో ౧౧౦ వృత్తులని చెప్పబడినది. ఈభేదమునకు కారణము, ఆయూరి దేవాలయములకు దత్తముజేసిన రెండువృత్తులను మొదటిసంఖ్యతోగూడ చేర్పకపోవుటయే. ఈ ౧౧౦ వృత్తులు గాక ఆయూరి బ్రాహ్మణబాలురకు వేదవిద్యను గరపు ఉపాధ్యాయులకు జీతనార్థము రెండు మాన్యములును, వీరాదిమంగల గ్రామము పొలముగుండ అచ్యుతరాయసముద్రపు చెరువునకు ఆ్రమవతి క్రొత్తయనకట్టదగ్గరనుండి కాలువను తెచ్చినందుకు, ఆకాలవయడుగునేలకు బదులు వీరాదిమంగలగ్రామస్థులకు ౨౦ ఖండుగల పరిపాలమును, అచ్యుతరాయసముద్రపు నీటికాల్వపైన వంతెన కట్టి, దానికి తగు రిపేరులు వీరాదిమంగలమువారే చేయించుచుండుటకు ౨ ఖండుగల పరిమడియును ఇవ్వబడెను.

(౫) విజయనగర రాజులు, తమకు పూర్వము దేశము నేలిన చాళుక్యచోళాదిరాజులవలె విద్యాభివృద్ధికి దగు నేర్పాటులను గావించినట్లు గాన్పించదు. రాజపోషణము లేకున్నను విద్యను పూర్వమువలెనే బాలురకు గరపుటకు దగినయవకాశము లుండెనని కొందఱభిప్రాయపడుచున్నారు. ప్రతియగ్రహారమును నొకచిన్న విద్యాపీఠమనియు అచ్చట బ్రాహ్మణబాలురు వేద వేదాంగములను శాస్త్రములను నభ్యసించుటకు నేర్పాటులుండెననియు వీరి నమ్మకము. ఈనమ్మకమునకు ప్రస్తుతశాసనమున కొంత యాధార మగపడుచున్నది. అయినప్పటికిని ఈయగ్రహార విద్యాశాలలలో బ్రాహ్మణేతరులకు ప్రవేశము లేదు. వా రెట్లు విద్యాభ్యాసము గావించుచుండిరో తెలుసుకొనుటకు నాధారములు కానరావు.

(౬) మూడవభాగములోని విషయమే కన్నడభాషయందు వివరింపబడినది. అచ్యుతరాయసముద్రాగ్రహారపు టెల్లలు విపులముగ వర్ణింపబడినవి. అచ్యుతరాయసముద్రమునది క్రొత్తపేరని ఇంతకు పూర్వమే తెలుపబడినది. కొళుంజవాడి, నీలంబేరూరు, పుత్తూరు అను మూడుగ్రామములను కలుపగా ఈనూతనాగ్రహార మేర్పడినది. కొళుంజవాడిగ్రామము కోయంబుత్తూరు జిల్లాలోని ధారాపురసమీపమున అమరావతినదియొడ్డున ఇప్పటికిని గలదు. పుత్తూరునీలంబేరూరుగ్రామము లచ్చటివే. ఈఅచ్యుతరాయసముద్రాగ్రహారమునకు హద్దులు:

తూర్పు: మూలనూరుఎల్లతలయందు నాటిన వామనముద్రరాయి.

దక్షిణము: రాయనుళగ్రామపు ఎల్లతలయందు నాటిన వామనముద్రరాయి.

పడమర: పత్తియూరు ఎల్లయందు నాటిన వామనముద్రరాయి. దానినుండి పడమట మాణకడ ఎల్లతలలో నాటిన వామనముద్రరాయి. దానినుండి పడమట వీరాదిమంగలపు పెద్దకాల్వ.

ఉత్తరము: వీరాదిమంగలము కాల్వయొద్దునసే ఆకాల్వకు తూర్పున నాటిన వామనముద్రరాయి. అచ్చటినుంచి ఉత్తరము మూడుమఱ్ఱిచెట్ల క్రింద నాటిన వామనముద్రరాయి. దానికి ఉత్తరము వీరాదిమంగలమునకు పోవుదారిని విడిచి రేవులోపల నాటిన వామనముద్రరాయి. దానికి తూరుపు ఒడయపిరాటి గ్రామపు ఎల్లకు దక్షిణముగ నాటిన వామనముద్రరాయి. దాని ఈశాన్యమున ఆమ్రవతీనది. దానికి ఈశాన్యమున పెరమయ గ్రామము ఎల్లరాయి. దానికి ఈశాన్యముమూలనూరి ఎల్లరాయి.

పైసరిహద్దులలో మూలనూరు, రాయసుళు, పత్తియూరు, మాణకడ, వీరాదిమంగలము, ఒడయపిరాటి, పెరమయ మను గ్రామములును ఆమ్రవతి యను నదియును చేర్కొనబడినవి. ఈ గ్రామము లన్నియు ధారాపురమునకు సమీపమున నున్నవి.

వీరాదిమంగలమును ఇప్పుడు వీరాజిమంగల మనుచున్నారు. ఆమ్రవతిని అమరావతి యనుచున్నారు. ఇది కావేరియొక్క ఉపనది. ఇది భవాని, నొయల్ నదులతోపాటు కోయంబత్తూరుజిల్లానుండ ప్రవహించుచున్నది.

వామనముద్రరాయి అనగా విష్ణువుఅవతారములలో వామనమూర్తిని చెక్కినరాయి. ఇట్టిరాళ్లను విజయనగరరాజుల కాలములో బ్రాహ్మణాగ్రహారముల పొలిమేరలయందు నాటుట వాడుక.

(౬) దానఫలశ్లోకములు. ఇందు విశేష మేమియును లేదు.

(౭) శాసనగ్రంథకర్త సభాపతి. లేఖకుడు మల్లణకుమారుడు వీరణాచార్యుడు.

## ప్రతిగ్రహీతల పట్టిక

| నెం. | పేరు. | తండ్రి పేరు. | వేదం. | సూత్రం. | గోత్రం. | వృత్తి సంఖ్య. |
|---|---|---|---|---|---|---|
| ౧ | శ్రీమాన్ తిరుమల తాతార్యుడు | తాతాచార్యుడు | యజుర్వేది | ఆపస్తంబ | కౌశిక | ౪ |
| ౨ | అనంతార్యుడు | నల్లారయ్య | ,, | ,, | శ్రీవత్స | ౧ |
| ౩ | అయ్యమయ్య | ,, | ,, | ,, | ,, | ౧ |
| ౪ | ఎంబారయ్య | ఎంబారయ్య | ,, | ,, | భరద్వాజ | ౨ |
| ౫ | పెద్దిభట్టు | పెరియనంబి | ,, | ,, | ,, | ౧ |
| ౬ | రామచంద్ర దీక్షితుడు | నాగాభట్టు | ,, | ,, | కాశ్యప | ౪ |
| ౭ | కృష్ణమార్యుడు | గంగాధరుడు | ,, | ,, | కౌశిక | ౩ |
| ౮ | గంగాధరార్యుడు | రామచంద్రుడు | ఋగ్వేది | ఆశ్వలాయన | విశ్వామిత్ర | ౧ |
| ౯ | కంజాండయ్య | రామచంద్రార్యుడు | యజుర్వేది | బహ్వృచ | ,, | ౧ |
| ౧౦ | ఎఱ్ఱంభట్టు | సర్వాభట్టు | ,, | ఆపస్తంబ | భరద్వాజ | ౨ |
| ౧౧ | లక్ష్మణాఖ్యుడు | ,, | ,, | ,, | కౌండిన్య | ౧ |
| ౧౨ | తిమ్మణాఖ్యుడు | నారసింహ | ,, | ,, | ,, | ౧ |

| నెం. | పేరు. | తండ్రిపేరు. | వేదం. | సూత్రం. | గోత్రం. | వృత్తి సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| ౧౩ | సింగాభట్టారకుడు | కొండాభట్టారకుడు | ,, | ,, | భరద్వాజ | ౨ |
| ౧౪ | రామాభట్టారకుడు | యతిరాజార్యుడు | ,, | ఆశ్వలాయన | విశ్వామిత్ర | ౨ |
| ౧౫ | వల్లభయ్య | ,, | ,, | ,, | ,, | ౧ |
| ౧౬ | లింగంభట్టు | నంజంభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౧౭ | అనంతదీక్షితః | వీరవల్లి (తల్లి) | ,, | ఆపస్తంబ | కౌండిన్య | ౧ |
| ౧౮ | పర్వాభట్టారకుడు | కామాభట్టు | ,, | ,, | కాశ్యప | ౧ |
| ౧౯ | తిమ్మయాఖ్యుడు | మంగలనాథుడు | ,, | ,, | కౌండిన్య | ౧ |
| ౨౦ | తిమ్మయాఖ్యుడు | చిట్టిభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౨౧ | నంజనాథుడు | బసవార్యుడు | ,, | ఆశ్వలాయన | విశ్వామిత్ర | ౧ |
| ౨౨ | ముద్దంభట్టారకుడు | లక్ష్మణార్యుడు | ఋగ్వేది |  | హరిత | ౧ |
| ౨౩ | అలగంభట్టు | సింగాభట్టు | యజుర్వేది | ఆపస్తంబ | వత్స | ౧ |
| ౨౪ | శైచంభట్టారకుడు | ఓబళార్యుడు | ,, | ఆశ్వలాయన | వాసిష్ఠ | ౧ |
| ౨౫ | రామాభట్టారకుడు | దేవభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౨౬ | దుర్గాభట్టారకుడు | సింగరియజ్వ | ఋగ్వేది |  | ఆత్రేయ | ౧ |
| ౨౭ | గోవర్ధనుడు | రంగనాథార్యుడు | యజుర్వేది | ఆపస్తంబ | ,, | ౧ |
| ౨౮ | కొండాభట్టారకుడు | కృష్ణాభట్టు | ,, | ,, | హారీత | ౧ |
| ౨౯ | ఎఱ్ఱంభట్టారకుడు | రామాభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౩౦ | అనంతయాఖ్యుడు | నారసింహార్యుడు | ,, | ,, | ,, | ౧ |
| ౩౧ | సింగప | నృసింహార్యుడు | ,, | ,, | ,, | ౧ |
| ౩౨ | తిమ్మంభట్టు | అబ్బంభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౩౩ | తిమ్మయ | తిప్పార్యుడు | ,, | ఆశ్వలాయన | ప్రథమాత్రేయ | ౧ |
| ౩౪ | నారసింహ | కామాభట్టు | ,, | ,, | వాసిష్ఠ | ౧ |
| ౩౫ | లక్ష్మంభట్టారకుడు | నృసింహార్యుడు | ,, | ,, | భారద్వాజ | ౧ |
| ౩౬ | అంగంభట్టారకుడు | తిమ్మాభట్టు | ,, | ఆపస్తంబ | కాశ్యప | ౧ |
| ౩౭ | తిమ్మయ పండితుడు | పెరుమాళ్లు | ,, | ,, | కౌశిక | ౧ |
| ౩౮ | కొండంభట్టు | అనంతభట్టు | ,, | ,, | కాశ్యప | ౧ |
| ౩౯ | సూరంభట్టు | లక్ష్మణార్యుడు | ,, | ,, | వాధూల | ౧ |
| ౪౦ | సోమనాథుడు | దేవాభట్టు | ,, | ఆశ్వలాయన | కాశ్యప | ౧ |
| ౪౧ | తిమ్మాభట్టు | మాధవార్యుడు | ,, | ఆపస్తంబ | కౌండిన్య | ౧ |

| నెం. | పేరు | తండ్రిపేరు. | వేదం. | సూత్రం. | గోత్రం. | వృత్తి సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| ౪౨ | లింగాభట్టు | సోమనాథుడు | ,, | బోధాయన | వాసిష్ఠ | ౧ |
| ౪౩ | మల్లిఖార్జునభట్టు | సూర్యనారాయణ | ,, | ఆశ్వలాయన | పారాశర్య | ౨ |
| ౪౪ | నారసింహ | నారిభట్టు | ,, | బోధాయన | జామదగ్న్యవత్స | ౧ |
| ౪౫ | గంగాధరుడు | మంచిభట్టు | ,, | ఆపస్తంబ | కాశ్యప | ౧ |
| ౪౬ | లింగయ | భానుభట్టు | ,, | ఆశ్వలాయన | ,, | ౧ |
| ౪౭ | లక్ష్మణభట్టు | తిమ్మణార్యుడు | ,, | ఆపస్తంబ | లోహిత | ౧ |
| ౪౮ | భాస్కరుడు | గంగణార్యుడు | ,, | ,, | భరద్వాజ | ౧ |
| ౪౯ | తిమ్మయ | పుల్లయ | ,, | ,, | కౌశిక | ౧ |
| ౫౦ | నారాయణార్యుడు | శేకణార్యుడు | ,, | ,, | కాశ్యప | ౧ |
| ౫౧ | శంకరార్యుడు | రంగంభట్టు | ,, | ద్రాహ్యాయన | ఆత్రేయ | ౧ |
| ౫౨ | తిమ్మభట్టు | దేవయార్యుడు | ,, | ఆశ్వలాయన | కాశ్యప | ౧ |
| ౫౩ | మణాభిఖ్యుడు | లింగణార్యుడు | ,, | ,, | విష్ణువృద్ధ | ౧ |
| ౫౪ | తిమ్మయ | లక్కంభట్టు | ,, | ఆపస్తంబ | హారీత | ౧ |
| ౫౫ | ధర్మరాజు | సింగయ | ,, | ,, | వాధూల వైద్యుడు | ౧ |
| ౫౬ | భాస్కరాఖ్యుడు | దేవరాజార్యుడు | ,, | ,, | కౌండిన్య | ౧ |
| ౫౭ | ఎల్లంభట్టు | విస్సాభట్టు | ఋగ్వేది | | ,, | ౧ |
| ౫౮ | నృహరి | విరూపాక్షుడు | యజుర్వేది | ఆశ్వలాయన | జామదగ్న్యవత్స | ౧ |
| ౫౯ | కవి గంగయ | తిమ్మయ | ,, | ,, | కౌండిన్య(కవి) | ౧ |
| ౬౦ | బసవంభట్టు | రామాభట్టు | ,, | ,, | కాశ్యప | ౧ |
| ౬౧ | లింగంభట్టు | రామాభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౬౨ | మంగణ | లింగంభట్టు | ,, | ,, | విశ్వామిత్ర | ౧ |
| ౬౩ | కృష్ణంభట్టు | శ్రీపతి | ,, | ,, | వసిష్ఠ | ౧ |
| ౬౪ | అనంతప్ప | వరదరాజు | ,, | ఆపస్తంబ | వత్స | ౧ |
| ౬౫ | కొండభట్టారకుడు | కామాభట్టు | ,, | ఆశ్వలాయన | కాశ్యప | ౧ |
| ౬౬ | సిరిగంభట్టు | కేశవుడు | ,, | ,, | భారద్వాజ | ౧ |
| ౬౭ | శ్రీకృష్ణుడు | శ్రీవెంగడుడు | ,, | ఆపస్తంబ | గర్గ | ౧ |
| ౬౮ | మాధవుడు | మాచయ | ,, | ,, | కౌండిన్య | ౧ |
| ౬౯ | విరూపాక్షుడు | నారాయణార్యుడు | ,, | ,, | కౌండిన్య | ౧ |

| నెం. | పేరు. | తండ్రి పేరు. | వేదం. | సూత్రం. | గోత్రం. | వృత్తి సంఖ్య |
|---|---|---|---|---|---|---|
| ౭౦ | ఆనందాళ్వారాఖ్యుడు | రామానుజదాసుడు | ,, | బోధాయన | కాశ్యప | ౧ |
| ౭౧ | పోచిభట్టు | గంగాధరుడు | ,, | ఆపస్తంబ | ఆత్రేయ | ౧ |
| ౭౨ | లింగాభట్టు | మారాభట్టు | ,, | ,, | కౌశిక | ౧ |
| ౭౩ | చెన్నంది | రామాభట్టు | ,, | ,, | పరాశర | ౧ |
| ౭౪ | తిమ్మయభట్టు | వల్లభార్యుడు | ,, | ,, | కౌండిన్య | ౧ |
| ౭౫ | లింగయ | కామాభట్టు | ,, | ,, | వాధూల | ౧ |
| ౭౬ | తిమ్మాభట్టారకుడు | వల్లంభట్టు | ,, | ,, | శాండిల్య | ౧ |
| ౭౭ | తిమ్మయ | ఔభళార్యుడు | ,, | ,, | కౌశిక | ౧ |
| ౭౮ | తిమ్మయ | వెంగళాఖ్యుడు | ,, | ,, | భరద్వాజ | ౧ |
| ౭౯ | తిమ్మాభట్టు | అన్నంభట్టు | ,, | ,, | సంకృతి | ౧ |
| ౮౦ | కోనేరిదేవుడు | తిమ్మాభట్టు | ,, | ,, | శ్రీవత్స | ౧ |
| ౮౧ | తిమ్మాభట్టు | లఖ్మాభట్టు | ,, | ,, | ,, | ౧ |
| ౮౨ | పర్వాభట్టు | వీరాభట్టు | ,, | ,, | ఆత్రేయ | ౧ |
| ౮౩ | వస్తిగిరీంద్రార్యయజ్వ | నైనారయజ్వ | ,, | ,, | గర్గ | ౪ |
| ౮౪ | కేశవదాసు | తిమ్మయార్యుడు | ,, | ,, | కౌశిక | ౨ |
| ౮౫ | సోమయ | సవాణభట్టు | ,, | ,, | భారద్వాజ | ౧ |
| ౮౬ | ఎల్లయ | అబ్బయ | ,, | ,, | ఆత్రేయ | ౧ |
| ౮౭ | తిమ్మయ | నిశ్చలుని కొమారుడు అబ్బయ | ,, | ,, | ,, | ౧ |
| ౮౮ | పార్వతీపతి యను ఈశ్వరుని గుడికి | ...... | ... | ... | ... | ౧ |
| ౮౯ | రమాపతియగు విష్ణువుగుడికి | ...... | ... | ... | ... | ౧ |
| ౯౦ | బ్రాహ్మణపిల్లకాయలకు వేదంచెప్పేవారికి ...... | | ... | ... | ౨ క్షేత్రములు | |

---

 శాసనమూలము, ప్రతిబింబములు రాబోవు సంచికయందు ప్రకటింపబడును. —(సం. భా.)



శ్రీకాకుళము మసీదు

(ఔరంగజేబు కట్టించినది)



జపానుసుందరుల విలాసవిహారము

(టోకియో)

E. N. P.

# హిందూదేశము; "ఇంపీరియల్ ప్రిఫరెన్సు" పద్ధతి

చా. వెం. హనుమంతరావుగారు, M. A., B. Ed.

## ౧

హిందూదేశము బ్రిటిష్‌సామ్రాజ్యాంతర దేశములకు తదితర దేశములకన్న వర్తకవ్యాపారములం దెక్కువసౌకర్యముల నీయవలెనా యనువిషయము ౧౯౩౨ సం. సెప్టెంబరు నెలలో ఒట్టావాయందు జరుగనున్న సామ్రాజ్య-ఆర్థికసమావేశమునందు చర్చకువచ్చును. బ్రిటిష్‌సామ్రాజ్యమునంతను ఒక ఆర్థికపద్ధతికి లోనుజేసి, సామ్రాజ్యమునందు చేరియున్న దేశము లన్నియు తమలోతాము తగు ఆర్థిక-కట్టుబాట్లను పరస్పరము ఏర్పాటుచేసికొనినప్పుడే, ప్రస్తుతకాలమం దీదేశము లన్నింటిని, ప్రపంచమంతటిని, ఆవరించియున్న ఆర్థిక దుస్థితి, నిరుద్యోగ సమస్య మొదలగువాటినుండి తప్పించుకొనుటకు వీలగునని గ్రహించి బ్రిటిష్ ప్రభుత్వమువా రీసభ నేర్పాటుచేసిరి. ఈసమావేశమునందు హిందూదేశమునకు కూడ ప్రాతినిధ్యము కలదు; ఇండియా ప్రభుత్వమువారు (Government of India) దానికి తగిన ఏర్పాట్లన్నియు చేసి హిందూదేశప్రతినిధివర్గమును వారే నియమించియున్నారు. హిందూదేశము పైనసూచించినట్టి ఆర్థిక-కట్టుబాట్ల కంగీకరించి సామ్రాజ్యాంతర దేశములను హెచ్చు వర్తకసౌకర్యముల నిచ్చుట కంగీకరింపవలెననియు, లేనియెడల మనదేశము చాల నష్టకష్టములకు లోనుగావలసివచ్చుననియు బ్రిటిష్ ప్రభుత్వమువారొకవిధముగ స్పష్టపరచిరి.

*  *  *  *

పైసందర్భములలో మన మాలోచింపవలసిన ముఖ్యవిషయము లొకటిరెండుకలవు. హిందూదేశమునకు పైన సూచించిన కట్టుబాట్ల నంగీకరించుటవలన లాభమా నష్టమా? లాభమైనను నష్టమైనను ఏయేసందర్భములలో వాటి నంగీకరింపవలయును? అను నీరెండువిషయములు చాల ప్రధానములును ఆలోచనీయములు నైయున్నవి. హిందూదేశము మొదటినుండియు ఇంపీరియల్ ప్రిఫరెన్సు (Imperial Preference) పద్ధతికి వ్యతిరేక మేయను విషయము ప్రధానముగ గమనింపవలసియున్నది. ప్రప్రథమమున ౧౯౦౩ సంవత్సరములో, ఇండియా ప్రభుత్వమువా రీవిషయమై బ్రిటిష్ ప్రభుత్వమువారిచే సలహా చేయబడిరి. అప్పటి పరిస్థితుల నన్నిటిని ఆలోచించి, హిందూదేశపు వర్తకవ్యాపారము, ఇతరదేశములతో మనదేశమున కున్న వర్తకసంబంధములు మొదలైనవాటిని విచారించి ఇండియా ప్రభుత్వమువారు, "ఆర్థికముగ విచారించిన, హిందూదేశమువలన బ్రిటిష్‌సామ్రాజ్యములోని దేశములకు హెచ్చులాభము వచ్చుట కష్ట" మనియు, "ఇంపీరియల్ ప్రిఫరెన్సు పద్ధతివలన హిందూదేశమునకు లాభము లేకపోవుటయేకాక చాల నష్టము వచ్చుట కవకాశములు గల"వనియు, తమ యభిప్రాయమును వెలిబుచ్చియుండిరి. తరువాత ౧౯౨౧ సం.లో "ఫిస్కల్ కమీషన్" (Fiscal Commission) వా రీవిషయమై పూర్తిగ ఆలోచించి హిందూదేశము తనకు హెచ్చు నష్టము లేకుండ, ఇతరదేశములకు వేటికిని వర్తకసౌకర్యముల నిచ్చుట అసంభవమనియు, హిందూదేశము నట్టి సౌకర్యముల నీయుమని కోరుట సమంజసము కాదనియు వ్రాసియుండిరి.

*  *  *  *

హిందూదేశపు విదేశవర్తకము మొత్తమువిలువ ౧౯౨౯-౩౦ లెక్కలప్రకారము సుమారు ౬౦౦ కోట్ల రూపాయలైయున్నది. దానిలో ఎగుమతులవిలువ సుమారు రూ ౩౫౦ కోట్లు. ఇట్లు ఎగుమతిచేయబడు వస్తువులలో నూటికి ౪౧ వంతులు పరిశ్రమలకు కావలసిన వస్తువులు (Raw Materials)గా ఎన్నబడునట్టివియు, "తిండి త్రాగుడు, పొగాకు" (Food, Drink, & Tobacco)

మొదలగునట్టి వస్తువులను, హిందూదేశమునకు దిగుమతి యగు వస్తువులలో సుమారు ౮౦% తయారైన వస్తువులునై యున్నవి. దీనివలన మనము గ్రహింపవలసిన విశేషమేమన మనదేశమునుండి ఎగుమతులు చాలవరకు పరిశ్రమలకు కావలసిన వస్తుసామగ్రియనియు, మనదేశములోనికి దిగుమతియగునవి పరిశ్రమలలో తయారైనట్టి వస్తువులై యున్నవనియు నై యున్నది.

మనదేశమునకు యునైటెడ్ కింగ్ డమ్ (United Kingdom) నుండి దిగుమతియగు సరకుల పరిమాణమును విలువయుకూడ క్రమేణ తగ్గిపోవుచున్నవను విషయము మనము ముఖ్యముగ జ్ఞప్తియం దుంచుకోవలసియున్నది. యుద్ధమునకుపూర్వము సగటున సంవత్సరమున ౬౨% వంతులు విలువగల వస్తువులు ఇంగ్లండు దేశమునుండి వచ్చుచుండగా, ౧౯౨౮-౩౦ సం.పు లెక్కలప్రకారము చూచిన ఆవిలువ ౪౨% వరకును, ౧౯౩౦-౩౧ సం.పు లెక్కలప్రకారము ౩౮%వరకును తగ్గిపోయినవి. అనగా యుద్ధమునకుపూర్వము హిందూదేశపు మొత్తము దిగుమతుల విలువయగు ౨౫౦ కోట్లరూపాయలలోను ౧౪౦ కోట్ల రూపాయిల వస్తువులు ఇంగ్లండుదేశమునుండివచ్చుచుండగా, ౧౯౩౦-౩౧ సం. లో ౯౦.౫ కోట్లరూపాయల వస్తువులుమాత్రమే ఆదేశమునుండి వచ్చియున్నవి. ఆవిధముగానే హిందూదేశమునుండి యునైటెడ్ కింగ్ డమ్కు ఎగుమతిచేయబడుచుండిన సరకులవిలువ యుద్ధమునకుపూర్వము ౨౫% లేక ౭౮౪ కోట్ల రూపాయలై యుండగా, యుద్ధానంతరము అనగా ౧౯౨౯-౩౦ సం. నాటికి అది ౫౦ కోట్ల రూపాయలవరకు తగ్గిపోయెను. ఇంగ్లండుదేశముతో దిగుమతి ఎగుమతి వ్యాపారములు మొత్తముమీద చూచిన పూర్వము నూటికి ౪౦ వంతులుండగా ఇప్పుడు ౨౯% నకు తగ్గిపోయినవి.

ఇంక బ్రిటిష్‌సామ్రాజ్య మంతటితోడను హిందూదేశమున కున్న వర్తకవ్యాపారము సంఖ్యలు గమనించి చూచిన పైవిషయములే స్పష్టీకరింపబడినవని గ్రహింపనగును. యుద్ధమునకుపూర్వము సామ్రాజ్యాంతరదేశముల నుండి మొత్తము దిగుమతుల విలువ ౬౯% ఉండగా, దానియందు ౧౯౨౯-౩౦ సం. లో ౫౮% నకును, ౧౯౩౦-౩౧ లో ౪౬% నకును తగ్గుదల కాన్పించెను. ఆదేశములకు దిగుమతుల విలువ యుద్ధమునకుపూర్వ ముండిన ౪౦% నుండి ౧౯౨౯-౩౦ లో ౩౬% వరకు తగ్గిపోయెను. బ్రిటిష్‌సామ్రాజ్యపుదేశములతో ఎగుమతి దిగుమతి వ్యాపారముల మొత్తము విలువ ౧౯౧౩ సం. పు ౫౨%నుండి ౧౯౨౯-౩౦ లో ౪౨%వరకు తగ్గిపోయెను.

* * * *

పైవిషయము లట్లుండ హిందూదేశమున కితర దేశములతో వర్తకసంబంధములు హెచ్చయి వాటితో వర్తకవ్యాపారము దినదినప్రవర్ధమాన మగుచున్నదని మనము గ్రహింపవలసి యున్నది. సామ్రాజ్యమునకు బయటనున్న దేశములనుండి మనము యుద్ధమునకు పూర్వము మనకు కావలసిన వస్తువులలో ౩౦% మాత్రమే దిగుమతిచేయుచుండెడివారము. కాని ౧౯౨౯-౩౦ సం. లో ఆవరుమానము ౪౭% నకును, ౧౯౩౦-౩౧ లో ౫౩% నకు పెరిగెను. మన మాదేశముల కెగుమతిచేయు సరకుల వరుమానము యుద్ధమునకుపూర్వ ముండిన ౫౭% నుండి, ౧౯౨౯-౩౦ లో ౬౪% వరకును పెరిగినది. మొత్తము ఎగుమతి దిగుమతుల విలువ ౪౮% నుండి ౫౮.౫% వరకును పెరిగినది.

హిందూదేశపు విదేశవర్తకవ్యాపార సంఖ్యలు గమనించిన ఇంగ్లండుదేశముతో వర్తకమునందుమాత్రమే హిందూదేశపు దిగుమతులవిలువ ఎగుమతులవిలువకన్న హెచ్చుగా నున్నదనియు, ఇతరదేశములతో చేయు వర్తకములో ఎల్లప్పుడును ఎగుమతుల విలువ హెచ్చుగను దిగుమతుల విలువ తక్కువగను నున్నవని మనము గ్రహింపగలము. అనగా బ్రిటిష్‌సామ్రాజ్యాంతరదేశములు కాని వాటితో చేయు వర్తకవ్యాపారములో మనదేశమున కెప్పుడును లాభమే యనియు, యునైటెడ్ కింగ్ డమ్, దానికి సంబంధించిన దేశములతోడి వ్యాపారమునందుమాత్రమే మనకు నష్టము వచ్చుచున్నదనియు దానివలన స్పష్టమగుచున్నది. ఒక ౧౯౩౦-౩౧ సం. లో మాత్రము ఇంగ్లండుదేశమునకు మనము ౮ కోట్ల రూపాయల విలువ గల సరకులను హెచ్చు ఎగుమతి చేసియుంటిమి.

* * * *

ఇంగ్లండుదేశమునుండి మనము దిగుమతిచేయు వస్తువులవిలువ చూచిన ఒకసంవత్సరములో (అనగా ౧౯౨౯-౩౦ నుండి ౧౯౩౦-౩౧ వరకు) ౧౦౩ కోట్ల రూపాయలనుండి ౬౧ కోట్లరూపాయలకు తగ్గిపోయెను. మరియు హిందూదేశము ఇంగ్లండునకు ఎగుమతిచేయు సరకుల పరిమాణము ౧౯౨౯-౩౦ సం. లోని ౨౧% నుండి ౧౯౩౦-౩౧లో, ౨౪% నకు హెచ్చినప్పటికిని, వాటి నికరమువిలువ ౬౯ కోట్ల రూపాయలనుండి ౫౪ కోట్లరూపాయలకు తగ్గిపోయెను. ఇంగ్లండుదేశమునకు మన మెగుమతి చేయు వస్తువులలో ముఖ్యమైనవి: తేయాకు (Tea), విలువ ౨౦ కోట్లరూపాయలు; చర్మములు, తోళ్లు (Hides and skins), విలువ ౬ కోట్లరూపాయలు; ప్రత్తి, ప్రత్తిగింజలు, తినుబండారపు వస్తువులు (Raw cotton, seeds and food grains) విలువ ౬ కోట్లరూపాయలు; గోనెనార, గోనెనారసంచులు మొదలైనవి (Jute, raw and manufactured), విలువ ౪ కోట్లరూపాయలు; ఉన్ని (Raw wool), విలువ ౨ కోట్లరూపాయలు. వీటి యన్నిటిమొత్తము చూచిన ఇంగ్లండునకు మన దేశమునుండి ఎగుమతియగు సరకులు ౧౯౩౦-౩౧ లెక్కలప్రకారము ౮౯% ఉన్న వని అంచనావేయబడెను. ౧౯౨౯-౩౦ సం.పు అంకెలను బట్టిచూచిన ఈపరిమాణము నూటికి ౨ వంతులు హెచ్చినదని మనము గ్రహింపవలెను. ఇంకొక విషయ మేమన, మనము ఇంగ్లండునుండి ఇదివరలో దిగుమతిచేయుచుండిన సరకులు చాలవరకు ఇతర దేశములనుండి ఇప్పుడు మనము దిగుమతిచేయుచున్నాము. ఈదేశములలో జపాను, సంయుక్తరాష్ట్రములు ప్రతియేటను తమహిందూదేశముతో వర్తకవ్యాపారమును అభివృద్ధి చేసికొనుచు, ఇంగ్లండును త్రోసిరా జనుచున్నవి.

పైవ్రాసిన విషయము ఏల ముఖ్యమనగా, ఫిస్కల్ కమీషను (Fiscal Commission) వారు సూచించినటుల, విదేశపుమార్కెట్టులలో పరిశ్రమలందు తయారైన వస్తువులమధ్య నుండునంత పోటీ పరిశ్రమలకు పనికివచ్చు వస్తువులమధ్య నుండదుకాబట్టి, పరిశ్రమలందు తయారైన వస్తువులకు వర్తకవిషయములందు అభిమానము చూపుటవలన ఆయాసరకులను పంపు దేశములకు లాభము. కాని హిందూదేశమునుండి ఎగుమతియగు వస్తువులు చాలవరకు రెండవరకమునకును (అనగా Raw materials) చెందినవై యుండుటచే, అవి ఇతర దేశములలోనికి ఏవిధమగు దిగుమతిసుంకములను చెల్లింపనక్కరలేకయే ప్రవేశము కల్గియున్నవి. దానంజేసి మన మాయాదేశముల మంచి యభిప్రాయముపై నాధారపడియుండుటకును, అట్టి యభిప్రాయమును సంపాదింప ప్రయత్నించుటకును అంత అవసరము లేదు.

*　　*　　*　　*

మనము యునైటెడ్‌కింగ్‌డమ్‌కు ఏయేవస్తువుల నెగుమతి చేయుచున్నామో పైన చెప్పబడినది. ఆసరకులపై నిదివరలోనే బ్రిటిష్‌ప్రభుత్వమువారు "దిగుమతి సుంకముల చట్టము" (Import Duties Act) క్రింద పన్ను చెల్లింప నవసరములేదని చెప్పియున్నారు. అట్లు కాక వారే ఆవస్తువులపై కొద్దిపన్నును విధించుటకు పూనుకొనినప్పటికిని, హిందూదేశము ఇంగ్లండుదేశపు సరకులకు వర్తకసౌకర్యముల నిచ్చి (Preferential treatment) వాటినుండి తప్పించుకొనుటకు ప్రయత్నింప నవసరములేదు. ఏలనన, మన సరకులు, ఆదేశములో కాకున్న ఏ ఇతరదేశములోనైనను తప్పక అమ్ముడుపోవుపరిశ్రమలకు మూలాధారములగునవై యున్నవి. మరియు, మన మెగుమతిచేయు వస్తువులలో కొన్ని (ముఖ్యముగ జనుము - Jute) మనదేశములోనే కాని ఏఇతరదేశములోకాని పండనివగుటచే, ఇతరదేశస్థులు వాటిని తప్పక మనవద్దనుండి తెప్పించుకొనవలసిన పరిస్థితులలో నుండును. ఎటు చూచినను, మనకు వర్తకవిషయములలో ఇంగ్లండుదేశమునకు పాదాక్రాంతులమగుట కంతమాత్ర మవసరము లేదు.

## ౨

ఇంపీరియల్ ప్రిఫరెన్సుపద్ధతిని మన మంగీకరించి హిందూదేశములోనికి దిగుమతియగు వస్తువులపై అభిమానముచూపు పద్ధతి నవలంబించిన, మనదేశపు ప్రజాసామాన్యమునకు ఆర్థికముగ చాలనష్టము వచ్చును. ఇప్పు

దున్న పరిస్థితులయందే హిందూదేశస్థులు బీదతనము వలన బాధపడుచు పారిశ్రామికాభివృద్ధి కనుకూలముగా నుండునట్లు విధించుచున్న రక్షణ సుంకములద్వారా కొన్నికొన్ని వస్తువుల ఖరీదు హెచ్చుటచే భరింపజాల కున్నారు. సామ్రాజ్యవర్తకసౌకర్యముల పద్ధతిప్రకారము ఇంకను హెచ్చుసుంకములు సామ్రాజ్యేతరదేశముల నుండి దిగుమతియగు వస్తువులపై విధింపబడిన, హిందూదేశప్రజల కిప్పటికన్న హెచ్చునష్టము వచ్చుననుసంగతి నిజము. ఇదియుకాక మనదేశపు పరిశ్రమాభివృద్ధికై ఇంతవరకు పడినట్టియు, ఇంకముందు పడవలసినట్టియు వ్యయప్రయాసము లన్నియు, ఇంపీరియల్ ప్రిఫరెన్సు పద్ధతి నామోదించుటవలన మనము కోల్పోవలసివచ్చును. మనదేశము ఇకముందు చాలకాలమువరకుకూడ పరిశ్రమలను అభివృద్ధిచేసికొనుటకు సావకాశముల విడనాడి ప్రస్తుతపరిస్థితులయందే మన ముండవలసివచ్చును. సామ్రాజ్యాంతరవర్తకపు టొడంబడికల నామోదించి స్వదేశపు ఔన్నత్యమార్గమును కోల్పోవుటకు దేశస్థు లెంతమాత్ర మంగీకరింపరు.

ప్రత్యేకముగ బ్రిటన్ దేశమునుండి దిగుమతియగు వస్తువులపై మనము తక్కువపన్ను విధించుట లేక అభిమానముమాపుట యనుపద్ధతిలో ఎంతమాత్రము న్యాయముకాని, లాభముకాని లేదను విషయము ఈమధ్యను ఆదేశమునందు రక్షణపద్ధతిని ప్రవేశపెట్టి వాటివలన ఆదేశపు పరిశ్రమలయందు తయారైన వస్తువుల ఖరీదు హెచ్చుచేయుటకు బ్రిటిష్‌ప్రభుత్వమువారు తోడ్పడుటచే స్పష్టమైనది. అట్లు హెచ్చు ఖరీదు వస్తువులను మనము దిగుమతిచేయుటవలన ఆహెచ్చుపన్నుల బరువును మనము భరింపవలసియుండును. మిక్కిలి బీదదేశములలో ఒకటని ప్రఖ్యాతిగాంచిన మనదేశము హెచ్చుభారమును వహింపజాలదనుట స్పష్టముకాదా ?

*  *  *  *

వీటియన్నిటికంటెను ముఖ్యమగు ప్రతిబంధకము వేరొకటి కలదు. హిందూదేశమునకు రాజకీయముగ గాని ఆర్థికముగగాని, తన స్వంతవ్యవహారములను తన ఇష్టమువచ్చినట్లు పరిష్కరించుకొనుటకు ఇతర-అధినివేశరాజ్యములకువలె అధికారము లేదు. మరియు, హిందూదేశస్థులను వలస-అధినివేశ-రాజ్యములందు ఎంత హీనముగ జూచుచున్నారో మనకందర కెరుకయే. ఈ రాజ్యములలో కొన్నిటియందు భారతీయులకు ప్రవేశము లేకుండ చేయునట్టియు, వారికి హక్కులేమియు లేకుండ చేయునట్టియు చట్టము లమలునందున్నవి. హిందూదేశమునకు వర్తకస్వాతంత్ర్యము లేకపోవుటచే, మనఇష్టము వచ్చినట్లు వర్తకవిషయములందు ఏర్పాట్లుచేసికొనుటకు వీలులేక హిందూదేశపు మంత్రిఆజ్ఞల ననుసరించి మన ప్రభుత్వమువారు నడువవలసివచ్చుచున్నది. మన కట్టి స్వాతంత్ర్య మున్నను, హైందవుల నంతహీనముగ చూచు సామ్రాజ్యాంతరదేశములతో మన మెందులకు వారికి లాభము కల్గునట్టియు, హిందూదేశమునకు నష్టము కల్గునట్టియు వర్తకపు టేర్పాటులు చేసికొనుట కొప్పుకొనవలెనో తెలియుటలేదు. దానికి వారు తగు జవాబు నిచ్చినప్పుడే హిందూదేశస్థు లాపద్ధతినిగూర్చి ఆలోచించుటకు తగుఅవకాశము లేర్పడును.

ఫిస్కల్ కమిషన్ (Fiscal Commission) వారిముందీవిషయము విచారణకు వచ్చినప్పుడు, అల్పసంఖ్యాకుల రిపోర్టు (Minority Report) నందు వారిట్లు వ్రాసియున్నారు: "హిందూదేశము బ్రిటిష్ సామ్రాజ్యమునందేదేశముతోనైనను పరస్పరవర్తకసౌలభ్యపు టేర్పాటుల నిచ్చురు ఒడంబడికలు చేసికొనుటకు ముందు, ఆయాదేశముల ప్రభుత్వములు హిందూదేశస్థుల కితరస్వాతంత్ర్యదేశముల ప్రజలతో సరిసమానమగు హక్కుల నీయవలెననియు, భారతీయులకనువర్తించు నంతవరకు, ఏషియాఖండవాస్తవ్యులకు వ్యతిరేకముగ నుండు చట్టముల నన్నిటిని రద్దుచేయవలెననియు, వారంగీకరించునట్లు చేయవలసియుండును. ఈరెండుషరతుల వా రామోదించినప్పుడే హిందూదేశమువారితో వర్తకపు టొడంబడికలు చేసుకొనువిషయ మాలోచింపగలదు." ఈ అభిప్రాయముతో భారతదేశమునందన్ని పక్షములవారు రేకీభవింపగలరు. భారతీయుల గౌరవముతో మాడని సామ్రాజ్యాంతరదేశములతో భారతప్రభుత్వము

వారెట్లు ఒడంబడిక చేసుకొనగల్గియుందురో యను విషయము వారాలోచింపకుండుట శోచనీయము.

*  *  *  *

హిందూదేశపు రాజ్యాంగవిధానములో ముఖ్యము మార్పులు జరుగనున్న ఈసమయములో, హిందూదేశమందు బాధ్యతాయుతప్రభుత్వవిధానము ప్రవేశపెట్టబడునను సూచనలు ప్రబలు ఈసమయములో, ఇప్పటి బాధ్యతలేని ప్రభుత్వవర్గమువారు, హిందూదేశప్రజాభిప్రాయమునకు వ్యతిరేకముగ సామ్రాజ్యాంతర్గతదేశములతో వర్తకసౌకర్యపు టొడంబడికలు చేసికొనినచో, భావిబాధ్యతాయుతప్రభుత్వమువారి స్వాతంత్ర్యాభిప్రాయము నరికట్టి, దేశమునకు తీరనినష్టము కలుగజేసినవారగుదురు. అట్లు వారు చేసిన ముందురాబోవు ప్రభుత్వవర్గమునకు చాలనష్టమును, అన్యాయమును చేసినట్లగును. అట్టి ఒడంబడికలు చేసికొనుటకుగాని, నిరాకరించుటకుగాని, శాసనసభకు సంపూర్ణస్వేచ్ఛ కల్గియుండవలెను. ఈదృక్పథమునుండి ఆలోచించిన, ఇండియాప్రభుత్వమువారు, ఒట్టావా సమావేశమునందు చేయు మార్పులను, ప్రస్తుతశాసనసభవారి ఎదుట పెట్టుదుమనియు, వారి యభిప్రాయము ననుసరించిరేని ఆమార్పుల ననుసరించెదమనియు, బుజ్జగింపజూచుట ఆమోదింపదగిన విషయము కాదు.

హిందూదేశమునకు కొంతవరకు వర్తకపు టేర్పాటులను విషయములలో స్వాతంత్ర్యమిచ్చుచు ఒక సమాధానము (Fiscal Convention) మాంటేగూ సంస్కరణముల ప్రవేశపెట్టునప్పుడు ఏర్పాటు కాబడినది. దానిప్రకారము ఇండియా ప్రభుత్వమువారును, భారత శాసనసభవారును ఒక పద్ధతినిగూర్చి ఏకాభిప్రాయులై యున్నప్పుడు, ఇండియామంత్రి ఆవిషయమునందు జోక్యముపుచ్చుకొనక ఇండియా ప్రభుత్వమువారి యొక్కయు శాసనసభయొక్కయు అభిప్రాయములను మన్నింపవలెను. కాని ఈసమాధానమునకు వ్యతిరేకముగ ఇండియామంత్రి హిందూదేశపు వర్తకపు టేర్పాటులందు ప్రవేశము కల్పించుకొని శాసనసభవారి యభిప్రాయమునకు వ్యతిరేకముగ ఏర్పాట్లు జరుగునట్లుచేసిన సందర్భములు చాల కలవు. ముఖ్యముగ ౧౯౩౦ సం. లో ఇండియా ప్రభుత్వమువారు భారతవస్త్ర పరిశ్రమకు రక్షణనిచ్చు సందర్భములో ఇండియామంత్రి ఎట్లు జోక్యముకల్పించుకొని హిందూదేశాభిప్రాయములకు వ్యతిరేకముగ ఎట్లు ప్రవర్తించెనో మనకు తెలిసినదే. అప్పుడాతడు ఇండియాప్రభుత్వమువారి కిష్టము లేకున్నను, బ్రిటిష్‌వర్తకపు సౌలభ్యసూత్రమును ప్రవేశపెట్టి లాంకషైరు మిల్లులకు సౌకర్యము కల్గునట్లు చూడవలెనని వారిని నిర్బంధించి కృతకృత్యుడాయెను. అప్పటి లెజిస్లేటివ్ అసెంబ్లీయందు దీనినిగురించి తీవ్రమగు ప్రతిరోధకము చూపబడినప్పటికిని, ఆనిరోధమువలన ప్రయోజనము లేకపోవుటవలన, భారత శాసనసభవారికి వర్తకపు విషయములలో స్వంతనిర్ణయములకు వచ్చుట కెంత అధికారము కలదో స్పష్టమైనది. కాని జ్ఞాపక ముంచుకోవలసిన విషయ మేమన అట్లు ౧౯౩౦ లో బ్రిటిష్‌దిగుమతులపై అభిమానము చూపబడినప్పటికిని, హిందూదేశమునకు బ్రిటన్‌నుండి దిగుమతులు పూర్వముకన్న తగ్గిపోయినవి; తగ్గిపోవుచునే యున్నవి. కాన హిందూదేశము తనంతట తాను తన వర్తకవ్యాపారవిషయములను ఏర్పాట్లు చేసికొనుటకు సంపూర్ణస్వాతంత్ర్యము కల్గియుండునంత వరకు, ఒట్టావాసమావేశమునందు చేయబడనట్టి సామ్రాజ్యవర్తక సౌకర్యపు టొడంబడికలు, ఎంతమాత్రము అంగీకరింపకూడదు, అంగీకరింపబడబోవు.

*  *  *  *

పైన చెప్పబడిన సందర్భములలో, ఇండియా గవర్నమెంటువారు బ్రిటన్‌తోగాని, ఇతరసామ్రాజ్యమందలి దేశములతోగాని వర్తకపు టొడంబడికలు చేసికొనుట కిష్టపడినచో చాల అవిచారమగు పనిచేసినవారగుదురు. ప్రస్తుత పరిస్థితులలో అట్టి ఒడంబడికలు ప్రజాభిప్రాయమునకు పూర్తిగ వ్యతిరేకములు. హిందూదేశము నిట్టి ఒడంబడికల కనుకూలముగ నుండునట్లు చేయుటకు, ఇంగ్లండులో గొప్పప్రయత్నములు జరుగుచున్నవి. హిందూదేశపు "ప్రతినిధుల" ను పేటి నొప్పికొనునట్లు చేయుటకు ఏర్పాట్లు జరుగుచున్నవి. కాని ఈప్రతినిధులలో నొకరగు సర్ పాదంజీ గిన్వాలా గారు

హిందూదేశపు రాజకీయవిధానపు విషయములు అనుకూలముగ పరిష్కరింపబడినగాని, వర్తకపు సౌకర్యపు టొడంబడికలు హిందూదేశాభిప్రాయము ఎంతమాత్రమును ననుకూలముగ నుండవని స్పష్టముగ తెలియపర్చిరి. ఒట్టావా సమావేశముకే ఇంకొక ప్రతినిధియగు సర్ అతుల్ ఛాటర్జీ గారుకూడ హిందూదేశమునకు లాభకరముగ నుండువట్టి షరతులపైననే ఒడంబడిక నేర్పైన తా మొప్పుకొందు మని ఈమధ్యనే చెప్పియున్నారు. కాని నిజముగ ఈ ప్రతినిధులు తమ స్వాతంత్ర్యాభిప్రాయములను ఆచరణ యందుంచుటకు తగిన అవకాశములు కల్గియుండిరా యను అనుమానమునకు తప్పక అవకాశము కలదు. హిందూదేశమునందుముఖ్యమైన హైందవవాణిజ్యసంఘము లన్నియు ఒట్టావాసమావేశమును బహిష్కరించినవి; వాటిప్రతినిధు లెవ్వరును హిందూదేశపు ప్రతినిధివర్గమని చెప్పబడువారికి ఏవిధమైన సలహా నిచ్చుటకుగాని, సహాయముచేయుటకుగాని ఒట్టావాసమావేశమునకు పోవుచుండుట లేదు. ఏది ఎట్లున్నను, ఒట్టావాసమావేశనిర్ణయములు రాజకీయ సంస్కరణముల ప్రవేశానంతరము ఏర్పడు శాసనసభవారి ఆమోదమును పొందగల్గినప్పుడుగాని హిందూదేశము వాటినిగూర్చి ఏబాధ్యతయు వహింపజాలదు.

---

## కవి జీవనము

వెదురుమూడి వెంకటకృష్ణరావుగారు

తినఁ గూడు లేకేమి! వనులెల్ల తమ మేలి ఫలరసా లిచ్చు తల్లులయి వెలయ;
కట్టఁ బట్టంబులు కలుగ కేమి! సుమలతల్ మానదాతలై తనరుచుండ;
నిండ్లు లే కేమి! మహీధరకందరములు కట్టనిపెనుకోట లయి యొప్ప;
బంధువుల్ లే కేమి! ప్రవిమలప్రేమగీతలఁ బాడు ద్విజగత్నుతతులు గలుగ;
సుఖము లే కేమి! సరసవాక్సుమశరీరి-కవిత యేవేళ వరియించి గౌరవింప;
నతురానంతరాజ్యసమంచితులుగఁ - గవుల దేవతల్ గావంగఁ గలదె లోటు!

---

# దశావతారతత్త్వము

శ్రీశ్రీశ్రీ రాజా విక్రమదేవవర్మ మహారాజులుంగారు (జయపురము)

జగమునకు నాది జల మౌట జలచరంబె
యాదిఁ బ్రభవించెనని మీన మవనిఁ జాటు
ధరణి గ్రొత్తగఁ గలుగంగ స్థలజలచర
సమితి ప్రభవించెనని చాటు కమఠవరము

అతిరజోగుణయుతమ్మగ నవలఁ బొడమె
ననుచుఁ బ్రకటించుఁగద వరాహంబు దలఁప.

అవల మృగనరగుణయుతవ్యక్తిచయము
పొడమెనని చాటు నరసింహమూర్తి యెన్న.

పదపడి యపూర్ణమానవు లొదవి రనుచు
వామనావతారము సేయుఁ బ్రకటనంబు.

మొదట నరులు రజోగుణపూర్ణు లనుచుఁ
బరశురామావతారంబు బయలుపఱచు.

పిదప నిక్కంపు గృహమేధి వెలయఁగలిగె
ననుచుఁ దెలుపును శ్రీరామజనవరుండు.

అవల నరులకు మూఁడవయాశ్రమంబు
గలిగెనని ప్రకటించెడు బలుఁడు గనఁగ.

సత్యగుణరాశి-సన్యాసి సంభవించెఁ
బిదప నని బుద్ధరూపంబు వెల్లడించు.

దుష్టహరుఁడు-సజ్జనసుఖదుండు నైన
స్వామి గలిగె నావలనని చాటుఁ గల్కి.

చూడ రామత్రయము పరశువును గార్ము
కానుగములను హలమును హస్తములను
దొడుగు టవి సాటు మనుజులు దొల్లి వనుల
నఱుకు టావలఁ బోరు టనంతరంబు
పుడమి దున్నుట క్రమముగాఁ బొడమెననుచు.

---

సత్యమును బాయఁ జనదని; సాధుజనుల
సాయమును జేయవలెనని; జన్మభూమి
గారవించుట దగునని; కడఁగి శ్రితుల
సాఁకవలె నని; మఱి బ్రహ్మచర్య మొనరఁ
జేయ వలె నని; శత్రుల శేష ముంపఁ
దగదని; గృహస్థధర్మంబు దగ నొనర్ప
వలె ననియు; నుదాసీనత భవ్య మనియు;
రాగరాహిత్యమే సుఖప్రకర మనియు;
ధర్మసంస్థాపనంబు కర్తవ్య మనియుఁ;
దెలుపు నవతారముల కార్యములు జనులకు.

---

విద్వాన్ కట్టి సాంబమూర్తిశాస్త్రి గారు

ఇదివఱలోఁ గావ్యప్రకాశికా వివరణమను బుజ్జ వృత్తినిగూర్చి పాఠకులకు నివేదించియున్నాఁడను. ఇపు డముద్రితమును నూతనోపలబ్ధమునగు నాంధ్ర ప్రబంధవిషయము విశదీకరింపఁబూనుచున్నాఁడను.

మాయా విలాసము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. కథ శైవపురాణములలోని యల్లముఁడను శివభక్తుని జితేంద్రియత్వమును మహిమను వర్ణించునది. కథానాయకుఁడు మాత్రమే ప్రసిద్ధుఁడు కాని మిగిలిన పాత్రము లన్నియుఁ గవికల్పితములే. దీనిని రచించినకవి

తులగాన నీలకంఠకవి :— జంగములలో పావరు లనియుఁ, జరులనియు రెండు తెగ లాంధ్రప్రాంతమునఁ గలవు. పావరు లనఁగా శివాలయములం దర్చనాదికమే చేయుచుండువారు. వీరికి శిష్యు లుండరు. చరు లనఁగా దేవాంగులు మొదలగువారికి మంత్రోపదేశములు లింగ ధారణములు గావించుచు దేశమున మతప్రచారము గావించువారు. మనకవి పావరజాతిలోనివాఁడు. పావర శబ్దము స్థావరశబ్దముయొక్క వికృతరూపము. ఇంటి పేరు తులగానవారు. తండ్రి నీలమాహ్వయుఁడు. తల్లి మల్లమ. నివాసము గంజాం మండలములోని తుల గామను గ్రామము. శ్రీకాకుళమునకు ముప్పదిమైళ్ల దూరమునఁ బర్లాకిమిడిసంస్థానములో వంశధారానదీతీర మున నీగ్రామ మున్నది. ఈగ్రామనామమును బట్టియే కవి యింటిపేరు వచ్చినది. తులగామ అనుదాని కొకవిధ మగు నాపవిభక్తికప్రత్యయము చేర్పఁగా తులగాన అని యేర్పడినది. కూర్మాన పట్నాన అనుపేళ్లు నైత మిట్టి పరిణతి నొందినవే. లాక్షణికవ్యాకరణములలో నీప్ర త్యయ మంగీకరింపఁబడకున్నను వ్యవహారమందు మాత్ర మీరూపములు బహుళముగానే కలవు. తులగా మునకు తులగానకు అనురూపములు సప్తమ్యంతములుగా లాక్షణికు లంగీకరించినవి. ఈరూపములు నైతము మొదట సప్తమ్యంతములుగానే యుండి కాలక్రమమున నాప విభక్తికములుగా మారినవి. మాగాపు, అంగవరపు, అను రూపములవలెనే యిదియు సమాసమందలి వికారమే. అయితే ప్రస్తుతమునకు వత్తము. ఈ కవి పుట్టువు తోడనే అనూరుఁడు. తొడలపై నున్న శరీరము మాత్రమే కాని పూర్వకాయము లేదు. కావున నితఁడు గురువులకడ కేఁగుట విద్యాభ్యాస మాచరించుటయు సమకూడినవి కావు. ఇతరలౌకికవ్యాపారముల కసమర్థుఁ డగుటచే నీకవి సంతతము విద్యాభ్యాసమునందే కాలము గడపిన వాఁడు. తమయింటికి వచ్చిన పెద్ద లెవ్వరో కొంచెము కొంచెము విద్య నేర్పఁగా దానిపైని దానే స్వతంత్ర ముగా విశేషగ్రంథవ్యాసంగ మొనరించి బుద్ధిబలము వలనఁ గవిత్వమునకు సమర్థుఁడైనవాఁడు. ఈవంత తానే నేర్చినకవిత్వ మగుటచేతనే ఆశ్వాసాంతగద్యములందు "శ్రీమన్మహేశ్వరకరుణాకలితాన్యదభ్యాసోచితకవిత్వ మహత్వ" యని స్వవిషయము వ్రాసికొన్నాఁడు. గురు శుశ్రూష లేమిచేఁ గవిత్వమునఁ దోష ములు చాలగా నగపడుచున్నవి. ఇందుఁ గవిప్ర యుక్తములు కొన్నియు లేఖకప్రక్షిప్తములు కొన్నియుఁ గలవు. లేఖకదోషములు పరిహరించినఁ గవిదోషము లంత హెచ్చుగా నుండవు. గ్రంథము మిక్కిలి రసవం తమైనది. శృంగారరస మిందు పొంగిపొరలి పరాకాష్ఠ నందియున్నది. దాక్షిణాత్యకవుల కీకవి సమానుఁడా యధికుఁడా యను విచికిత్స గలిగింపఁజాలునంతగా నిందు శృంగారము వర్ణింపఁబడినది. కథానాయిక పుట్టిన యూ రగు బసవశీపురంబును మధుకేశ్వరావాసమగు ముఖలింగ మును కవి నివాసగ్రామమునకు దగ్గఱగానే యున్నవి. కవి యిప్పటికి నూటయేఁబదియేండ్లకు పూర్వుఁడని నర సన్నపేటనివాసులగు వేశంగి చంద్రయ్యస్వామిగారు చెప్పుచున్నారు. చంద్రయ్యస్వామిగారు చరజంగమశాఖ వారు. వారును వారిపూర్వులును శైవమతాంధ్రగ్రంథము లందు విశేషవ్యాసంగ మొనర్చినవారు. ఇపుడు వారి వయస్సు డెబ్బదికి పైఁగా నుండును. వారిచిన్నతనమందే

యీ కవినిగూర్చి నూతేండ్ల కు ముందువాఁడని వినెడివా
రఁట. కావున నీకవి నూతేండ్ల కుఁ బూర్వుఁడని నిస్సంశ
యముగాఁ జెప్పవచ్చును.

ఇందలి కథా విధానము:— నైమిశారణ్యమున
మునులు శైవపురాణములనెల్ల సూతునివలన వినుచుండి
యొక్కనాఁ డల్లమ గణాధిపతి చరిత్రమును దెలుపుమని
వేఁడ సూతుఁ డీకథ వక్కాణించెను. బనవసిపురంబున
మమకారుం డనురాజు సంతానాపేక్షచే మధుకేశ్వరునిఁ
గూర్చి తపం బొనరింప నాతనికొక్క తనయారత్న ముద్భ
వించెను. ఆబాలిక పుట్టినంతనే యరణ్యములందుఁ దపం
బొనరించుచున్న మనంబులు హఠాత్తుగాఁ జలించి సమాధివిర
హితము లయ్యెను. మునులు మనస్స్థైర్యనాశమునకు
హేతువు గానక విచారించుచున్నతఱి దుర్వాసో
మహర్షి యచ్చటి కేతెంచి వారికి ధైర్యము నొల్పుచు
నా బాలికపూర్వవృత్త మిట్లని చెప్పెను. కైలాసంబున
నొక్కనాఁడు శివుఁడు నిండుకొలువున్నతఱి నచ్చటి
కల్లమగణపతి రాఁగా శివుఁడు లేచి యెదురేఁగి యర్ఘ్య
పాద్యాసనాదులచే నాతని గారవించి వీడ్కొలిపెను.
అది చూచి పార్వతి యీర్ష్యామాయాపరవశయై
'నాథా, యాతనినంతగా గారవింప నేల? కామ
వశుఁడై క్షణములో వసఃపతితుఁడు కావలసినవానికి
మదనారివగు నీ విట్లు సపర్యలు చలుపవచ్చునా' యని
శివు నడిగెను. శివుఁ డాతఁడు జితేంద్రియుఁ డనియుఁ
దనకంటెఁగూడ నధికమహత్త్వము గలవాఁడనియుఁ
బ్రత్యుత్తరం బీయ నపర్ణ వానిని భ్రంశమొనరింప శపథ
మూని తన మనంబునంగల యహంకారము నెల్ల నొక్క
వనితగా భూలోకంబున నవతరింపఁ బంచెను. ఆ యహం
కారమే మమకారభూపునకుఁ దనయయై యుదయించె
నని యా బాల వృత్తాంతము దెలుప మునులు దిగు లుడిగి
యథాపూర్వముగ నియమవ్రతులై యుండిరి.

మమకారునిభార్య మోహిని యీ బాలికకు
మాయ యనునామము గావించి పెంచి సమస్త కళలు
నేర్పుచున్నంత నొక్కనాఁడు శివాజ్ఞాప్రచోది
తుఁడై మార్దంగిక రూపంబున నల్లముం డేతెంచి
మధుకేశ్వరాలయాంగణంబున మృదంగ వాద్యంబున
స్వామి నారాధించెను. అంతకు మున్న మధుకేశ్వ
రారాధనమునకు గర్భాలయంబు సొచ్చియున్న మాయ
యతిలోకమగు నావాద్యప్రౌఢి కచ్చెరువంది వచ్చిచూచి
యాతనిసౌందర్యమున కని కామపరతంత్రయై యాతని
వలచె. ఆసంగతి నెఱింగి మాయ చెలి యొకతె రాజున
కీమర్మెలకాని ప్రౌఢి తెల్పి మాయకు విద్య నేర్పఁ బ్రో
త్సాహపఱచెను. రాజును కుమారికి వాద్యంబు నేర్ప
నల్లము నొడంబఱిచి కన్యాసౌధోపాంతమున నొక
యింట నీతని విడియించె.

విద్య నేర్పుసమయమునఁ దన హావభావాదుల
వల్ల ముని వశము గావించికొనఁ బ్రయత్నించియు విఫల
మనోరథయై తుదకు తానే విరహవేదన నైఁపఁజాలక
యసువుల వీడునంతటి దుర్దశకుఁ బాలయ్యెను. ఆసమయ
మున నొక్క చెలికత్తె దాని యాప్సిత మెఱింగి యల్ల
ముని కడ కేతెంచి దాని బాధ నివేదింప నాతఁ డౌను గా
దనక దానితోడన కన్యాంతఃపురి ప్రవేశించె. కేళికాగా
రంబున మాయాల్లముల నుంచి సఖు లంతంత బయట
కేగినపిదప మాయ తన మాయ లన్నియుఁ బ్రకటించి
యాతనిఁ గరఁగింపఁజూచెను కాని యాతఁడెంతమాత్రము
చలింపలేదు. ఆ సమయంబున మోహిని యరుదెంచి
కూఁతు విరాళి నాలించి చూచి తన తనయ నిల్లాలిఁగాఁ
గైకొనుమని యల్లమునిఁ బ్రార్థించె. ఒకచెలికత్తె యల్ల
ముని వాద్యమునకు సరిగ లయ తప్పకుండ నృత్యము చేసి
నచో నల్లముఁ డాపిల్లను బెండ్లాడునట్లును లయ తప్పి
నచో నల్లముఁడు దాని వీడునట్లును సన్నిద మేర్పఱి
చెను. అందఱు దాని కంగీకరించి మధుకేశ్వరాలయమున
నాట్యసభ స్త్రీలు మాత్రము కావించిరి. కామాతుర
యగు మాయ యల్లముని సౌందర్యదిదృక్షాపరవశయై
లయ తప్పఁగా నాతఁ డామద్దెల చిదుకఁగొట్టి యరణ్య
ములవెంటఁ బరువెత్తెను. వానివెంట మాయయుఁ జెలి
కత్తియలును బరువెత్తి వానిఁ జుట్టుముట్టి వానితో నను
నయవాగ్వివాదము గావించుతఱి మాయ తా నధికురాల
ననియుఁ దనకు వశము కానివా రుండరనియుఁ బల్క
నల్లముఁడు దాని నీసడించి శివభక్తుల మహిమను వర్ణిం
చెను. మాయాప్రేరణంబున నాతనిం జెలికత్తియలు బం

ధింపఁ జూచునంతలో నాతఁ డంతర్ధాన మొందెను. మాయ పార్వతీప్రేషిత యగు దూతికతోఁ గూడి కైలా సంబున కేగెను.

కూఁతు రట్లు వనమున కరిగినదని విని మనుకా రుఁడు మోహినియు నేతెంచి వనంబున మాయావిరహి తలై వచ్చుచెలికత్తెలవలన జరిగిన వృత్తాంత మెఱింగి భిన్నులై పురంబున కేతెంచి శోకించుచుండ, వారిని గురువర్యుండగు సిద్ధుఁ డేతెంచి యథార్థ మెఱింగించి వారి శోకాగ్ని చల్లార్చెను. ఇది కథ.

కథాసంవిధానమున వేదాంత మిమిశ్రి యతి శృంగారముగా వర్ణించిన కవిప్రతిభ శ్లాఘ్యము. కవి సహజపాండిత్యుఁ డగుటచేఁ గథాకల్పనమందుఁగూడఁ గొన్ని చిన్నిదోసఁగులు పొసఁగినవి. కవితాశైలి తెలి యుటకై కొన్ని పద్యము లుదాహరించెదను.

ఉ. తమ్ములనీటు, నీలశర
దమ్ముల నీలిమ, గండు తేఁటి మొ
త్తముల డాలు, నిర్ఝరప
దమ్ము చోకారము, తక్కుఁగుల్కుట
దమ్ములచాయ నేలె నల
తామరసాయతనేత్ర కన్నులం
దమ్ము, మెఱుంగు వేనలి వి
ధ, మ్ములయారును, గొను, కెక్కులుక్.

చ. కనుఁగొనవచ్చినట్టి కల
కంఠికి నవ్యనరాజ్యలక్ష్మి సాం
పెనయఁగ హస్తపంకజము
లెత్తి వివాహ లొసంగి నేసఁ బ్రా
లొవరఁగఁ జల్లెనో యనఁగ
నొప్పె మరుచ్ఛలద్రామపల్లవా
భినుత సుగంధపుష్పరసభృ
త్సముదగ్రలతాంతజాలముల్.

సీ. రహి సుబ్బరోయి భారము భరింపఁగలేక
యలఁతి నెన్నడుము జవ్వాడుచుండ
కొలుకులు వెలువడి కొవలారు కరిచూపు
లలరుచెక్కులమీఁద నలముకొనఁగ
నొఱపైన పేరెద మెఱయు కట్టాణి ము
త్యాలహారంబు లుయ్యాలలూఁగ
దరహాసచంద్రికల్ దెలి మించుమోముపైఁ
బ్రోవుసేయుచుఁ గళల్ పొంగి పొరల
పసిఁడిగాజుల మిసమిసల్ పరిఢవిల్ల
కంబరారాతి మెఱుఁగు కలంబమట్లు
శీఘ్రగతి నేగి కడిఁది యచ్చెరువు నొంది
వలపు మరి నంటి చూచె నావాలుఁగంటి.

సీ. మూర్తి సంకస్థలిం గూర్చుండఁబోయిన
మంచంపుదండైయై మరఁగుచుండు
నిద్దంపుఁ జెక్కులు ముద్దాడ మంకింప
నంతటఁ దొలఁగి యలంత మెఱయుఁ
గవగూడి గట్టిగాఁ గౌఁగిలింపఁగఁబోవఁ
గను నిరాకారమై కను మెఱుంగు
నధరసుధారసం బాన మాహింపంగ
నందంద యందక యాసగొల్పు
భువనమోహన సుందరమూర్తియైన
యల్లమస్వామి యిట్టు లత్యంతవిరహ
శిఖిశిఖలచేత వేఁచి యాచెలువ నపుడు
త్రిప్పులం బెట్టెఁ గేళిమందిరములోన.

గీ. పురుషుఁ డాజ్యఘటము పూఁబోఁణి దావాగ్ని
యట్టి దవనియందు నంద్రు పెద్ద
లహహ యిపుడు చూడ నతివ యాజ్యఘటంబుఁ
బురుషుఁ డగ్నిరీతిఁ బొసఁగె నౌర.

ఇట్లే యీతని కవిత్వమెల్ల లలితములగు పదజాలముల తో నింపగు వర్ణనములతోఁ బాఠకుల యుల్లంబుల కుల్లా సంబు గూర్చుచుండును.*

---

* జన్మమాత్రంబున నమారుండై సహజ పాండిత్యుండై రసవత్తరంబులగు కృతులు రచించి లోకంబున కర్పించి కీర్తిగన్న యీ శైవాగ్రణిగ్రంథంబులు సరసశేఖరు లెవ్వరేని ముద్రించి ప్రకటించినఁ జాల బాగుగ నుండును. ధనికుఁడఁ గామింజేసి నేను ముద్రింపఁజాలను. ఎవ్వరేని ముద్రింప నియ్యకొనిరేని చక్కఁగఁ బ్రతి వ్రాసి యచ్చున కనువగురీతి నర్పింప సిద్ధముగా నున్నాఁడను. ఈతని యితరగ్రంథములు నీలకంఠలాపరిణయము, బసవ కల్యాణమును. వానింగూర్చి వేఱొకసారి నివేదించికొందును.

# ఆంధ్రముద్రాక్షర విలేఖనయంత్రము* 'బహారి'

౧

క్రిందటి డిసెంబరు ౯-వ తేదీని వెలువడిన "ఆంధ్రపత్రిక" లో ప్రచురింపబడిన "విజ్ఞప్తి" యందు, నే నాంధ్రముద్రాక్షర విలేఖన యంత్రమునుగూర్చి పేర్కొన్న విషయములన్నియు జనవరి "భారతి" యందు విపులముగ దెల్పుకొందునని విన్నవించుకొంటి గాని, కొన్ని యిబ్బందులవల్ల నింత యాలస్యముగ ప్రకటన కందజేసినందులకు పాఠకులు నన్ను మన్నింపవేడుచున్నాను.

ఇతర భాషాలిపులవిషయ మెట్లున్నను, మన యాంధ్రభాషాలిపిమాత్రము కాలక్రమమున మార్పుల జెందుచునేయున్నది. అట్లు మార్పుల జెందునప్పుడెల్ల కొంత ప్రాతపోకళ్యమును, మరికొంత యందమైన రూపమును నేకరించుకొనుచునే యున్నది. ఇందలి సత్యాసత్యములు దర్శింపనెంచిన, పూర్వశిలాతామ్రాది శాసనములను, ప్రాచీనతాళపత్రగ్రంథములను, ప్రస్తుత ముద్రితగ్రంథములను వరుసగ బరిశీలించినపక్షమున బోధపడగలవు. మరియు నాంధ్రభాషాలిపి యెట్లు మార్పుల జెందుట కుత్తరవాదులు భాషావిలేఖకులని చెప్పక తప్పదు. వా రావిధి లిపిని మార్చునప్పుడెల్ల అప్పటికి వాడుకలో నున్న లిపియందలి యక్షరములకే యించుక మార్పును గల్గజేయుచువచ్చిరి కాని, యంతకు పూర్వమం దెప్పుడో వాడబడిన లిపియందలి యక్షరములకు మార్పు కల్పించియుండలేరు. ఈపద్ధతి ననుసరించియే ముద్రాక్షరయంత్రము (Printing Press) ఆంధ్రదేశ మలంకరించునప్పటి కప్పుడు వాడుకలోనున్న యిటీవలి తాళపత్రగ్రంథాంతరాక్షరములను, అప్పటికి నూతనముగ ప్రచారములోనున్న బుడుతకీచుల పీచుకాగితపు గ్రంథాంతరాక్షరములను ఇంచుక సంస్కరించి ముద్రాక్షరముల నేర్పరచుకొనిరి. ఇందులకు నిదర్శనముల గొన్నింటి నిచట మచ్చునకు పేర్కొనుచుంటి గమనింపుడు.

ఇటీవలి తాళపత్రగ్రంథములందు "ప్వా" యను సంశ్లిష్టవర్ణ మీ క్రింద నుదాహరింపబడిన ఒకటవచిత్రమం దెన్నివిధముల వ్రాయబడినదో యన్నివిధముల వ్రాయబడినది. (ఇంతకన్న నెక్కుడురూపములు గలవు గాని యివి యంతముఖ్యములుగ దోచనందున విడువబడినవి.) కాని యీ యిటీవలి తాళపత్ర గ్రంథాంతరాక్షరముల సంస్కరించి యేర్పరచుకొనిన ముద్రాక్షరములం దీసంశ్లిష్టవర్ణము "ప్వా" యని యొక్క విధముననే ప్రస్తుతముద్రణమందు వాడబడుచున్నది.



చిత్రము ౧

ఇందలి సంశ్లిష్టవర్ణము లిటీవలి తాళపత్ర గ్రంథాంతర్గతములును, ఐత్వము ప్రాచీన తాళపత్రగ్రంథాంతర్గతమును నైయున్నవి.

ఐత్వము ప్రస్తుత ముద్రణమందువలెనే యిటీవలి తాళపత్రగ్రంథములందును గలదు గాని యంతకు పూర్వమందు లిఖింపబడిన ప్రాచీన తాళపత్ర గ్రంథములం

* నేననుగకపోయినప్పటికిని, నాకు లభింపని మ. రా. రా. శ్రీ M. S. వెంకయ్యగారి "తెలుగు లిపియు దత్సంస్కరణ" మను వ్యాసము నా కుచితముగ బంపిన భారతిపత్రికాధిపతులకును, నా చిత్రించిన చిత్రపటంబుల నతిజాగ్రత్తగ బరిశీలించి కష్టమున కోర్చి నా యభిప్రాయానుసారముగ I, III,IV, V, VI చిత్రముల నిండియన్ యింకు (Indian Ink) తో వ్రాసియిచ్చిన నా స్నేహితుడగు మ. రా. రా. శ్రీ V. వీరబ్రహ్మంగారికిని ఇందుమూలమున నాకృతజ్ఞతాభివందనముల నర్పించుకొనుచున్నాడను.

దైత్వము మొదటిచిత్రమందు జూపబడినవిధమున గానం బడుచున్నది.

ఐత్వము మొదటిచిత్రమందు జూపబడిన విధమున వాడబడుకాలమున వట్రువసుడియు, సుడిదీర్ఘమును, ఇప్పటివలె హల్లక్షరమునకు ప్రక్కభాగమం దించుక క్రిందుగా చేర్చబడెడిది గాని, యంతకు పూర్వ మందు లిఖింపబడిన తాళపత్రగ్రంథములందు హల్లక్షరమున నూర్ధ్వభాగమందు చేర్పబడినట్లు, నే నెచ్చటనో యతిపురాతనమై చాల శిథిలమై యున్న తాళపత్రగ్రంథ మందు చూచినట్లు నా కించుక జ్ఞాపకమున్నది కాని యట్టి యతిపురాతనతాళపత్రగ్రంథముల గొన్నింటి నిం కొకసారి చూచిన గాని దృఢముగా జెప్పజాలను.

కనుక నీవాదానుసారముగ, ప్రస్తుతవిలేఖనముద్రణాదులయందు వాడబడుచున్న అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః, క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ క్ష యను నీయేబదిరెండక్షరములను, వీనిసంజ్ఞాచిహ్నములగు నేబదిరెండుసంజ్ఞలను సేకరించి, వానిలో గొన్నింటికి మాత్ర మతిస్వల్పములగు మార్పుల జేసి, *ముద్రాక్షరవిలేఖనయంత్రకుంచికాఫలకమునం దమర్చుట కనువుగా నుండున ట్లేర్పాటుచేసియుంటిని. అ ట్లేర్పాటుచేయబడినయక్షరంబులు ప్రస్తుతముద్రాక్షరంబుల బోలియున్నప్పటికిని, అందలి వ్యంజనాక్షరములలో కొన్నింటికి సుడిని గాని, లేక సుడిదీర్ఘమును గాని చేర్చినపుడు మాత్ర మించుక భేద మగపడగలదు గాని యది యంత గొప్పమార్పులో జేర్పదగినది గాదు.

ఇక ముఖ్యముగా గమనింపవలసిన దైత్వమునకు జేసినమార్పు తప్ప మరేదియును గాదు. కాన నీ దైత్వమునుగూర్చి యించుక విపులముగ జెప్పవలసియున్నది.

ఆంధ్రాక్షర తత్త్వవేత్తలలో నగ్రగణ్యులగు పాడి వేంకటస్వామి యను వేంకటనారాయణపాఠీగారిచే రచింపబడిన "ఆంధ్రాక్షరతత్త్వ" మను గ్రంథమందు ౬౩-వ పుటలో ఐత్వ, వట్రువసుడులగూర్చి యీక్రిందివిధముగ నున్నది:

"గుణితక్రమమున నచ్చులన్నియు వ్యంజనములకు పై భాగముననూ, హల్లులన్నియు క్రిందిభాగముననూ, బూర్వంబునకు బరం బాదేశంబుగను జేర్పవలయు. (ు) వట్రువసుడి తలమీద నొకవైపునను, (ై) ఐకారము (ె) ఎత్వమునొద్దనుండి యెడమవైపునకు వంగియు ప్రాచీన లిఖితగ్రంథముల గానంబడియెడు. ఇప్పుడు ముద్రణముల క్రిందిభాగమున సగము వేఱుగ బెట్టుచుండిరి. (ఇది యుచితము కాదు.)"

దీని నాధారముగ దీసికొనియే ప్రస్తుతము వాడుకలో నున్న దైత్వము నిందు వర్ణింపబడిన పగిది మార్పుచేసి ప్రథమచిత్రమందు లిఖించియుంటిని. ఇయ్యది ప్రస్తుతపు ఐత్వమునకు భిన్నముగ నున్నను, ఇప్పటిదైత్వమువలె వ్యంజనాక్షరములకు క్రింద చేర్చు ఒత్తుల కవిసమును నాటంకమును గలుగజేయక, లేఖిని యొక్క వేగమునకు దోడ్పడుచు ముద్రాక్షరవిలేఖనమున కనువుగ నున్నందున స్వీకరింపబడినది. కాని పాఠీగారి వచనానుసారముగా వట్రువసుడిని వ్యంజనాక్షరమున నూర్ధ్వభాగమందు జేర్చినపక్షమున, ఆ వ్యంజనాక్షర రూపము వికృతమగుటయు, లేఖిని కుంటువడుటయు, ముద్రాక్షరవిలేఖనమున కంత యనుకూలముగా నుండక పోవుటయు సంభవించుటయే గాక, చూచువారి కనవసరము మార్పై, ప్రస్తుతాచారమునకు భంగము వాటిల్లగలదు. అంతియే గాక వాని కిప్పటి కున్న స్థానము వ్రాతకును, ముద్రాక్షరవిలేఖనమునకును జాల ననుకూలముగ నుండుటంజేసి వానిస్థానమును మార్చియుండలేదు.

పై జెప్పిన ౫౪ వర్ణములను ౫౪ వర్ణచిహ్నములను గలపి మొత్తము ౧౧౮ చిహ్నములలో గొన్నింటి

* ముద్రాక్షరవిలేఖనయంత్రములగూర్చి సామాన్యముగ దెలిసికొనవలసినవిషయము లెల్ల మ. రా. రా. శ్రీ M. S. వెంకయ్యగా రిదివరకే నవంబరు "భారతి"యందు దెల్పియుండిరి గాన వానిగూర్చి మరల నే నిందు పేర్కొనుట మానితిని.

దీసివేసి మిగిలినచిహ్నములను, ఆ వదలివేసిన చిహ్నముల స్వీకరించిన చిహ్నములతో సమకూర్చుకొనుటయందు గావలసిన మరికొన్ని చిహ్నములను, వ్యంజనాక్షరములలో గొన్నింటికి స్వరసంజ్ఞల జేర్చునప్పు డవసరమగు మరికొన్ని చిహ్నములను, లేఖిని కవసరమగు మఱికొన్ని విరతులను, అంకెలను స్వీకరించి, వాని నన్నింటిని ముద్రాక్షరవిలేఖనయంత్ర కుంచికాఫలకమం దొక్కొక్క కుంచికకు మూడేసి చిహ్నముల చొప్పున కూర్చియుంటిని. ఆ విడిచిన వర్ణములను వర్ణచిహ్నములను సమకూర్చుకొనువిధాన మిచట పొందుపరచితిని జూడుడు. (చిత్రము ౨)

చిత్రము ౨

ఈ విధానమువల్ల లిపి కించుక భేద మబ్బుగల దనుసంగతి నిశ్చయము. అట్లించుక భేద మబ్బినప్పటికి నీ విధానము నంగీకరించిన పక్షమున ముద్రాక్షరవిలేఖనయంత్ర కుంచికాఫలకమందలి కుంచికలసంఖ్యచాల భాగము తగ్గుటకు వీలున్నది. ఇందు కుదాహరణముగా నీ ప్రక్కపుటయందలి కూడ నచిత్రమున పొందుపరచిన కుంచికాఫలకమును జూడుడు.

ఇందు కుంచికల సంఖ్య చాల తక్కువగ నుండునటుల జేసితిని, ఉన్న కుంచికలన్నియు మూడు వరుసలం దమర్పబడి యుండుటంబట్టియు, కుంచిక కొక్కింటికి మూడుసంజ్ఞలు గల్గి రెండు పరివర్తనకుంచికలు (Shift Keys) ఉండుటవల్లను నిజముగనిది రెంపైర్ (Empire) యంత్ర కుంచికాఫలకము (Key Board) ను బోలియున్నది. ఇందుగల వరుస కొక్కింటికి

ఇందు మొదటివరుసలో కుంచికలలో నంకెలు, విరతులు తరచుగా వాడబడని యక్షరాదిచిహ్నములు మొదలైనగురుతులును, మిగిలినమూడువరుసలందు స్వర వ్యంజనాదులు, వానిసంజ్ఞాదులును గలవు. స్వరములకు జెందినసంజ్ఞలు వానిప్రక్క కుంచికలందును, వ్యంజనములకు జెందినసంజ్ఞలు వానిప్రక్క కుంచికలందును సమకూర్పబడినవి. అట్లు సమకూర్చుటయం దాసంజ్ఞల యుపయోగస్వల్పతాధిక్యములను, స్థిరాస్థిరకుంచికల సౌకర్యమును గమనించియుండకపోవలే దను సంగతి కుంచికాఫలకమును దిలకించినవారికి దెలియకపోదని నా నమ్మకము. మరియు లిపియందు చాల తక్కువగ నుపయోగింపబడుచున్న ౡ ఙ ఞ అను అక్షరములును, ౡ ఙ ఞ అను సంజ్ఞలును, ్ అను హల్సంజ్ఞయును మొదటి వరుసలోని కుంచికలలో జేర్పబడినవి. కణకులించుక తరచుగా నుపయోగింపబడుచున్నందున రెండవ వరుసలోని ప్రథమ కుంచికయందును, వాని సంకేతములును, ఋ ౠ ఞ వా యను చిహ్నములును అంత తరచుగా నుపయోగింపబడనందున వానిని కుడిప్రక్క చివరభాగమునందు గల కుంచికలయందును సమకూర్చియుంటిని.

హల్లక్షరములకు ప్రక్క జేర్పబడు ' [illegible] ' అను నీ గురా వర్ణచిహ్నములలో నేదైనను, అక్షర మాక్రమించుకొను స్థలము నర్ధభాగమందే యిమడగలదు. అయినను ఆంధ్రముద్రాక్షరవిలేఖనయంత్రము దక్షరవిన్యాసమున కెంతస్థలము (Space) నిర్ణయించి విడువబడునో, యంతస్థల మీపై నుదాహరింపబడిన వర్ణచిహ్నముల కవసరమైనను విడువక తప్పదు. అప్పు డాంధ్రముద్రాక్షరవిలేఖన మించుక వికృతముగా గోచరించును. అంతియే గాక ఋ, ము, యు లకు రెండుకొమ్ములు తీయవలసిన యవసర మున్నది గాన, ఒకకొమ్ముప్రక్క నింకొకకొమ్ము ముద్రించినప్పుడు, రెండవకొమ్ము మొదటికొమ్మునంటి ముద్రింపబడక, యించుకదూరమున ముద్రింపబడును. అక్షరమునకు వదలినంతస్థలము కొమ్మునకు కూడ వదలుటయే యిందులకు కారణమై యున్నది. ఈచిక్కును దొలగించుకొనుటకై కొమ్ముయొక్క నిడివిని బెంచితిమేని యక్షరమునకంటె కొమ్ము పెద్దదై ముద్రాక్షరవిలేఖనము మరింతవికృత మగును. (ఇందు కుదాహరణముగా రెండవ చిత్రమందలి కొమ్మును గమనింపుడు.) కాన నీ గురా వర్ణ చిహ్నములకును అర్ధస్థలము (Space) నిచ్చుటకును, తక్కిన వర్ణచిహ్నములకును వర్ణములకును పూర్ణస్థలము (Full Space) నిచ్చుటకును, యంత్రమం దించుక మార్పుజేసి, మరికొంతయంత్రభాగమును జేర్చితిని. కాని దానివలన యంత్రనిర్మాణమందు చాల కష్టము గల్గుటయేగాక, యట్లు తయారైనయంత్రముయొక్క విలువకూడ ఎక్కుడగుటచే ముద్రాక్షరవిలేఖకులు కొనబోరు. అప్పుడు ఆంధ్రముద్రాక్షరవిలేఖనయంత్రమే మూల పడవలసివచ్చును. అందుచే పైని జెప్పిన యంత్రమందలి మార్పులనెల్ల వదలివేసి, యావశ్యకమునుబట్టి పై నుదాహరింపబడిన గురా వర్ణచిహ్నముల యాకారాదు లించుక పెంచి, వాని కక్షరములతోపాటు పూర్ణస్థలముల వదలి, కొమ్ముప్రక్క కొమ్ము ముద్రించునప్పుడు కల్గెడిచిక్కును దొలగించుటకు మాత్రము జంటకొమ్ములచిహ్న మొకటి ప్రత్యేకముగా రెండవ కుంచికాఫలకమందు జేర్పడమైనది.

లఘురేఫచిహ్నమును క్రావడియక్షరమునకు ముందు ముద్రింపవలెనన్న ప్రస్తుతవిలేఖనపద్ధతికి విరుద్ధమగుటం జేసి ముద్రాక్షరవిలేఖకులకును, అక్షరమునకు క్రింద ముద్రింపవలెనన్న సంశ్లిష్టవర్ణంబునకు గూడ ననువుగా నుండునట్లేర్పాటు చేయవలసివచ్చును గాన యంత్రనిర్మాతలకును గష్టంబు గల్గించును. మరియు ముద్రాక్షరవిలేఖనమందు సంశ్లిష్టవర్ణంబున కేర్పరచిన క్రావడి నేవత్తును గాని లేక కొమ్మును గాని గల్గియుండని వ్యంజనాక్షరమునకుగూడ క్రింద జేర్పవలసివచ్చి చేర్చినపక్షమున అవ్యంజనాక్షరమునకును క్రావడికిని మధ్య కొంతకాళీస్థల మేర్పడి విలేఖన మించుక వికృతంబగును. ఈచిక్కుల నివారించునిమిత్తము ప్రస్తుతముద్రణమందు వాడబడు "ఽ" అను లఘురేఫచిహ్నమును కుంచికాఫలకమున జేర్చియుంటిని.

పూర్ణానుస్వారమునకు జంటకొమ్ముల చిహ్నమిడి వానిపై దలకట్టు చేర్చిన యకార మేర్పడగలదు కాని యట్లాచరించిన యకారముయొక్క నిడివి యెక్కుడై వైశ్వ మిచ్చినప్పు డాకారైత్వముయొక్క చివరభాగము యకారమందు గల పూర్ణానుస్వారము మీద ముద్రింపబడి యైకారము వికారమగును. అందుచే అనుస్వార-కొమ్మను నొక ప్రత్యేకచిహ్నమిందు చేర్పబడినది. కాన అనుస్వార-కొమ్ముచిహ్నమును ముద్రించి దానికి తలకట్టిడి కొమ్ము చేర్చిన యకార మగును.

లఘురేఫమునకు జంటకొమ్ముల చిహ్నమిడి పూర్వస్థలదర్శిని నొకసారి నొక్కి కామావిరతిని ముద్రించినపక్షమున ఝకార మేర్పడును.

ఫ, వ లకు మామూలుకొమ్ము లిడిన ఫు వు, లేర్పడగలవు.

ఇందలి యకార చిహ్నమునకు దలకట్టిడి జంట కొమ్ముల చిహ్నమిడిన యుకారమును, వ, బ లకు జంట కొమ్ముల చిహ్నమిడిన వు, బు లును, ముద్రితము లగును. ఇటులనే తక్కినవికూడ గ్రహింపవలెను.

చెప్ప మఱచితిని. 'ఔ', చె, జె యను అక్కరములయొక్క సంకేతము లేమాత్రమును లిపియందు వాడబడుచుండుట లేదు గాన వానిని నంచికాఫలకములయందు జేర్చియుండలేదు.

ఈ కుంచికాఫలకముల నతిజాగ్రత్తగా బరిశీలించినపక్షమున, ప్రతికుంచిక యూర్ధ్వ భాగమున A అని గాని, B అనిగాని వ్రాయబడియున్నట్లు గానంబడును. దానంజేసి వీనియందు గల కుంచిక లన్నియు రెండు భాగములుగ విభజింపబడినవనియు, అందు A గుర్తు గలవి అస్థిరకుంచిక లనుభాగమునకు జెందినవనియు, B గుర్తుగలవి స్థిరకుంచిక లను భాగమునకు జెందినవనియు గ్రహింపవగును. అస్థిరకుంచిక లన, ప్రస్తుతము ముద్రాక్షరవిలేఖనయంత్రము లందు గల కుంచికలవలె నొక్కినప్పు డక్షరమును ముద్రించి ప్రక్క రాబోవు అక్షరమునకు తావొసంగునవని యర్థము. కాని స్థిరకుంచిక లట్లు కాదు. అస్థిరకుంచికలవలెనే యీస్థిరకుంచికలును నొక్కినప్పు డక్షరవిన్యాస మొనరించును గాని, వానివలె ప్రక్క రాబోవు అక్షరమునకు జోటుమాత్ర మొసంగబోదు. (ఇందులకు గారణము దరువాత దెలుపబడును.)

ఇందువలన మనకు జాల లాభ మున్నది. మన మిప్పుడు "స్థా" యను సంశ్లిష్టవర్ణము ముద్రింపవలె నను కొనుడు. అందులకు ద్వితీయకుంచికాఫలకమును దిలకింపుడు. దానియందలి రెండవవరుసలోని వాలవకుంచికను నొక్కినయెడల నాకుంచికలోని మొదటియక్షరము "స" కారము ముద్రితమగును. ఈసకారము గలకుంచిక స్థిరకుంచికలలోనిది గాన, దీని నొక్కినప్పుడు సకారమును ముద్రించినది గాని దానిప్రక్క రాబోవు నక్షరమునకు జోటుమాత్ర మొసంగినది గాదు. (అనగా వాహనము (Carriage) కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు కదలి చోటు (Space) ఇచ్చినది కాదని యర్థము.) అందుచే నా సకారమునకు "థ" ఒత్తు నిచ్చుటకు పూర్వస్థలదర్శిని నొక్క నవసరము లేకయే "స"కారము గమ్యస్థానమలంకరించియున్నది. కనుక నిప్పుడు నాల్గవవరుసలోని రెండవకుంచికను నొక్కిన యెడల నందలి మొదటి యక్షరము "థ" ఒత్తు "స"క్రింద ముద్రితమగును. ఈ "థ" ఒత్తుగలది కూడ స్థిరకుంచికయే కాన తొంటియట్లు వాహనము కదలనేరదు. అందుచే నిప్పుడును పూర్వస్థలదర్శిని నుపయోగింపకయె రెండవవరుసలోని పదునొకండవకుంచికను నొక్కిన "ා" లంబరేఖ "స" పైన ముద్రితమగును. ఇదియు స్థిరకుంచికయె కాన వాహన మట్లె నిలిచియుండును. ఇప్పటికి "స్థ" అను నాకారము ముద్రితమైనది. ఇక మూడవవరుసలోని యేడవ కుంచికను (ఇందుకు పరివర్తనకుంచికసాయ మవసరమై యున్నది. ఎందుచేతనో గ్రహించునది.) నొక్కి "ా" దీర్ఘమును ముద్రించిన వెంటనే వాహనము కుడిప్రక్క నుండి యెడమప్రక్కకు జరిగి, రాబోవు అక్షరమునకు తావొసంగును. ఎందుచే నన, "ా" గల కుంచిక అస్థిరకుంచికలలో చేరినది. ఇప్పటికి "స్థా" యను సంశ్లిష్ట వర్ణము ముద్రితమైనది.

మరియు నింకొకవిషయము గలదు. పూర్వస్థలదర్శిని యొక్కపర్యాయము నొక్కుటకు వ్యయపడు కాలములో, అక్షరకుంచిక (Key) రెండుపర్యాయములు, లేక రెండుకుంచికలు, నొక్కుటకు వీలున్న దను విషయము విలేఖకులకు అనుభవసిద్ధమే. కాన "భారతి" యనుపదము ముద్రించునప్పుడు భకారమునకు దీర్ఘమును చేర్చునపు డొకసారి, రకారమునకు తలకట్టు చేర్చుట కొక్కసారి, తకారమునకు గుడి చేర్చుట కొకసారి గలసి వెరసి మూడుసారులు పూర్వస్థలదర్శిని నొక్కవలసినయవసరము స్థిరాస్థిరకుంచికలు లేనిచో గల్గును. ఈమూడుసార్లు పూర్వస్థలదర్శిని నొక్కుటకు వ్యయపడినకాలములో మూడురెట్లు కుంచికలు నొక్కుటకు వీలున్న దని యీ పేరాయొక్క మొదటిభాగమందు చెప్పబడిన యంశమును బట్టి విశదమగుచున్నది. అనగా, "భ ా ర ె త ి" యను నీ యారుసర్తులచే చేర్పడిన "భారతి" యను పదము పూర్వస్థలదర్శిని నొక్క నవసరము లేనియెడల మరల నొకసారి "భారతి" యను పదమును ముద్రింప వీలగును. అంతియేగాక, ప్రస్తుతాంగ్ల ముద్రాక్షరవిలేఖన యంత్రమందలి పూర్వస్థలదర్శిని నంత తరచుగా నుపయోగింపకపోయినను త్వరలో చెడిపోవుచుండుట మనము చూచుచునేయున్నాము. అట్టితటి మన యాంధ్ర ముద్రాక్షర విలేఖనయంత్రమందలి పూర్వస్థలదర్శిని ప్రతి అక్షరమునకు నొక్కుచుండినపక్షమున నెంత త్వరలో చెడిపోవునో వేరె చెప్పవలయునా? కాన యీ విషయములబట్టి స్థిరాస్థిరకుంచికల చేర్పఱచుట వల్ల నెంతలాభ మున్నదో పాఠకులే నిర్ణయించుకొందురుగాక.

ఇక స్థిరాస్థిరకుంచిక లెట్లేర్పడినవో విపులముగ నెరుంగుట కీప్రక్క పొందుపరచిన ౫వ చిత్రమును జూడుడు.

ఇయ్యది రెమింగ్టన్ పదియవ నెంబరు ముద్రాక్షర విలేఖన యంత్రమందలి యొక భాగము.

ఈచిత్రమందు K అనుకుంచికను నొక్కినప్పుడు, దానిస్థానము K 1 అనుచోటునకు మారగలదు. దానినిబట్టి K 2 అను ఊచ (Rod) K 3 అను స్థానమునకు మారగలదు. అప్పు డాయూచకు గల N అను చిన్ని మేకుయొక్క యడుగుభాగము A అను పేరు గల రేకుపట్టాను క్రిందికి నొక్కివేయును. అంత నా రేకుపట్టా ననుసరించియున్న B యను పేరుగల కీళ్లు (Joints) క్రిందకు లాగబడి, వాని ననుసరించియున్న C యను ఇనుపకడ్డీ కొంచెము త్రిప్పబడును. అందుచేత నా C యనుదానికి మరమేకుతో బిగింపబడి, D యనువక్షరము గుర్తుచేయబడియున్న పనిముట్టు (Instrument) తనస్థానమును మారి, క్రిందకు వంగి, తనకోటితో ఎట్టియుంచిన W అనుతీగను క్రిందకు లాగును. ఆ W అనుతీగ ఎస్కేప్మెంటు వ్హీల్ (Escapement Wheel) ను తిరుగకుండ అడ్డుపడుచున్న పనిముట్టును కదల్చి, ఎస్కేప్మెంట్ వ్హీల్ను ఒకస్పేసు మాత్రము తిరుగుటకు వీలు కలుగునట్లు చేయుచున్నది. ఈవిధముగ, ఒక యక్షరము ముద్రింపబడినపుడు (అనగా ఒక కుంచిక నొక్కబడినపు డని యర్థము) ప్రక్క రాబోవు అక్షరమునకు చో టొసంగుచున్నది. కుంచిఫలకములోని యేకుంచికను నొక్కినప్పటికిని పై వివరింపబడిన చర్యలన్నియు దప్పక జరుగునని యెఱుంగునది.



చిత్రము ౫

దీనినిబట్టి గ్రహింపదగినవిషయ మొండు గలదు. అదేదన, K అనుకుంచికయొక్క K 2 అను ఊచకు అడుగుభాగమునకు కొనదేరియుండునట్లు బిగింపబడిన N అను ఆచిన్న మేకుయొక్క విషయమే. కుంచిక నొక్కునప్పు డీమేకు A అను రేకుపట్టాను క్రిందకు నొక్కుటచేతనే యిన్నిపనులుజరిగి స్పేసుఇచ్చుట (అనగా రాబోవు అక్షరమునకు చోటొసంగుట) కు వీలు కలుగునట్లు చేయుచున్నది కనుక ఈ మేకు నూడదీసివేసినయెడల కుంచిక నొక్కునప్పుడు స్పేసు ఇచ్చుట కవకాశ ముండనేరదు. ఇది గ్రహించి కుంచికాఫలకమువందలి స్థిరకుంచికలకు ఈ మేకు లేకుండ చేసి వైచితిని. అందుచేత స్థిరకుంచికలు నొక్కునప్పుడు స్పేసు ఇవ్వబడదు. అస్థిరకుంచికలకు స్పేసు ఇవ్వవలసిన భారమున్నది గాన వాని కామే కుంచడమైనది.

ఈ సందర్భమున మరి యొకవిషయమును గూర్చి కొంచెము చెప్పవలసియున్నది. ఈ చిత్రమందు R అను గురు తెచట నున్నదో గమనింపుడు. అక్షరము స్తంభిక (Roller) మీద ముద్రింపబడు సమయమునకు సరిగా ఆ స్తంభికకును, ఆయక్షరమునకు మధ్యభాగమున రిబ్బన్ నెత్తిపట్టుటకుగాను యేర్పడిన పనిముట్టు (Instrument) యొక్క సంబంధము (Connection) ఈ R అను గుర్తు దగ్గరనే యున్నది. D అను అక్షరము గుర్తుగా గల పనిముట్టు క్రిందకు వంగినప్పుడు రిబ్బన్ పైకిలేచి ముద్రణమునకు సహాయపడుచున్నది. D గుర్తులు గల పనిముట్టు మామూలుస్థలమం దున్నప్పుడు రిబ్బన్ క్రిందకు దిగజారి ముద్రింపబడిన యక్షరములు కంటికి గపడునట్లు చేయుచున్నది. ఈచర్యలుకూడ కుంచిక నొక్కుతరి దానియూచకుగల N పేరుగల యాచిన్న మేకు A అనురేకుపట్టాను క్రిందకు నొక్కుటవల్లనే కల్గుచున్నదని గ్రహింపనగును. అందుచేత ఈమేకు లూడదీయబడిన స్థిరకుంచికలు నొక్కునప్పుడు, A అను రేకుపట్టా క్రిందకు నొక్కుపడి కదలింపబడదు గాన, ముద్రణసమయమునకు, అక్షరమునకును స్తంభికకును మధ్యకు రిబ్బన్ చేరుకొనదు. అప్పు డక్షరము కాగితము మీద, (అనగా స్తంభికకు జుట్టబడిన కాగితముమీద నని యర్థము) ముద్రింపబడదు. కనుక నీచిక్కును దొలగించుటకు వేరొకమార్గము త్రొక్కబడినది. ఆనూతనమార్గ మెరుంగుటకై క్రిందిచిత్రమును గమనింపుడు.



చిత్రము ౭

ఆంధ్రముద్రాక్షర విలేఖనయంత్రమందు క్రొత్తగ జేర్పవలసిన యంత్రభాగము

నాల్గవచిత్రమందు R అనుగుర్తు దగ్గరనే రిబ్బన్ పనిముట్టు యొక్క సంబంధము గలదని యింతకు ముందు చెప్పబడినది. ఇప్పు డా R అనుగుర్తుక్రింది భాగమందు గల H అనుగీతవరకును నరికి, ఆపైభాగమును దీసివేసి, D అనునక్షరములు గుర్తుగల పనిముట్టునకును, రిబ్బన్ పనిముట్టునకును గలసంబంధమును లేకుండ చేయవలయును. తరువాత C అను ఇనుపకడ్డీకిని, కుంచికాఫలకమునకును మధ్య C అను ఇనుపకడ్డీవంటి పనిముట్టునే వేరొకదానిని జేర్పవలయును. (ఇదియే ఆరవపటమందు C 2 అనుపేరుగల పనిముట్టు.) దీనినిగూర్చియే ఆరవచిత్రమందు వ్రాయబడినది. ఇందు A 2 అనురేకుపట్టాను నొక్కుటకు ప్రతికుంచికకును N 2 అనుపేరుగల మేకుండితీరవలయును. దానివల్లనే కుంచిక నొక్కబడినప్పటికిని (అనగా స్థిరకుంచికలుసైతము నొక్కబడినప్పు

టికిని అని యర్థము) A 2 కీలుపట్టా క్రిందకు నొక్క
బడి, దానికి సందర్భానుసారముగ సంబంధించియున్న
D 2 అను పేరుగల పనిముట్టు (A 2 నకును D 2 న
కును ఎట్లు సంబంధము గలదో అయిదవ పటమునుబట్టి
పాఠకులు గ్రహింతురు గాక) చలించి, R అను సంబం
ధముచేత రిబ్బన్‌పనిముట్టును కదలించి, ముద్రణమునకు
రిబ్బన్ సహాయపడునట్లు చేయును. ఇట్లీఆరవచిత్ర
మందుగల పనిముట్టు అయిదవచిత్రమందు చేయబడిన
మార్పువల్ల గల్గిన చిక్కును తొలగించివేయగలదు.

చెప్ప మఱచితిని. ఆరవచిత్రమందు J అను గుర్తు
గల కీలు కదలికగలది గాని, గట్టిగ బిగింపబడినది కాదు.
ఇట్లీ కీలు కదలికగలదిగ చేయుటకుగల కారణము, అయి
దవచిత్రమును ఆరవచిత్రమును శ్రద్ధవహించి, సూక్ష్మ
దృష్టిచే పరిశీలించిన పక్షమున చక్కగ బోధపడ గలదు.

ముద్రాక్షరవిలేఖన మొనరించునపుడు మన మొక
యెత్తుబల్ల (Stool) మీద కూర్చుండి, యెదుట మరొక
యెత్తుబల్లమీద గాని, లేక, మేజాబల్ల (Table) మీద
గాని ముద్రాక్షరవిలేఖనయంత్ర మిడికొనుట సహజ
మనుసంగతి యందఱెరింగినదియే. అదిగమున మనముందు
వేరొకబల్ల నిడికొని, దానిమీద ముద్రాక్షర విలేఖన
యంత్ర ముంచుకొనుటకంటె, ప్రత్యేక మొకయెత్తుబల్ల
మీద నాయంత్ర మమర్పబడియుండుట కంగీకరించిన
పక్షమున పూర్వవ్యవస్థలదర్శినియు, పరివర్తనకుంచికలు
కుంచికా ఫలకమునుండి తొలగించుటకు వీలున్నది.
అప్పగిది నాయంత్ర మమర్పబడుబల్ల మూడుప్రక్కల
చెక్కలచే మూయబడి నాలవవైపు (అనగా ముందరి
భాగము) తెరవబడియుండవలెను. అందమర్పబడ
వలసిన మొదటియంత్రభాగ మీప్రక్క పొందుపరచితిని
జూడుడు. (చిత్రము ౮)

ఇందు A గురుతుగల గురుకుంచిక (Big Key)
కాలియొక్క యడుగుభాగము (అరికాలుతో) క్రిందకు
త్రొక్కబడుట కనువుగా చేయబడినది. ఈ A యను
కుంచిక త్రొక్కబడి, క్రిందికి నొక్కబడినపుడు,
దానిస్థానము B యను ప్రదేశమునకు మారగలదు. దాని

ననుసరించి D యను కీలు E అను కీలుయొక్క స్థానమున
కును, E అను కీలు F అను ప్రదేశమునకును మారగలవు.
అందుచే E K యను వంకరశలాక (Curved Rod)
H అనుచోట సీలచే వదులుగా బిగింపబడినది గాన, దాని
E యను మొదటి మొన (End) F అను ప్రదేశమునకు,
క్రిందికి నొక్కబడుటచే, దాని K యను రెండవ మొన
L అనుకీలు యొక్క స్థానమునకు పై కెత్తబడును.




చిత్రము ౮

అపుడు K L అను లఘుశలాక (Short Rod) L M
అను ప్రదేశమునకు, పైకి త్రోయబడుటచే, దాని
ననుసరించియున్న L R అనుగురుశలాక (Long Rod)
కూడ పైకి త్రోయబడి M S అను కీళ్ల మధ్యగల స్థాన
మాక్రమించును. అట్లాక్రమించునపు డాగురుశలాక
ప్రక్కల కేమాత్రము తొలగిపోకుండు నట్లు N O

యను పేర్లుగల బంగులు కాపాడగలవు. అంత నా RS అను లఘుశలాక ST యను ప్రదేశ మాక్రమించుకొనును. అపుడు SX అను వంకరశలాక V యను చోట సీలచే వదులుగా బిగింపబడినది గాన దాని S అను మొదటి మొన T యను ప్రదేశమునకు పైకి త్రోయబడుటచే, దాని X అను రెండవ మొన W అను ప్రదేశమునకు క్రిందికి లాగబడును. అంత నా XZ అను లఘుశలాక XW అను ప్రదేశమునకు క్రిందికి లాగబడుటచే, దానితోపాటు దాని ననుసరించియున్న పరివర్తనకుంచికాశలాక (Rod of the Shift Key) క్రిందకు లాగబడి పరివర్తనకుంచిక క్రిందికి నొక్కబడినట్లు కాగలదు. అందువలన ముద్రాక్షరవిలేఖన మొనరింపుతరి పరివర్తనకుంచిక చేతివ్రేలితో నొక్కి కాలవిలంబన మొనర్చుకొని, విలేఖనావేగ మించుకైన కుంటువడునట్లు చేసికొన నవసర ముండదు. కావ నిటువంటియంత్రభాగముల రెంటి నమర్చుకొంటిమేని పరివర్తనకుంచికల రెంటికిని సాయపడగలవు. (చి. ౮).

ఇక నాబల్లయం దమర్పబడవలసిన రెండవ యంత్రభాగమున కీ ప్రక్క చిత్రమును జూడుడు.

ఇందలి A గురుతుగల గురుకుంచిక కుడిమోకాలి పైని తొడయొక్క కుడిప్రక్కయందలి భాగముతో కుడిప్రక్కకు త్రోయబడుట కనువుగా చేయబడినది. ఈ A యను గురుకుంచిక కుడిప్రక్కకు త్రోయబడినపుడు, దానిస్థానము B యను ప్రదేశమునకు మారగలదు. దానిననుసరించి, D యను కీలు E యనుకీలుయొక్క స్థానమునకును, E యనుకీలు F అను ప్రదేశమునకును మారగలవు. అందుచే, EK యను వంకరగురుశలాక (Big Curved Rod) H అనుచోట సీలచే వదులుగా బిగింపబడినది గాన, దాని E యను మొదటి మొన F అను ప్రదేశమునకు, కుడిప్రక్కకు త్రోయబడుటచే, దాని K యను రెండవ మొన L అను కీలుయొక్క స్థానమునకు, ఎడమప్రక్కకు త్రోయబడును. అపుడు KL అను లఘుశలాక LMX అను ప్రదేశమునకు, ఎడమప్రక్కకు త్రోయబడుటచే, దాని ననుసరించియున్న LO యను గురుశలాక కూడ కుడిప్రక్కకు త్రోయబడి MR అనుకీర్ణ మున్నగల స్థాన మాక్రమించును. అట్లాక్రమించునపు డాగురుశలాక ప్రక్కలకు గాని క్రిందికి గాని తొలగిపోకుండునట్లు N అను పేరుగల బందు కాపాడగలదు. అంత నా OR అను లఘుశలాక RS అను ప్రదేశ మాక్రమించుకొనును. అపుడు, RW అను సమకోణశలాక (Right-angled Rod) T యనుచోట సీలచే వదులుగా బిగింపబడినది. కాన దాని R అను మొదటిమొన




చిత్రము ౮

S అను ప్రదేశమునకు, కుడిప్రక్క కించుక పైకి త్రోయబడుటచే, దాని W అను రెండవ మొన V యను ప్రదేశమునకు క్రిందికి లాగబడును. అంత నా WX అను లఘుశలాక VW అను ప్రదేశమునకు, క్రిందికి లాగబడుటచే, దానితోపాటు దాని ననుసరించియున్న పూర్వస్థలదర్శినీకుంచికాశలాక (Rod of the Back Space Key) క్రిందకు లాగబడి, పూర్వస్థలదర్శినీ

కుంచిక (Back Space Key) క్రిందికి నొక్కబడినట్లు కాగలదు. ఇందువల్ల విలేఖన మొనర్చునప్పు డవసరమునుబట్టి పూర్వస్థలదర్శినీకుంచికను హస్తాంగుళితో నొక్కి, కాలవిలంబన మొనర్చుకొని, విలేఖనావేగ మించుకైన కుంటుపడునట్లు చేసికొన నగత్య ముండదు. అంతియే గాక తదితర ముద్రాక్షరవిలేఖనయంత్రకుంచికాఫలకములలోని పూర్వస్థలదర్శినులవలె త్వరలో చెడిపోకుండున ట్లీయంత్రభాగమును చేర్చిన పూర్వస్థలదర్శినిని నించుక బలముగా నిర్మించుకొనుట కవకాశ మున్నది.

ఇందలి ౭,౮ చిత్రములందు P అను అక్షరము గుర్తువేయబడిన స్థలమున గల తీగచుట్ట ఎంగుళకాని విధముగ బిగింపబడినదో, దాని యుపయోగ మేమియో పాఠకులే గ్రహించుకొందురు గాక.

మనభాషయందు ఖ, ఘ, జ, ఝ, ట, ణ, బ, ఋ, ల యను నీ యక్షరముల కకారసంకేతము తలకట్టు నిడు ఆచారము లేకున్నను, ఇక్కన స్వరసంకేతముల నిడునాచార మున్నందున నీ తొమ్మిదక్షరములను, యకారమును సమకూర్చుకొనుటకుగా ననుస్వార - కొమ్మును ప్రత్యేక చిహ్నము ౦ నకు తలకట్టును, కొమ్మును చేర్చవలసిన యవసర మున్నందున అనుస్వార-కొమ్మును ప్రత్యేకస్థిరకుంచికలందు చేర్చియుంటిని. అందుచే స్వరసంజ్ఞ చేర్చని ఖ, ఘ, జ, ఝ, ట, ణ, బ, ఋ, ల యనువానిలో నే యక్షరమునైన గాని, లేక మన భాషా సంప్రదాయము ననుసరించి ఇకారస్వరసంకేత మును గుడిని చేర్చని "యి" యను నక్షరమునైన గాని, వాక్యమధ్యభాగమందు ముద్రింపవలసివచ్చినచో నాయక్షరమును ముద్రించిన పిమ్మట వ్యవధానశలాక (Space-bar) నొకసారి నొక్కవలసియుండును. అట్లా వ్యవధానశలాక నొకసారి నొక్కనిపక్షమున నాయక్షరమునకు ప్రక్క ముద్రింపబడు అక్షర మా వెంటనే ముద్రింపబడిన ఆ యక్షరముమీదనే ముద్రితమై విలేఖనము వికారమగును.

అటు లావ్యవధానశలాక నొక్కునప్పు డించుక కాలము వృథావ్యయమగునని తలంచి, యీ కొద్దిపాటి కాలము కూడ వృథావ్యయము కాకుండునట్లు పై జెప్పబడినయక్షరములు గల స్థిరకుంచికలు సైత మవసరమున్నప్పు డస్థిరకుంచికలవలె పనిచేయ గల్గుట కొకవిధమైన యంత్రభాగమును చేర్చియుంటిని. ఈయంత్రభాగము నంతను సులభముగాను, విపులముగాను దెలిపికొనుటకు వీలగున ట్లీయంత్రభాగమును రెండువిభాగములుగ జేసి, రెండుచిత్రములందు ప్రదర్శించియున్నాడను. అందలి ప్రథమచిత్ర (చి. ౯) మీ క్రింద పొందుపరచితిని చూడుడు.




చిత్రము ౯

ఈతొమ్మిదవచిత్రమును గమనింపుడు. ఇందు P యను పేరుగల కుంచికలు (Keys) రెండు గలవు. ఈరెండుకుంచికలయొక్క శలాకలకును నడుమ W అను పేరుగల గురుశలాక ఒకటి గలదు. ఈగురుశలాకయొక్క Z అను పేరుగల కొన లాకుంచికాశలాకలకతుకబడియుండుటచే, ఈకుంచికలరెండింటిలో దేనినినొక్కినప్పటికిని రెండవది సైతము నొక్కబడినట్లే కాగలదు. అందుచేత నీరెండుకుంచికలలో దేనిని నొక్కినప్పటికిని ఫలితముమాత్ర మొక్కటియే యగును. ఇది చూచువారికి కుంచికాఫలకమందలి పరివర్తనకుంచికలు జ్ఞప్తికి రాక మానవు. కాని యీ పరివర్తనకుంచికలు చేయు

పని వేరు. ఈ నూతనకుంచికలు చేయుపని వేరు. అందుచే ముద్రాక్షరవిలేఖన మొనరించువార లీ నూతనకుంచికలను పొరబడక సులభముగా గుర్తించుటకుగాను వీనికి జరుపుకుంచికలని (Pass Keys) పేరిడియున్నాము.

ఇందలి P అను పేరుగల కుంచికల రెంటిలో నేదైన నొకదానిని క్రిందికి నొక్కినప్పుడు, దానిస్థానము P 1 అను ప్రదేశమునకు మారగలదు. అంత నాకుంచికయొక్క శలాక ననుసరించియున్న D E యను వంకర శలాక D 1, E 1 అను చోటునకు మారగలదు. అపు డావంకరశలాకకు సంబంధించియున్న D K యను సమకోణశలాక T యనుచోట సీలచే వదులుగా బిగింపబడి యుండుటచే D 1, K1 అను ప్రదేశమునకు మారగలదు.

ఇందలి H అను నక్షరములు గుర్తువేయబడిన రేకుపట్టాయొక్క F అను పేరుగల మూలలవద్ద చిన్న యుంగరము లతుకబడి, వానిరంధ్రములగుండా D K యను సమకోణ శలాకలయొక్క నిడివిగల భాగములు వదులుగా దూర్చబడి సంబంధము కల్పింపబడి యుండుటచే D K యను సమకోణ శలాకలస్థానము D 1, K 1 అను ప్రదేశమునకు మారినప్పుడు, వాని ననుసరించి H అను పేరుగల రేకుపట్టా H 1 అను నక్షరములు గుర్తువేయబడినచోటునకు (అనగా పదియవచిత్రములోని యంత్ర భాగమందలి యక్షరకుంచికా శలాక కమర్చబడిన N 3 అను పేరుగల చిన్ని మేకుయొక్క యడుగుభాగమునకు సూటిగా నుండునట్లు) మారగలదు.

ఇప్పుడిక పదియవ చిత్రమును గమనింపుడు.

ఈ పటమందలి K యను నక్షరకుంచికను నొక్కినప్పుడు, దానిస్థానము K 1 అనుచోటునకు మారగలదు. అపు డా కుంచికాశలాకకుగల N 3 అను చిన్నిమేకుయొక్క యడుగుభాగము H 1 అను పేరుగల రేకుపట్టాను క్రిందికి నొక్కివేయును. అంత నారేకు పట్టాయొక్క R అను పేరుగల కొనలవద్ద అడ్డముగా బిగింపబడిన లఘుశలాకలు క్రిందికి లాగబడుటచే, వానిక్రింద నమర్చబడిన B యను పేరు గల శలాకలుకూడ క్రిందికి నొక్కబడును. అయిదవ చిత్రములోని యంత్రభాగమందలి C యను ఇనుపకడ్డీయొక్క B యను పేరుగల కొనల పొడుగించిరే ఈ B యనుశలాక లేర్పాటుచేయబడియుండుటచేత, ఈ B యను శలాకలు క్రిందికి నొక్కబడినప్పుడు, వాని ననుసరించి యా C యను ఇనుపకడ్డీ కొంచెము త్రిప్పబడి, దాని కంటి D యను నక్షరములు గుర్తువేయబడియున్న పనిముట్టు క్రిందకు వంగి, తన కొటితో పట్టియుంచిన W అను తీగను క్రిందకు లాగి, ఒకస్థలమును గల్గజేసి ప్రక్క ముద్రింపబడబోవు నక్షరమునకు తావొసంగును.

మన యంత్రముయొక్క యడుగుభాగమందలిచట్టము (Frame) న కిరుప్రక్కల లోపలిభాగములయందు నిట్టనిలువుగా గాళ్లు చేర్పరచి, వానిలో నిందు R అను నక్షరములు గుర్తు వేయబడినచోటులంగల లఘు శలాకలయొక్క వెలుపలిభాగముల నించుక వదులుగ దూర్చియుంచినచో, H లేక H 1 అనురేకుపట్టా కదలునప్పుడు తన స్థానమునుండి ప్రక్కలకు తొలగిపోకుండునట్లు కాపాడబడగలదు.

అచ్చటనే చట్టముయొక్క పైయంచుల క్రిందలి M అను నక్షరములు గుర్తువేయబడిన తీగచుట్టల



చిత్రము ౧౦

పైభాగములు గట్టిగ బిగించి యుండిన పక్షమున H 1 అను రేకుపట్టా క్రిందికి నొక్కబడినప్పుడవి సాగుచు, తక్కినసమయములం దారేకుపట్టాను పైకి లాగిపట్టియుంచుచు సహాయపడగలవు.

ఈచిత్రమందలి యక్షరకుంచికాశలాక Y యను వక్షరము గుద్దుచేయబడినచోట నెవ్విధమున పైకి వంచబడియున్నదో యట్లే యీయంత్రమందలి యక్షరకుంచికాశలాక లన్నియు నావిధముననే పైకి వంచియుంచబడినచో, యక్షరకుంచికలు క్రిందికి నొక్కబడినప్పుడు, వానిశలాకలు, తొమ్మిదవపటమందలి H అనుపేరుగల రేకుపట్టాను తగలకయుండగలవు. మరియు నాంధ్ర కుంచికాశలాకలపొడవు నించుక పెంచుట మంచిది. ఇందుమూలమున గల్గు లాభములను పాఠకులే గ్రహించుకొందురుగాత అని నేనిచట చేర్కొనుట మానితిని.

ఈవ్యాసమున స్థలాంతరమందు వర్ణింపబడిన రొత్తుబల్ల (Stool) యొక్క కుడిప్రక్కయందు పూర్వస్థలవర్ణనికి సంబంధించిన యంత్రభాగము (ఎనిమిదవ చిత్రములోని యంత్రభాగము) వంటిదాని నింకొకటి రెండవ ప్రక్కకూడ సమకూర్చుకొని, ఆయంత్రభాగమునకును, ఇంవలి జరుపుకుంచికల (Pa:s Keys) కును సంబంధ మేర్పర్చుకొన్నచో నీజరుపుకుంచికలను కూడ నవసరమైనతరి హస్తాంగుళితో నొక్క ప్రయాసపడ నవసరము లేక, రెండవ మోకాలిపైని తొడయొక్క రెండవప్రక్కయందలి భాగముతో నాయంత్ర భాగమందలి గురుకుంచికను ఎడమప్రక్కకు త్రోసిపట్టిన సరిపోవగలదు.

ఇక నీప్రక్క పొందుపరచిన పదునొకండవ చిత్రమును జూడుడు.

ముద్రాక్షర విలేఖన యంత్రమున కుడిప్రక్క పూర్వభాగమున గలయంత్రభాగ మీపదునొకండవచిత్రమందు జూపబడినది. మన మీయంత్రభాగము నుపయోగించినపు డిందలి శలాకల సంచలనమును, ఇంతకుముందు జూపబడిన చిత్రములందువలె బింద్వాకారపురేఖల నిడి చూపుటకు వీలులేనందున, బాణపుగుర్తుల మూలమున జూపియున్నాడను. బాణముయొక్క మొన యేవైపునకు తిరిగి యుండునో యచ్చటిశలాక యావైపునకు కదులునని యెరుంగునది.

ఈచిత్రములోని యంత్రభాగమందలి A, B యను పేరుగల యినుపకడ్డీయొక్క A యనుకొనను కుడిచేతితో కుడివైపునకు త్రోసినయెడల, దానియొక్క రెండవ C యనుగొట్టమున వదులుగా బిగింపబడియుండుటచే ఇంచుక తిరిగి, దానియొక్క B యను రెండవ కొనకు గట్టిగ బిగింపబడిన D యను లఘుశలాక యించుక క్రిందికి వంగి, తన్ను ననుసరించియున్న E యను లఘుశలాకను క్రిందికి నొక్కివేయును. దానితరువాత గల F, H యను సమకోణశలాక T యను చోట సీలచే వదులుగా బిగింపబడియుండుటచే, దాని F అను మొన E యను లఘుశలాకచే క్రిందికి నొక్కబడినప్పుడు, దాని H యను రెండవమొన యించుక ముందునకు—అనగా స్తంభిక వైపునకు, త్రోయబడును. దాని ననుసరించియున్న K యను శలాకకూడ ఇంచుకముందునకు త్రోయబడును. అపుడు L, M అను వంకరశలాక మొదట ఇంచుక ముందునకు త్రోయబడి యటుపిమ్మట ఇంచుక పైకి త్రోయబడును. అటు లావంకర శలాక మొదట ముందునకు




చిత్రము ౧౧

త్రోయబడినప్పుడు, దానికి M అను కొసవద్ద గల కోర పన్ను, స్తంభికయొక్క N అను పేరు గల పళ్లమధ్యకు చేరి, యటుపిమ్మట L, M శలాకలు యించుక పైకి త్రోయబడినప్పుడు తనతోపాటూ పళ్లచక్రమును, దానికి సంబంధించియున్న స్తంభికనుగూడ నొక్కసారిగా పైకి లాగును—అనగా స్తంభికను నించుక త్రిప్పి ముద్రాక్షరవిలేఖనము దక్షరపంక్తుల గూర్చుకొనుట యందు సహాయపడుచున్నది. ఇందు మనము గ్రహింపవలసిన విషయ మొండు గలదు. అదేదన, స్తంభికకు చివర భాగమందు గట్టిగ బిగింపబడిన యా పళ్లచక్రము యొక్క పళ్లను గురించినవిషయమే.

ఇందలి స్తంభికకు చివరభాగమందు గల పళ్ల చక్రమును ముందునకు త్రిప్పి, యందలిపళ్లలో నొక పల్లుయొక్క స్థానము దానిపై భాగమందుగల పల్లు యొక్క స్థానమునకు చేర్చినప్పుడు, మనము ముద్రించిన యక్షరపంక్తి పైకి జరిగి, దానిక్రింద వేరొక యక్షర పంక్తి ముద్రించుటకు తావొసంగును—అనగా మొదట ముద్రించిన యక్షరముక్రింద మరొకయక్షరమును ముద్రించుటకు తావొసంగుచున్నదని యర్థము. కాన దానిని బట్టి పార్ష్ణి, పార్ష్ణిత్ర, పార్ష్ణిగ్రాహుడు, శార్ఙ్గి, శార్ఙ్గము, దుర్జ్ఞేయము మొదలగుపదములలోని సంశ్లిష్ట వర్ణములందలి సంయుక్తాక్షరంబులు దొంతికుండలవలె చేర్చబడిన ట్లున్నను, వానిని సైతము మన యాంధ్ర ముద్రాక్షరవిలేఖనయంత్రమందు ముద్రింప వీలున్నదని చెప్ప సాహసించుచున్నాడను.

ముద్రాక్షరవిలేఖనమందు ముద్రింప మచ్చునకు "శార్ఙ్గి" యనుపదమును దీసికొనుడు. ఇందు "ర్ఙ్గి" యను సంశ్లిష్టవర్ణమందలి సంయుక్తాక్షరములు దొంతికుండల వలె చేర్చబడియున్నవి చూడుడు. ఈ "శార్ఙ్గి" యను పదమును ముద్రించునపుడు, ద్వితీయ కుంచికాఫలకమందలి మూడవవరుసలోని రెండవకుంచికను పరివర్తన కుంచిక సహాయమున నొక్కినయెడల, అందలి రెండవ యక్షరమగు "శ" శకారము ముద్రితమగును. ఈ శకారముగల కుంచిక స్థిరకుంచిక గాన వాహన మట్లే కదలక నిల్చియుండును. తర్వాత నామూడవవరుసలోనిదియేయగు నేడవకుంచికను పరివర్తనకుంచికసాయమున నొక్కినపక్షమున, అందలిమూడవసంకేతమగు "ా" దీర్ఘము "శ" శకారముపైన ముద్రితమగును. ఈదీర్ఘముగల కుంచిక అస్థిరకుంచిక గాన వాహన మించుక రెండవ ప్రక్కకు కదలి, యిప్పటికి ముద్రింపబడిన "శా" యను నక్షరమునకుప్రక్క ముద్రింపబడబోవు నక్షరమునకు తావొసంగును.

ఇప్పు డిక నామూడవవరుసలోనిదియేయగు ఎనిమిదవకుంచికను నొక్కి, యందలిమొదటియక్షరమగు "ం" లఘురేఫమును ముద్రించుము. ఈలఘురేఫము గల కుంచిక స్థిరకుంచిక గాన వాహన మట్లే కదలక నిల్చియుండగలదు. తర్వాత మొదటివరుసలోని పదియవ కుంచికను నొక్కి, యందలి మొదటిసంజ్ఞయగు "ఙ" యను వర్ణచిహ్నమును లఘురేఫముక్రింద ముద్రించుము. ఈ "ఙ" యను వర్ణచిహ్నముగల కుంచిక స్థిరకుంచికయే గాన వాహన మట్లే కదలక నిల్చియుండగలదు. ఈ పట్టున "గ" యొత్తును ముద్రించినచో నయ్యది "ఙ" యొత్తుక్రింద ముద్రింపబడక, నా "ఙ" యొత్తుమీదనే ముద్రింపబడగలదు. కాన నీ "గ" యొత్తును ముద్రించుటకు ముందు, పదునొకండవచిత్రమందలి యంత్రభాగమందుగల స్తంభికయొక్క చివరభాగమున బిగింపబడిన W యనురబ్బరుచక్రము కుడిచేత బట్టి, దానిపై జూపబడిన బాణపుగుర్తు ననుసరించి యించుక పైకి త్రిప్పి, ఆ స్తంభికకు గల పళ్లచక్రమందలి పళ్లలో నొకపంటియొక్క స్థానము దానిపైభాగమందు గల పంటియొక్క స్థానమునకు చేర్చి, యిప్పటికి ముద్రించిన "శార్ఙ" యనునక్షరములు గలపంక్తి పైకి జరుగునట్లు చేసి తదుపరి కుంచికాఫలకమందలి నాల్గవవరుసలోని యారవ కుంచికను పరివర్తనకుంచికసాయమున నొక్కి, యందలి మూడవచిహ్నమగు "గ" గకారపు ఒత్తును "ఙ" యొత్తుక్రింద ముద్రించుము. ఈ "గ" యొత్తుగల కుంచికకూడ స్థిరకుంచికయే గాన వాహనమట్లే కదలక నిల్చియుండును. తర్వాత, నింతకుముం దా W యను

రబ్బరుచక్రమును బట్టి పైకి త్రిప్పిన ఆ స్తంభిక మరల నిప్పుడు క్రిందకు త్రిప్పి, వెనుకటిస్థాన మలంకరించునట్లు చేయుము. ఇప్పుడు, మూడవ వరుసలోని యేడవకుంచికను నొక్కి, యందలి మొదటి చిహ్నమగు "॰" నుడి వాలఘురేఫముపై ముద్రింపుము. అంతే నా "శార్గి" యనుపదముద్రణము పూర్తికాగలదు. ఇటువంటి తదితర పదములగూడ దీనిగమగనే ముద్రించుకొనవచ్చును. అంతియే కాక యింతకన్న నెక్కుడొత్తుల గల్గి, యెంతెత్తున కుండలదొంతరవలె చేర్చియున్నప్పటికిని ఈపద్ధతి ననుసరించియే ముద్రించుకొనవచ్చునని యెరుంగునది. కాన వలపలిగిలుకే నుపయోగించి, యిట్టిపదములందలి సంశ్లిష్ట వర్ణములలోని సంయుక్తాక్షరములసంఖ్య తగ్గించుకొనవలసినయవసర ముండదు.

ప్రస్తుతము మనభాషయందు వలపలిగిలుకయొక్క యుపయోగము చాలభాగము తగ్గిపోవుటకుగల కారణమీ వలపలిగిలుకే నుపయోగించిన పదములయుచ్చారణ సులభగ్రాహ్యము గాకపోవుటయే యని నా యభిప్రాయము. ఇందులకు తార్కాణముగ నేను గళాశాలయందు విద్యార్థిగా నున్నకాలమున నైతము భాషోపాధ్యాయులలో కొందరీవలపలిగిలుకే నుపయోగింపబడిన పదములయొక్క యుచ్చారణ దెలియకుండినను దెలిసినట్లు నటించుటయు, మరికొందరా పదములమాత్రము లోలోన జదువుకొనుటయు, వేరొకకొందరు తమమిత్రులలో జక్కగ దెలిసినవారి నడిగి తెలిసికొనుచుండుటయు మొదలగు బాధల పాలగుట నే జూచియున్నాడను. ఇటువంటిబాధల దొలగించుటకైన నిటువంటి పదములందలి సంశ్లిష్ట వర్ణములలోని సంయుక్తాక్షరములు దొంతికుండలపగిది చేర్పబడియున్నప్పటికిని వాని నవ్విధముననే ముద్రించుట చాల ఉపయుక్తమని నా యభిప్రాయము.

ప్రస్తుతము మన హిందూదేశమం దధిక ప్రచారముగల వివిధ ముద్రాక్షరవిలేఖనయంత్రముల స్తంభిక లన్నియు, నించుమించుగ నొకేవిధమగు సామాన్యమైన లావు గల్గి, ఊర్ధ్వాధోభాగములయం దక్షర సంకేతంబు లేవియు జేర్పబడని యాంగ్లాక్షరములవంటి యక్షరముల ముద్రించుటకుమాత్ర మనువుగా నిర్మింపబడినను, సంశ్లిష్టవర్ణభూయిష్ఠంబగు మన యాంధ్రభాషాక్షరములగూడ వానివలననే ముద్రించుకొనవచ్చును. కాని యక్షరపరిమాణముమాత్ర మమితముగ తగ్గవలసి యుండును. అట్లక్షరపరిమాణము తగ్గించినచో గల్గు చిక్కుల చాలభాగము పాఠకు లెఱింగియే యుందురు గాన నిచ్చట దెలుప బనిలేదు. కనుక నీ సామాన్య స్తంభికలకంటె నుత్తమమైన స్తంభిక వేరొకటి యల్. సి. స్మిత్తు (L. C. Smith) గారి యాంగ్లముద్రాక్షరవిలేఖన యంత్రమందు గలదు. అయ్యది లేబిల్ గాథిక్ టైప్ (Label Gothic Type) అనునామధేయమున, ౧౭ వ ముద్రాక్షరశైలి (Type Style No. 17) యందలి, దాదాపు ౬.౪ మిల్లీమీటర్ల యెత్తుగల యాంగ్లాక్షరముల ముద్రించుటకుగాను నిర్మింపబడినది గాన, దానిపైన మన యాంధ్రాక్షరముల ముద్రించుకొన్న పక్షమున సంశ్లిష్టవర్ణములు ౬.౪ మిల్లీమీటర్ల యెత్తు గల్గి ముద్రింపబడును. అందుచేత నాంధ్రముద్రాక్షరవిలేఖనమందలియక్షరము లిచ్చట బ్రాకెట్లమధ్య జూపబడిన (అర్థము, ఖద్దరు) ఆంధ్రముద్రాక్షరములపగిది నుండగలవు. కావున యల్. సి. స్మిత్తు (L. C. Smith) గారి ౧౭ వ ముద్రాక్షరశైలి (Type Style No. 17) యందలి యాంగ్లాక్షరముల ముద్రించుటకు నిర్మింపబడిన యాస్తంభికను మనయాంధ్రముద్రాక్షరవిలేఖనయంత్రమందు సమకూర్చుకొనవలయును.

అట్లు సమకూర్చుకొనునప్పుడు, ఆ స్తంభిక యొక్క పళ్లచక్రమందలి పళ్లు పెద్దవిగ నుండి చాల వెడల్పగు పంక్తిస్థలముల (Line Spaces) నిచ్చి, దొంతికుండలవలె చేర్పబడిన సంయుక్తాక్షరములుగల సంశ్లిష్టవర్ణముల ముద్రించుకొనుటకు వీలు గల్గనీయదు గాన ఆపళ్లచక్రమును దొలగించి, దానిస్థానమున, నీ పేరాకు పైగల పేరాయం దొకచో పొందుపరచిన యాంధ్రముద్రాక్షరములం దక్షరసంకేతము లేవియు జేర్పబడనియక్షర మెంతయెత్తు గలిగియుండునో యంత వెడల్పు గలపంక్తిస్థలముల నిచ్చుట కనువగు పళ్లుగల

వేరొక పళ్లచక్రమును సమకూర్చుకొనుట చాల అవసరమైన సంగతియని తోచుచున్నది.

ఎంపైర్ (Empire) యంత్రములోని కుంచికాఫలకమందలి కుంచికలలో నొక్కొక్కదాని కేవిధముగ మూడుసంజ్ఞలు కూర్చబడియున్నవో, యవ్విధంబుననే మన యాంధ్ర కుంచికాఫలకమందలి కుంచికలలో గూడ నొక్కొక్క దానికి మూడుసంజ్ఞలు కూర్చ బడియున్నవి. అందుచేత మనయాంధ్రముద్రాక్షర శలాకల (Type Rods) ను ఎంపైర్ యంత్రములోని యాంగ్ల ముద్రాక్షరశలాకల ననుసరించి నిర్మించుకొన వలయుట సహజము. ఆవిధమున నిర్మించుకొనినచో మన మొకచిక్కునకు లోనగుదుమని నా నమ్మకము. ఆచిక్కును విపులముగ నెరుంగుటకై క్రింది చిత్రమును (చి. ౧౨) జూడుడు.




చిత్రము ౧౨

మనయంత్రమున, యల్. సి. స్మిత్తుగారియంత్రములోని లావైన స్తంభికను సమకూర్చుకొంటిమి గాన, దానిపైన ఎంపైర్ యంత్రమందలి యక్షరశలాక పాయమున నందుగల "t, T, 5" అను నక్షరముల ముద్రించునప్పుడు గల్గు చిక్కు నుదాహరణపూర్వకముగ నీపం క్రిందివ చిత్రమందు ప్రదర్శించియున్నాడను. అందలి t యను నక్షరమును ముద్రించునపుడు దానికి పైగల T యను ముద్రయు, T యను నక్షరమును ముద్రించునపుడు దానికి పైనను క్రిందను గల 5, t యను ముద్రలును, 5 యనుసంఖ్యను ముద్రించునపుడు దానికి క్రిందగల T యను ముద్రయు స్తంభికను నిండుగ దాకి ముద్రితమగును గాన విలేఖనము వికారమును జెందును. కనుక నిందలి t, T యను ముద్రలకు నడుమగల స్థలము (Space) ను, T 5 అను ముద్రలకు నడుమ గల స్థలము నించుక పెంచి పొడుగించి, యటుపిమ్మట మన యాంధ్రముద్రల సమకూర్చుకొన్నచో నీచిక్కు తొలగిపోగలదు.

ఈ వ్యాసమున ప్రదర్శింపబడిన నూతన యంత్రభాగములను, దత్పూర్వమున గల యంత్రభాగములందలి మార్పులను, ౧౦-వ రెమింగ్టన్ (Remington No. 10) యంత్రమున సమకూర్చుకొనుట చాల సమంజసము.

ఇందు జర్చింపబడిన ముద్రాక్షరవిలేఖనమును గూర్చి యింతకన్న విపులముగ విశదీకరింపబడవలసివచ్చుచో ఆంధ్రముద్రాక్షరవిలేఖనసంబంధమగు పఠనీయగ్రంథము (Text-book) వ్రాయునంతటిభాగ్యము మన యాంధ్రభాష కబ్బినప్పు డాలోచించుకొనవచ్చును.

క్రిందటినవంబరు "భారతి" యందు ప్రచురింపబడిన మ-రా-రా-శ్రీ, యమ్. యస్. వెంకయ్యగారి "తెలుగుముద్రాక్షరవిలేఖన" మను వ్యాసము నిందు ప్రత్యేకించి విమర్శించియుండలేదు. కాన నీవ్యాసమందలి విషయములబట్టి యావ్యాసవిమర్శనము నిర్ణయించుకొనుటకు పాఠకమహాశయులే ప్రార్థితులు.

[సర్వస్వామ్యములు వ్యాసకర్తవి.]

# ప్రాచీన చిత్రములు



౧. గణపతి



## దస్యుఁడు-సదస్యుఁడు "సద్వాదం డంతయుఁ జూపి చెప్ప" క్రొత్తపల్లి సూర్యారావుగారు

శ్రీలఁగుం డొత్తిగిలుండు ప్రక్కగను బోదు న్రాజమార్గంబునం
దెలుపన్లే దనఁబోకుఁ డేను వరదా తిమ్మండ లెండో జనుల్
ఫల మే మున్నది మిమ్ము రాచికొని పోవ న్నాకు ము న్నెట్టిచే
తలు చేయంగను గల్గెనో గదరె యీదౌర్భాగ్యజన్మం బిటన్.

చెప్పకున్న నెఱుఁగఁ జేయు నాయాకార-మాత్మవృత్తి మెల్ల నజ్ఞుఁడను గృ
పావిహీనుఁడను శవంబులఁ దినిమెడు-వాఁడఁ బచ్చిదొంగఁ బొనరతుఁడ.

ఎంతచెడినఁగాని పంతంబు తప్పను-దెచ్చికొన్నయప్పు దీర్చివైతు
దొంగవుగదర యప్పుతోఁ బని యేమన-వలదు పాపధనము నిలువ దింట.

కల రందం దటి గోప్యరీతి నడుగంగా నప్పు మా కిచ్చువా
ర లణాచొప్పున వారవృద్ధికిని స్వల్పం బైన-నెచ్చైనచో
నలవడ్డంతటిలో సగంబు రథయాత్రారంభ కాలంబులం
దులఁ దీర్ప న్గడువు ల్రచించుకొని పద్దుల్ వ్రాసియే తెచ్చెదన్.

గడుసుఁదనపుమాటగా వ్రాసికొందుము-గడువులందుఁ దీర్ఘకాలములను
నాఁడునాఁటఁ దీర్థమాడవచ్చినవారి-మూటముల్లె దొరకు మ్రుచ్చిమికిని.

తెలియఁ గోటిపల్లితీర్థంబునకుఁ గొంతె-యనిన నపుడు దొంగతనము చేసి
సంగ్రహించి తెచ్చి నగ మిచ్చెద నటన్న-మాటయిల్లై గోప్యమార్గగతులు.

నిలువనుమాట సున్న, చెయినిండఁగ డబ్బు గనంబడుంగదా
వలువలు రూకలున్ దొరకు వచ్చిన దంతయు నాకె కాదె య
న్బలిమిని నన్నొకానొకసివంగి వరించెను దానికన్నులన్
దల మయి మత్తు నిర్భయతఁ దాఁ జరియించును వాడవాడలన్.

నిముసం బింటను గూరుచుండ దెపుడో నే నింట లేనప్పు డా
యె మగం డింటికి వచ్చునన్నతలఁ పొక్కింతైన లేకుండఁగా
భ్రమియించుం బనిమాలి తొత్తు వెదకన్ రాదెందు గ్రామాటనం
బమరం జేయుచునుండెఁ గొంచెమును శౌర్యం బేల తానేర్వదో!

కలరేగాదె మగండునున్నగువ యేకంబౌచు సందండు వై
ద్యాలు, తా స్త్రీలను జేరి ముచ్చిలఁగ రాదో నాకుఁ జేయూఁతగ,
న్వాలదో దేవుఁడ యంటిపెట్టుకొని యింటం బిండముం గిన్నెలో
పల నేవచ్చిన వేళకుం బడఁగ వైవం గష్ట మాచుండెఁగా.

ముష్టిచెడిపె యెందుఁబోయి ముచ్చటలాడు-చున్నదొక్కా- సంఘమన్న బలుపు
పదుగురున్నచోటఁబడి చత్తు ననుఁగాని-యింట నొంటి నుండ దేమిసేయు.

అదిగో నెవ్వరో కొందఱాదరిని బ్రోగై యున్నవారందులో
నదియుండుం గనుఁగొందనంచుఁ జని డాయన్వారిలోవానియాఁ
డుది లేదొక్క-మహానుభావుఁ డగు వాఁడున్వానితోఁ బల్వురున్
హృదయాహ్లాదకర ప్రసంగముల హాయిం దేలుచున్నా రటన్.

సంఘమందుఁ జేర సందేహ మవ్వారిఁ-జూడఁగానె మనసు చులుకు మనియెఁ
తొలఁగిపోఁడు వారితోఁగూడఁ జూడఁడు-మిడుతుమిడుతుఁ జూచు మిడుకుమిడుకు.

ఆమహాత్ముఁ డతని నల్లంతనలవోకఁ-గాంచి యేలసంశయించె దిందు
రమ్ము నాఁగ జనులనమ్మర్ద్దమున జంకు-కొంకుతోడఁ జేరుకొనియె వాఁడు.

పౌరు ల్వాని నెఱింగియుం బిలిచి సంభావింప నప్పెద్దతో
నారం జెప్పఁగఁ గొంకి రొయ్యఁ జని తిమ్మప్పయ్య నాబాబులా
రా, రక్షింపుఁడు దండము ల్గొనుఁడు నేనర్హుండఁగా నీసభా
స్తారు ల్నిల్చినచోట నిల్చుటకు, నర్థంబౌనె మీవాక్యముల్.

దారిం బోవుచుఁ దొంగిచూచితిని పెద్ద ల్మీర లున్నారనన్
దూరం బేగుదు, నెవ్వరోయనియు నా దుర్మార్గురాలుండునే

మోరా యంచును దప్పుచేసితిని భృత్యుండ న్దయన్నన్నుఁ గ
న్గోరే యన్న, భయంబులే దిచట నీకుం గూడఁ దాపున్నదా.
పెదపెద్దల్మన కేలయంచు నౌకరుం బిల్పించిన న్రానియు
ట్టిదరిద్రస్థితిలోన నీవెటఁగియుంటే నేమి లేకున్న నే
మి దయం గొంచెము పిచ్చపాటివిని పామిమ్మమంచికో చెడ్డకో
హృదయంబందున నుంచని మ్మిచటి మావృత్తాంత మో నాయనా.

ఏమి యొనర్తు వీవు కులమేమి యొకప్పుడు కల్మిఁ జెందియు
న్లేమిని బొందినట్లుగను నిన్గనఁ దోఁచును?-చెప్పుకొన్న సి
గ్గో మహనీయ నాచరితఁ, గూలఁగఁద్రోసి కులంబు శీలముం
గామికవృత్తిఁ గోల్పడిచి కట్టకడం జరియింతు దొంగనై.

కన్నంబుల్ బదియింతు నేర్పువెలయంగాఁ దారి రాదారులం
జన్నంగొట్టి ధనంబు దోఁచెదను సంతల్తీర్థము ల్వొచ్చినం
గన్నంబ్రామి హరింతు మూటలును రొక్కంబుల్ దివావేళయం
దిన్నాళ్లైనది యెందుఁ బట్టువడలే దింతైన నా వృత్తిలోన్.

నను నైకాగారికుఁడని-యనుట దివాభీతుఁ డనుట యర్థాము గాదో
ఘనులార! యింకనెవ్వరి ననినను మీయిష్టమందు నరయుఁడు నన్నున్.

నేనని యెఱుఁగరు నన్నొకఁ-రేనియు ధైర్యమున నడుగఁ రెప్పుడు భీతిన్
నేనయిన బ్రహ్మభేద్యము-గా నుంచెద దొరకనీను గన్నపుసొమ్మున్.

ఇరుగుపొరుగువారి కెన్నఁడు నొనరింప-హాని, యెఱుక వారి కాపుతలకును
గలుగనీను బాధ, గాని చూచిన కన్ను-వెఱ్ఱియనుచు వారె వెఱచుచుంద్రు.

అన విని యామహాత్ముఁడు బలా యొనరించెదు వృత్తి మంచిదా
నును మఱి కాకపోవును గనుంగొన నస్థలితంబుగాఁ దగున్;
నినుఁ గొనియాడుదు న్నిజము నీవు వచించితి వింకమీఁద నీ
పనిని యథాప్రకారమనపాయతఁ జేయుము సత్యవాదివై.

సత్యవాక్యమునను సమకూరు శుభములు-సత్యవాక్యమునను సౌఖ్యమబ్బు
సత్యవాక్యమునను సౌజన్యమలవడు-సత్యవాక్యమునకుఁ జాల దేదియు.

చేసినపాప మెప్పుడును జెప్పినఁబోవును గ్రూరకర్ములుం
జేసినదానికై వగచి చేయఁగఁ బో రకృతుల్, యథార్థివా

రా జెఱుంగు దొంగ రచియించినట్టి కృ-త్యంబు సత్యవాక్యతత్పరత్వ,
మన్నతవాది యగు నమాత్యుఁ డటం చంత-రంగమందు శంక ప్రభవమంద.

ఉన్నయట్ల యుండి యుద్యోగి నొక్క-ని-బిలిచి నిర్భయముగ వెతకుమీ య
మాత్యు కంచుకంబు మడి పరిధాన ము-ష్ణీష ముందు నొకమణియు నటన్న.

వెలవెలఁబోయి ప్రెగ్గడ, వివేకనిధీ! క్షమియింపు తప్పు నా
వలననె యున్న దీతఁడు ధ్రువంబుగ సత్యము పల్కె-నంచు నం
చలమునఁ గట్టిదాఁచిన ప్రశస్తచతుర్థమణి న్నృపాలు ప
జ్జలజమునొద్దఁ బెట్టె-ధనసంగ్రహబుద్ధి యనేకరూపముల్.

మనుజేశుం డిదె పత్తునం చరిగి మర్మం బార నిల్వేరి వి
న్నను వొప్ప న్నడిపీథిఁ దిమ్మనికి నే యాకారము౦ దాల్చి చూ
పెనొ తా నాపాడ తోడ బంటువెనుకం బేరోలగం బాయ్యెఁ జో
చ్చెను మాణిక్యహ్మ్రాతి న్నటుండు గొనితెచ్చె న్వీని నన్నట్లుగన్.

చూచి తిమ్మఁ, డితఁడె నాచేతఁ జేయించె-దొంగతనము వీని కొంగునందుఁ
గానఁబడును రత్న మేను నీతఁడుగాని-యెఱుఁగ రితరు లనియె నెచ్చరిల్లి.

రాత్రివేసగాఁడు రాజని సభవారు-తెలిసికొనిరి, దొంగ తెలియలేదు,
పగటివేసగాఁడు పార్థివప్రెగ్గడ-నిలువునీరుగాఁగఁ దెలివిదక్కె.

ఆ సభలో జను ల్భయము నద్భుతముంగొన వేసగాడు రా
జై సచివుం గనుంగొని యథార్థవచస్కుఁడ నీచవృత్తిలో
నే సిరినొందు మన్నతుఁడ నిమ్నతగాంచు నసత్యవాగ్మి, నీ
చేసిన ద్రోహకార్యము వచింపఁగనౌను సభాంతరంబునన్.

చోరునకుఁ జేయఁబోయెడు ఘోరశిక్ష-కర్హుఁడవు నీవు, నీ స్థితి కర్హుఁ డితఁడు
బ్రాహ్మణుఁడ వౌట శిక్షింప వదలిపొమ్ము-పట్టనం బని యానతిపెట్టె-మఱియు.

నీవు తలంచినట్టు లవని న్మతి యెన్నఁడు జన్మమధ్యమం
దేవిధచౌర్యముం జఱుపనేటికి నేఁడు మొదల్మనీయ దు
ర్భావనతత్పరుండవగుమా, ములుమ్ముంటను బుచ్చునట్లుగాఁ
గావలులైన దస్యులను గన్గొని పట్టుచు నాఁడునాఁటికిన్.

సేవకత్వముగాదు నా చెలిమికాఁడ-వనుకొనుము వలసినయప్పు డర్థమెంత
యైనఁ గొనిపొమ్ము సుఖముండుమయ్య యనుచు-ననిపెఁ దిమ్మని మర్యాద నాదరించి.

---

# న్యాయ ప్రభువు

శ్రీ బి. జ్ఞానాంబగారు

౧ రంగము—ఉద్యానవనము

[జహాంగీరు చక్రవర్తి నూర్జహానుతోఁగూడ చంద్రకాంతశిలావేదికపై నాసీనుఁడై యుండును.]

జహాంగీరు

దేవీ! జీవకోటికి సమానాశ్రయమును, సమానసౌఖ్యమును ఇచ్చుచున్న యీయుద్యానవనము న్యాయదేవతాస్థానమువలె దర్శనీయమై యున్నది.

నూర్జహాను

పరమయోగీంద్రునికిఁ బరమాత్మస్వరూపమటుల ప్రభువుగారికిఁ బ్రకృతిచిత్రముఁ బరికించునప్పుడు సైతము న్యాయవిషయమే సాక్షాత్కరించుచున్నది.

జహాంగీరు

అవును. న్యాయము నిర్మలమధురనదీజలమువంటిది. ప్రజ లాజలములఁ గ్రోలుటకు సర్వవిధముల నర్హులు. అందుకు ఆటంకముఁ గలిగించువాఁడు ప్రభుపదవికి అనర్హుఁడు.

నూర్జహాను

కావుననే ప్రభువుగారు ప్రజలతోపాటు పశుపక్ష్యాదులకుఁగూడ న్యాయసుధను సమానముగఁ బంచియిడుచున్నారు.

జహాంగీరు

(నిరూపించి చూచి) ప్రియతమా! మధురమందహాసచంద్రికలను వెలయించుచున్న నీ వదనబింబముపై నేఁ డేలొకో విషాదజలదశకల మొకటి పరుగిడుచున్నట్లు నాకు స్ఫురించుచున్నది. కారణ మేమై యుండును?

నూర్జహాను

(తనలో) చెప్పుదునా? వలదు. తొందరపడరాదు. పలికి బొంకుట పరస్త్రీసాంగత్యముకంటెను అన్యాయము నాసవము కంటెను హీనముగాఁ దలంచు ఈన్యాయమూర్తి మదీయ దారుణోదంతము నాలకించిన తత్క్షణమే నారకీయభీషణాగ్నిజ్వాలలఁ బడఁద్రోయించునేమో? (ప్రకాశముగా) ప్రాణాధికా! ఏమియు లేదు. కొంచె మస్వస్థతగా నున్నది.

జహాంగీరు

అట్లయిన అంతఃపురమునకు వెళ్లి కొంత తడవు విశ్రమింపుము.

నూర్జహాను

(తనలో) నే నిట లేకున్నచోఁ బ్రభువుగారికి నాచేసినవిషయము నివేదింపఁబడునేమో? (ప్రకాశముగా) అన్యాయచమూసంహారులగు తమపరోక్షమందు అస్వస్థతయొక్క ధూర్తత్వము మఱింత యధికమగును. కావున నిచ్చటనే యుండ నిచ్చగింతును.

(ప్రవేశము—సేవకుఁడు)

(వంగి సలామొనరించి) దేవా! బ్రాహ్మణియట. న్యాయదర్శనార్థులకొరకు ప్రభువుగారి పవిత్రమగు హాజారద్వారమున వ్రేలాఁగట్టిన గంటను వినుగు విరామము లేకుండ మ్రోఁగించుచున్నది.

నూర్జహాను

(తనలో) సర్వనాశనమైనది. నేను లంచ మిచ్చిన కావలివారిని తప్పించుకొని ఆ బ్రాహ్మణి హాజారద్వారము నెట్లు సమీపింపఁగల్గినది?

జహాంగీరు

సేవకా: ఆమెను నేఁటిమధ్యాహ్న వేళ ఆస్థానమందుఁ బ్రవేశపెట్టుము.

సేవకుఁడు

చిత్తము. (నిష్క్రమించును.)

జహాంగీరు

దేవీ! ఏ మట్లాయాసపడుచున్నావు?

నూర్జహాను

రాను రాను శిరోభార మతిశయించు చున్నది. ఇఁక వెళ్లెదను. (నిష్క్రమించును.)

జహాంగీరు

ప్రేయసివైఖరి నేఁ డెంతయు వింతగ నున్నది. పరీక్షించెదఁ గాక. (వెళ్లును.)

౨ రంగము—ఆస్థానము

[జహాంగీరు సింహాసనాసీనుఁడై యుండును. అతనికి ఇరుపార్శ్వములందును సభికులు కొలువుదీరియుందురు. బ్రాహ్మణి సింహాసనాభిముఖయై నిలిచి యుండును.]

బ్రాహ్మణి

ప్రభువుగారి ఆస్థానమందు న్యాయము నదీజలమువలె సమృద్ధిగా దొరకుచున్నదని విని వచ్చితిని.

జహాంగీరు

నిక్కము నివేదించినచో నట్లే.

బ్రాహ్మణి

ప్రభువుగారికి ఆగ్రహము జనించు వృత్తాంతము కావున జంకుచుంటిని.

జహాంగీరు

పిరికితనము పిల్లలకుండవలసిన లక్షణము.

బ్రాహ్మణి

క్షంతవ్యురాలను.

జహాంగీరు

భయపడక సర్వము నెఱింగింపుము.

బ్రాహ్మణి

దేవా! నిన్నసాయంకాలము తమబేగం సాహెబాగారు ధనుర్విద్య నభ్యసించుచుండిరి. తత్సందర్భమున నొకతీవ్రనారాచము గుఱిఁ దప్పి వచ్చి దారి నేగుచున్న నా పతి ప్రాణములను హరించినది. ప్రభువుగారు న్యాయమునుఁ బరిపాలింపవలెను.

జహాంగీరు

(ఆలోచనాధీనుఁ డగును.)

మొదటి సభికుఁడు

(రెండవసభికునితో మెల్లగా) ప్రభువుగారు నే డెట్లు ప్రవర్తింతురో చూడవలసి యున్నది. భార్యావిషయము గనుక.

రెండవ సభికుఁడు

చూచుట కేమున్నది? కొన్నివందల రూప్యములతో సర్వముఁ బరిసమాప్తమగును.

మూఁడవ సభికుఁడు

ఛీ! అట్లనుకొనరాదు. న్యాయపరిపాలనమందు ప్రభువుగారు ప్రసిద్ధహస్తులు.

నాలుగవ సభికుఁడు

తినుచుండియు రుచు లడిగెద రేల? ప్రభువుగా రేమో పల్కుచున్నారు. వినుఁడు.

జహాంగీరు

సభికులారా! మహమ్మదీయశాస్త్రములు రుధిరమునకు బదులు రుధిరమునే వాంఛించుచున్నవి. ఇఁక గత్యంతరము లేదు.

ఒక సభికుఁడు

ప్రభువుగారు తొందరపడరాదు.

మఱియొక సభికుఁడు

స్త్రీవధము పాపహేతువు.

ఇంకొక సభికుఁడు

ఉద్దేశరహితము కావున ఈ యపరాధమునకు జరిమానా విధింపవచ్చును.

వేరొక సభికుఁడు

కేవల మొకసామాన్యవ్యక్తికొఱకు జగన్మాన్యయగు నూర్జహాన్మప్రభ్వికి మరణదండనము విధింపఁబూనుట ప్రజాసంతాపహేతువు.

జహాంగీరు

(మొల నున్న కైజారు నూడఁబెఱికి బ్రాహ్మణిముందు పడవైచి)

మానినీ! నిన్ను విధవగ నొనరించిన ఆ దుర్జాతి నూర్జహానుభర్త నీయెదుట వినమితమస్తకుఁడై నిలిచియున్నాఁడు. నీ వా కైజారుతో వానిశిరమును ఖండించి నీరీతిగనే వాని సతినిసైతము విధవగా నొనరించి కసిఁదీర్చుకొనుము. ఏల వెనుదీసెదవు? కానిమ్ము.

సభ్యులు

(ఆశ్చర్యచకితులై హాహారవములఁ గావింతురు.)

బ్రాహ్మణి

(ముకుళితహస్తయై) ప్రభూ! తాము సంహరింపఁబడినచోఁ దమ సతీరత్నమే గాక ప్రజ లనాథ లయ్యెదరు. కాఁబట్టి యిట్టి దారుణకార్యమున కొడిగట్టఁజాలను. నూర్జహాను రాజ్ఞీమణిని నేను మనఃపూర్వకముగ క్షమించుచున్నాను.

సభ్యులు

(ఏకగ్రీవముగా) బ్రాహ్మణి ప్రభుభక్తి సర్వవిధముల స్తవనీయము. ప్రభువుగా రీక

తమ యభిప్రాయము నుపసంహరించుకొన వచ్చును.

జహాంగీరు

రాలతోఁ గొట్టిన వ్యక్తిని పూలతోఁ బూజించిన యీ మానినీమణి మహోదార గుణమున కెంతయుఁ గృతజ్ఞుఁడను. నే నొక వ్వఁడు ప్రణయపరాజితుఁడ నై నూర్జహానుకుఁ గొన్నియూళ్లను కానుకగా నొసంగియుంటిని. అం దర్ధభాగ మీబ్రాహ్మణికి సంక్రమించుఁ గాక.

బ్రాహ్మణి

ధన్యను.

కవి

ప్రభువుగారి పవిత్రనామము మానవహృదయవీథులందు మారుమ్రోఁగుచుండఁగలదు నిరంతరము.

---

## కలవరింతలు

పిలకా గణపతి - జనమంచి కామేశ్వరరావుగార్లు

వెడలిపోకోయి! మురళీ!
నన్నిచటు! విడిచిపోకోయి! మురళీ!

అలసి ఈవనములో నిదురపోయితి! నేను!
ఆగాఢనిద్రలో! నీమురళి వినిపించె!
—వెడలి.

దూరాన దశదిశల దావాగ్ని వెలిగించు!
కారుమబ్బులు గ్రమ్మె! గగనాంతములలోన
—వెడలి.

ఈకారుచీకటిలో! ఈభీకరాటవిలో!
నిదురించుచుండగా నను విడిచి చనినావ!
—వెడలి.

ఆకు లల్లల్లాడ అదరిపడి చూచితిని!
మురళివచ్చె నటంచు మురిసిపడిపోయితిని!
—వెడలి.

కోయిలల పాటలో! క్రొమ్మావిచిగురులో!
నీపిలుపె! వినిపించు నీరూపె కనిపించు!
—వెడలి.

మెఱుపుతళతళలో! ఏటిగలగలలో!
నీతళుకె! కనిపించు! నీపాటె వినిపించు!
—వెడలి.

---

## రాజ్ఞా

తోట కృష్ణమూర్తిగారు, బి. ఏ., యల్. టి.

కరీమ్ సాయిబుగారి మేడలో బసచేశారు, సర్కస్ మెంబర్లు—ఇంచుమించు పాతికమంది. చుట్టూ పడి పోతూవున్న కురుచైన ప్రహరీగోడ, విశాలమైన నగుసు లేని పచ్చిక తిన్నెలు, ఎత్తుగా పెరిగిన చెట్లు, సంరక్షణ లేక కృశిస్తూవున్న పువ్వులమొక్కలు — అన్నీ ఆ యింటి ప్రాకారాని కొకవిధమైన శోభ కూర్చేవి. ఒకప్పుడు జనంతో క్రిక్కిరిసి, కలకల లాడుతూఉండే రమ్యమైన సౌధ మిప్పుడు క్రమంగా పాడుపడి బూజుపట్టింది: అందులో కాపురముండేవా ళ్ళెవరూ లేక, యేళ్లకొలదీ తలుపులు మూసేవుండేవి. పూనా సర్కస్‌కంపెనీవా ళ్లందులో ప్రవేశించగానే, మళ్లీ కొత్తకళ వచ్చింది మేడకు. ఇంటినిండా కిటకిటలాడుతూ మనుషులు, సామానులు, మెరుపుదీపాలు, అలికిడి, ఉండేసరికి మృతకళేబరానికి ప్రాణం వచ్చిన ట్లయింది, ఆయింటికి.

తమబస కోఫర్లాంగు దూరంలో ఉండే మైదానం మీద, ఆటకు పెద్దడేరా వేసుకున్నారు సర్కస్‌వాళ్లు. సుమారు పదివేలమందికి సరిపోయినంత డేరా అది. దాని చుట్టూ కొన్ని చిన్న చిన్న డేరాలుకూడా వేసుకున్నారు. గుర్రాలు, ఏనుగులు, కోతులు, కుక్కలు, ఎలుగుగొడ్లు, కంగోరాలు, జీబ్రాలు, పులులు, సింహాలు—ఇంకా యేవేవో జంతువులు,—కొన్ని ఆడేరాలకు దగ్గిరగాను, కొన్ని లోపల బోనులలోను, కొన్ని వెలుపలను ఉం డేవి. ఈ మృగాలను, డేరాలను, చూడడానికి పురజనులు గుంపులు గుంపులుగా వచ్చి పోతూ ఉండేవారు. ఆ నాలుగు రోజులూ ఊరంతా మహా అలికిడిగా ఉండేది. ఏగోడమీద చూసినా మంచిమంచి రంగుల బొమ్మలతో సర్కస్‌వాళ్ల ప్రకటన పత్రికలే కానవచ్చేవి.

ఆట ప్రారంభించడాని కింకా ఒకరోజు వ్యవధి ఉన్నదనగా కంపెనీవాళ్ల యేర్పాటులన్నీ పూర్తి అయి నవి. అది శీతకాలం. డిసెంబరు నెల. వెన్నెల రాత్రులు. చలి మిక్కుటంగా ఉండేది. వాడు దీపాలు పెట్టే వేళప్పుడు సర్కస్ మెంబరు తారాబాయి మేడ దిగివచ్చి, ఆవరణలో ఉన్న బాదంచెట్టుకింద నిల్చుంది, చంద్రుణ్ణి చూస్తూ. పదహారుపది హేడేళ్ల జవ్వని. చలికి పొడుగైన ఉన్నికోటు తొడుగుకుంది. అందంగా దువ్వుకున్న జుట్టులో గులాబీపువ్వులు పెట్టుకుంది. గాలికి చెదరి కళ్లలోపడుతూవున్న ముంగురులను సవరించుకుంటూ, రోడ్డుదీపాలను, దారిని నడిచే జనులను, మోటారు కార్లను పరీక్షిస్తూ, యేదో ఆలోచిస్తున్న దానివలె పర ధ్యానంగా నిల్చుంది. దూరంగా ఎక్కడో గంటలు కొట్టిన చప్పుడు వినవస్తే, చేతినున్న రేడియమ్ రిస్టు వాచీ చూసుకుంది ఏడుగంటలయిం దప్పుడు. ఇంతట్లో ఎవరో తన భుజంమీద చెయ్యివేసినట్లనిపించి ఉల్లిపడి తిరిగిచూసిం దామె.

"ఒక్కర్తెవే ఏంచేస్తున్నా విక్కడ—యీ చలిగాలిలో?" అంటూ చనువుగా చిరునవ్వుతో కుశల ప్రశ్నచేశాడు జమన్సింగ్.

కళ్లెత్తి అతడివేపుచూసి, ముసిముసిగా నవ్వు తూరు కుంది, ఆమె. ఇద్దరూ సర్కస్ మెంబర్లే; ఇద్దరూ పొట్ట కోసం కంపెనీలో చేరి నౌఖరీ కున్నవాళ్లే.

తారాబాయి మంచి అందకత్తె. ఆమె నిజమైన కులం యెవరికీ తెలియదు. క్షత్రియకన్య అని చెప్పుకుం టారు. గుర్రపుస్వారి చేస్తుంది. కత్తి తిప్పుతుంది. విలు విద్యలో మంచి ప్రవీణురాలు. తీగమీద నేర్పుగా సైకిల్ తొక్కుతుంది; నాట్యంచేస్తూ చిత్రంగా మొగ్గలు వేస్తుంది. ప్రేక్షకులను రంజింపజేసే శక్తులు ఎన్నో ఉన్నాయి, ఆమెవద్ద. ముఖ్యంగా ఆమెరూపం, యౌవ నం, పురుషుల నాకర్షించి భ్రమింపజేస్తాయి. కేవలం ఆమెనే చూడడానికి సర్కస్‌కు వచ్చేవాళ్లెందరో ఉం టారు. అట్టి మోహనాకార మామెది!

జమన్సింగ్ సుమారు 30 ఏళ్లవాడు. మంచి రూపవంతుడు. సర్కస్ విదూషకుడి వేషం వేసి, నవ్వుతాలతోను, వికారచేష్టలతోను, చూపరులను మెప్పిస్తాడు. జంతువైద్యం నేర్చిన డాక్టరు. కనుక అడవి మృగాలను చూసే పూచీకూడా అతనిదే. వాటికి తిండి పెట్టినప్పు డాయన దగ్గిరుంటాడు. ఎప్పుడైనా అవి ఆరోగ్యంగా ఉండనప్పుడు, వాటికి మందులు మాకులు యిస్తాడు.

తారాబాయి అంటే సింగుకు ప్రాణం. ఆమె నెట్లాగైనా వశపరచుకొని, తనదాన్ని చేసుకుందుకు యెన్నో విధాల యత్నించేవాడు. కాని తార బలే పెంకెది. అతని హృదయమారాటం తా నర్థం చేసుకోనట్లు నటించేది. జమన్సింగ్ వలె తనకోసం యెంద రెన్ని విధాల తహతహలాడినా ఆమె కానందమే! వాళ్లను పిచ్చివాళ్లను చేసి, ఆడించి తనలో నవ్వుకునేది. పురుష స్నేహితులందరితోను చనువుగానే ప్రవర్తించేది. మగవాడంటే భయం, బిడియం, లేవామెకు. తా నొక స్త్రీ అన్న సంగతి మరచిపోయినట్లు నడుచుకునేది, వాళ్లతో. పురుషులతో స్నేహం, అగ్నితో చెలగాటమన్న సంగతి ఆమె కింకా విశదం కాలేదు!

తారాబాయిని వెన్నెలలో ఒంటరిగా చూసే సరికి, జమన్సింగుకు వొళ్లు పులకరించింది. వెర్రివెర్రి కోర్కెలతో హృదయం గంతులాడింది. పట్టరాని మోహావేశంతో కౌగలించుకొని, చెట్లనీడ నామెను ముద్దు పెట్టుకున్నాడు.

“సింగ్, నీకేం మతిపోయిందా?...వొదులు!” అంటూ సిగ్గుతో పెనగులాడింది, తార.

కాని, ఆనందంతో కులుకుతూ గుండె కామెను మరింత గట్టిగా అదుముకున్నాడు సింగ్. తారకు కోపం వచ్చింది. శక్తికొలదీ పెనగులాడ ప్రారంభించింది. కొప్పులో ఉన్న పువ్వులు నలిగి, క్రింద రాలాయి. ఒళ్లు వేడెక్కి మొహం యెర్రబడింది. తలతిరిగి కళ్లు చీకట్లు కమ్ముకున్నట్లు తోచిందామెకు. బుగ్గలూ, పెదవులు, కళ్లు, వక్షం—అన్నీ ముద్దులాడుతున్నాడు సింగు, బలాత్కారంగా. పులిపిల్లవలె రక్కడం ప్రారంభించింది, తార. రోడ్డుమీద దూరంగా యెవరో నవ్వుతున్నట్లు చప్పుడు వినవచ్చింది. మేడలో దీపాలుకూడా ఆమె అవస్థను చూసి, నవ్వుతున్నట్లే తోచింది, తారకు. చెట్లు, చంద్రుడు, పిట్టలు—లోకం యావత్తూ తన్ను చూసి నవ్వుతున్న ట్లనిపించిందామెకు. ఉదాసీనంతో ముఖం దించుకుంది. పోట్లాటమాని, బలహీనంగా ప్రాణంలేని బొమ్మవలె వొరిగింది, అతని చేతులలో. దిగులు, ఆశ్చర్యం, జనించాయి సింగుకు. పశ్చాత్తాపం కలిగి, కౌగలివదలి, బిక్కచచ్చి నిల్చున్నాడు. తలపైకెత్తి ఒక్క క్షణం తీక్షణంగా అతనివేపు చూసిందామె, యేమీ అనకుండా. చేతిరుమాలుతో పెదవులు, బుగ్గలూ, తుడుచుకుంటూ, గిరున తిరిగి మేడవేపు వెళ్లిపోయింది.

ఇదివరలో తారాబాయి యెన్నడూ ఇట్టి అవమానం పొంది ఉండలేదు. తుదకు కంపెనీ మానేజరు సూర్యాఖాన్ కూడా ఆమె నీవిధంగా హింసించి యెరగడు. అతగాడంటే తారాబాయికి కొంచెం యిష్టం కూడా. తక్కినవాళ్లె న్నెన్ని వేళాకోళాలు చేసినా సూర్యఖానును మాత్రం గౌరవంతో చూసేది. అతని ప్రేమ నెన్నడూ తిరస్కరించేదికాదు. సిగ్గుతో కౌగలించుకొని ముద్దులాడుకునేవా రిద్దరూ. కాని,...

సూర్యఖాన్ చాలాచిన్నవాడు. తారాబాయి కంటె రెండుమూడేళ్లు పెద్దవాడేమో. మీసంకూడా బాగానల్లపడలేదు. తండ్రి గతించినవెనక, సర్కస్ వ్యవహారాలన్నీ తనే చూసుకుంటున్నాడు. వొల్లమాలిన ధనం ఉంది అతనికి. అన్నివిధాలా స్వతంత్రుడే. తారాబాయిని పెళ్లాడి, సర్కస్‌గొడవ వదులుకొని, హాయిగా ఆమెతో సుఖించాలని అతని ముచ్చట. కాని ధైర్యంగా ఆమెతో తన మనోభీష్టం చెప్పడానికి సిగ్గు!

సూర్యాఖాన్ అంటే యిష్టమే కాని, బాదల్సింగ్‌ను చూస్తే, తారాబాయికి మతిపోయేది. అతన్ని తల్చుకున్నంతమాత్రాన, హృదయం ఆనందంతో సందడించేది. అర్థం కాని కోర్కెలతో మనసు కలవరపడేది. నిజమైన ప్రేమంటే, ఆమె కిదివఱలో అంతగా అనుభ

వానికి రాలేదు. కాని, యిప్పుడిప్పుడు చాలాసంగతులు బోధపడుతున్నాయి. ఏదో స్పష్టంగా తెలియని బాధతో మనసు అప్పుడప్పుడు కలతపడడం, ఏవో పిచ్చిపిచ్చి వాంఛలతో గుండె బరువెక్కడం, నిద్రలో తియ్య తియ్యని కలలు వచ్చి తృప్తి తీరకముందే మెలకువ రావడం, తిండి తిన్నగా హితవుకాకపోవడం, మొద లయిన అవలక్షణాలవలన తనలో జనించిన రుగ్మతను గుర్తించుకుందామె. బాదల్చంద్‌ను మనసారా వలచి, ప్రేమతత్వం అర్థంచేసుకుంది కొంతవరకు.

బాదల్చంద్ పహిల్వాన్; ఆసర్కస్‌కు ఆయువు పట్టువంటివాడు. రూపంలో మన్మథుడుకాకపోయినా, కంపెనీకి పేరు ప్రతిష్ఠలు సంపాదించినవాళ్లలో అతడు ముఖ్యుడు. నల్లగావున్నా, మెలితిరిగిన కండలతో అతని శరీరం మెరిసేది, బలంతో. పెద్దకళ్లు, తరుచైనమీసం— గంభీరంగా ఉండే దతనిముఖం. మనిషి చిన్నవాడే. పాతికేళ్లుంటాయి. పొడుగైన ఉక్కుగొలుసులు తెంచ డం, ఛాతీమీద పెద్దపెద్దబరువైన రాళ్లు పెట్టించుకొని సుత్తులతో పగలగొట్టించడం, మొదలైన పనులుగాక, అడవిమృగాలతో వింతవింతవినోదాలు చేసేవాడు. పెద్ద ఇనపగజాల బోనులో పులులు, సింహాలు, ఆవులు, మేకలు, కోతులు—అన్నిటినీ ఒకచోట చేర్చి, వాటి చేత అద్భుతమైన పనులు చేయించేవాడు. ఒకే పళ్లెంలో అన్నిటికీ ఫలహారాలు పెట్టి తినిపించేవాడు. సింహం చేత తుపాకి పేలించేవాడు. పెద్దపులులను దుమికించే వాడు, మండుతూవున్న చక్రాలలోనుండి. సాధారణంగా ప్రతీ సర్కస్‌వాళ్లూ చూపించే చిల్లరవినోదాలు గాక, పెద్దపులులతోను, సింహాలతోను కొన్నికొన్ని భయంకర మైన 'ఫీట్లు' చేసిచూపించేవాడతడు. బోను గీను యేమీ లేకుండానే "రాజా" అనే పెద్దపులిని బయటికితెచ్చి, గుర్రంమీదవలె దానిమీద స్వారీచేసేవాడు రంగ స్థలంలో! ప్రేక్షకులు భయంతో ఊపిరి బిగపట్టుకొని చూసేవారా చిత్రాన్ని. మనిషితోవలె పులితో కుస్తీ పట్టి, దానితో కిందామీదా పడి దొర్లేవాడు. అమాం తంగా దాన్ని భుజంమీద రెత్తుకొని మోసేవాడు. నిర్భ యంగా పులినోట్లో తలదూర్చి తీసేవాడు. చూసేవాళ్లకు కంపం పుట్టించేది, ఆదృశ్యం!

ఎన్నోసార్లు తారాబాయి అతన్ని బ్రతిమాలు కుంది, ఆఫీటు మానవలసిందని. "పిరికిదానా!" అంటూ ఆమె నెగతాళిచేసి, నవ్వి, ఊరుకునేవాడు బాదల్చంద్.

తారాబాయి జమున్సింగ్‌తో కలహించి, ముఖం ముడుచుకొని మేడమీదికి వెళుతున్నప్పుడు, బాదల్ చం దామెకు రెదురుగా వస్తున్నాడు. మెరుపుదీపం వెలుగులో ఆమె ముఖమైఖరి కనిపెట్టి త్రుళ్లిపడ్డాడతడు. పలకరిస్తే బదులు చెప్పకుండా ఆమె తనగదిలోకి వెళ్లి పోయి, తలుపులు మూసుకుంది. కాని లోనుండి గడియ వేసుకునేలోపున, బాదల్చంద్ చప్పున లోపలికి వచ్చి ఆమె చెయ్యిపట్టుకున్నాడు.

అతడెన్నివిధాల ప్రార్థించి అడిగినా, ఆమె మొదట యేమీ చెప్పలేదు కాని, క్రమంగా ఉన్న దున్నట్లుగా జమున్సింగ్ ప్రవర్తనను తెలియజేసింది. శిరము మూర్ధాడి, గుండెమీది కామెనువాల్చుకొని, ఓదా ర్చాదు బాదల్చంద్. సహజంగా సింగుమీద అతనికి పట్టరాని కోపం వచ్చింది.

మరికొంతసేపటికి కొరడా పట్టుకొని సింగు కోసం వెతుక్కుంటూ బయలుదేరాడు. సింగును చూసే సరికి వెర్రికోపంతో వొళ్లు మరచిపోయాడు, బాదల్ చంద్. కొరడాతో అతడిని కుక్కను తన్నినట్లు చావ గొట్టి కసి తీర్చుకున్నాడు.

"ఈమాటు దానివేపు కన్నెత్తి చూశావంటే, పీకనులిపి చంపేస్తాను నిన్ను. జాగ్రత్త!" అని పళ్లు కొరుకుతూ, తాటించాడు కూడా.

బాదల్చందు నెదిరించడం మదపుటేనుగుతో పోట్లాడడ మన్నమాట. ఆసంగతి తెలిసే ఊరుకున్నాడు జమున్సింగ్. కాని దెబ్బలు తిని పగ తీర్చుకోకుండా ఊరుకునే నైజం కా దతనిది. మనసులో రగిలేమంటను మనసులోనే అణచుకొని తరుణంకోసం నిరీక్షిస్తూవున్నా డున్నా డప్పటిమట్టుకు. పగ సాధించుకుందుకు మార్గా

లాలోచిస్తూ, రాత్రల్లా నిద్రపోక తనగదిలో యిటూ అటూ పచారు చేశాడు. గ్లాసుమీద గ్లాసు బ్రాందీ తాగాడు. తారాబాయిమీద అతనికి గల మోహమంతా ద్వేషంగా పరిణమించింది. బాదల్చంద్ మీద కసి తీర్చుకుందుకు సరియైన ఉపాయమేదీతోచక, మెదడు వేడెక్కి పిచ్చెత్తినట్లయిందతనికి. తీవ్రంగా ఆలోచిస్తూ తలనొక్కుకున్నాడు చేతులతో. కళ్లుమంట. నరాలు పీకు. గుండెలో భారం. కొరడాదెబ్బలకు వొళ్లంతా నొప్పి. సారామత్తుకు కడుపులో యేదో వికారం. కోపం, మోహం, తాపం, అవమానం, అన్నీకలిసి అతని హృదయాన్ని నలిపి, పీడించి, దహించి పిప్పిచేశాయి.

ఆమర్నాడే సర్కస్ ప్రారంభ మవుతుందన్న సంగతి జ్ఞాపకం వచ్చింది సింగుకు. యేకుల్లోనూ చాలుగా టలకన్న అధికం వెయ్యడం, ఆకంపెనీవాళ్లకు మామూలు లేదు. "ఈ ఊరునుండి కదిలేలోపునే పీకిపనిపట్టించి తీరాలి." అని మనోనిశ్చయం చేసుకున్నాడు సింగు.

మొదటి రాత్రితో సర్కస్‌వాళ్ల కీర్తి ఊరంతా వ్యాపించింది. వాళ్ల ప్రదర్శనం చూడతగినదని అందరికీ విశదమైంది. ఎవరినోటవిన్నా, తారాబాయి పేరు, బాదల్చంద్ పేరు, వినవచ్చేవి. ఈర్ష్యతోను, ద్వేషంతోను, వొళ్లు మండుకొచ్చింది జమన్సింగుకు. కాని వాళ్లనణిచే సాధనం కానరాలేదు. నిద్రాహారాలుకూడా తిన్నగా లేక, జమన్సింగు కప్పుడూ ఒకటే ఆలోచన—బాదల్చంద్ మీద కసితీర్చుకోవడ మెట్లాగా, అని.

జమన్సింగును తాను గట్టిగా శిక్షించినసంగతి బాదల్చంద్ నవ్వుతూ తారాబాయితో చెప్పినప్పుడు, సంతోషం వెలిబుచ్చడానికి బదులుగా నిట్టూర్పు విడిచిందామె.

"ఛా, మనిషంత మనిషిని అమాంతంగా మీదపడి కొట్టడం తప్పుకాదూ ? ఇట్లా తొందర పడతావని తెలిస్తే, అసలు నీతో యేమీ చెప్పకనే పోదును."

"నిన్నట్లా అవమానపరచినందుకు వాడిని నిలువునా చీల్చెయ్యాలనిపించింది నాకు. ఇంకా పస్తాయించి ఊరుకున్నా నంతటితో ! సంతోషించు—" అన్నాడు బాదల్చంద్.

"సింగు చాలా కార్పణ్యం గల మనిషి. నీ చేత దెబ్బలుతిని, ఊరుకుంటాడనుకోకు. పాముపగ, వాడిది!" అన్నదామె.

"పీకేసాడు." అంటూ బాదల్చంద్ విరసంగా నవ్వి, "తారా, నువ్వు వట్టిపిరికిపిల్లవు సుమా !" అంటూ ప్రేమతో ఆమె నెత్తుకొని, వక్షాని కదుముకొంటూ, ముద్దులతో నోరు మూశాడు.

"బలం ఉన్నదని మోటసరసంకూడదు !...నొప్పి కాదూ, అట్లా నొక్కితే ?"

*　　　*　　　*　　　*

రెండోనాటి ప్రదర్శనానికి సర్కస్‌డేరా తొమ్మిదిగంటలసరికే నిండిపోయింది. టిక్కెట్లు దొరకక, కొందరు ఆశాభంగులై యిళ్లకు మరలవలసి వచ్చింది.

తీగమీద తారాబాయి తన చాకచక్యాలన్నీ చూపి, ప్రేక్షకులను మెప్పించి, రెండు బంగారుపతకాలు సంపాదించింది. చప్పట్లతో డేరా ఊగిపోయింది. సభాసదులసన్మానంపొంది, ఆమె లోనికి వెళ్లి పోయినపిమ్మట, మానేజరు సూర్యాభాన్ ఆమెను సమీపించి, షేక్‌హాండ్ చేసి, తనసంతోషం వెల్లడిచేస్తూ, హెచ్చుగా పొగడి పొంగజేశాడు.

పిదప, ఆమెను తోడుకొని తన గుడారంలోకి తీసుకొనిపోయి, ఫలాహారాలు పేపి, ఒకగ్లాసు షాంపెన్ త్రాగించాడు; ఆనందంతో కులుకుతూ తారాబాయి తన క్రేగంటిచూపులతోను, ముసిముసి నవ్వులతోను కృతజ్ఞతను సూచించింది, అతని దయకు. ఆమె మోహనరూపానికి పరవశుడై అట్టే ఆమెముఖంవేపు చూస్తూ, మీద చెయ్యివేసికూచున్నాడు సూర్యాభాన్.

"తారా, ఈవాళ నీప్రదర్శనం, నీచక్కదనం అద్భుతంగా ఉన్నాయి !"

ఇద్దరూ లేబ్రాయమువారు. రూపవంతులు. ప్రియులు. సర్కస్‌గొడవ మరచిపోయి ప్రియాలాపాలలో పడ్డారు. నవ్వులు, ముద్దులు, కౌగిలింతలు, నిట్టూర్పులు— ఒకరి కౌగిట్లో ఒకరి వొళ్లు మరచి కళ్లుమూసుకున్నారు.

బాదల్సింగ్ ఆడేరాకు సమీపంగా యెక్కడికో వెళుతూ, అప్రయత్నంగా లోనికి తొంగి చూశాడు. మానేజరు కంఠాన్ని కౌగలించుకొని, ప్రేమతో అతనికి ముద్దులిస్తూవుంది తార!

కోపంతోను, 'జెలసీ'తోను హృదయం మండి పోయింది, బాదల్సింగుకు. తన నెంతో ప్రేమిస్తూ ఉన్నట్లు చెప్పిన తార యీవిధంగా ద్రోహం చేస్తుందని అత డెన్నడూ అనుకోలేదు—కలలోనైనా. అతనికేమీ అర్థం కాలే దామె ప్రవర్తన.

"వా డావిధంగా మీద చెయ్యి వేస్తే యెట్లా సహించుకుంటూవుంది తార? ఒళ్లు కాలిన ట్లనిపిం చదూ? లేక......"

అధికం ఊహించుకుందుకు కూడా యిష్టపడ లేదు, అతని మనస్సు!

జమన్సింగును కొట్టినట్లేకాదు! సూర్యాభాను నెట్లా యెదిరించడం? కొండతో ఢీకొని పోట్లాడితే గొర్రెపోతుకే ముప్పు,—తల పగిలి చస్తుంది. ఏంచెయ్యా డానికీ పాలుపోలేదు, బాదల్సింగ్‌కు. దుర్భరమైన యీర్ష్యతో బాధపడ్డాడు. తారాబాయి వనకు, సూర్యాభాను వనవలసిన పనియేముంది? కాని ఆమెమీద బాదల్సింగుకు గల అధికార మేమిటి? అన్నిటికీ స్వతం త్రురాలామె. కాని,............

తల గిర్రున తిరుగుతూ వుంది—నిద్రలో నడిచే వాడివలె తూలిపోతూ అక్కడినుండి వెళ్లిపోయాడు బాదల్సింగ్.

వాడు సర్కస్‌లో తాను చేయవలసినపనులలో యేమీ ఉత్సాహంలేకుండె నతనికి. ఏదో విధిలేక, మొక్కుతీర్చుకున్నట్లు నెరవేర్చాడు, కొన్ని ఫీట్లను. అడవిజంతువులచేత వినోదాలు చేయించినప్పుడు, అతని కత్యంత ప్రియమైన 'రాజా' అన్న పులి అల్లరిప్రారం భించింది. చెప్పినమాట వినకుండా బధకించి మూలిగేది. యజమానిని సమీపించడానికి ఉత్సాహం చలిబుచ్చ డానికి ఇనుల, సుర్రుపెట్టి దూరదూరంగా జరిగేది.

వెర్రికోపం వచ్చింది బాదల్సింగుకు. లోకమంతా అతన్ని హఠాత్తుగా ద్వేషించి, హింసించి, పరాభవించ డాని కుద్యమించినట్లు తోచిందతనికి! మనసిచ్చి ప్రేమిం చిన తారాబాయి తుదకు మోసంచేసి, అతనిప్రేమను అవమానపరచింది. ఇప్పు డీపులికూడా అతని స్నేహాన్ని అగౌరవిస్తూవుంది. ఇన్నివేలమంది చూస్తూవుండగా, అతనిఖ్యాతికి భంగం లేస్తూ, అసందర్భంగా ప్రవర్తిస్తూ వుంది 'రాజా'. అవమానం సహించుకోలేకపోయా డతడు. తాగినవాడివలె వొళ్లుమరచిపోయి, కొరడా తీసుకొని, పులిని కొట్టడం ప్రారంభించాడు. ప్రేక్షకు లకు భీతి పుట్టింది. గాండ్రు గాండ్రు మని పులి అరుస్తూఉన్నప్పుడల్లా భూమి వణుకుతున్న ట్లనిపించేది. కొరడాచప్పుడుతో డేరా మారుమ్రోగింది. ఎన్ని దెబ్బలు తిన్నా, పులి తన మూర్ఖతను వదలలేదు. కోరలుచూపి, కస్సుమని యెదురు తిరిగింది.

'రాజా' సామాన్యమైన పులికాదు. తెలివితేటలు, చురుకుదనం, హృదయం, గల అపూర్వమైన జంతువు. బాదల్సింగు నెంతో ప్రేమిస్తూ, మిక్కిలి అడకువతోను, మర్యాదతోను మెసలేది, అతనివద్ద. వాడు మామూలుకు వ్యతిరేకంగా ప్రవర్తించడానికి, తగినహేతువేదో ఉండ వచ్చునని గ్రహించలేకపోయాడు, బాదల్సింగ్. సాధార ణంగా సర్కస్‌వాళ్లు పులులకు, సింహాలకు అప్పు డప్పుడు నల్లమందు తినిపిస్తూ ఉంటారు. మత్తుచేత వాటి ఘాతుకస్వభావం కొంతసేపైనా అణగిఉంటుం దని అభిప్రాయం కాబోలు! 'రాజా' శరీరతత్వం యెట్టిదోకాని, నల్లమందువాసనే పడేదికాదు దానికి. బలవంతం మీద యెప్పుడైన తినవలసివస్తే, ఆ రోజల్లా పిచ్చెత్తినట్లు ప్రవర్తించేది. జమన్సింగుకు దానిప్రకృతి తెలుసు. కాబట్టె నల్లమందుమాత్రం యెన్నడూ దానికి పెట్టనిచ్చేవాడు కాడు. కాని, ఆరోజున ఉద్దేశపూర్వ కంగా మాంసంలో నల్లమందు తనే స్వయంగా కలిపి 'రాజా'కు పెట్టించాడు. కడుపులో వికారం పుట్టి, వమనం చేసుకుందుకు యత్నించింది పులి. జమన్సింగ్ నీళ్లలో యేదో మందుకలిపి మళ్లీ తాగించాడుపులిచేత.

'రాజా'కు ఒంట్లో సరీగా లేదన్న సంగతి మానేజరుకు కూడా చెప్పలే దాయన.

రంగస్థలంలోకి వచ్చి మనుషులను, దీపాలను చూసేసరికి, 'రాజా'కు గిర్రున తలతిరుగుతూ ఉండేను. మత్తుగా, బద్ధకంగా, ఉండేను, ఒంట్లో. 'ఈవాళ నాకు సరీగాలేదు. నన్ను బాధపెట్టకు.' అని దీనంగా చేసుకొని సంజ్ఞతో తెలియజేసింది, యజమానికి. కాని బాదల్చంద్ దాని ప్రార్థన నర్థం చేసుకునే స్థితిలో లేకుండేను.

ఎన్నడూ శిక్ష యెరగని జంతువుకు వీపుమీద దెబ్బలు పడగానే, కష్టం తోచింది. పౌరుషం కలిగి 'రాజా' యెదురు తిరిగింది. అమాంతంగా మనిషిని చీల్చేస్తుందా అన్నంత ఆగ్రహం చూపింది, కళ్ళలోను కోరలలోను. ప్రేక్షకులు భయపడి గొల్లుమన్నారు. మానేజరు ముందుకువచ్చి, భరవాలేదని వాళ్ళకు ధైర్యం చెప్పి అల్లరి, కేకలు కూడదని మందలించాడు.

బాదల్చంద్‌ను, పులిని, భయదృష్టులతో చూస్తూ దగ్గిరగానే నిల్చుంది తారాబాయి. అతని కపాయం రాకుండా కాపాడమని దేవుణ్ణి వెయ్యివిధాల మొక్కు కుంది మనసులో. ఏదైనా ప్రమాదం సంభవిస్తే, వెంటనే పులిని చంపడానికి ప్రక్కనే ఇద్దరు భటులు నిల్చున్నారు, తుపాకులు పట్టుకొని.

రౌద్రాకారంతో పంజా తెరచి, వ్యాఘ్రం తన్నెదిరించడానికి వచ్చినప్పుడు బాదల్చంద్‌కు గుండె లో దడ పుట్టింది. అప్రయత్నంగా చేతిలోవున్న కొరడా క్రిందికి జారిపోయింది. "రాజా!" అని బిగ్గరగా అరచి, నిస్సహాయుడై నిల్చున్నాడు—చావుకు సిద్ధపడి.

అతని కేకతో మెలకువ వచ్చింది పులికి. రౌద్రం అణిగి పశ్చాత్తాపంతో నిల్చుంది, అతని పాదాలు చూ చూస్తూ! ధైర్యంగా మెడమీద తట్టి వీపునిమిరి 'రాజా'ను బుజ్జగించాడప్పుడు బాదల్చంద్. అతని కర స్పర్శవలన మంత్రింపబడినట్లు పిల్లివలె లొంగిపోయింది, పులి. అద్భుతమైన ఫీట్లు చేయించాడప్పుడు దానిచేత. ఊపిరి బిగపట్టుకొని చూస్తూ, ప్రాణాలులేని ప్రతిమల వలె కూచున్నారు ప్రేక్షకులు. కిక్కురు మన్న ధ్వని కూడాలేక, డేరాఅంతా నిశ్శబ్దం!

పన్నెండు గంటలు కావచ్చింది. ఇంకో ఐదు నిమిషాలలో ఆట ముగుస్తుంది. 'రాజా' చేత ఆఖరు ఫీటు చేయించడాని కుద్యమించాడు బాదల్చంద్. కాని పులి తన అయిష్టతను సూచించింది.

అలసి, రుమాలుతో ముఖం తుడుచుకున్నాడు బాదల్ చంద్. ఆక్షణంలో యెదురుగానిల్చున్న తారా బాయిని చూశాడు. ఆమెదృష్టి అంతా తనమీదనే ఉన్నట్లు విశదమైందతనికి. ఆ భ్రమర నేత్రాలనుండి వెలు వడిన ప్రేమకిరణాలతనిహృదయాన్ని మూసుకొపోయి, మనసును కలవరపెట్టినవి. దీర్ఘమైన నిట్టూర్పువిడచి, ఆమెనుండి దృష్టి మరల్చుకున్నాడు.

పులిని కొంతసేపు బుజ్జగించి, నోరు తెరవమని ప్రోత్సహించాడు. దవడలు బిగపట్టి మూర్ఖంగా నిల్చుంది 'రాజా'. తలపైకెత్తి జిగజిగలాడే పచ్చని మెరుపుకళ్ళతో అట్టే చూసిందతనివేపు, దీనంగా!... "వొద్దు. నన్ను బలవంతపెట్టకు. నాతల తిరుగుతూవుంది. తెలివితప్పి, యేమక్రమంచేస్తానో అని దిగులుగావుంది. నన్ను క్షమించి, నేటికి విడిచిపెట్టు." అన్నభావం వెలి బుచ్చింది, ఆచూపులో! బాదల్ చంద్ మన్నించలేదు దానిప్రార్థనను. దవడమీద చరిచి, నోరు తెరవమని ఆజ్ఞాపించాడు.

విద్యుద్దీపాల కాంతిలో తళతళ మెరిశాయి కో రలు మృత్యుద్వారంవలె తెరువబడిన పులినోట్లో చప్పున తలదూర్చాడు బాదల్చంద్. పెట్టెకప్పు మూతపడినట్లు దవడలు మూసుకొపోయాయి 'రాజా' కి. వెచ్చని రక్తంతో నోరు తడిసింది దానికి. అదిరిపడి కళ్ళువిప్పి, నోరు తెరచింది. కంఠం కత్తిరించుకొపోయింది, బాద ల్చంద్‌కు. స్మృతిలేక క్రిందపడ్డాడు. జరిగిన ప్రమాద మప్పుడు విశదమైంది పులికి. దుఃఖంతో అతని ముఖం చూస్తూ, కన్నీరు విడచింది, రాజా! రెండుసారులు తుపాకిమ్రోత మారుమ్రోగింది, డేరాలో. ఒక్కసారి

మూలిగి, గుండెనుండి వరదలుగా రక్తం కార్చుకుంటూ, వెంటనే నేల కొరిగింది పులి. గొల్లుమన్నారందరూ!

బాదల్ చందును రంగస్థలంనుండి లోనికి తీసుకొ పోయినారు. పెద్దపెద్ద డాక్టర్లు వచ్చి తమ శక్తి సామర్థ్యాలన్నీ వినియోగించారు కాని, లాభం లేక పోయింది.

నెత్తీ నోరూ కొట్టుకొని, అతని మృతకళేబరం మీదపడి యేడ్చింది తారాబాయి. సర్కస్ మెంబర్లందరూ కంట తడిపెట్టుకున్నారు. మానేజరు మూర్తా ఖాన్ తారాబాయిని మెల్లగా లేవనెత్తి, పడిపోకుండా ఆమెను తన వక్షంమీదికి వాల్చుకొని, శిరం నిమురుతూ, జేబురుమాలుతో కన్నీళ్లొత్తి ఓదార్చాడు.

---

# గ్రీష్మము

పెమ్మరాజు లక్ష్మీపతిగారు

పవడంపు జివురుజొంపంబులు పరచిన పెండ్లిపందిళ్లు విప్పించినావు,
గానంపుకోకిలసానిమేళము జిగురాకుబత్తెము లిచ్చి యనిపినావు,
అలరుదేనియవిందు లారగింపగజేసి యలిబంధువుల సాగనంపినావు,
పువ్వుపళ్లెరముల బుప్పొడిపసుపుల పేరంటములు పంచిపెట్టినావు,
అన్నిమరియాదలును నయమారనడపి-నావు, సత్సంప్రదాయంపు నడకలెరిగి;
నాకబలియైన యామరునాడువోలె-చిన్నవోయియు నీయిల్లు చెన్నుమీరె.

నిన్నమొన్ననె గద పెండ్లి వన్నెచిన్నె-లెల్లవెలయించితివి భువి నెల్లయెడల
కాని, ప్రకృతిరో! యిమ్మహోగ్రాతపమున-తీక్ష్ణతమమైన యీతపోదీక్ష యేల?

వసుధ బీరెండ బీటలు వారిపోయె-జలము లావిరియై యాకసమున దేలె,
అనిల మొక్కట స్తంభించి యట్టె నిలిచె-అనల మేపారి తన సరిహద్దు దాటె.

నీడలకునైన నిలువగ నీడలేక-యవనియంతయు దేజోమయత్వమంద
తనప్రతాపంబు కేంద్రీకృతంబుజేసి - వెలుగుచున్నాడు రవి వినువీథినొకడ.

పూచిన పూలు లోని వలపుల్ వెలిసేయ వినూత్నయౌవన
శ్రీ చిగురొత్తగా ప్రణయచిహ్నితమైన వపుస్థితాన మ

ద్యా! చెలువేదె, నీఖరకరోష్ణమయూఖము లంటి, యుష్మహో
గ్రాచరణంబు పాడియగునా తలపోయగ నీకు గోమలీ!
దిరిసెనపూలతోడ తలదిండులొనర్చి, చిగుళ్లు పైపయిన్
బరచిన పండువెన్నెలల పానుపులన్ మృదునిద్ర జెంది, బం
గరుకలలం గరంగు వనకారుహాయల్ చిలికించు ప్రాయ, మి
త్తరి పటురోహిణీసమయదారుణ వహ్ని తపింపజేతురే.

ప్రణయమయమైన ప్రీడాభరంబుకతన-వంగి, నీచూపుతెర లరవ్రాలె నాడు,
నేడు, దృఢయోగదీక్షానిశ్చలత్వ-మున నిమీలితములు ముగ్ధమోహనములు.

గరళము ద్రావినట్టి కలకంఠుని జిచ్చుఱ కన్నుదాల్చు దే
వర పతిగా జపించు హిమపర్వతరాజకుమారివోలె, సు
స్థిరతరదీక్షమై తపము జేసెదు నీమహనీయ దివ్యరూ
పరమమె, నాకు నిత్తరి యుపాస్య తలంప భయానకప్రియా!

అలినై క్రోలితి కమ్మతేనెలు, పికంబై పాడితిన్ బూల తీ
గలునై యూగితి నవ్వసంతసమయైక్య స్ఫూర్తి వర్తిల్లి, కో
మలశిల్పంబులు గూర్చి యీచటులగ్రీష్మాఖండతేజోవిని
శ్చలతన్ గ్రాలెడు నీభయంకరమనోజ్ఞత్వంబు గీర్తించెదన్.

సరసమధుమాసరసనసరస్వతివి నాడు-కడగి నినుబాడిన కుమారకవిని నేను,
ప్రకటతేజోకరాళకాళికవు నేడు-తీక్ష్ణతమరక్తి గొల్చు తాంత్రికుడ నేను.

---

# కిష్కింధలో కోతి

చింతా దీక్షితులుగారు

౧

ఆ కొండను మీరు చూచి ఉండరు. నాటికీ నేటికీ ఎవ్వరూ కూడా ఆకొండను చూచి ఉండరు. చూడరు. చూడడానికి ఎవ్వరికీ మనస్కరించదు. అంత పాపభూయిష్ఠమైన కొండ అది. న్యాయానికి ఆకొండది తప్పు కాదు. దాని నాశ్రయించుకొని బ్రతికిన నా వల్ల ఆకొండకు కళంకం వచ్చింది.

పవిత్రమైన ఏటిగట్టుననే ఉన్నది ఆకొండ; లోకాల కళంకాన్నంతా కడిగివేసే శక్తిగల ఆయేరు ఈకొండ కళంకాన్ని కడగలేదు. నా వల్లనే ఆకళంకం ఆకొండకు పట్టుకొంది కాబట్టి.

పవిత్రమైన ఏరు. అద్దరినీ ఇద్దరినీ దట్టముగా పెరిగిన ఫలవృక్షములు. నీటిఅంచుల నాశ్రయించి పెరిగిన రెల్లుదుబ్బులూ. రెల్లుదుబ్బుల నాశ్రయించిన చిన్నపక్షులు, అనంతప్రాణి కోటి. ఆయేటి ఒకగట్టున నాకొండ. కొండకు అన్నివైపులా ఫలవృక్షములు. ఎవరు పెంచారో మాకోసమని ఆఫలవృక్షములు; ఎవరు మాకోసమని పాలవంటి ఏటినీళ్లు ఆ ప్రాంతముననే ప్రవహింపజేస్తున్నారో; మాకు ఇరుగు పొరుగుగా ఉండేటందుకు ఎవరు ఆపాటలుపాడే పక్షులను, ఆచిందులుత్రొక్కే మృగములను, ఆగంతులువేసే కీటకాదులను ఆప్రాణికోటి నంతనూ సమకూర్చారో; ఎవరి దయాదాక్షిణ్యములు ప్రాపుగా మేము ఆ అడవిలో కులాసాగా కాపురం చేస్తున్నామో-మాకు తెలియదు. తెలుసుకుందామని ఊహ, ఇచ్ఛ మాకు కలగలేదు. నేనూ, నాకుటుంబమూ ఆకొండమీద కాపురము, ఆ అడవిలో సంచారము, ఆయేటిమీద విహారము. సౌఖ్యమునకు ఇదేమేరకదా అనుకొన్నాము. మా కొండమీద పెద్దపెద్ద పాషాణములు పేర్చిపెట్టినట్లున్నవి. ఆపాషాణములే ద్వారముగా ఉన్నవి. గదులుగా ఏర్పడ్డవి. అంతఃపురములైనవి. ఆపాషాణములే వేదులు, జరుగుడుబండలు; ఆపాషాణములే కోటగోడలు, సొరంగములైనవి. ఆకొండ మాఉనికిపట్టుగా, మాఇల్లుగా, మానగరుగా మేము భావించుకొంటున్నాము.

ఆ కొండప్రక్కలమీద నిలువుగా చెట్లు పెరిగినవి. దట్టముగా పెరిగినవి; ఆకొండ చుట్టూ దట్టముగా పెరిగినచెట్లు; ఆకొండ నుంచి చూపుకందనంతదూరము వరకూ దట్టముగా చెట్లు. ఆచెట్లు మాకు సంచారభూములు; ఆచెట్లు మాకు ఆటపట్టులు; ఆచెట్లు మాకు భోజనములు; ఆచెట్లు మాకు లీలోద్యానములు. సౌఖ్యమునకు ఆకొండా ఆ అడవీ మేర అని మాకుమాత్రం తోచడము లేదూ?

ఆచెట్లకొమ్మలలో రాత్రివేళ మేము నిద్రించే సమయాన చిరుతపులులూ, పెద్దపులులూ, ఏనుగులూ, సివంగులూ, తోడేళ్లూ ఆప్రాంత మున సంచరిస్తూ బొబ్బరిస్తూ ఉంటవి. మాకు అవి తలారులు. ఈ బొబ్బరింతలతో అడవి అంతా ప్రతిధ్వనిస్తూ ఉంటే మాకు హాయిగా నిద్రపట్టుతుంది.

పగటివేళ లేళ్లు మాకొండచుట్టూ చెంగలిస్తూ తిరుగుతవి. పక్షులు, వన్నె వన్నెలపక్షులు, రెక్కలు విప్పి చాచి ఎగురుతూ మాకు నేత్రానందము కలుగజేస్తవి. రకరకముల గొంతుకలతో రకరకముల పాటలతో, రక రకముల పలుకులతో అడవిని మధు రారావ ములలో ముంచివేస్తవి కొన్ని పక్షులు. రాలేక రాలేక చెట్లసందులలోనుంచి సూర్యకిరణ ములు బలవంతముగా సందుచేసుకువచ్చి పచ్చికలమీద శయనిస్తవి. మాకొండప్రక్కల మీద మేకలూ, జింకలూ, ఆవులూ మంద లుగా వచ్చి తియ్యనిపచ్చిక మేస్తవి.

మాయేటి కీవలిగట్టునా ఆవలిగట్టునా పెరిగిన వృక్షములు కొమ్మలూ కొమ్మలూ కలుపు కోవడం వల్ల మేమంతా ఏటి నడిమిభాగము చేరి నీడలతోనూ వెలుగులతోనూ ప్రవహించే సుళ్లుతిరిగే, తల్లక్రిందులయ్యే, చెంగునదాటే ఏటినీళ్లను చూస్తూ ఉంటాము.

ఈ సౌభాగ్యోన్నతికి వశులమై తిండికీ నీటికీ లోటు లేకుండా ఆకొండమీద మేము కాపు రము చేస్తున్నాము. అప్పటి కింకా ఆకొండకు కళంకము రాలేదు.

౨

ఒకనాడు ఒకపెద్ద కేక వినిపించింది. ఆ కేకకు చెట్లకొమ్మ లల్లల్లాడినవి. కొండగుహాలు ప్రతి ధ్వనించినవి. ఆ కేక నందుకొని మా యేరు అన్ని దిక్కులా దానిని వ్యాపింపచేసింది.

ఆ కేక వానరలోకాన్ని ఉద్దేశించినది. వానర లోకానికంతకూ అది చాటింపు. పుట్టినాడట లోకములో పుణ్యపురుషు డొక్కడు. సంహ రించినాడట వానర చక్రవర్తిని వాలిని.

కట్టినాడట పట్టము కపిలోకమునకు సార్వభౌమ ట్టుగా సుగ్రీవునకు.

ఆపుణ్యపురుషుడు అవతారపురుషుడట. ఆ అవతారపురుషుని నామమై పవిత్రమైనదట రామశబ్దము.

ఆచాటింపు, ఆ కేక, ఆపిలుపు మాశ్రవణపుట ములలో ప్రవేశించి హృదయమున హత్తు కొన్నది. ఆ కేక మాకు ఆదేశ మైనది.

పుణ్యపురుషుడు అవతారపురుషుడు జన్మిం చిన కాలాన మీరు సమకాలీనులై ఉండడం తటస్థించిందా? అప్పుడుగాని మాసంతోషం మీకు బోధపడదు.

పుణ్యపురుషుని కనగలిగిన కాలము ఎంత మహత్తర మైనదో తత్కాలముననే ఉండే జను లెంత అదృష్టవంతులో ఆ కాలపువారికి తెలియకపోయినా తరువాతిప్రజలు తెలుసు కొంటారు. ఆకాలమున తాముండకపోతిమి గదా అని వగతురు.

కాలము అనంతమైనది. అందులో కొన్ని భాగాలు ఉత్కృష్టములు. ఉదయించే సూర్యునిశోభ ప్రభాతానికి పట్టినట్లు ఉదయించే మహాపురుషునిశోభ ఆకాలానికి పట్టుతుంది.

ఒకదివ్యకాంతి ఆకాలాన్ని ఆవరిస్తుంది.

ఒకదివ్యసౌరభము ఆకాలములో ఇమిడి ఉంటుంది. ఆకాలానికే ఒక దివ్యమైనమాధుర్యం ఉంటుంది. ఆకాలములోనే పక్షులు మరీ శ్రావ్యముగా పాడుతవి. ఆకాలములోనే మేఘములు నెలకు మూడువానలు కురుస్తవి. పంచభూతములూ ఆకాలభాగాన్ని అంటి ఉన్న కల్మషాన్ని కడిగివెయ్యడానికి పూనుకొంటవి.

మహాపురుషోదయాన్ని చూడగలిగిన ఆనాటి ప్రజలు ఎంత అదృష్టవంతులై ఉంటారు!

ఆకాలపుప్రజ లందరూ అదృష్టవంతులా? ఆకాలపువారి కందరికీ సంతోషముంటుందా? కారు; ఉండదు.

కోరికలు పెంచుకొని పెంచుకొని ఆకోరికలు సఫలపరుచుకోవడమే సంతోషమని ఊహించే వారికి మహాపురుషోదయముతో ఏమిపని?

అధికారమును ఆశ్రయముగా చేసుకొని లోకమున కుపకారం చేస్తున్నామని చెప్పి అపకారం చేసే వారికి మహాపురుషోదయము అసంభవము.

తమతమ శాసనములకు ప్రజలను లొంగదీసుకొని వాటినే మతముగా భావించుకోమని బోధించే వారికి మహాపురుషోదయమేటికి? మహాపురుషోదయమునాటి ప్రజలు అవతారకారణమైన మహాపురుషుని కార్యములు సాధించుకోడానికి సాధనములై ఉంటారు. అందువల్లనే వారికి సౌఖ్యముండదు. లోకులు సాధారణముగా దేనిని సౌఖ్యమని భావిస్తారో అది ఉండదు. వారి జీవితమంతా కష్టభూయిష్ఠమై ఉంటుంది. మహాపురుషునితోబాటు జన్మించినందుకు వారికి ఫలము ఈసడింపులు, బాధలు, మరణము.

కాని వారి మనస్సుమాత్రము నిండుశాంతితో నిండి ఉంటుంది.

బాధలు తలుచుకొని మహాపురుషుని ఆదేశములు లెక్కచెయ్యరు కొందరు.

మహాపురుషుని ఆదేశనిర్వాహణము స్వర్గతుల్యముగా భావించి సమస్తమూ అందుకొరకై ధారపోస్తారు కొందరు.

## 3

ఆనాటి కపిలోకమునకు ఆజ్ఞవచ్చినది. రాముని ఆజ్ఞ సుగ్రీవునిద్వారా వచ్చినది.

ప్రతియొక్కకపినీ ఉద్దేశించిచేయబడ్డ ఆజ్ఞఅది. రాక్షససంహారమునకు పూనుకొమ్మని ఆజ్ఞ. సుగ్రీవుని కేతనముక్రిందచేరి రామకార్యమును కపులందరూ నిర్వహించమని ఆజ్ఞ.

అట్టి ఆజ్ఞలో ధనము లేదు. సౌఖ్యము లేదు. అట్టి ఆజ్ఞలో నిరంతరత్యాగ మున్నది, స్వర్గ మున్నది.

ఆ ఆజ్ఞ కిష్కింధ అంతటా వ్యాపించినది. కిష్కింధావాసులందరూ దానిని పాటించారు. సుగ్రీవునాజ్ఞ తలదాల్చి స్వధర్మ నిర్వహణా ర్థము బయలుదేరారు. స్త్రీపురుషవిచక్షణ లేదు. వృద్ధులు బాలురూ అనేవిచక్షణలేదు. అందరూ ఒక్క హృదయముతో ఒక్క పట్టు దలతో, భక్తితో ఆవేశముతో సుగ్రీవుని కొండ చేరారు. త్యాగమనే బుద్ధిలేదు. కీర్తి వచ్చుననే ఆశ లేదు. శాశ్వతత్వము వారికి కలుగుననే ఆశలేదు. స్వామికార్యముమీద నే బుద్ధి. మహాపురుషుని ఆదేశమును విధేయ పూర్వకముగా అంగీకరింపవలెననియే సంక ల్పము. వారందరూ ధన్యులని వేరే చెప్ప వలెనా ?

ఆ ఆజ్ఞ మాకొండనూ చేరినది. మా చెవు లలోకూడ పడ్డది. ఆ ఆజ్ఞవిని మాకొండ, అచ్చటివనము, ఆమేరు, పులకితములైనవి. ఆ ఆజ్ఞను విన్నసంతోషము మాకు కలిగింది.

ఆ ఆజ్ఞను అందరూ పరిపాలిస్తున్నారనే వార్త మాకు సంతోషము కలిగించింది. మా జాతి వారందరూ స్వామికార్యధురంధరు లనిన్నీ, మాజాతివా రందరూ త్యాగశీలురు, పరాక్రమ శాలులూ అనిన్నీ మాకు గర్వము కలిగింది. మాహృదయములుకూడా ఉప్పొంగినవి.

సుగ్రీవుని కేతనము క్రిందకు మేము కూడా సాయుధులమై చేరవలెనుగదా! సోత్సాహుల మై శ్రీరామకార్యము మేము మాత్రము పూనుకొనవద్దా? మమ్ముకూడా ఉద్దేశించి నదేగదా ఆ ఆజ్ఞ. స్వామిఆజ్ఞ కెదురుపోవచ్చు నా? దైవకార్యము కాదనవచ్చునా? ఎవరి కొరకు యీదేహములు పెంచుకొనుచుంట— స్వామికొరకేగదా!

ఎవరివల్ల యీసౌఖ్యములు మాకు కలుగు తున్నవి — స్వామివల్ల నేకదా!

జన్మకు సాఫల్య మేమిటి? — బ్రదికినందు వల్ల ఫలమేమిటి? — అవతార పురుషుడు వచ్చి తనకార్యము నిర్వహించమని ఆదేశించి నప్పుడా వెనుకంజ వెయ్యడం? మేముమాత్ర ము కపులము గామా? కిష్కింధనేలే సుగ్రీవుడు మారాజు గాడా? సుగ్రీవుని దేవుడు మాదేవుడు గాడా?

మేము కర్తవ్యమును నిర్ణయించుకోవలసినపని యేమున్నది? మేము ఆలోచించవలసిన పని యేమున్నది? మేము సందేహించవలసిన పనియేమున్నది? కాని—

౪

కాని మేము కర్తవ్యమును నిర్ణయించుకోవలసి వచ్చింది. మేము సందేహించాము? మేము ఆలోచించవలసి వచ్చింది! ఆలోచించడం మొదలుపెట్టాము. సంశయాత్మా వినశ్యతి అంటారు. మేము సంశయించాము. సంశయా లు తీర్చుకొని ఆలోచనలు సాగించి ముగించి తరువాత స్వామికార్యానికి పూనుకోవలెనని సంకల్పము చేసుకొన్నవా రాకార్యములలో ఎప్పుడైనా దిగడం సంభవిస్తుందా?

ఇక్కడ మాకొండ—సర్వసౌఖ్యాలకూ ఆలవాలమైనకొండ—ఇహసౌఖ్యాలకి మేరచూపించే కొండ!

అక్కడ లంకాపురి—భీషణవక్త్రగహ్వరము తెరుచుకొని నృత్యము చేస్తూన్న మృత్యుదేవత కాటపట్టయిన లంకాపురి—భయము, బాధ, బీభత్సముల కాకరమైన లంకాపురి!

ఇది మేలా? అది మేలా?

ఇక్కడి ఈయేరు — ఈవనము — ఈ మృగముల సందడి ఇక్కడి ఈవిహారములు ఇక్కడి ఈసంచారములు ఈ సుఖములు — వీటికి బదులుగా అక్కడి సముద్రోత్తరణము, సేతునిర్మాణము, దూరప్రయాణము—ఆ రాక్షసుల కోలాహలము — అక్కడి గర్భనిర్భేదకమగు రణభేరీశబ్దములు — అక్కడి రణరంగవిహారములు, శత్రుదేశసంచారములు — అక్కడి ఆకష్టములు! ఇక్కడ ఉంట మేలా? అక్కడికి పోవుట మేలా?

ఇహసౌఖ్యములకూ పరసౌఖ్యములకూ సంఘర్షణ కలిగింది. ఇంద్రియసౌఖ్యములకూ పరసౌఖ్యములకూ ప్రబలయుద్ధము లేటస్థించింది.

ప్రత్యక్షసౌఖ్యములను చూపి ఇంద్రియములు పరసౌఖ్యముల సీసడించుచున్నవి.

రానున్న శాశ్వతత్వముకై ఆశ, అందులో నిరవధికానందమును తెలిపి పరసౌఖ్యములు ఇంద్రియములపై దాడి వెడలుచున్నవి.

ఇంద్రియసుఖములలో మృత్యువు నిత్యమూ సంచారం చేస్తూ ఉంటుంది.

పరసౌఖ్యములోనిత్యత్వము నిర్మలత్వము!

చేతులో సుఖములను వదిలిపెట్టి ఎప్పుడో రానున్న సుఖముల కపేక్షించడం వివేకమేనా? మా దేహములే మాస్వామి కేతనము కిందికిపోయి సహాయము చేయవలెనా? మా మనస్సుల కాశక్తిలేదా? మాఇచ్ఛాశక్తి మా స్వామి ననుసరించి ఉండరాదా? మాసంకల్పబలము మా దేహబలముకన్న ఎక్కువ ప్రయోజనకారి కాకూడదా?

వానర సేనల విజయఘోషములు మాకొండను చేరినవి. మావానర సేనల సేతునిర్మాణములో మాసంకల్పసాహాయ్యము మేము చూచుకొన్నాము.

మావానర సేనల లంకాప్రవేశములో మా మనస్సులూ ఉన్నవి.

మావానర సేనల భీషణయుద్ధములో మా మనస్సులూ పాల్గొన్నవి.

రాక్షససంహారము జరుగుతున్నది. వీరవానర హుంకారనాదములను మాకొండ ప్రతిధ్వనిస్తున్నది. రాక్షసహాహాకారములు మాయేటి చప్పుళ్లలో కలిసిపోతున్నవి.

రాక్షసరాజును రామభూపాలుడు సంహరించిన వార్త పంచభూతములూ, దశదిక్కులూ వ్యాపింపజేసినవి. మా కొండకూ ఆవార్త చేరినది.

మామనస్సులలో సంతోషము మేము తెచ్చి పెట్టుకొన్నదా? నిజమైన దేనా? దానికి సహజత్వము లేదేమి?

లోకములో కొండలు తలలూపి ఆడినవి! మా కొండ తల ఊపి ఆడలేదు.

లోకములో నదులు చెంగుచెంగున గంతులు వేస్తూ ప్రవహించినవి. మాయేరు మందమై, శుష్కమై ఇసుక తిన్నెల నంటిపెట్టుకు పోయింది.

లోకములో వనములు చిగిరించినవి. మొగ్గలు తొడిగినవి. పుష్పించినవి. పరిమళములను నల్గడల ప్రసరించినవి.

మావనము తలవాల్చినది. పుష్పములరాల్చినది. వాయువును బంధించినది.

లోకము ప్రకాశవంతమైనది. మా నివాస మంధకార మయమైనది.

లోకము నవ్వినది!

మావాసస్థానము సిగ్గుచే తలవంచి దుఃఖముచే కుమిలిపోయినది.

స్వామికార్య నిర్వహణము మావానరకులమునకు గర్వకారణమైనది.

మాకు శాశ్వత కళంకము నాపాదించినది.

లంకనుగెలిచి కిష్కింధారాజ్యమును మావారు చేరుకొన్నారట. ఆవార్త మాకు చేరినది. మాకు ఉత్సాహము లేదు.

మాకొండ మాకు భోజనము పెట్టడము మానుకొన్నది.

మాయేటి స్వాదుజలము లిప్పుడు చేదైనవి. మాకు విహారములు లేవు.

పశ్చాత్తాపమువల్ల లాభముంటుందా? స్వామి కార్యమును లక్షించని సేవకులకు గతి ఉన్నదా?

అవతారపురుషుని ఆదేశమునే అంగీకరించని మందుల కెన్నటికైనా మోక్షలాభమున్నదా? ఆకొండకు కళంకం నావల్లవచ్చింది. ఆకొండ వల్ల నాకు కళంకం వచ్చిందని చెప్పి నాపాపమును నేను వృద్ధిచేసుకోను. ఆకొండను మీరు చూచి ఉండరు. చూడరు.

---



కామసోం పురిలసే అతిసుందరీ ఆమకీ ఛాహామే ఖడీ సుహావే
ఘుఖవ అంగ జరావజరే ధరో మోరని చిత్త లగా ఈచు గావే
సారీ జరీకీ బిరాజత అంగమే ఆగీ బిచిత్ర ఉరోజ నిభావే
సో యహూా మేఘమల్లారకీ రాగనీ హూ కుకంభ సుభనామ కహావే.

# గౌరీపూజ

విశ్వనాథ సత్యనారాయణగారు, యం. ఏ.

(వరలక్ష్మీత్రిశతి. కర్మశతకము - ఆరవపది)

ఉన్న దే యువతులం దున్న యందఱు ఫాల బాలనీహారాంశు పలితబింబ
లున్న దే వెలుగులం దున్నవన్నియు నిడానిభృత పింగళమధ్య నిర్గమములు
ఉన్న దే మహిమలం దున్నవన్నియు త్రిలోకనమస్క్రియా సమాకర్షకములు
ఉన్న దే వినతులం దున్నవన్నియు విశ్వనాథ నీరజ చరణార్పితములు
ప్రళయరహిత గౌరీలోకములు, శివాన-పీనపాద విన్యాసలాతూనతాంక
కృతనవాలంకృతులు నీకుఁ గేవలముగ-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అవి చిత్రమైనవాయువులు నిరుద్ధనిశ్వాస నిర్వాత నైశ్చల్యనిధులు
అవి చిత్రమైన క్రొంబువుతావు లాఘ్రాణపర్యంతవేదు లపార్థివములు
అవి చిత్రమైన ధ్వనివిశేషకములు బ్రహ్మకపాల రుద్ధానిలాగతములు
అవి చిత్రమైనట్టి యాకృతు లతిదృష్టు లాజృంభము లతీతతైజసములు
ప్రళయరహిత గౌరీలోకములు, నచంద్ర-మశ్శిశిర చారుచంద్రికామంథరప్ర
శాంతకాంతిమంతంబు లచ్ఛముగ నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అట నాశ లే దున్నయది నిరాశావిషయంబు నిస్త్రైగుణ్య మమృతమయము
అట బాధ లే దున్నయది పాంచభౌతికం బది యేమొ సహజబాధావహంబు
అట నూహ లే దున్నయది యనూహాత్మకం బానందవిషయ మనాదిలయము
అట లేమి లే దున్నయది యందు కలదా నపేక్షచే నెచటొ కల్పించినయది
ప్రళయరహిత గౌరీలోకములు, సనాత-నములు సచ్చిదానందవాటములు భర్తృ
జనమనోఽభిరామా నివాసములు నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అడుగడ్డునకుఁ జివురాకు లూఁచిన గాలివడి వేదశిఖ లూఁదుకడిమిచెట్లు
చెట్టుచెట్టున నీడపట్టులందున ఫాలచంద్రమనలు శివానదృశనతులు
పతిసతివాక్యాన శ్రుతిమహార్థానుగవ్యాఖ్యానములు గౌరివైభవములు
ప్రతివైభవమున నేత్రనిమీలనములు హృత్పద్మవికాసముల్ తన్మయతలు

ప్రళయరహిత గౌరీలోకములు, సమార్ద్రి-మసృణహారిద్ర మృదుకుంకుమప్రలిప్త,
సర్వశృంగాటకమ్ము లచ్చముగ నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

ఉష్ణశీతాంశులయుదయాస్తములతోడ నైన కాలవిభాగ మందు లేదు
ప్రాక్పశ్చిమాదిక వ్యవహారనిర్దిష్టమైన దేశవిభాగ మందు లేదు
సత్కి-మిత్యాది కించిత్కార్య పార్థవాక్యముల మిథ్యాచర్చ లందు లేవు
విషయవిషయ్యాది వేద్యాదిదృగ్దృశ్య ద్రష్ట్రాదికములు భేదములు లేవు
ప్రళయరహిత గౌరీలోకములు, గుణత్రప-హీణములు సత్ప్రధాన నిర్వాణములు, ని
శాతబ్రహ్మలయమ్ము లచ్చముగ నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

మొరసినట్టిది యందు మొరసినట్లే యుండుఁ గూనతుమ్మెద రొదవోని యులివు
కురిసినట్టిది యందు కురిసినట్లే యుండు తరిలేతమంచు తుంపురుల జల్లు
సాగినట్టిది యందు సాగినట్లే యుండు గాజువారిన సన్నజాజి తావి
కాసినట్టిది యందుఁ గాసినట్లే యుండు తెలిచిక్కనైన చందిరుని వెలుఁగు
ప్రళయరహిత గౌరీలోకములు, బెడంగు-లోలయు తలరింపుకల తొలివెలుఁగు సాగి
చాలుకట్టిన మేలిపొలాలు నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అట జన్మజన్మాంతరాజ్ఞానకృత ఘోరలీన పాపములు జల్లించినట్లు
అట నకారణఫలావాప్తి కందిన మహానేకపుణ్యములు పండించినట్లు
అట నైకదైహికోద్భట దుఃఖపరిణామవిధి చేతితోఁ దీసివేసినట్లు
అట సచ్చిదానందమైన బ్రహ్మము నిరావృతమాయచేఁ గన్ను తెరచినట్లు
ప్రళయరహిత గౌరీలోకములు విధూత-జానుపోపాత్త దుఃఖవాసనలు కమల
మృదుపవనవీచి చలనసంపదలు నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అచటిరుద్ధశ్వాస నిచయంబులందుండి అల్పలోకప్రళయములు కలుగు
అచటిముక్తశ్వాస నిచయంబులందుండి అల్పలోకపుసృష్టు లవఘళించు
అచటినేత్రనిమీల నానందములనుండి భువనముల్ మోహౌద్ధ్వములు గమించు
అచటిలీలామోహానాపాంగములనుండి భువనమ్ము లజ్ఞానమున నెసంగు
ప్రళయరహిత గౌరీలోకములు సమస్త-భువనతతి సృష్టిలయ హేతుభూతములు వి
శస్తఘోరాఘదత్తమోక్షములు నీకు-లలితవిహరణ వాసభూములుగ నగుత.

అవికారము వికార మచటి తుమ్మెద్రమోత కేలికయగు తొలిమొద్దుజంకె
అవిభిన్నము విభిన్న మచటిగౌరీమూర్తి కాదిశివాకారమైన జ్యోతి
అద్వైతమును ద్వైత మానిశ్వసంబుల కలధర్మమూలమైనట్టి విద్య
అవియుక్తము వియుక్త మాచోటున కతివిచిత్రమా వైధసస్పష్టి యెల్ల
ప్రళయరహిత గౌరీలోకములు విలీన-వృతబీజవత్తతకృత్స్న సృష్టిగర్భి
తాచ్ఛవిజ్ఞానమయము లందములు నీకు-లలితవిహారణ వాసభూములుగ నగుత.

నిత్యసౌమంగల్య నిభృతమూర్తిని నిన్ను పాలించుఁగాక సౌభాగ్యగౌరు
అతిలోకదివ్యశీలాభినందిత నిన్ను లాలించుఁగాక కళ్యాణగౌరు
అమితనిర్మమురాలవైన నీయాత్మలో నటియించుఁగాక యానందగౌరు
విమలాచ్ఛవిజ్ఞాన వీథిలోపల నిన్ను రూపించుఁగాక చిద్రూపగౌరు
మద్వియోగవ్యథాదూయమానహృదయ - నీరజను భవత్తనయాకుమారరత్న
గాతురమనోఽంబుజాతను నాదరించి-యాది యోదార్చుఁగాక నిన్నాదిగౌరు.

---




## సంగీతము-గొల్లవాడు

మైలవరపు వెంకటశివరామశాస్త్రిగారు

అనగాఅనగా ఓఊరు. ఆవూళ్లోకి ఓనాడు ఒకగొప్ప సంగీతపుపాఠకుడు వచ్చాడు. ఆ వూళ్లోవాళ్లందరు వానిపాట వినగోరి వాళ్లలో వాళ్లు చందాలువేసికొని ఒక రింట సభ యేర్పరచిరి. ఆసభలోకి వారువీరనక వూళ్లోవాళ్లందరు వచ్చారు. పాటకుడు తోడి రాగము ఆలాపనచేసి అమోఘముగ పాడుచు, ఆరోహణావరోహణములకు తగినట్లు తల త్రిప్పుచుండెను. చక్కగా రక్తికట్టియుండుటచే సభాసదు లందరును గానామృతమును వీనులార గ్రోలి పరమానందపరవశులై సంతోషబాష్పములు కార్చుచున్నారు. ఆ సభలోకి వచ్చిన గొల్లవాడొకడు ఆపాటకుని చూచి ఊరికే యేడ్వ మొదలుపెట్టెను. అది చూచి - 'అబ్బీ, ఎందు కేడుస్తావు' అని అడగ్గా - "బాబూ, మొన్నమొన్ననే మా గొఱ్ఱెపిల్ల యొకటి ఇట్టులే బెకబెక లాడుచు, గిజగిజ తన్నుకొనుచు, ఊరికే తలయూడించుచు కొట్టుకొని, కొట్టుకొని చచ్చింది. అది చచ్చింతరువాత మాపెద్దబోయడు వచ్చి సంగతి విని 'అయ్యో! తల యాడించినపుడు మెడమీద వాతవేయక పోతిరా' అన్నాడు. ఇప్పుడైనా యీ బ్రాహ్మడికి మెడమీద వాతవేస్తే రోగము కుదురును. వాతలు వేయుటలో నాకు చాల ప్రజ్ఞ కలదు. గరిటెకాడ కాల్చి నాచేతి కిస్తే నే వేస్తా" నని గొల్లవాడు చెప్పెను. వాడిమాటలు విని అందరు కడుపులు చిరిగేట్టు నవ్వేరు.

కథ కంచాని కెళ్లింది. మనం మంచాని కెడదాము.

---

## విద్యాబుద్ధులు

శ్రీ నరసింహస్వామిగారు

పూర్వం మన దేశంలో ఒక రాజుండేవాడు. ఒకనాడతడు రాజగురువుని పిలిపించి తనకొడుక్కి విద్యాబుద్ధులు చెప్పవలశిందని కోరాడు. అందుమీద గురువన్నాడు, "మహారాజా! నీ కొడుక్కి విద్య చెప్తానుకాని బుద్ధి విషయమై పూచీ పడలే" నన్నాడు. "అదేమ

య్యా! వెర్రివాడికి మల్లె ఉన్నావు. విద్యాబు ద్ధులు చెప్పవయ్యా అంటే విద్య చెప్తానుగాని బుద్ధిచెప్పలేనంటావు. చాలుచాలు; రేపటి నుండి తీసికెళ్లి చెప్పు" అన్నాడు రాజు.

గురువు మారు మాటాళ్లే. ఆలానే అని కుర్రాణ్ణి తీసికెళ్లి కొన్నాళ్లపాటు చదువుచె ప్పాడు. అన్ని శాస్త్రాలలోను విద్యల్లోను గట్టి వాణ్ణి చేశాడు. ఒకనాడు రాజు కుర్రాణ్ణి పరీక్షచేద్దామని గురువుని కొడుకుతోకూడా హాజరు కమ్మన్నాడు.

ఒకపెద్ద సభచేశారు. ఆసభలో రాజు పిడికిలిలో ఒక రత్నంపట్టి అదేమిటో చెప్పమ న్నాడు కొడుకుని. రాకొమారుడు ప్రశ్నవేళ నుబట్టి లగ్నం గ్రహస్థితులు మొదలైనవి కట్టాడు. వేళ్లు లెక్కించాడు. ఆలోచించాడు. చేతిలో ఉన్నది రాతిసంబంధమైనదీ గుండ్ర మైనదీ, మధ్యనుకన్న మున్నదీ, కాబట్టి అది తిరగలిపాప అన్నాడు. దానిపై రాజు నిర్ఘాం తుడై గురువువేపు చూశాడు.

గురువులేచి "రాజా! నేచెప్పినది విద్య. ఆ విద్యవల్ల వస్తురూపం కనిపెట్టాడుకాని బుద్ధి లేకపోవటంచేత చేతిలో తిరగటిపాప ఎల్లాయి ముడుతుందీ అనే జ్ఞానంలేకపోయింది. ఇందు కే విద్యచెప్తానుగాని బుద్ధికి పూచీలేదన్నా" నన్నాడు. రాజు తెలివితెచ్చుకొని బుద్ధిలేని కొడుకు పుట్టాడుకదా అని విచారించేడు.

కథ కంచికీ మనం ఇంటికీ.

---

## తెలివైన దంపతులు

పెనుమర్తి శివరామశర్మగారు

అనగా వినగా ఒక ఊళ్లో మొగుడూ పెళ్లాం ఉండేవారు. ఇద్దరూ పొదుపుగా డబ్బు ఖర్చుపెడదాం అనుకున్నారు. ఇలా అను కున్నతరవాత మొగుడుకంటె పెళ్లాము, పెళ్లాంకంటె మొగుడూ తెలివితేటలు చూపె డుతూ ఉండేవారు. ఇంతట్లో వర్షం కురిసింది, చెరువులన్నీ నిండేయి, అందరూ పొలంలో వరిచేను ఉడిపిస్తూన్నారు. ఈసంగతి మొగు డూ పెళ్లాం కలిసి చూచేరు. "ఏమండీ, మన వరిచేను ఇంకా ఉడిపించరేం" అంది పెళ్లాం. "సరే ఉడిపిస్తా" నని పొలంలోకి వెళ్లేడాయజ మాని. పొలం చక్కగా ఉడిపించేడు.

అటుపైని వర్షాలు కురిసి వరిచేను బాగా ఎదిగింది. ఈసంగతి పాలికాపు లొచ్చి చెప్పే రు. 'సరే' అని పొలం చూడ్డానికి బయలు దేరేడు. గట్టుమీద కూర్చున్నాడు. పొలం బాగా చూచేడు. "ఈచేను చక్కగా పెరి గింది. ఇంకా నాలుగుమాసా లుంటే గరిసి ధాన్యం అవతాయి; ఇప్పుడు కోస్తే సగమేనా కావా" అని నిశ్చయించేడు. కూలాళ్లని పిల

వడానికి పాలికాపుని పంపించే డాయన. కూలాళ్లు వచ్చేరు. కూలా ళ్లందరూ 'ఏం సెల'వన్నారు. "ఒరే, మీ అందరూ వరిచేను కొయ్యాల్య" అన్నాడు యజమాని. "బాబూ, పొలం ఇంకా పండలేదు, కోయించమన్నారేం" అన్నారు కూలాళ్లు. యజమాని ఆమాట విని ఆలోచించడం ప్రారంభించేడు: "ఇప్పుడు కోయిస్తే సగం అవతాయి; మళ్లా ఊడిస్తే సగం అవతాయి. ఊడిచి నాలుగుమాసము లయింది, యింకా నాలుగుమాసాలు పంటరోజు లున్నాయి, మళ్లా ఊడవడం కోయించడం అవుతుంది" అని నిశ్చయించేడు. మనస్సులో "గడ్డి మిగులుతుంది, ధాన్యం ఎప్పట్లా కాకపోతాయా" అనుకున్నాడు. ఈఉపాయం కూలాళ్లకి చెపితే అందరికీ చెపతారని చెప్పడం మానేసేడు. వాళ్లని కసిరి, "పొలం కోస్తే కొయ్యండి. లేకపోతే వెళ్లండి" అన్నాడు యజమాని. కూలాళ్లు మన కేం అనుకొని చేను కోసి కుప్పపెట్టేసేరు. ఈసంగతి పెళ్లాంతో చెప్పడానికి తొందరపడుతూ బయిలెళ్లేడు ఇంటికి.

ఇంటిదగ్గిర పెళ్లాం కుర్రాళ్ల బుర్రలు మాసిపోయేయి, క్షవరం చేయిద్దాం అని వీధిలోకి వచ్చింది. మంగలాడు కనపడ్డాడు. "ఒరే, మంగలీ, మాముగ్గురు కుర్రాళ్లకీ క్షవరం చేస్తావురా?" అంది ఆవిడ. "రెండుడబ్బులిస్తే చేస్తా" నన్నాడు మంగలి. "కుర్రాళ్లురా, డబ్బిస్తాను, నలుగురికి చెయ్యరా" అంది యజమాన్రాలు. "అలా బేరం చేస్తే మేం ఎలా బతకాలి? అయినా మీసెలవుప్రకారం చేస్తా"నన్నాడు. తరవాత మంగలి ముగ్గురుకుర్రాళ్లకీ క్షవరం చేసేడు. "నాలుగోవా ళ్లెవరమ్మా" అన్నాడు. "ఒరేమంగలీ, డబ్బు దండుగపెడతానా? నాకే సేసీ క్షవరం" అంది ఆవిడ. సరే అని మంగలి చేసేడు క్షవరం ఆవిడకి. ఆవిడ తన తెలివితేటలు, ఒకడబ్బుకి నలుగురికి క్షవరం చేయించడం, మొగుడుతో చెప్పడానికి ఉవ్విళ్లూరుతోంది.

ఇంతట్లో పొలంలోంచి వచ్చి ఎక్కడున్నావే అని పిలిచే డాయన. ఏమిటండీ అని ఎదురుగా వచ్చింది ఆవిడ. వచ్చీరావడంలో మనిషినేనా చూడకుండా తన తెలివైన పని పెళ్లాంతో చెప్తున్నాడు. విని విని, "మీ తెలివి కేంగాని, నా తెలివి చూచేరా: ఒక్కడబ్బుకే మీకుర్రాళ్లూ నేనూకూడా క్షవరం చేయించుకున్నాం" అని చెప్పింది. ఇలా అనేటప్పటికి, నా తెలివే గొప్ప దన్నా డాయన, నా తెలివే గొప్ప దంది ఈవిడ. ఇలా పరస్పరం వైరాలొచ్చేయి.

ఈసంగతి యిరుగుపొరుగులవారు వింటున్నారు. ఇంతట్లో వీళ్ల దెబ్బలాట ముదురుతోంది. దెబ్బలాట చూళ్లేక యిరుగుపొరుగులవారు వచ్చి, "యిద్దర తెలివితేటలూ ఒక్కలాగే ఉన్నాయి. ఊరుకోం"డని కూకలేసేరు. అందరికీ నవ్వు ఆగింది కాదు. నవ్వుకున్నారు.

ఆనవ్వు చూచి "మన తెలివికి వీళ్లు నవ్వుతు న్నారు. అంచేత మనం తెలివైన దంపతులం; మనకి సాటెవ"రని వాళ్లూ నవ్వుకున్నారు. కథ కంచి కెళ్లింది. మనం యింటి కొచ్చేం.

---

## పాత పాటలు

### ౩౮

రోలికి రోకలికి వొక్క దండమ్మ
మముగన్న తలిదండ్రు లికి వెయ్యిదండములు.

### ౩౯

చిట్టి జీలకర్ర పొట్టిమిరియాలు
కంతకు కన్నవారు కంతనడిపేరు.

### ౪౦

గోపాల కృష్ణమ్మ యెవరి అల్లూడు
గోవెల గాచేటి గొల్లలల్లూడు
మందసా లేలేటి మామల్లూడు.

### ౪౧

మా నెడు బియ్యం మరి కింద గడిగి
మళ్లొచ్చి నేనిస్తు చెన్న కేశవునికి.

### ౪౨

చూలింత బాలింత సుఖము గోరితే
లేత మామిడిచెట్టు పూత గోరింది.

సేదూరి గంగాధరంగారు

చూలింత బాలింత నీళ్ల కెళ్లేను
చూలింత జెప్పింది సుఖము దుఃఖమ్ము
బాలింత చెప్పింది బాలుడాటాలు
బాలింతగాజులు భద్ర కేళీలు
చూసేవ బావయ్య అప్ప చేతుల్లు
చూలింత గాజుల్లు చుక్కగాజుల్లు
చూసేవ అన్నయ్య వదినెచేతుల్లు.

### ౪౩

కూతురు అమ్మాయి కూడట్టు కెళితె
కుంభవర్షము కురిసి కూళ్లన్ని దడిసె.

కూటి కుప్పకాడ వారయ్య లుండి
కూతురు తడిసిందని చేతిగోడు గంపు.

అరటితోటాలోను తనయన్నలుండి
సోదరి తడిసిందని మేదరగోడుగంపు.

మామిడి తోటలోను తనమామ లుండి
కోడలు తడిసిందని గుబ్బగోడుగంపు.

పనసతోటలోను తన బావ లుండి
మరదలు తడిసిందని మల్లెరథ మంపు.

పుష్పతోటలోను తవపురుషు డుండి
పుణ్యశాలి తడిసిందని పూలరథ మంపు.

౪౪

మామిడికాయలు మరికొమ్మ నుండు
మాతల్లి భ్రమలన్ని మామీద నుండు
చిక్కుడుకాయలు చిరికొమ్మ నుండు
శ్రీరాము భ్రమలన్ని సీతపై నుండు.

౪౫

రాజనాలు మాకు పాలొచ్చినాయి
రాజులంటి యల్లుళ్లు విందొచ్చినారు.

౪౬

సీతమ్మ శ్రీరామ తోవట్టు కెళితె
పారిజాతపు పూలు మరి పరిమళించు
అవిగోనె ఓ సీత పారిజాతాలు
చూచిరా అంటేను కోసుగొచ్చేను.

౪౭

చెట్టుమీది కోతివలె బావ వున్నాడు
చెరువులో చేమంతివలె అక్క వున్నాది.

౪౮

తల్లాడు తల్లాడు యేమి తల్లాడు
తామరాకులమీద నీరు తల్లాడు
తల్లాడు తల్లాడు యేమి తల్లాడు
తల్లిలేని బిడ్డలకు గుండె తల్లాడు.

౪౯

వానవ లేనిపువ్వు పూసేమిఫలము
వద్ద పురుషుడులేని వగలేమిఫలము
కాయగూరలన్ని కాసేమిఫలము
వల్లభుడులేని వంట వండేమి ఫలము.

౫౦

వానలేక పైరు లెల్ల వాడిపోయెను
నీళ్లులేక నిమ్మమొక్క నిలువుకెండెను
వానొచ్చి కురిసింది పైరులమీద
లక్ష్మివచ్చి వొరిగింది రాసులమీద.

---

## అపరిమిత దాహతృష్ణ

సీరిపి ఆంజనేయులుగారు

౧

నామమశ్చంచరీక మేనాఁ డనూన
కాంక్ష సారస్వతారామగతులఁ జెదరి
తిరిగి, కనఁ గావ్యపుష్పమందిరసమాన
మపరిమితదాహతృష్ణావశాత్మ యగుచు

౨

కనుఁగొనుట తోన, రసపాన గరిమఁ జెలఁగ
నరయు నెడఁ దమిఁ గుసుమగర్భాంతరముల,
నేదివాంతంబునఁ ముకుళించు నట్టి
మెట్టి విరసపుష్పముని శమించునొక్కొ!




## ఆనందచక్రము

(Merry Go-round)

కో. నరసింహాచారిగారు

ఈ చక్రమున ౧. అరుగు, ౨. చక్రము, 3. చక్రమున కాధారములు, ౪. ఉయ్యాలలు అను నాలుగుభాగములు కలవు.

### ౧. అరుగు

అరుగు చాలా పెద్దదిగా నుండవలెను. ౧౪" × ౬" వైశాల్యముకల గట్టి అట్టను దీసికొని (A B C D చిత్రము ౧.) దానిపై చుట్టును ఒక అంగుళము వెడల్పున అంచును వదలి గీతలు వేయవలెను. అప్పుడు మధ్యభాగమున (E F G H) ౧౨" × ౪" వైశాల్యము గలిగియుండును. అంచులయొక్క మూలలందు చిత్రమునందలివిధమున కత్తిరించి, అంచులను క్రిందికి వంచి మూలలందు అతికించినయెడల అరుగు ఏర్పడును. (చిత్రము ౮ M.)

### ౨. చక్రము

౬" వ్యాసముకల రెండు వలయములను గట్టి అట్టముక్కలలో కత్తిరించుకొనవలెను (చిత్రము ౬). వాటియందు అంచునకు ½ అంగుళములోపుగా ౬ చిన్న చదరపు రంధ్రములను (Square holes) సమదూరముననను, మధ్య నొకగుండ్రమునున్ను చేసికొనవలెను. ఒక్కొక్కటి ౨½" నిడివికల ౬ వేముతునుకలను తీసికొని వాటికొనలను చిత్రము ౭ నందలి రీతిగ చెక్కి, పై రెండువలయపు అట్టల అంచులందలి రంధ్రములలో దూర్చి రాట్నపు చక్రమువలె బిగించవలెను.

### 3. చక్రమునకు ఆధారములు

ఒక్కొక్కటి ౧౪" × ౭" వైశాల్యముకల రెండు గట్టి అట్టలను తీసికొని (చిత్రము ౨. J K L M) వాటిపై నిడివి అంచుల వెంబడి ౨½" లోపుగ V X W Y అను రేఖలను వేసికొనవలెను. తర్వాత L M అను వెడల్పుటంచునుండి S U రేఖ ౧½" లోపున వేసికొనవలెను. పిమ్మట చిత్రమునందలి విధముగ కత్తిరించుకొని వాటిని చిత్రము 3 నందలి విధముగ మడిచి అతికించుకొని చిత్రము ౧ యందలి అరుగుపై a b అను ప్రదేశములందు నిలువబెట్టి అతికించినయెడల చిత్రము ౮ యందలి ౧౧ వలె నుండును. ఈ రెండు ఆధారముల

యొక్క పై కొనలవద్ద రంధ్రములను (చిత్రము ౨.౯) చేసికొనవలెను. పిమ్మట చక్రమును రెండు ఆధారముల మధ్య పట్టుకొని ౮" లేక ౫" నిడివిగల పేముతునుకను చక్రములకు ఇరుసుగా మార్చి, ఆధారములందలి రంధ్రములందు దూర్చి పెట్టవలెను. అప్పుడు, చక్రము సులభముగ చుట్టగలదు.

౮. ఉయ్యాలలు

చిత్రము ౪ నందు e f g h వలె ౨౪" X ౨" వైశాల్యముగల ౬ అట్టముక్కలను తీసికొని వాటిని చిత్రమునందు చూపబడిన రీతిని కత్తిరించి ప్రక్కలను పైకిమడిచి అతికించినయెడల చిత్రము ౫ నందలి విధముగ ఉయ్యాలలు ఏర్పడును. ఒక్కొక్క ఉయ్యాలను చక్రమునందలి ఒక్కొక్క పేముతునకకు వ్రేలాడగట్టి ఒక్కొక్కదానియందు ఒక్కొక్కచిన్న బొమ్మనుఉంచి చక్రమును త్రిప్పినయెడల ఉయ్యాలలు ఒకదానివెంబడి నొకటిగా క్రిందికిని మీదికిని చుట్టుచుండును. అప్పుడది ఆనందజనకమై ఆనందచక్రమనదగియుండును.



# పైకారా విద్యుచ్ఛక్తి కర్మాగారము

చె. లక్ష్మీపతిగారు, ఎంజినీరు.

(చిత్రము 1)

పైకారానది నీలగిరిలో ఉదకమండలమునకు పడమట ముకుర్తి ప్రాంతములలో పుట్టుచున్నది. ఇది మంచి ఓషధుల నడుమనుండి ప్రవహించును కాన దీని నీటిని ఇచ్చటి జనులు పవిత్రముగా పరిగణించెదరు. దీనికి, పాలునకు, సుమారు 105 అంగుళముల వర్ష పాతము కలదు. సుమారు 38 చదరపు మైళ్లనుంచి నీరు వచ్చి యిందు కలియుచున్నది. దీని పుట్టుక స్థలమునకు 15 మైళ్ల దూరము నున్న గ్లెన్ మోర్గన్ (Glen Morgan) అనుచోట విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేయుటకు గాను నిశ్చయించి కర్మాగారమును నిర్మించిరి.

ఇచ్చటనుంచి పైకారా నది రాళ్లగుండ ప్రవహించుచు కొద్దిమైళ్ల దూరములోనే, సుమారు 4,000 అడుగులు క్రిందికి దిగుచున్నది. మార్గమున, రెండుచోట్ల, మరీ ఒకరకముగా సుమారు 200 అడుగులు చొప్పున దిగును. ఈ 4,000 అడుగులు దిగినపిమ్మట, లోయలలో, దీనిని మోయారునది (Moyar) అని పిలతురు. పిమ్మట ఇది భవానినదిలో కలియుచున్నది.

నాలుగువేల అడుగుల జలపాతమునందును, ప్రస్తుతము, సుమారు 3,000 అడుగులే ఉపయోగింప నిశ్చయించిరి. కాని ఈనదికి వరదకాలముకంటె వేసవియందు నీరు చాలా తక్కువగా ప్రవహించుటచే నీరును నిలువ చేసికొనుటకుగాను 840 లక్షల ఘనపుటడుగుల నీరు పట్టెడి చెరువు (Fore-bay) నొకదానిని కట్టియున్నారు. దీనికి దరిదాపు అన్నిప్రక్కలను పర్వతములే ఒడ్డులు. ఇందులోనికి నీరు ఒకవైపు పైకారానది నుండియు, ఇంకొకవైపు గ్లెన్‌మోర్గన్ (Glenmorgan) నది నుండియు కాలువల గుండ కొనితెచ్చుచున్నారు. పైకారా నదినుంచి చెరువులోనికి నీరు త్రిప్పుటకుగాను, సుమారు ఒకటిన్నర మైలు దూరమున ఒక ఆనకట్ట (చిత్రము 2) కట్టియున్నారు. ఎక్కువనీరు దానిమీదనుంచి ప్రవహించును.

ఈగట్టునకు రెండుప్రక్కలను కాలువలోనికి నీరు పారుటకు తూములున్నవి. అందు ఎడమప్రక్కను త్రిప్పబడిన నీరు ప్రవహించుటకుగాను కాలువయు, ద్వారమును కలవు. ఈద్వారమునకు ముందు మాలములు మొదలైనవి ఆపుటకుగాను కటకటాలు (Log-catchers) గలవు. (చిత్రము 3)

ఇచ్చటనుంచి, త్రిప్పబడిననీరు త్రిప్పుడు కాలువ (చిత్రము 4) గుండా ప్రవహించును.

ఈ కాలువగుండా ప్రవహించినపిమ్మట, ఒక గొట్టముగుండా (చిత్రము 5) చెరువులో కలియుచున్నది. గ్లెన్ మోర్గన్ నదినుండికూడ నీరిదేవిధముగా కాలువగుండా చెరువులోనికి ప్రవహించును.

ఈ చెరువు (Fore - bay) నుంచి 7½ అడుగుల వ్యాసము గల యినుపగొట్ట మొకటి కలదు. చెరువులోనుంచి దీనిగుండా ప్రవహించెడినీటిని క్రమపరచుటకుగాను తలుపులు (Control - tower) (చిత్రము 6) గలవు.

ఈ గొట్టముగుండా నీరు కొద్దిదూరములో నున్నట్టి గోపురమువంటి యినుపగొట్టము (Surge - tower) (చిత్రము 7) లోనికి పోవును. ఈ గోపురము నుంచియే 3,000 అడుగుల దిగుడును ఇంచుమించుగా ప్రారంభమగును. ఇచ్చటినుంచి చూచెడిచో 10,000 అడుగులు పొడవుగల నీటిగొట్టములను (Pen-stocks), క్రింద 'శింగారా' యందు గల విద్యుచ్ఛాల (Power - house) యు కప్పట్టును. ఈగోపురమునుంచి మనుష్యులు, సామగ్రియు క్రిందికి వచ్చుచు పోవుచుండుటకుగాను విద్యుచ్ఛక్తిచే తొట్టెలు (Lifts) నడుపబడుచున్నవి.

ఈ గోపురపు గొట్టమునందు, 7½ అడుగుల గొట్టము రెండు గొట్టములుగా విభజింపబడును. అందు



చిత్రము 3 కటకటాలు



చిత్రము 4 త్రిప్పుడు కాలువ



చిత్రము 5 చెరువులోనికి నీటినిగొంపోవు గొట్టము-(Flume)



చిత్రము 6 నీటినిక్రమపరచు తలుపులు Control - Tower

ఒక గొట్టము ఇకముందు అవసరము వచ్చినపుడు ఉపయోగించుటకై ప్రస్తుతము మూసివేసినారు. రెండవ గొట్టము తిరిగి రెండుగా విభజింపబడెను. (చిత్రము 8) ఈ రెండు గొట్టములే 3,000 అడుగులు క్రిందికి నీటిని గొనిపోవును.

ఒక్కొక్క గొట్టము పొడవు 10,000 అడుగులును, వడిమి కొలత 21—24 అంగుళములును. గొట్టములు క్రిందికి దిగినకొలది ఒత్తిడి (pressure) ఎక్కువగుచుండుటచే, మందముకూడ అధికమగుచుండును. ఈ 10,000 అడుగుల పొడవుగల గొట్టముల ఖరీదు సుమారు 18 లక్షలరూపాయలు. ఈ 10,000 అడుగుల పొడవుగల గొట్టములును చిన్నిగొట్టములును (చిత్రము 9) చేర్చి కట్టబడినవి

ఈగొట్టములకు ఆధారముగా అచ్చటచ్చట దిమ్మెలు (Anchors) కట్టబడినవి. ఈగొట్టములపూర్తి అంతయు ఇంచుమించుగ పూర్తి అయిపోవచ్చినది.

ఈరెండు నీటి గొట్టములును (Pen-stocks)(చిత్రము 10) విద్యుచ్ఛాలకు ముందు తిరిగి మూడుగా విభజింపబడినవి. ఈ మూడు గొట్టములును విద్యుచ్ఛాలయందున్న మూడు నీటి చక్రముల (Pelton-Wheels) యందు ఒక్కొక్కటి ఒకదానికి పోవును. నీటిచక్రముల దగ్గరకి వచ్చెడుసరికి నీరు 3,060 అడుగులు క్రిందికి దిగును. అందుచే ఇచ్చట చదరపు అంగుళమునకు సుమారు 1,500 పౌనులు ఒత్తిడి (Pressure) కలదు. ఇంత అధికమగు ఒత్తిడితో విద్యుచ్ఛక్తిని పుట్టించు ప్రదేశములు తక్కువ. ఇంత ఒత్తిడితో నీటిచక్రములను త్రిప్పిన పిమ్మట, నీరు ఒకకాలువనుండా అరమైలు దూరమున ఉన్న పైకారానదిలో తిరిగి కలుపుచున్నారు.

ఈ నీటిచక్రములకు తగిలించియే విద్యుచ్ఛక్తి యంత్రములు (Alternators) కలవు. వీటియొక్క వడిమి కొలత ఒక్కొక్కటి సుమారు 8 అడుగులు. ఒక్కొక్కటి 11,000 Volts, 7,500 K. W. తయారు చేయ కలవు. కంపెనీల తరఫున వచ్చినవారిచే ఈయంత్రములు స్థాపింపబడుచున్నవి.

ఇచ్చట 11,000 Voltsతో పుట్టించుచున్న విద్యుచ్ఛక్తిని 66,000 Volts వరకు పెంచి, 50 మైళ్ల దూరములో ఉన్న కోయంబత్తూరు తీసుకొనిపోయెదరు. ఇందులకుగాను తీగలు కట్టబడినవి. అచ్చటనుంచి కోయంబత్తూరునందలి మిల్లులకును, పొలాచి, తిరుపూరు, ఈరోడు మొదలగు ప్రదేశములకును పంపెదరు. నీలగిరియందున్నట్టి తేయాకు పరిశ్రమల కన్నిటికి ఇచ్చటనుండియే పంపబడుచున్నది. ఇంతియేకాక, ఈరోడునుండి మద్రాసువరకును, మార్గమందలి ప్రదేశములకును ఇవ్వ నాలోచించుచున్నారు. ప్రస్తుత ముపయోగించుచున్న 3,060 అడుగుల దిగుడులోను, సుమారు 50, 000 K. W. తయారుచేయుటకు తగిన వసతు లున్నవి. అటుపైని మిగతా 1,000 అడుగులు దిగుడు నుంచికూడ విద్యుచ్ఛక్తి తీయ మొదలిడెదరు.

పైకారా స్కీము (Scheme) తయారుచేయుటకై గ్లెన్‌మోర్గన్‌స్కీము (Glenmorgan Scheme) అనుపేరట 680 అడుగుల దిగుడు (Drop) నుపయోగించి 440 Volts, 350 K. W. తయారుచేయగల మూడుయంత్రముల నడపుచున్నారు. ఇచ్చటనుండియే ప్రస్తుతము ఉదకమండలము ప్రాస్పెక్టు (Prospect) మొదలగు తేయాకు పరిశ్రమలకును పంపుచున్నారు. దీనిని పైకారాస్కీము పూర్తి అయినపిమ్మట, బహుశా ఆపివేయుదురు.

ఈ పైకారాస్కీము, మూడువంతులు కొద్దినెలలలో పూర్తియగునని తలంచుచున్నారు. ఈ స్కీము మొత్తపువ్యయము సుమారు 1,25,40,000 రూపాయలు. ఇది తయారైనపిమ్మట తగినవాడకయున్నచో, చాలా ప్రదేశములకు విద్యుచ్ఛక్తి చవుకగా ఇచ్చుటకు వీలగును. దక్షిణహిందూస్థానమున ఇటుల చవుకగా విద్యుచ్ఛక్తి తయారుచేయుటకు వసతులున్న ప్రదేశములు ఇంకను చాలా కలవు.

1. పెరయూరుస్కీము—ఇచ్చట త్వరలో విద్యుచ్ఛక్తి తయారు చేయుచున్నారు. 2. మెట్టూరునందు కూడ త్వరలో విద్యుచ్ఛక్తి తయారుచేయుటకై, 8½



చిత్రము 9 చిన్న గొట్టములు



చిత్రము 10 రెండు నీటి గొట్టములు క్రిందికి దిగుట

అడుగుల నడిమి కొలతగల గొట్టములు వేసియున్నారు. ౩. విశాఖ పట్టణము దగ్గర, జోలాబు వందుకూడ విద్యుచ్ఛక్తి చేయుటకు వసతులు గలవు. ఇంకను దక్షిణ హిందూస్థానమున, సుమారు పదిస్థలములయందు విద్యుచ్ఛక్తి తయారుచేయుటకై వసతులను పరీక్షించుచున్నారు.

ఇదంతయు చూడ కొలదికాలములోనే దక్షిణ హిందూస్థానమున విద్యుచ్ఛక్తి ప్రజలందరి అందుబాటులోనికి రానైయున్నదని తోచుచున్నది. అటుల వచ్చిన ప్పుడు ఇది మనుజునికి నిత్యజీవితమునందలి ముఖ్యావశ్యకములలో మొదటిది కాగలదు. పెక్కుమంది క్రొత్త పరిశ్రమలను ఆరంభించుటకును, పొగబండ్లు నడుపుటకును వీలగును. ఈవిధముగ దేశమున పరిశ్రమలు మిక్కుటముగ అభివృద్ధిని జెందగలవు. కనుక ప్రజలు ఎంత త్వరలో విద్యుచ్ఛక్తి యొక్క విలువను గమనించి, దానిని తమ లాభములకొరకై యుపయోగింప మొదలిడెదరో అంత త్వరలో దేశము ఆర్థికముగా బాగుపడు ననుట కెంతయు సందియము లేదు.

---

# ఆంధ్రకవుల ప్రతిభ

హరి రాధాకృష్ణమూర్తిగారు

## ౬. నన్నయభట్టు

నన్నయభట్టు వేగిదేశప్రభుండగు రాజరాజవిష్ణువర్ధనుని యాస్థానమం దొకయాత్రి తుఁడు కాఁగోరి తద్రాజద్వారముం జేరఁజని యందున్న ద్వారరక్షకునితో,—

ఇదియే? రాజనరేంద్రుఁ డెంతయును దేవేంద్రాదులున్ మెచ్చఁ దా
నదయుండై ధరణీధవోచితజనస్వామ్యమ్ముఁ బాలించి నే
ర్పొదవం ధర్మువ శాసనంబు జరుపన్ యోగ్యస్థలంబైన యా
సదసిం దున్నె చళుక్యవంశమణి విస్తారప్రభాభాసియై.

దూరదేశాయాత దురభిమానము మనంబును వీడి తెనత్రోవఁ జనినదొక్కొ—
పల్లవోర్వీశశంపాధ్వానితోర్వి సంపత్సౌఖ్యములఁ దృప్తిఁబఱచునొక్కొ—
నిర్వ్యాజమగు ప్రేమ నెఱపుచు సత్కవు లెంతయుఁ బ్రభుని దీవింతురొక్కొ—
అమలినమా జన మధిపు నాయుష్మంతునిగఁ జేయ జేజేలఁ బొగడునొక్కొ—
న్యాయపథ మెట్టివేళను బాయకుండ - దీనజనులు ధరానాథు దివ్యకీర్తి
కెంతయును వన్నె నిడుదురే యేలికయును - దీని గమనింపనేర్చునే తెలుపుమన్న.

కర్ణాకర్ణిగ వింటిని - స్వర్ణము నీతండు కురియు సత్కవులకు సం
పూర్ణుండు గుణములం దని-కర్ణాయతనేత్రములను గన మదిఁ గలిగెన్.

బాపడఁ బేదవాఁడ నిరపాయముగా మనుత్రోవలేక ని
ర్వ్యాపక మెంతయున్ మనసు రంజిలనీయమి నిట్లు వచ్చి యీ
భూపతి నాశ్రయింపఁ దలపోయుదు నీకును బుణ్యముండు నా
పాపముఁ దెల్పి యాతని కృపన్ దరలింపగఁ జూడు నాదెసన్.

కవనం బే నొకయింత వ్రాయుదును విఖ్యాతాంధ్రభాషేందిరా
స్తవనీయుల్ మనసిచ్చి మెచ్చినను మెచ్చన్నేరకున్నన్ మహీ
ధవుఁడున్ మెచ్చఁ బురాణముం జదివెదన్ ధర్మైకదీక్షారతిన్
సవనం బొండు రచించినాఁడ నిది ప్రస్తావంబుగాఁ బల్కుమా.

ఔననినఁ గాదనిన మది యలుగకయ్య-నొక్కమాత్రము పల్కు మీనుడుల నచట
'కవి యొకఁడు నీదుసేవయే ఘనతగాఁగఁ-గోరివచ్చెను సెలవిమ్ము గుణనిధి'యని.

* * * * *

భయపడనేల తెల్పు నిది పండితుఁ డెన్నఁడు కష్టసంచయో
న్నియమమునం గలంగఁడు గణింపఁడు దుఃఖము సౌఖ్యసంపదల్
భయదములౌనుగాని నిరపాయము లెన్నఁడుగావు కాన నో
ప్రయతుఁడ చింతఁ దక్కుము భవత్కృతదోష మదేమి కల్గెడిన్.

ఇది యనుకొంటి యింటికడ నెంతటి ధర్మపరీతుఁడైన యీ
పదవిని నుండువాఁ డిటులఁ బల్కక నింకెటు పల్కునైన నే
మదికొఱవోవు నిట్టియవమానమ సత్కవి కెందునైన ? యో
యెద విడువంగనేల యివి యెందును పీడవు పండితోత్తమున్.

ఐన నొకచింత మనమున నంటియుండు-నాంధ్రులను గాచునట్టి ధరాధిపునకు
ఆంధ్రకవి భారమగునేని యట్టివాని-నధికసారస్వతజ్వరం బధిగమించు.

* * * * *

ఓకవిరాజపూజిత, యనూనకృపామహనీయమూర్తి య
స్తోకమనీష నీ విటుల తూర్యము లెల్లెడ మ్రోవ నన్ను వి

ద్యాకమనీయు మన్ననలఁదన్నిన నీయఘు మెంతయుక్ వయః
పాకముఁ దక్కి వృద్ధగతి వర్తిలు నొక్క తమోంగణంబునన్.

అనుభవనీయసంచితము నాఁడట నెట్టిఁడునైనఁ ద్రోవఁగా
నెనయునె? నాఁటి దట్టిది యథేచ్ఛఁ దెలుంగుము నేఁటినుండి నీ
మనసిజరుగ్మతల్ దొలఁగు మానుగ భారత మాంధ్రభాషలో
వినిన! భవత్సమాదరత వీనులవిం దొనరింతు భూవరా!

నీవంశీయులు పాండవోత్తములు మున్నే వారి నార్యోక్తభా
షావైదుష్యవిలాసి వ్యాసుఁడు మనీషన్ వ్రాసె నాభాష నేఁ
డో వాణీవిభవుండ నాంధ్రమున నెట్లో పల్కెదన్ సత్క్రియా
భావం బెంతయు దోహదంబుగొన నప్పా, యాలకింపంగదే.

ఇమ్ములఁ గావ్యసంతతికి నెత్తిన టీకృతి, దీనిఁగాంచుభా
గ్య మ్మెవ్వనఁగూడునే యజునకైన భవేశునకైన నీదుయో
గమ్ము ఫలించె సత్క్రియఖండపరాక్రమముం దెరల్చు కా
వ్యమ్ము పరిగ్రహించుటను భారతవంశవివర్ధనోదయా.

‘శ్రీవాణీగిరిజాశ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం,
తే వేదత్రయమూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వ స్సురై
ర్భూయాసుః పురుషోత్తమాంబుజభవశ్రీకంధరా శ్శ్రేయసే’.

రాజు నైమఅచి

ఆవేశంబు శమించె నీనుతుల నాహా యెట్టిమాధుర్యధా
రావైచిత్ర్యము కల్గునో సుకవితారాగంబు నీకట్లనే
యావిర్భావము నొందె నీకిఁక నశక్యంబౌనె లోకమ్ము నీ
‘శ్రీవాణీగిరిజాశ్చిరాయ’యను నాశీర్వాద మున్నంతకున్.

---

# చంద్రుడు

నిడుమోలు కనకసుందరంగారు, యం. ఏ.

చంద్రుడు నక్షత్రములకు రాజు. రాత్రులం దాకాశమున వెలిగెడి అనంతకోటినక్షత్రములలో చంద్రునియాకారము పెద్దదిగ భూమియందు నివసించు వారికి కనబడుచుండుటవలననే దానికి 'రాజు' నామము ప్రాపించియుండవలెను. ప్రాచీనవేదశాస్త్రసారస్వతము నందు 'సోము' డని పేర్కొనబడిన దేవతాంశము చంద్రునం దెంతవరకుపలక్షితమైనదో వేరొకవ్యాస మున వివరించియుంటిని.* చంద్రుడు సాగరమథనసమయ మం దుద్భవించినవాడు కావున లక్ష్మికి తోబుట్టువు; చల్లనివెన్నెలకు నెలవగుటవలన సుధాకరుడు; శివుని జటాజూటమునకు "వన్నెవెట్టు వనార్తకంపు బువ్వు." తారాచంద్రులప్రణయగాథ ఆంధ్రమహాజనులకు మఱపు రాదు. చంద్రునినవ్వుచే విఘ్నేశ్వరునిబొజ్జకు కలిగిన ప్రమాదమును, పార్వతీశాపవశమున చంద్రు డనుభవించు వృద్ధిక్షయములను వివరించు గాథయు, భగవత్స్వరూపు డగు శ్రీకృష్ణుడుకూడ నిషిద్ధదినమున చంద్రప్రతిబింబ సందర్శనమున నపనిందలపాలయిన చరితమును హిందువు లేటేట నొకసారియైన స్మరింపుచునే యుందురు. హిందూమత సంప్రదాయసిద్ధములగు నీవిశేషములను గాక నీవ్యాసమున చంద్రగోళముయొక్క భౌతికలక్షణ ములను కొన్నిటిని వివరింతుము.

ఆకాశమున భూమికి మిక్కిలి చేరువలోనున్న గోళము చంద్రుడే. అది భూమియొక్క "ఉపగ్రహ" మని వాడుటయు కలదు. ఈచంద్రుడు గాక అదృశ్యము లగు మూడు ఉపగ్రహములు భూమిచుట్టును తిరుగు చున్నవని ఆధునికపరిశోధనలు తెలుపుచున్నవట. కాని ఆమూడింటితో మన కిపుడు పనిలేదు. భూమి తనలో తాను తిరుగుచు సూర్యునిచుట్టును సంవత్సరమున కొక రి ఎటుల ప్రదక్షిణము చేయుచున్నదో అటులనే చంద్రుడును తనలో తాను తిరుగుచు భూమిచుట్టును నెలకొకసారి తిరుగుచుండును. భూమియొక్క సంచార మునకు సూర్యుని ఆకర్షణశక్తి యెంత ప్రాధాన్య మైనదో అటులనే చంద్రుని సంచారమునకు భూమి యొక్క ఆకర్షణశక్తి యంత ముఖ్యమైనది. ఈకార ణమువలననే చంద్రుని సంచారమువలన భూమిపై కొన్నివస్తువులయందు సంచలనము కలుగుచుండుటయు విదితము. ఇందులకు సముద్రము నిదర్శనము. అందలి పాటు పోటులకు చంద్రుడే కారకుడు. ఈఉపగ్రహము నిత్యము సముద్రమున సంచలనమును కలుగజేయుచు మనకు మహోపకార మొనర్చుచున్నదని అంగీకరింపక తప్పదు. చంద్రమండలము హఠాత్తుగ మాయమగునెడల వెంటనే సముద్రములందు పాటుపోటులును మాయమైన వని నావికులు ఘోషిల్లగలరు. అపుడు, సముద్రతీరవి శ్రామస్థలము (Harbours) లందున్న నౌకలు వెలుపలికి పోజాలవు; వెలుపలనున్న నౌకలు లోనికిపోలేవు. ఈ రీతిని నౌకావ్యాపారమంతయు కల్లోలము కాగలదు. పాటుపోటులనుబట్టి రాకపోకలను నిర్ణయించుకొను పల్లె వాండ్ర చేపల నావలపని సున్నయగును.

చంద్రబింబముయొక్క విచిత్రమగు వృద్ధిక్షయ ములను గమనించి ఆశ్చర్యపడని వారెవరు? మొట్టమొదట వెలవెలబోయెడి తెల్లని కొడవలివలె నది సూర్యాస్తమ యమైన వెంటనె పడమటిదిశను మన కగపడును. ఆచం ద్రుని కొక నూలుపోగును సమర్పింతురు. ఆకసమునందు మబ్బులు లేకున్నచో చంద్రరేఖనంటి మిగిలిన చంద్రగో ళముకూడ భూమివలన ప్రతిఫలింప జేయబడిన స్వల్ప కాంతివలన చాయాయగ నగుపించును. రోజులు గడచిన కొలదిని చంద్రబింబము క్రమక్రమముగ వృద్ధిచెందుచు తూర్పునకు కదలిపోయి ఒక పక్షమునకరికి పూర్ణబింబ మై సూర్యాస్తమయ సమయమునకు తూర్పున నుదయిం

* భారతి సంపు. V. సంచి. 8. పే. 28 చూడుడు.

నును. అటుపిమ్మట బింబము క్రమముగ తగ్గుచు వోకవా రముదినములలో మరల సగమైపోవును. అట్టి స్థితియందే సూర్యోదయమైన పిదపకూడ కళావిహీనమైన చంద్ర బింబమును ఆకాశమున మధ్యభాగప్రాంతముల మనము చూడగలుగుదుము. దినములు గడచినకొలదిని ప్రకాశ వంతమగు భాగము క్రమముగ క్షీణించి మరల రేఖాకృతి చెంది తుట్టతుదకు సూర్యుని సమీపమునకు చేరినపుడు ఆ బింబముయొక్క అప్రతిమాన ప్రతిభయందు అదృశ్యమగుచుండును. అంత మరల రేఖాకృతి నుదయించి యీ విధముగనే నెలకొకసారి వృద్ధిక్షయముల నందుచుండును.

చంద్రుని ప్రకాశత సూర్యవరప్రసాదమే యన్నచో శరత్కాలమున పూర్ణిమారాత్రుల వెన్నెలయందు సుఖించుజనులు విశ్వసింపకపోవచ్చును. కాని చంద్రగోళము స్వయంప్రకాశతలేని పదార్థములతో కూడినదనుట యథార్థము. ఈవిషయము నిరూపించుట బహు సులభము. ప్రాతఃకాలమున సూర్యరశ్మియందు కనపించు చంద్రబింబమును మబ్బులతో పోల్చిచూచిన రెండిటి స్వరూపమును ఒకమాదిరిగనే యుండుననివిశదమగును. సూర్యుడు మబ్బులకు వెలుగు నెటులిచ్చుచున్నాడో అటులనే చంద్రబింబమునకు నిచ్చుచున్నాడని విశదమగునుగదా.

సూర్యుడు నిరంతరము నిర్ఘాటముగ అనంతాకాశములోనికి విరజిమ్ము వెలుగునందు కొలది భాగమును చంద్రగోళము గ్రహించుచున్నది. అందు కొంచెము తిరిగి భూమిపైకి ప్రసరింప జేయుచున్నది. సూర్య చంద్రుల ప్రకాశతలను పోల్చి చూచినచో ౬,౦౦,౦౦౦ పూర్ణచంద్రులు లోకసమయమున ప్రకాశించు నెడల సూర్యుని ప్రతిభకు సమమగునని అంచనా వేయబడినది. అనుభవసిద్ధమగు చంద్రుని చలువదనమున కిదియే కారణము. ప్రబంధములందు నాయికానాయకుల వియోగసందర్భముల వర్ణింపబడురీతిని సుకుమారులకు వెన్నెలయందు దుస్సహముగ వేడిమియున్నటుల్ తోచుటకును ఇదియే కారణమై యుండవోవు!

మనకంటె కగపడు నసంఖ్యాకములగు జ్యోతిర్గోళములలో మనకు చంద్రగోళ మొక్క విషయమున చాల ముఖ్యమైనది. ఈగోళములన్నిటిలో భూమి కతి సమీపమున నున్న దీచంద్రగోళమే. ఒక్కొకప్పుడేదేని యొక తోకచుక్క చంద్రునికంటె చేరువలోనికివచ్చుచుండును గాని గ్రహములును స్థిరనక్షత్రములును చంద్రునికంటె వందలు,వేలు, బహుశః లక్షలు, కోట్లు రెట్లు దూరమున నున్నవి.

అదియును గాక మనకంటి కగపడు జ్యోతిర్గోళములలో నెల్ల చంద్రగోళము సూక్ష్మతమమైనది. ఆకాశమున దోచు వేనకువేలు నక్షత్రములలో ప్రతియొకటియు చంద్రునికంటె చాల పెద్దది. చంద్రబింబము మిగిలిన నక్షత్రములకంటె ప్రకాశవంతముగను పెద్దదిగను కనబడుటకు కారణమేమన, అది మనకు ౨,౩౯,౦౦౦ మైళ్ల దూరమున మాత్ర ముండుటయే. ఇతరనక్షత్రము లింతకు పెక్కువేలరెట్లు దూరమున నున్నవి.

ఈక్రిందిపటమున భూగోళము, చంద్రగోళముల పరిమాణము పోల్చబడియున్నది.




పటము 1 - గోళముల పరిమాణములు

ఇందు చిన్నగోళము చంద్రుడు, పెద్దగోళము భూమి. భూమియొక్క వ్యాసము (Diameter) ౭,౯౧౮ మైళ్లు. చంద్రుని వ్యాసము ౨,౧౬౦ మైళ్లు. భూగోళమును ఏబది సమభాగములుగా కోసి అందొక్కొక్కభాగమును గోళాకారముగ మార్చినచో చంద్రునంతగోళమగును. చంద్రగోళో పరిభాగము

(Surface) భూగోళోపరిభాగమునందు సుమారు పదిమూడవవంతు. కావున భూమివైపునకు తిరిగియుండు చంద్రబింబార్ధభాగము భూగోళోపరిభాగమున ౨౭ వ వంతు. అనగా సుమారు ఐరోపాఖండముయొక్క వైశాల్యమునకు రెట్టింపు. కాని చంద్రగోళమునందలి పదార్థములకంటె భూమియందలి పదార్థములు చాల బరువైనవి. భూమితో సరితూచుటకు చంద్రునివంటి గోళము లెనుబది కావలయును.

చంద్రు డెన్నిమార్పుల నొందుచున్నను ఒక్క విషయముమాత్రము మనకు ప్రత్యక్షముగ గోచరింపక మానదు. పూర్ణిమనాడైనను, అమవసనాడైనను, లేక నీవనుమనే యవస్థయందైనను, ఉదయాస్తమానసమయములందైనను లేక ఆకాశమున నూర్ధ్వభాగమున నున్నపుడైనను, సూర్యునిచే మరుగుపడినప్పుడైనను లేక సూర్యుని మరుగుపరచునపుడైనను చంద్రగోళముయొక్క ప్రమాణమునందు విశేషముగుమార్పు మన కగపడదు. గణితపద్ధతిని దీని నుదాహరింపవచ్చును. నీ వాకాశమున వెలుగు పూర్ణచంద్రుని చూచుచున్న సమయములో నీదృక్పథమున నీ కంటికి ౧౧౧ అడుగుల దూరములో నొక అడుగు వ్యాసము గల గోళము నుంచినచో అది చంద్రగోళమును నీకంటి కగపడకుండ మరుగు పరచుటకు హెచ్చు తగ్గులు లేక సరిపోవును. చంద్రుని సంచారమును బట్టి, ఇట్లు చంద్రుని సంపూర్ణముగ మరుగుపరచుట కీ గోళము నొక్కొకపుడు ౧౦౩ అడుగుల దూరమునకు తీసుకొని రావలసి యుండును. వేరొక్కొకపుడు ౧౧౭ అడుగులవరకు కొనిపోవలసియుండును. సాధారణముగా నీ పరమావధులను చేరవలసిన యవసరము కలుగదు. కాన చంద్రుని పూర్ణముగ మరుగుపరచుట కట్టిగోళమును కంటికి ౧౧౬ అడుగులకు లోబడి ౧౦౫ అడుగులకు మించిన దూరమున నుంచవలసియుండును. ఈమార్పులనడుము విశేషమగు నవకాశము లేకుండుటవలన మనము తొలుత వీనిని పరిశీలింపక విడువవచ్చును. చంద్రుని దృశ్యపరిమాణము భూమికిని చంద్రునకు నడుమనున్న నిజదూరముపై నాధారపడి యుండునని చులకనగనే విశదమగు. ఉదాహరణముగా, చంద్రుడు క్రమక్రమముగా భూమికి దూరస్థుడై అనంతాకాశములోనికి కదలిపోవు ననుకొనుము. అపుడు చంద్రబింబము క్రమముగ చిన్నదగుచు పోయిపోయి యితరభగోళములలో నతిసామీప్యమునన్న వేరొకగోళమును చేరకపూర్వమే అదృశ్యము కాగలదు. అట్లుగాక చంద్రబింబము క్రమముగ భూమికి చేరువకు వచ్చినచో దాని దృశ్యపరిమాణము హెచ్చి, మన గోళమును సమీపించినంతనే ఆకాశమున వ్యాపించిన వేరొక ఖండమో యనునట్లు తోచును. చంద్రబింబముయొక్క దృశ్యపరిమాణము విశేషముగ మార్పుచెందదని పైన వివరించియుంటిమి: దానివలన చంద్ర, భూగోళముల నడుమను విశేషముగుమార్పు కలుగదని యూహింపవచ్చును. ఆదూరము సుమారు ౨,౩౮,౦౦౦ మైళ్లు. ఇదియే మధ్యమాంతరము (mean distance). అరుదుగ నీగోళము లొక్కొకపుడు ౨,౨౧,౦౦౦ మైళ్లదూరమునకు చేరుచుండును. ఒక్కొకపుడు వీని నడుమదూరము ౨,౫౩,౦౦౦ మైళ్లవరకును పెరుగుచుండును. కాని యీమార్పులు సాధారణముగా మధ్యమాంతరమగు ౨,౩౮,౦౦౦ మైళ్లకు ౧౩,౦౦౦ మైళ్లు వెనుకముందుల నుండునే గాని యీహద్దును దాటిపోవు.

చంద్రగోళమునందు నిరంతరము కలుగు మార్పులవలన నది యెల్లపుడును సంచారము చేయుచుండునని విదితమగుచునే యున్నది. ఈసంచార మెట్టిదైనను భూమికి చంద్రగోళము సుమారుగా సమదూరమునందే యెల్లపుడు నుండునని మన కిపుడు తెలిసినది. చంద్రు డాకాశమున సంచరించు మార్గముకూడ నొకక్షేత్రము (plane)న నున్నదనికూడ మనము గమనించుచో కేంద్రమున నున్న భూమిచుట్టును చంద్రుడు వలయాకారమగు మార్గమువెంట తిరుగుచుండుననియే మన మూహింపవలసి వచ్చుచున్నది. కావున్నను చంద్రగోళము భూమిచుట్టును తిరుగుచున్ననే గాని చంద్రభూగోళములు సతతము సమదూరముల నుండవని నిరూపింపవచ్చును. ఆకర్షణశక్తివలన నీగోళములు రెండును ఒకదాని నొకటి చేర నుంకించును. అట్లు చేరుచో నొరపిడివలన రెండుగోళముల యందును కల్లోలము కలుగక మానదు. చంద్రుడు భూమి

చుట్టును ప్రదక్షిణము చేయుచుండుటవలననే అట్టిప్రమాదము తప్పుచున్నది. ఈ రెండుగోళములు నొకదాని నొకటి యెల్లప్పుడు నాకర్షించుకొనుచునే యుండును. చంద్రుని వలయాకారమగు (కక్ష్య) మార్గమునందు నిలుపుటకే ఆశక్తి యిప్పుడు వినియోగపడుచున్నది కాని యీ రెండుగోళముల నొకచోటికి చేర్పుటకు ప్రసరించుట లేదు. ఎప్పుడీ యాకర్షణము నిశ్శేషమగునో అప్పుడే చంద్రగోళము భూమిని విడిచి సూటిగా •సంతాకాశము లోనికి పారిపోయి తిరిగి రాదు.

చంద్రుడు భూమిచుట్టును తిరుగుచున్నాడని నక్షత్రములను పరీక్షించుటవలన చులకనగ నిరూపింపవచ్చును. భూమియొక్క భ్రమణమే చంద్రుని ఉదయాస్తమానములకు గారణమని యెల్లరెరిగినదే; దీనివలన సూర్యుని వలెను, ఇతర నక్షత్రములవలెను చంద్రుడు కూడ దినందిన భ్రమణమును పొందుచున్నట్లగపడుచుండును. కాని నక్షత్రములలో చంద్రుని స్థానము నిత్యము మారుచుండు టొకవిశేషము. పరిశీలన దృష్టితో చూచువారికి యంత్రసాహాయ్యము లేక ఒక రాత్రియందే చంద్రబింబముయొక్క చలనము ప్రత్యక్షముగ దోపగలదు. ౨౭⅓ దినములలో చంద్రుడు భూమిని చుట్టి యొక్క సంపూర్ణ ప్రదక్షిణము చేయును. ఈదిగువ పటమును చూడుడు.




పటము 2 - చంద్రునికక్ష్య

ఇది సూర్యచంద్ర భూగోళముల పరస్పరస్థానములను చూపుచున్నది. ఇందు ప్రదర్శనమున కనుకూలమగునట్లు చంద్రుని మార్గము భూమి సూర్యులకు నడుమనున్న దూరముతో పోల్చినచో ఉండవలసినదానికంటె హెచ్చుగ చూపబడి యున్నదని ముందుగ చెప్పవలసియున్నది. చంద్రగోళమున సూర్యునివైపు తిరిగియున్న సగభాగము ప్రకాశవంతముగ నున్నది. ప్రకాశవంతమగు నా చంద్రార్ధమునం దెంతభాగము మనకు కనబడునో దానినిబట్టి మనము చంద్రకళలను నిర్ణయింతుము. ఆకళ లీదిగువపటమున చూపిన క్రమమున మార్పుచెందుచుండుట సర్వజనవిదితము.




పటము 3 - చంద్రునికళలు

రాత్రులందు ప్రసరించు సంపూర్ణచంద్రునికాంతి సూర్యునివలన నెటుల కలుగునో గ్రహించుటకు శాస్త్రపరిచయము లేని చదువరులు తికమకలు పడుదురేమో! "సూర్యచంద్రులకు నడుమ భూమి యడ్డు లేదా? సూర్యుని కావలవైపున నున్న ప్రతిపదార్థముపైనను సూర్యకాంతి ప్రసరించుటకు భూమి అడ్డుగ నుండదా" అని యట్టివారు ప్రశ్నింపవచ్చును. ౨-వ పటమును పరిశీలించిన దీనికి సమాధానము తెలియగలదు. భూమి సూర్యుని చుట్టును తిరుగు క్షేత్రమునందే చంద్రుడు భూమిచుట్టును తిరుగుట లేదు. చంద్రభ్రమణక్షేత్రము భూభ్రమణక్షేత్రమును కలిసికొను రేఖము చంద్రకక్ష్యను రెండుసమానార్ధ వలయములుగ విభజించుచున్నది. భూమి సూర్యునిచుట్టును ఏకాగ్రతముతో సమమగు క్షేత్రమున తిరుగుచున్నదని మన మెంచుచో చంద్రునికక్ష్య యీపత్రక్షేత్రమునకు కొంచె మోరగిలబడియున్నదనియు అందొక యర్ధవలయము ఈ క్షేత్రమునకు పైనను రెండవయర్ధవలయము క్రిందుగ నున్నదని యూహింపవచ్చును. (౨-వ పటము చూ.) ఆ పటమున చూపిన రీతిని చంద్రుడు పూర్ణుడైయుండు స్థానమును చేరినపుడు సూర్యుడు భూమియుండు స్థానములను చేర్పు సరళరేఖ కూర్ధ్వమున నుండునుగదా! అందువలన భూమియొక్క ఊర్ధ్వభాగమునుండి సూర్యరశ్మి చంద్రగోళమును చేరి చంద్రుని ప్రకాశవంతముగ నొనర్చును.

అమావాస్యనాడు సూర్యునకు భూమియుండుస్థానములను చేర్చురేఖ నడుమభాగమున చంద్రుడుండును.

భూమి సూర్యునిచుట్టును నిరంతరము తిరుగుచుండుటవలన ప్రతిప్రదక్షిణమందును రెండుపర్యాయములు భూచంద్రకక్ష్యలు రెండు క్షేత్రములు కలసిన సరళరేఖయందు సూర్యుడు చేరును. ఇది పూర్ణిమనాడు కలిగినేని సూర్యచంద్రులకు నడుమ భూమి యడ్డముగ నిలుచును. కావున భూమియొక్క నీడయందు చంద్రగోళము మునిగిపోవును. సూర్యకాంతి చంద్రునిపై ప్రసరింపకుండ భూమి అవరోధమును కలుగజేయును. అట్టిసమయములందే చంద్రగ్రహణము కలుగునని చెప్పుదుము. ఒక్కొకప్పుడు చంద్రునియందలి కొంతభాగముమాత్రమే భూమియొక్క నీడయందు ప్రవేశించును. అప్పుడు అసంపూర్ణముగ గ్రహణము కలుగుచున్నది. ఇక నమావాస్యనాడు సూర్యుడాసరళరేఖయందు చేరునప్పుడు భూమికి సూర్యునకు నడిమికి సూటిగా చంద్రుడు చేరును. సూర్యరశ్మి భూమికిచేరకుండ ప్రకాశవిహీనమగు చంద్రబింబ మడ్డుపడును. అందువలన సూర్యగ్రహణము కలుగును. సాధారణముగాసూర్యునియందు కొంతభాగమే యిట్టుల మరుగుపడుచుండును. అట్టిసమయముల ఖండగ్రహణము కలుగును. ఒక్కొకప్పుడు చంద్రుడు సంపూర్ణముగ సూర్యున కడ్డుపడును. అపుడు సంపూర్ణగ్రహణమను అతీతదృశ్యమును చూడగలుగుచున్నాము. సూర్యగోళమునుగూర్చిన పరిశోధనలను సలుపుట కట్టి సంపూర్ణగ్రహణములు చాల నుపయోగకారులు. మరికొన్ని సమయములందు చంద్రుడు సూర్యుని సంపూర్ణముగ మరుగుపరుపజాలక యుండును. అపుడు సూర్యుడు కంకణరూపమున ప్రకాశించుచు ట్లగపడును కావున దానిని కంకణగ్రహణ మందురు.

చంద్రబింబము కొన్నిసమయముల సంపూర్ణముగ సూర్యుని కప్పగలుగు ననియు, మరికొన్ని సమయముల కొంతభాగమును మాత్రమే మరుగుపరచుననియు పైన చెప్పితిమి. దీనికి కారణ మేమి? సూర్యచంద్రుల దృశ్యపరిమాణములు దాదాపుగ సమము లగుటవలన వాని సంచారమునందు మనకు మామూలుకంటె చేరువలోనికి వచ్చినబింబము మామూలుకంటె పెద్దదిగను, దూరమునకు పోయినబింబము చిన్నదిగను కనబడుట సహజము. అందువలన కొన్ని సమయములలో చంద్రబింబము యొక్క దృశ్యపరిమాణము సూర్యునికంటె పెద్దదిగ నుండినచో చంద్రుని కేంద్రగమనము వలన సంపూర్ణ సూర్యగ్రహణము కలిగెడిని. మరికొన్ని సమయముల చంద్రుని దృశ్యపరిమాణము సూర్యునికంటె చిన్నదిగ నున్నచో చంద్రుని కేంద్రగమనము కంకణగ్రహణమును కలుగజేయును. వివిధములగు గ్రహణములకంటె ప్రబోధకములగు విశేషము లాకాశమున గమనింపజాలము. ఈ దృశ్యములను పరిశీలించుటకు సాధనసామగ్రి యేమియు నక్కరలేదు. దూరదర్శక యంత్రము లేకయే వీని ముఖ్యలక్షణములను గమనింపవలెను. చంద్రగ్రహణ మెట్లు కలుగునో యీపటము సూచించుచున్నది.




పటము 4 - భూచ్ఛాయ చంద్రగ్రహణకారణము

కాలచ్ఛాయయందు చంద్రబింబము ప్రవేశించుటయు, సంపూర్ణగ్రహణమైనచో ప్రకాశవంతమగు నాబింబము సన్నని కొడవటివంటి రేఖయగువరకు క్రమముగ నాఛాయవలన నాక్రమింపబడుచు తుట్టతుద కాని లవంకకూడ నదృశ్యమై కాలచ్ఛాయవలన సంపూర్ణముగ కప్పబడుటయు చూడ నెంతో ముచ్చటగ నుండునుగద. అంతట చంద్రుడు సంపూర్ణముగ భూచ్ఛాయయందు మునిగి సూర్యకిరణము నొక్కదానినైనను గ్రహింపలేకున్నను ప్రకాశవంతమగు నెర్రనిరంగుతో వెలుగుచున్నటుల ముద్దుముచ్చటల గూర్చు నొకదృశ్యమును మనము చూడగలుగుదుము.

సంపూర్ణగ్రహణమున మునిగియున్న చంద్రుని అరుణచ్ఛాయ భూమియొక్క అంచునుండి తప్పించుకొనిపోయిన సూర్యకిరణముల వలననే కలుగుచున్నది. అట్లు తప్పించుకొనునపుడు భూగోళము నావరించియున్న వాతావరణమువలన సూర్యకిరణములు వక్రీకర

ణమునొంది నీడలోనికి ప్రసరించును. వందలకొలది మైళ్ల వరకు వ్యాపించు నీ వాతావరణమునుండి ప్రయాణము చేయునపుడా కిరణములు రాగివన్నెగ నెఱ్ఱనిరంగును పొందుచున్నవి. వాతావరణమున కిట్టి స్వభావముండుట వనుట మనకు క్రొత్తకాదు. సూర్యుడు మధ్యాహ్నసమయమున విరజిల్లు కాంతికంటె ఉదయాస్తమాన సమయములందిచ్చుకాంతి మిక్కిలి యెఱ్ఱగనుండుట యెల్లరును గమనించియే యుందురు. మధ్యాహ్నమందుకంటె నుదయాస్తమానసమయముల నాకిరణములు విశేషదూరము వాతావరణమునుండి వచ్చి మనకంటిని చేరవలసియుండును కావున స్వభావసిద్ధమగు నాయరుణచ్ఛవి యేర్పడుచున్నది. గ్రహణచ్ఛన్నమగు చంద్రబింబమును చేరుటకు సూర్య కిరణములు ఉదయాస్తమానము లందుకంటె రెట్టింపు దూరము వాతావరణమునుండి ప్రయాణముచేయును కావుననే గ్రహణచంద్రు డరుణోజ్జ్వలు డగునని గ్రహింపనగును.

ఏయేట వచ్చు గ్రహణములనుగూర్చిన విశేషము లన్నియు పంచాంగములందు సంపూర్ణముగ వ్రాయుచునే యుందురు. చిరకాలమునుండియు జ్యోతిశ్శాస్త్రజ్ఞులు చంద్రుని సంచారమును జాగ్రతగ పరిశీలించుచుండిరి. కావున చంద్రు డే యేసమయముల నే యేస్థానములను చేరునో పొరబాటు లేక నిర్ణయింపగలుగుచున్నారు. ఇందులకు సంబంధించిన గణితపద్ధతుల నిందు వివరింపజాలము. కాని చుల్కనయగు నొక ముఖ్యాంశము నిందు వివరింపక తప్పదు. ఈయేట కలుగు గ్రహణములకును, గడచిన సంవత్సరమున కలిగిన గ్రహణములకును, రానున్న సంవత్సరమున కలుగు గ్రహణములకు నెట్టిసంబంధము నుండదు. కాని విశాల దృష్టితో చూచునెడల వీనియందొక ప్రత్యేకనియమము ప్రత్యక్షమగును. ౧౮ లేక ౧౯ సంవత్సరములలో కలుగు గ్రహణముల నన్నిటిని మన మెఱిగినచో ముందనేకసంవత్సరములలో రానున్న గ్రహణముల నన్నిటిని విశేషముగ పొరబాటు లేకుండ నిర్ణయింపగలము. ఒక గ్రహణము కలిగిన పిదప ౬,౫౮౫ ౧/౩ దినములకు తిరిగి యావిధమగు నింకొక గ్రహణము కలుగునని మాత్రము మనము జ్ఞప్తియం దుంచుకొనవలెను. ౧౮౮౧-వ సంవత్సరమున డిశంబరు ౫-వ తేదిని చక్కనిచంద్రగ్రహణ మొకటి కలిగెను. అంతకు పూర్వము ౧౮ సంవత్సరముల ౧౧ దినములను లెక్కించుచో —. అనగా ౧౮౬౩ నవంబరు ౨౪ వ తేదిని అట్టి గ్రహణమే కలిగియుండెను. ౧౮౮౧, ౧౮౯౯, ౧౯౧౭ సంవత్సరములందు నాలుగు చంద్రగ్రహణములు కలిగెను. అటులనే ౧౯౩౫ సంవత్సరమునందును కలుగ గలవు. చంద్రుని సంచారమును గూర్చి ఆధునిక కాలమున గమనింపబడిన విశేషములు పెక్కులు ప్రాచీన జ్యోతిష్కులకు తెలియకున్నను పైసూత్రము వలననే వారు చంద్రగ్రహణములు సంభవించుకాలమును ముందుగనే నిర్ణయింపగలుగుచుండిరి. మానవులు గమనించి గ్రంథస్థముచేసిన ప్రథమసూర్యగ్రహణము ౨,౫౮౦ సంవత్సరముల క్రిందట అనగా క్రీ. పూ. ౬౪౮ వ సంవత్సరమున ఏప్రియల్ ౬ వ తేదిని కలిగినదట.

సముద్రయానముచేయు నావికులకు తుపాను మొదలగు ప్రమాదములు రానున్న సమయములందు మిగుల నుపయోగకరములగు విషయములను చంద్రబింబము సూచింపగలుగుచున్నది. హద్దులేని సముద్రమధ్యమున నావను నడుపునపుడు నావ యేప్రాంతముల నున్నదియు నౌకాధిపతి నిర్ణయింపవలసి యుండును. ఇది నిర్ణయింప లేకున్న బాటలేని పారావారమునందు బడు నావికుడు మార్గము తప్పిపోవుట నిశ్చయము. కొలంబోనుండి సింగపూరునకు పోవలెనన్నచో నావికుడు తన నావను మార్గమునందు నడుపుకొనుట అవసరముగదా. చంద్రుని సంచారమువలన నావికు లుపయోగించు కాలదర్శకయంత్రములను (Chronometers) సరిచూచి నావయొక్క స్థానమును నావికులు నిర్ణయించుకొనగలుగుదురు. ఆధునికకాలమున నోడలలో పెక్కులు కాలదర్శనయంత్రము లుపయోగపడుచుండుటవలన చంద్రుని సంచారముతో సరిచూచుకొనవలసిన యగత్యము తగ్గుచున్నది.

భూమిపై వాతావరణమునందలి మార్పులకును చంద్రునకును సంబంధమున్నదను నపోహము విశేష

ముగ ప్రచారములో నున్నదియే కాని చంద్రకళలను వాతావరణస్థితిని పరిశీలన దృష్టితో పోల్చిచూచిన నీయపోహము నిరాధారమని స్పష్టముకాగలదు.

చంద్రగోళముయొక్క ప్రతిభాగమును జ్యోతిశ్శాస్త్రజ్ఞుల దూరదర్శక యంత్రములకు సరియైన సాంగోపాంగముగా పరిశోధింపబడినది. భూగోళశాస్త్రజ్ఞులకు ఆఫ్రికా, ఆస్ట్రేలియా దేశములందలి అంతర్భాగ ప్రదేశములు తెలిసినదానికంటె బాగుగ జ్యోతిశ్శాస్త్రజ్ఞులకు చంద్రగోళోపరిభాగము పరిచితమై యున్నది. చంద్రబింబమున నొక గ్రామమంత వైశాల్యముగల ప్రతిమచ్ఛాయను గురుతింపబడినది. అందు ప్రాముఖ్యముగ గనుపించు ప్రతివస్తువునకును శాస్త్రజ్ఞులు నామకరణము చేసియుండిరి. చంద్రగోళమున ౧౧ సముద్రములును, ౮ పర్వతపంక్తులును, ౫౬ గర్తములును గురుతింపబడినవి. ఇందలి సముద్రములందు జలము లేదు. పర్వతపంక్తులపై మంచు లేదు. గర్తములందు నిప్పులేదు. ఈగర్తములు వలయాకారముగ పర్వతపంక్తులచే నావరింపబడి కేంద్రమున నొక యున్నతపర్వతముగల సమప్రదేశములై యున్నవి. ఈవలయములయొక్క వైశాల్యము సుమారు ౩౩ మొదలుకొని ౧౬,౫౦౦ చతురపు మైళ్ల వరకును విస్తరించి యున్నది. కొన్ని గర్తములు వలయాకారములు గాక నిడివియగు రెండువరుసల పర్వతపంక్తులను కలిగియున్నవి. ఈగర్తముల ఆవరణములందలి పర్వతపంక్తులు ౨౫,౦౦౦ అడుగులఎత్తువరకు వ్యాపించియున్నవి.

గర్తములను చుట్టియుండినవి గాక ఇతరములగు పర్వతపంక్తులెనిమిది కలవని పైన వ్రాసియుంటిని. అందు అత్యున్నతములగునవి లిబ్నిట్జ (Leibnitz) అను పేరగల ౨౬,౯౦౦ అడుగుల యెత్తున నున్నవి. భూమిపైనున్న పర్వతములయెత్తునకు సముద్రముయొక్క లోతును కలిపి పోల్చిచూచిన యెడల చంద్రునియందు మనపర్వతములంత యెత్తు గలవి లేవని తేలును.

చంద్రగోళమును ప్రస్తుతపరిస్థితికి తెచ్చిన విచిత్ర పరిణామమునకు కారణము లెవ్వియో మన మూహింపవలసి యున్నది. ఈవిషయమున శాస్త్రజ్ఞులకు లభించిన సాక్ష్యము సాదృశ్యమువలన నూహింపబడినదే కాని ప్రత్యక్షముగ చూడబడినది కాదని ముందుగనే మనము జ్ఞప్తియందుంచుకొనవలసియున్నది. విచిత్రములగు నీచాంద్రగర్తములు అగ్నిపర్వతములవలన నేర్పడినవని నిర్ణయించుటకు అట్టి అగ్నిగుండములలోనుండి స్ఫులింగములు వెలువడి పర్వతము లేర్పడుచుండుట భూమియందలి ప్రజల కెన్నడైనను కనబడియుండవలెను. అట్టిదృశ్యము చంద్రునియం దెవ్వరును నేటివరకు చూచియుండలేదనుట సాహసమే కావచ్చును. ఓపికగల పరిశోధకులు కొందరు చంద్రగోళమున నప్పుడప్పుడు కల్గు కొన్నిమార్పులను గమనించియున్నారు. లిన్ (Linne) అను పేరున పిలువబడు నొక చాంద్రగర్తము సుమారు ౧౦౦ సంవత్సరములకు పూర్వము ౬౪ మైళ్లు వ్యాసము గలిగిన వలయరూపమున నగపడెడిది. ౧౭౬౬-వ సంవత్సరమున నది అదృశ్యమయ్యెనని ష్మిట్ (Schmidt) అను శాస్త్రజ్ఞుడు ప్రచురించెను. అప్పటినుండియు అది యొక చిన్న గోయివలె సూక్ష్మముగ నగపడుచున్నది. కాన ఈ గర్తముయొక్క గోడలు విరిగి లోపలి కొరగి లోనున్న గోతిని చాలవరకు పూడ్చినవని యూహింపవచ్చును. వేరొకచోట నొకచిన్నగర్తము పుట్టుచున్నట్లుండెను. ఇట్టి యుదాహరణములవలన చంద్రగోళమున నధికములగు మార్పులు కలుగుట లేదని యూహింపవలసును. అదియును గాక, చంద్రగోళమున నగపడు ఘనములైన గర్తసమూహ మెట్లేర్పడినదియు నిర్ణయించునపుడు పైన వివరింపబడిన అల్పములగు మార్పులు గమనింపదగినవి కావు.

కావున మన ఉపగ్రహమగు చంద్రునియం దొకప్పుడు పెక్కుమార్పులు కలిగియుండవలెనని మన మెంచవచ్చును. ఇట్టిమార్పులు ఏవిధముగ నేల కలుగుట లేదో మనము కొంతవరకు తెలిసికొనగలను. సూర్యుడు, భూమి, చంద్రుడు—ఈ మూడుగోళముల నొకసారి పోల్చిచూతము. వీనిలో సూర్యగోళము మహా ఘనమైనది. చంద్రగోళము భూమికంటె చాల చిన్నది. సూర్యగోళ మత్యుష్ణముగనున్నను క్రమముగనది వేడిమిని కోల్పోవుచున్నదని వేరొకచో' నిరూపించి యుంటిమి.

భూగోళోపరిభాగమున కొండలును, మట్టియు నధికముగ సముద్రము నావరించియుండుటవలన ఇచట వేడిమి విశేషముగ నున్నట్లు మనకు తోచుటలేదు కాని భూగోళగర్భమున నత్యధికోష్ణము కలదని అగ్నిపర్వతముల యునికివలన మనకు ద్యోతకమగుచున్నది.

రెండువస్తువుల నొక కొలిమియందుంచి నియమిత కాలము కాల్చి తీసినయెడల తిరిగి చల్లారుటకు అందు చిన్నవస్తువుకంటె పెద్దవస్తువున కెక్కువకాలము పట్టును. ఒక పెద్దశంది విగ్రహము చల్లారుటకు కొన్ని దినములు కావలెను: ఒక కుంది చల్లారుటకు కొన్ని నిమిషములు చాలును. ఈ సూర్యకుటుంబమునందలి గోళము లన్నియు నొక కాలమున వేడిమికి నిలయములై యుండి క్రమక్రమముగ యుగయుగములనుండి చల్లారుచున్నవి. సూర్యగోళము మహోన్నతమైన దగుటవలన నది చల్లబడు సమయ మింకను రాలేదు. మధ్యమప్రమాణముగల భూమి క్రమక్రమముగ ఉపరిభాగమున నున్న వేడిమిని కోల్పోయినను గర్భమున నగ్ని నింకను ఇముడ్చికొని యున్నది. స్వల్పప్రమాణముగల చంద్రగోళము వేడిమియంతయు విడిచిపోవుటవలన పైభాగమున నెట్టి మార్పును కలుగుటలేదు.

కావున చంద్రుని చరిత్రమునందు మిగుల పురాతన కాలమున నీచాంద్రగర్తములు పుట్టియుండెనని మన మూహించవలసివచ్చుచున్నది. ఈగర్తములవయస్సు నిర్ణయించుట సాధ్యము కాదు కాని యవి చాల ముసలులని మాత్ర మనక తప్పదు. ఈగర్తము లేర్పడుటకు వలయు వేడిమి చంద్రునియం దున్నప్పుడు భూమియం దిప్పటికంటె నధికతరమగు నుష్ణముండి యుండవలెను కదా. చంద్రగోళమున అగ్నిగుండములనుండి రాలురప్పలు పైకెగిరి గర్తరూపము నొందినప్పుడు పుడమియందు జనులుండుటకు వీలు లేనంత వేడిమి యుండెనేమో? చాంద్రగర్తములు ప్రస్తుతస్వరూపమును ఎన్నికోట్ల సంవత్సరములకు పూర్వము పొందెనో ఎవ్వ రెరుగుదురు?

ఈ చాంద్రగర్తము లెట్టుల కలిగియుండెనో యిపుడు విచారింతము. ఈవిషయమున నాస్మిత్ (Nasmyth) అను శాస్త్రజ్ఞుని సంఘయే పెక్కురి యూహవాదమును బపెసినది. ఈతని సిద్ధాంతమువలన నీగర్తముచుట్టును ఉన్నతమగు గోడ యెట్టుల యేర్పడెనో, నడుమనున్న సమప్రదేశమధ్యమున పర్వత మెట్టుల కలిగెనో వివరింపవచ్చును. చంద్రగోళమున నగ్నిపర్వతము ప్రజ్వలించునప్పుడు గోళాంతర్భాగము నుండి యగ్నిస్ఫులింగము లీ క్రిందిపటమున చూపబడినట్టుల బయటకు విసరివేయబడి యుండెనని మన మూహింపవచ్చును.



పటము 5 - గర్తమేర్పడుగతి

అగ్నిగుండ ముఖమునుండి దూరముగా నీపటమున చూపబడినట్టుల విసరివేయబడిన రాలురప్పలే గర్తముచుట్టును మన కగపడు వలయాకారమగు కుడ్యముగ నేర్పడి యుండును. క్రమక్రమముగ నాయగ్నిగుండముయొక్క శక్తి క్షీణించి కొన్నాళ్లుపశమించినను పిదప మరల క్షీణశక్తితో వస్తుసముదాయము అగ్నిముఖమునుండి బయల్వెడలునప్పు డవి అధికదూరము పోజాలక ఆముఖము నందే నిలిచిపోయి అచట నొక పర్వతాకారమున ప్రోగుపడియుండును. అగ్ని సంపూర్ణముగ నుపశమించిన పిదప చుట్టు నేర్పడిన కుడ్యమును కేంద్రమున నేర్పడిన పర్వతమును ఘనీభవించి మన కగపడు గర్త మేర్పడియుండవచ్చును. గర్తముయొక్క ఆవరణమునందు అగ్నిగుండమునుండి వెలువడిన ద్రవపదార్థము సమముగ నరుదుకొని మైదానమువలె నేర్పడి యుండనగును.

గర్తము లీరీతి నేర్పడినవని సమర్థించుట కొక్క ప్రతిబంధకము కలదు. గర్తముచుట్టు నేర్పడిన కొండ లింత ఎత్తున నుండుట విపరీతముగ దోపవచ్చును. ౨౦, ౬౦ మైళ్ల వ్యాసములుగల గర్తములు పెక్కులు చంద్రునియందు కలవు. అందు పెటావియస్ (Petavius) అను గర్తము ౪౮ మైళ్ల వ్యాసముగల వలయమువలె నుండి నడుమ నున్నతమగు నొకపర్వతమును గలిగియున్నది. కేంద్రమునందలి అగ్నిముఖమునుండి వెలువడిన వస్తువులు చుట్టును ౩౯ మైళ్లదూరమున కెగిరిపోవుట అత్యాశ్చర్యకరము. కాని భూమియందుకంటె చంద్రగోళమున నాకర్షణశక్తి చాలతక్కువయని జ్ఞాపకముంచుకొను నెడల దీనికి సమాధానము చెప్పవచ్చును.

చంద్రుని యంతటిగోళముల నెనుబదింటి నొక సుద్దచేసినను భూగోళముతో తులతూగదని యిదివరకే తెలిసికొనియుంటిమి గద. భూమియం దొక్క తులము యొక్క బరు వొకతులమే—ఒక్కవీసెయొక్క బరు వొక్కవీసెయే. కాని యిచ్చట ఆరుతులములు బరువుగల వస్తువు చంద్రునియం దొక తులము బరువుమాత్రమే యుండును. ఇచ్చట ఆరువీసెల బరువుగల వస్తువన కచట నొకవీసెడు బరువే. భూమియం దొక బియ్యపుమూట మోయగలవాడు చంద్రగోళమున నట్టిమూట లారింటిని ఎక్కువ శ్రమచెందకనే మోయగలుగును. ధనుస్సునుండి విడువబడిన బాణము నేలపై బడులోపల వేయిబాణములను విడువగలిగిన అర్జునుడు చంద్రగోళమున కేగుచో ఆగడువులోనే ఆరువేలబాణములను విడువగలుగును. చంద్రునందు ౩౯ మైళ్లవరకు అగ్నిస్ఫులింగములను విసరివేయగలిగిన అగ్నిగుండము (Volcano) యొక్క శక్తివలన వస్తువులు భూమియందు ౬౪ మైళ్లదూరము విసరివేయబడవలెను. ఇంతకంటె నెక్కువదూరమునకు ప్రాణాపాయకరములగు వస్తువులను జర్మను ఫిరంగులు విసరెనని ఐరోపా మహాయుద్ధపురోజులలో విననివా రుండరు.

ఈగర్తములయొక్క పరిమాణములం దింతటితారతమ్యము లున్నను అవియన్నియు నొకేమాదిరిగ నున్నవని గమనింపవలసియున్నది. మూడుమైళ్లవ్యాసము గలిగిన వలయము మొదలుకొని అంచెలపై విశాలమగు పెటావియస్ చేరువరకు నడుమ నీగర్తములను వరుసగ నేర్పరుపవచ్చును. అగ్నిగుండములవలన నిందలి చిన్నగర్తము లేర్పడియుండు టొకవింత కాజాలదు: వానివలెనే పెద్ద గర్తములు నేర్పడియుండెనని యెంచుట పొరబాటు కాజాలదు.

చంద్రగోళోపరిభాగము విశాలమగు నూసరక్షేత్రములతో నిండియున్నదని దూరదర్శకయంత్రసాహాయ్యమున పరిశీలించుచో విదితమగును. మనకు భూమిపై పరిచయములైయున్న పచ్చికబయళ్లుగాని, పచ్చనియడవులుగాని అచట లేవు. చంద్రునకును భూమికిని కొన్ని సందర్భములందు పోలిక కలదు. భూమియందువలెనే చంద్రునందును రాత్రిందివవిభేద మున్నది—కాని చంద్రునియందు దినము మన ౧౪ దినములంత పొడ వుండును. అటులనే అచటిరాత్రియు నిచట ౧౪ రాత్రులంత పొడ వుండును. సూర్యరశ్మి మనకు వేడిమి నిచ్చుచున్నది—అటులనే చంద్రునకు నిచ్చుచున్నది. చంద్రునియందు దీర్ఘదినమున నెంతవేడిమి కలుగునో చెప్పలేము గాని అచట రాత్రియందలి శీతలము భూమియం దతిశీతలప్రదేశమునందుకంటె మిగుల దుర్భరముగ నుండు ననుట సత్యము. చంద్రగోళమునుండి మన కెంత వేడిమి వచ్చుచున్నదో లార్డు రాసి (Lord Rosse), ప్రొఫెసరు లాంగ్లి (Professor Langley) యనువారు నిర్ణయింప బ్రయత్నించి యుండిరి. చంద్రునియందలి ప్రతిభాగమును వరుసగా పదునైదురోజులు సూర్యరశ్మిని గ్రహించుచున్నను అందలి వస్తుసముదాయముయొక్క వేడిమి హెచ్చుగ నుండదు. భూమిచుట్టును వెచ్చని దుప్పటివలె నావరించియున్న వాతావరణము చంద్రుని చుట్టును లేకుండుటవలన సూర్యునివలన గ్రహించిన వేడిమిని నిలుపుకొనజాలకున్నది.

చంద్రునియందు ప్రాణికోటి కలదో లేదో ప్రత్యక్షముగ నిరూపించుటకు శాస్త్రజ్ఞులు నిర్మించిన యుత్కృష్టతమ దూరదర్శకయంత్రమును చాలకున్నది. మహోన్నతములగు వృక్షము లాగోళమున పర్వతములపై పెరుగు

మున్న వేమో మనకు తెలియదు. అందు ఏనుగులు తిరుగు చున్న వేమో ఎరుగజాలము. భూమియందు తిరుగాడు జీవ మేది చంద్రునిపై నున్నను మనకీ దూరదర్శకయంత్రమున వగపడదు.

కావున చంద్రునియందు జీవకోటి యుండుట కనుకూల పరిస్థితులున్నవో లేదో నిర్ణయించుటకు ప్రత్యక్షప్రమాణములు మనకు లభ్యము కావు. మనకు పరిచితమైనట్టి జీవకోటి చంద్రమండలమున నివసించుట లేదని జ్యోతిశ్శాస్త్రజ్ఞులు తలచుచున్నారు. ప్రాణమున కవసరములగు భూతములలో జలము మొదటిది. వృక్షజాతియందు—రాతిపై మొలచునాచు మొదలుకొని అడవిలో పెరుగు మహావృక్షము వరకు—దేనినైన కనుగొనుడు. అందు ప్రతిదానికిని జలము కావలసియున్నది. జలము లేనిచో చెట్టే లేదు. పశుజాతికిహూడ నీటి యవసరము ముఖ్యమైనదే. ఈభూతమునినా మానవుని జీవితమును, జీవకోటియును నెటు లుండునో యూహింపజాలము. కాబట్టి చంద్రునియందు నీరుండిననే గాని మనకు పరిచితమైనట్టి జీవరాశి అందుండజాలదని నిశ్చయమగుచున్నది. చంద్రునియందు నివసించుచున్నవా డెవడైనను దూరదర్శకయంత్రమున భూమిని చూచిన కో అతనికి భూమియందు జలమున్నటుల సూచన లగుపించునా? తప్పక యగుపించగలవు. అతనికి మేఘములును, క్షణక్షణ మవి చెందుమార్పులును తప్పక ద్యోతకమగును. మబ్బుల యునికియే నీరుంటకు ప్రమాణము. మనగోళమున భూప్రదేశములును సముద్రములును వేరువేరు రంగులతో చంద్రగోళములోని జ్యోతిశ్శాస్త్రజ్ఞునకు వివరముగ దోచును. ప్రశాంతమగు సముద్రభాగమునం దొకచోట సూర్యబింబముయొక్క ప్రతిఫలము ప్రకాశవంతమగు నొకనక్షత్రమువలె చంద్రునియందు నివసించువానికి కన్పింపవచ్చును. భూమి యందు సగభాగమునకు పైగా సముద్ర ముండుటవలనను, భూమి చాలభాగము మబ్బులచే నెప్పుడు కప్పబడి యుండుటవలనను భూమియంతయు జలమయమనియు, నిందు జలచరములే నివసించు ననియు నతఁ డూహింపవచ్చును.

కాని మన దూరదర్శకయంత్రములతో చంద్రుని జూచినయెడల నీటియునికి కనబడదు. చంద్రగోళమున సముద్రములని పిలువబడెడి భాగములను పరిశీలించి చూచిన ఎడారులని తెలిసికొనగలము. అందు సముద్రములు లేవు; సరస్సులు లేవు; నదులు లేవు. చంద్రునియం దొక్క మేఘశకలమైనను కనబడదు. ఎట్టి ఆవిరియున్నటుల నిదర్శనము లేదు. కావున చంద్రగోళము నిర్జలమగు నూసరక్షేత్రమని శాస్త్రజ్ఞుల యభిప్రాయము.

జీవకోటికి ఆవరువగు వేరొక భూతము చంద్రుని యందు కావరాదు. భూగోళోపరిభాగమున ౨, 3 వందల మైళ్లవరకును గాలి దట్టముగ నావరించియున్నది. ప్రాణులకు గాలి యెంతముఖ్యమో చెప్పవక్కర లేదు. కావున చంద్రునియందు గాలి యుండుట కవకాశము కలదాయని మనము విచారింతము. ఒకప్రయాణికుడు చంద్రగోళమును చేరుటకై భూమినుండి బయలుదేరినా డనుకొందము. వాడు పోయినకొలదిని గాలి క్రమక్రమముగ పలుచనై కొంతదూరము పోవుసరికి భూమియొక్క వాతావరణము అతనికి వెనుకపడును. అతడు ప్రయాణము చేయవలసిన ౨,౩౯,౦౦౦ మైళ్లలో సుమా రొకసహస్రాంశమునే అత డప్పటికి కడచినియుండును. గాలి లేనిప్రదేశముగుండ చాలదూర మింకను అతడు పోవలసియుండును. భూమివలెనే చంద్రునియందును గాలి యుండుచో నతడు చంద్రగోళప్రాంతములను చేరునప్పటికి అచట మరల గాలి ప్రత్యక్షమై ఆగోళమును చేరునప్పటికి దట్టముగు గాలి అతని నావరించును. కాని ప్రయాణికు నాహ్వానించుటకు చంద్రగోళమున వాయువు లేదు. ఇది యెట్లు తెలియునని పాఠకు లడుగవచ్చును. ఒక్కొక్కపుడు చంద్రబింబము భూమికిని ఒకస్థిరనక్షత్రమునకును నడుమనుండి యట్టిస్థిరనక్షత్రమును మరుగుపరచుచుండును. చంద్రునిచుట్టును వాతావరణ ముండునెడల అట్లు మరుగుపడు నక్షత్రము క్రమక్రమముగ వాతావరణమును ప్రవేశించినప్పటినుండియు క్షీణించుచు పోయి పిమ్మట నదృశ్యమై తిరిగి బయల్పడిన పిమ్మట క్రమక్రమముగ సహజప్రకాశతను గాంచును. కాని అట్టిసమయముల ప్రత్యక్షముగ దూరదర్శక యంత్రముతో చూచునెడల సహ

జప్రకాశముతో వెలుగునక్షత్రము చంద్రబింబ మడ్డురాగనే హఠాత్తుగ నిర్గమించి మరల నటులనే చంద్రుని చాటునుండి బయల్పడును. చంద్రునియం దిదివర కుండిన జలమును గాలియు వాయురూపమున క్రమముగ చంద్రగోళమును విడిచిపోయి యుండవచ్చును. నీరును గాలియు లేకుండుటవలననే చంద్రగోళమున వధికములగు మిట్టపల్లము లేర్పడి యున్నవి. గాలి, వర్షము, మంచు మొదలగునవి భూమియందలి పర్వతములను నిరంతరము సానపెట్టుచున్నవి. చంద్రునియం దిట్టి ప్రకృతియే లేదు. అగ్నిగుండములు అనేకయుగముల క్రిందట చంద్రబింబ మిపుడున్న స్థితిలోనికి దెచ్చినవి. ఈ పరిస్థితు లేర్పడి యెన్నియుగము లైనదో చెప్ప వలని కాదు.

చక్కని మేడలు, పవిత్రములగు గోపురములు ఈ భూమియందు చిరకాలము నిలిచియుండవు. గాలి, నీరు వాటి నెదుర్కొని యోడించుచున్నవి. ఒకపుడు మహోన్నతదశ ననుభవించి యిపుడు శిథిలములై భీత్యావహములగు కట్టడము లెన్ని భూమిపై లేవు? ఇట్టిగాలియు నీరును చంద్రగోళమున లేకుండుటచే అచట కట్టిన సౌధ మెన్నియేండ్లు గడచిన నొకేరీతి నుండగలుగును. అట్టి సౌధమున కిటికీల కద్దము లక్కరలేదు. అవి లేకున్న లోనికి ప్రవేశించుటకు గాలియు వానయు నుండవుకదా. చంద్రునియందు పట్టణమున నివసించువారికి దుమ్ము వలన బాధ యుండదు; శబ్దములు వినబడవు; వాసన లుండవు.

మనుష్యుడు తానున్న పరిస్థితుల కనుగుణముగ తన జీవితమును మార్చుకొనుచుండును. చంద్రుని విషయమటుంచిఅనంతబ్రహ్మాండమునందనంతకోటిగోళములలో అనంతవిభేదములగు పరిస్థితు లేర్పడి యున్నవి.భూమిగాక మిగిలిన గోళములం దెందైనను ప్రాణు లున్నవేమో మనకు తెలియదు. అయిన నొక్క విషయము గమనింపుడు. మనభూమియందు ప్రతిభాగమునను ప్రాణికోటి ప్రత్యక్షమగుచున్నది. సూర్యునివేడిమి కాల్చిచ్చువలె దహించు భూమధ్యరేఖాప్రాంతములందును, సూర్యరశ్మి చొరక నతిశీతలములై యున్న ధ్రువప్రాంతములందును, తేజోలేశము లేని పర్వతకుహరములందును గభీరమగు సముద్రముయొక్క అట్టడుగునను-ఎచ్చట చూచినను ప్రాణులే. బాహ్యపరిస్థితు లెటు లున్నను, వానికనుగుణముగ జీవములను పెంచి పోషించుప్రకృతిని తలంపుడు!

అనంతములగునండము లన్నిటిలోను భూమికి సరిగా పోల్పదగినది—అనగా ఇట్టినీటిని, ఇట్టిగాలిని, ఇట్టిపరిమాణమును, ఇట్టిపరిణామమును కలిగినగోళ మింకొకటి యుండజాలదు. భూమియందు గాక వేరొక గోళమున నిచటి మానవు డొక గడియయైనను జీవింపగలడని చెప్పజాలము. అటులనే మఱ్ఱిచెట్టొకటి వేరొకగోళమున నొక ఋతువును గడుపజాలదు. భూమియందలి పరిస్థితులు కలవాటు పడియుండుటవలననే యిచట నరులు జీవించుటకును, వృక్షములు పెంపొందుటకును అవకాశము కలుగుచున్నది. అటులనే యితరగోళములలోను అచటి పరిస్థితుల కలవాటుపడిన జీవము లుండకపోవు నేల?

---

## నివేదన

శ్రీమతి చావలి బంగారమ్మగారు

3

చూచివచ్చినమాట తేటబడగాను
నోటజెప్పఁట నీకు చేతగా దనుము.

చురుకుగల చూపులతో సూర్యుడా, నీవు
చూడలేవైతివా సున్నితపు విభుని ?

మనసుమెత్తనివాడు, మహామంచివాడు
మాటాడ వెరతురు మనబోటివారు

మగువలకు భయమన్న మరి నమ్మవచ్చు,
మగవారి కేలయ్య మాటాడ భయము ?

మగవారికైనను మాటాడుటకును
మనసుదెలుపనివాని మరులేల తిరిగ ?

పగలె పరికిస్తావు, పారిపోతావు;
చీకటిని జూచితే చిక్కుతాడేమొ !

కునికిపాటున నీవు కునుకుతావేమొ,
కుముదబాంధవులైన కూకలెట్టమను !

---

## గులాబికలిక

కె. అన్నమరాజ శర్మగారు

పూవుటోవరి కమ్మని తావి గుబులు
జేయు చజ్ఞాతవృత్తి వసించదేల?
పల్లవకవాటములఁ ద్రోసి ప్రాచిఁ దోఁచు
శోభల గులాబిముకుళమా, చూడరాదె.

ప్రణయభగ్నలు, విరహిణీబాల లదిగో,
జాగరారుణనయనలై సరసనుండ
సురభివాసన లొకమారు జోపరాదె
హృదయతాపాగ్ని చల్లారి కుదురువడఁగ.

బాలభానూదయంబునఁ బ్రమదబాష్ప
కణములన్ రాల్చు నీనిగ్గు గాంచినంత
నాదుప్రియురాలి చెక్కుల నాట్యమాడు
మందహాసంబుగాఁగ నామదికిఁ దోఁచు.

సాధుహృదయంబువోలె నజ్ఞాతమైన
తావకవివిక్తజీవిత తత్త్వమెఱుఁగ
తరమె పూమొగ్గ, పర్ణసాధప్రదేశ
మందె జనియించి, తూఁగాడి, యంతరింప.

ఇపుడె, క్రొత్తరేకులఁ బుక్కిలించు నీదు
పరిమళంబు నీర్ష్యాళువౌ బాటసారి
ప్రమదమునఁ బీల్చి, సత్యంబుఁ బలుకలేక
కంటకావృతవంచు నిన్ గసరుగాదె.

భేదబుద్ధిని బ్రకటించు విరసమతుల
జల్పములకేమి? తావక సౌరభంబు
పవనగర్భంబునందునఁ బఱచియుండె
నిర్మలాత్మల మోదంబు నివ్వటిల్ల.

---



## దక్షిణభారత హిందూమహాసభ

ఇన్ని దినములకు దక్షిణభారత హిందూమహాసభ ప్రారంభ మగుట వాస్తవముగా గర్వింపదగిన విషయము.

కాని, మనరాష్ట్రమున ప్రముఖులైయున్న వారిలో గొలదిమంది — యిక్కలి కొలదిమందిమాత్రమే యిందు పాల్గొనినారు. తక్కినవా రందఱు నింకను రాజకీయ ములను సుఖస్వప్నములయందే తేలికలు తిరిగిపోవుచు న్నట్లున్నది.

ఇప్పుడు మన మున్న స్థితిలో నీయల్పారంభ మునకే మిగుల సంతసింపవలసి యున్నది. ఆరంభ శూరత్వము కార్యశూరత్వమునకు లక్షణముగూడ కాదు. కాక: మహానదులు పుట్టినచోట పంటకాల్వలకంటె పెద్దవై యుండవు.

అయితే: దీనిని ప్రారంభించిన కొలదిమందికైన నీయుద్దేశ మేల కలిగినది?

"......బ్రిటిషు ప్రభుత్వమువారు తమ తెలివి తేటల నన్నిటిని ఉపయోగించి 'హిందూ' అనుపదము నా (సాంఘికపరిష్కార) పత్రమున నెందును గన్పింప కుండునట్లు చేసి, హిందూసంఘము నొకనామరూపములు గల సంఘముగా పరిగణింపరైరి......కావున భారతవర్షమున అధికసంఖ్యాకులు గల సంఘ మొకటి 'హిందూ' సంఘ మను పేరిట జీవించియున్నదని ప్రభుత్వమునకును ప్రపంచమునకును దెలుపవలసిన యవసరమిపు డేర్పడినది."

కారణమున ప్రారంభసభ కధ్యక్షత వహించిన రామదాసుపంతులు గా రిట్లు నిర్వచించినారు; గాని యీ యవసరమును మనవారు గుర్తించుట యిప్పుడు జరిగినది; గాని యిది యేర్పడి చాలదినములే అయినది; కావుననే మాళవీయులు, మూంజీగారు మున్నగు ప్రముఖులు ఉత్తరభారతవర్షమున చాల సంవత్సరములకు పూర్వమే హిందుమహాసభను ప్రారంభించి యున్నారు.

ఇంతకీ: బ్రిటిషు ప్రభుత్వమువారు హిందూ సంఘము నొక నామరూపములుగల సంఘముగా పరిగణింపకపోవుటలో ఆశ్చర్యము లేదు. ఏమంటే? మన హిందూత్వమునెడల మనము ముగ్ధులమై యున్నామనుటకు నిదర్శనము లేవీ?

మతమునుబట్టి మహమ్మదీయులు ప్రత్యేకప్రయత్నములలో నున్నారు. నేటివఱకును హిందూరక్తమే గల దేశీయక్రైస్తవులుగూడ ప్రత్యేకదృష్టితో నున్నారు గాని హిందువులమగు మన కట్టి ప్రత్యేకత యేదీ?

మూంజీప్రభృతులు ప్రారంభించిన హిందూమహాసభకు మనము దవ్వుదవ్వులనే యుండుచున్నాము. ఇక మన మెవరము?

మనలో క్షత్రియులు, వైశ్యులు, కాపులు, కమ్మలు, రెడ్లు, విశ్వబ్రాహ్మణులు, నిమ్నజాతులు — ఇట్లందఱును తమతమ తెగలకు ప్రత్యేకసభలు, ప్రత్యేకకార్యనిర్వాహణసంఘములు ఏర్పఱచికొని పునరున్నతిని సాధించుకొనుచున్నారు. ఇట్టి వీ రందఱును హిందువులే యనిన అట్లు చెప్పుట చాలదు. వర్ణములు, తెగలు భిన్నములైనా, మతసాంఘికధర్మముల ననుసరించి వీ రందఱు నేకసూత్రబద్ధు లని నిరూపించి, ఒక్కత్రాటిమీద నడిపించుసంస్థ యేదీ?

మనకు రాజకీయపక్షములు ఆగంతుకములు గాని సహజములును, నిత్యములును గావు; గాని యవి యిది

వలెనే ప్రసన్నగిల్లియున్న మతాభిమానమును పూర్తిగా చంపివేసి, మనలను జీవచ్ఛవములుగా తయారు చేయుచున్నవి. దేశమున ప్రముఖులు, నాయకులు నని గౌరవింపబడుచున్నవారు ఈపుట్టిమునకను గ్రహింపక రాజకీయములను బురస్కరించుకొని చెదరి చెదరి, ఇంకను — ఇంకను భేదములనే పెంచుచున్నారు; గాని అనుబంధమును, రక్తసంబంధమును వృథపలుచు మతసంఘధర్మములను స్మరించుటయైన లేదు. పైగా అట్లు స్మరించుట అనాగరకలక్షణముగను, అపాయకరముగను గూడ భావించుచున్నారు. ఇట్టి స్థితిలో మనలను మతాభినిరతిగల రెవరు లెక్కచేసెదరు?

ఏవం చ: జరిగినదేమో జరిగిపోయినది. దాటిపోయినది కలసియురాదు; గాని వర్తమానమునందును, విశేషించి భవిష్యత్తునందును మనము చేయవలసినది, చేయగలది యెంతో యున్నది. అట్టి మనకు చైతన్యము గలిగించి, మన కర్తవ్య నిష్ఠను సునిశితము గావించుటలో నీహిందూమహాసభ కెంతో శక్తి యున్నది; గావున ఇప్పుడైన — ఇకనైన రామగాను పంతులుగారు, నాగేశ్వరరావు పంతులుగారు మున్నగువారు రూపకల్పనము గావించిన యీ దక్షిణభారత హిందూమహాసభకు మనము జీవము పోసెదమేని ఇది మనలను సభ్యతాపీఠమున అభిషిక్తులను జేయగలదు.

—శా. స్త్రీ.

## శారదాశాసనము

ఇది మంచిదా చెడ్డదా యని కాదు ప్రశ్న. ఇది యేల చేయబడినది?

మన్వాదికము లగు మన స్మృతులను నిక్కచ్చిగా అమలుజరిపిన శుద్ధహిందూరాజ్యముల కార్యనిర్వహణ విధాన మెట్టిదో చరిత్రలకుగూడ నంవనివిషయము; గాని నాటినుండి నేటివఱకు నేదోయొక విధముగా మన మత సంఘాచారముల శాసకత్వము ఆస్మృతులకే చెల్లుచున్నది. అట్టిచో వివాహవిషయమున వానిని గాదని యీశాసన మేల చేయబడినది?

దీనిని నిర్మించిన—అథవా ప్రతిపాదించిన శారదాగారు మనస్మృతుల యధికారమునకు దూరమైన యొక ప్రత్యేకసంప్రదాయమునకు చెందినవా రగుట నిజమే; గాని దీనిని బలపరిచినవారిలో మన సధర్ములుగూడ ననేకు లున్నారు. ఇది యేల సంభవించినది?

ఏతావతా: వివాహము మతాచారమా, సంఘాచారమా? ఇది యొక పెద్దప్రశ్న. సనాతనధర్మవాదులకును, సంస్కరణపరాయణులకును ఈవిషయమున నెంతో తగవు గలదు. అయితే: ఇది యేతెగకు చెందినను ప్రధానాచారములలో చాల ప్రధానము.

స్మృతుల నిర్ణయమున వివాహ వయస్సేది?

"అష్టవర్షా భవేత్కన్యా—" ఇత్యాదిప్రమాణముల నందరు నెఱుగుదురు. రజస్వలా వివాహములే శాస్త్రసమ్మతము లని వాదించువారు నున్నారు; గాని యెనిమిదేండ్లకు బూర్వము వివాహము చేయుట కిచ్చటను ప్రమాణములు లేవు. చేయవచ్చునని యెవరును జెప్పుటయు లేదు.

స్త్రీకి యెనిమిదేండ్లకే పెండ్లి చేయవలయునను టకు మూఢవిశ్వాసము తప్ప నితరాధారము లేమియు లేవు. భర్త యననేమో యెఱుగని వయస్సునందే భర్తయేర్పడు నెడల జ్ఞానోదయమైన పిదప ఆబాలికకు సాంసారికములగు భవిష్యదూహాలు, కల్పనములు ఆపురుషుని మీదనే కేంద్రీకృతము లగును; గావున నామె యేకచారిణిగామాత్రమే యుండిపోవుట కీ సన్నివేశ ముపయోగపడునంటే యీ సిద్ధాంతము పురుషులకుగూడ నావశ్యకము గాదా?

ఇంతకీ: ఆకనిష్ఠ ప్రమాణము గౌరవింపబడినను ఒకదారే; గాని దేశమున నేమి జరుగుచున్నదీ?

ఆఱు, అయిదు, నాలుగు, మూడు, రెండు, ఒకటి—తుదకు నెలలలోని నిసుగులకును బెండ్లిండ్లు చేయ బడుచున్నవి. గరిష్ఠ ప్రమాణమును దాటిన— స్మృతులు నిషేధించిన పదకొండు, పండ్రెండు,—ఒకొక్కచోట పదమూడేండ్ల బాలికలకును బెం

డ్లిండ్లు జరుగుచున్నవి. కొన్నిస్థలములలో బాలికలు రజస్వలలయినను దాచి, కాలేదని బొంకి కొందఱు నిర్భయముగా—నిస్సంకోచముగా వివాహములు చేయుచున్నారు.

అనేకస్థలములలో వయస్సుచెల్లినవృద్ధులు ముక్కుపచ్చలారని బాలికలను పెండ్లియాడుచున్నారు. అనేక ప్రదేశములలో వరహీనపు పెండ్లిండ్లు జరుగుచున్నవి. కన్యావిక్రయము లింకను తగ్గిపోలేదు. శాస్త్రనిషిద్ధములైన వావులనుగూడ ఎవరును పరిగణించుటలేదు. అనేకవిధములైన అసమ వివాహములు, విషమ వివాహములు జరుగుచున్నవి.

కాని యీ శాస్త్రాతిక్రమణమును సనాతనధర్మవాదు లాక్షేపించుటలేదు. ఇట్లు చేసినవారిని తిరస్కరించుటలేదు. బహిష్కరించుటయు లేదు. పైగా యిట్టి అశాస్త్రీయ వివాహములను వారుగూడ చేయుచునేయున్నారు; ఎవరును కిక్కురు మనుటలేదు.

వ్రతముపట్టి, దీక్షపూని, సద్భావముతోడను, ధర్మప్రీతితోడను, ఆత్మ విశ్వాసముతోడను బహిరంగముగ నెవరైన రజస్వలా వివాహము చేసినయెడల మాత్రము ఈ సనాతనధర్మవాదులు ఉలిక్కిపడి, నడుములుకట్టి, ఎగిరిపడి కారికలు చదివి, బహిష్కారమును ప్రకటించెదరు.

అక్షతయోను లగు బాలికలును—తుదకు రజస్వలలు కాని బాలికలునే కాను, ఎనిమి దేండ్లు నిండని వయస్సునగూడ వితంతువులైన బాలికలు మనదేశమున లక్షలకొలది ఉన్నారు; కాని వారినిజూచియైన సనాతనధర్మవాదులు శాస్త్రాతిక్రమణము మాన్పుటకు ప్రయత్నింపరు. ఆ వితంతువులను జూచి దుఃఖింపరు. మాట్లాడరు; గాని ఆ వితంతువులకు పునర్వివాహము లనిన గోల పెట్టెదరు. నిప్పులు త్రొక్కిన కోతులవలె చిందులుత్రొక్కెదరు. కుమిలికుమిలి దుఃఖించెదరు.

సనాతనధర్మవాదులకే వివాహములనిన నింత నిర్లక్ష్యముగా నున్నవి. ఇక గతానుగతికులగు సామాన్యజనుల ప్రస్తావన యేల?

అయితే లోకప్రవృత్తి సనాతనధర్మవాదుల తోడనే లేదు. పాశ్చాత్యులను చూచియేయగుగాక—వారి యుపదేశములవలననే యగుగాక, మనలో సంఘసంస్కరణపరాయణు లనేకులు బయలుదెడలినారు. అనేకులు తమ జీవితముల నందుకే ధారపోయుచున్నారు. వారు యువతివివాహములను ప్రవేశపెట్టినారు. విధవా వివాహములను సదాచారములలో చేర్చినారు. స్త్రీవిద్యను ప్రారంభించి స్త్రీలయందును, బాలికలయందును ఆత్మజ్ఞానమును వికసింపజేయుచున్నారు. ప్రజలను ప్రబోధించుచున్నారు.

అయినను సనాతనధర్మవాదులు అశాస్త్రీయవివాహములను తొలగించకపోవుటయేగాదు. స్వయముగను మానలేదు.

ఇట్టి స్థితిలో సంస్కరణపరాయణు లిట్టిశాసనము ప్రతిపాదించుటలో అక్రమ మేమి గలదు?

అయితే శారదాశాసనము నిర్దుష్టమా? పోనీ: గుణబహుళమా?

కాకపోవచ్చును; గాని అదియిట్లగుటకు కారణము వాది దౌర్బల్యము గాని, వాదదౌర్బల్యముకాదు. నేటిశాసననిర్మాతలకును, తన్మూలమున శాసనసభలకును మన మతసంఘాచారములను సవరించుచును, పునస్సృష్టి చేయుచును శాసించుటకు అర్హత లేదు. ఏమంటే? మొత్తముమీద వారు మతవిషయములయందును, సంఘవిషయములయందును అంధులు. వారిని శాసనసభకు పంపినవారు రాజకీయవిషయములను, విశేషించి కులకక్షలను, సాంఘికవైషమ్యములను బురస్కరించుకొనియే వోటుచేసియున్నారు; గాని మతసంఘదృష్టితో గాదు. అట్లు పంపుటకు వారికిగూడ అర్హత లేదు.

కావుననే శారదాశాసనము జల్లెడవలె రంధ్రబహుళమైయున్నది.

ఇక దీని ప్రయోజన మెంతవరకు?

ముక్కుపచ్చ లారని హైందవబాలికలను వివాహము పేరున బలియిచ్చు దురాచారమును ప్రతిఘటించి నిలిచిన సంస్కరణపరాయణుల ధర్మనిష్ఠకు, కర్తవ్యపరాయణతకును శారదాశాసన మొకజయస్తంభము. అంతే.

—శాస్త్రి.

---

# తెర!

అడవి బాపిరాజుగారు, బి. ఏ., బి. యల్.

ధవళమైనది, తలపు కానినిది
దానికి మొదలూ చివరా లేనిది,
నీకు ఇవతల
నాకు అవతల
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!

తెరమీదానిన నీడను చూస్తిని,
తెరచాటున నీపాటలు విన్నా,
తెర చొచ్చిన నీకాంతి జోగితి,
తెరు వేమన్నా,
తెలియలేక నే
కలిగి పోలిసీ,

తెర వున్నాది బాలా!
తెర ఉన్నదే!

కన్నుల కానని రూపం పిలిచీ,
కౌగిలి కందని భావం తలచీ,
తెరవైపున నాచేతులు మోడ్చీ,
అరమూతలు నాతీరని కలలే!
చీల్చిన చిరగని
తెర యివతలనే,
చేరగరానీ
నీ నవతలనే,
తెర ఉన్నాది బాలా!
తెర ఉన్నదే!!

---

# ఛాయాచిత్రావళి



౧. పళని గ్రామము

(కొండపైనుండి)

ఛాయాచిత్రకారుడు: యం. కే. రంగస్వామయ్యంగారు.

# ప్రాకృతగాథలు*

రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారు

౧

అమ్మ! యింట వలసినట్టి వేవేవియో
లేవటంచుఁ జెప్పలేదె నిన్న ?
ఏమి తెత్తు నిప్పు డెఱిఁగింపవే మఱి;
యిల్లు నిలిచియుండ దేపుడుఁ బ్రొద్దు.

(కావ్యప్రదీపము, ఉల్లాసము ౨, పు. ౧౮.)

౨

పూఁటపూఁటకు వానిఁ దేఁబోయి యచట
నాకొఱకుఁ జాల గాసిగొన్నావు గదవె!
చెలియ! నాచెల్మినమ్మకములకుఁ దగిన
కరణి నడచితి; వేమైనఁగాని లెమ్ము!

(కావ్యప్ర. ఉల్లా. ౨, పు. ౧౯.)

౩

వడిగ వచ్చినాను గడుఁ బెద్ద దీనిండుఁ
గడన మోచికొనుచుఁ; గాన చెలియ!
ఒడలు వసముదప్పె నూర్పుఁ జెమ్మటలచేఁ;
గొంత సేదదేర్చికొందు నిందు.

(అదే, ఉల్లా. ౩, పు. ౪౯.)

౪

నిదురలేమి, చింత, నిట్టూరుపులు, మేను
సోలియుంట, పాలుమాలికయును,
నిన్నుఁగూడఁ జెఱచెనే చెలి! నాకోస;
మెంత భాగ్యహీన నేను దలఁప!

(అదే, ఉల్లా. ౩ పు. ౪౯.)

౫

అపుడు నాచెక్కిళుల నిల్పినట్టి చూడ్కి-
నొండుదెసకు మరల్పక యుంటి వీవు;
అదియె నేను, నాచెక్కిళ్లు నవియె; కాని
చూడు మిప్పుడు లేని దాచూడ్కి-యొకటె!

(అదే, ఉల్లా. ౩, పు. ౫౧.)

౬

కటికమనసు దత్తగారింటిపను లెల్లఁ
దలకుఁ గట్టి నన్ను నలఁచుచుండు;
ఉబుసు సందెవేళ నొక్కింత కలిగినా
కలిగెఁ; గలుగకున్నఁ గలుగదమ్మ!

(అదే, ఉల్లా. ౩, పు. ౫౨.)

౭

ప్రియుఁడ! మీఱలేవు పెద్దల మాట; నే
మందు భాగ్యహీనురాల నేను;
ఇపుడ పోవవలయునేని బొమ్మవె వి
నంగఁగలవు మీఁద నడుచు తెఱఁగు.

(అదే, ఉల్లా. ౩, పు. ౫౪.)

౮

"సొమ్ము చాలఁ గలదు; సోమారులకు మేటి
పోకిరీల కెల్లఁ బోటు మగఁడు;
అతనిఁ గంటె బిడ్డ! యని చెప్ప విన్నంత
సతివకనులు చేరెఁడంత లయ్యె.

(అదే, ఉల్లా. ౪, పు. ౧౦౩.)

(సశేషము.)

---

* బొంబాయి నిర్ణయసాగరమువారు ముద్రించిన గాథాసప్తశతిలోఁ గానరానివి మఱి యనేక గాథలు ప్రాచీనాలంకారికులచే నందం దుదాహరింపఁబడినవి. వానిలోఁ దగినవాని నేర్చి తెలిఁగించి క్రమముగాఁ గొన్ని కొన్ని ప్రకటించుచున్నాను. రసికుల కిందలి భావములు సుగ్రహములు గాన టీక యనావశ్యకము. రా. అ. కృ.

# అచ్యుతదేవమహారాయల కొళింజవాడి తామ్రశాసనము

(శ. ౧౪౫౫) యన్. వెంకటరమణయ్యగారు, యం. ఏ., పి. హెచ్. డీ.

## మూలము

### మొదటి రేకు

1. శ్రీగణాధి¹పతయేనమః ।[।*] నమస్తుంగ శిరశ్చుంబిచంద్రచామ
2. రచారవే త్రైలోక్యనగరారంభమూలస్తంభాయ శంభ
3. వే।[।*౧॥] హరేర్లీలావరాహస్య దంష్ట్రాదండః స పాతు వః।
4. హేమాద్రి కలశా యత్ర ధాత్రీచ్ఛత్ర శ్రియందధౌ ।[।*౨॥]కల్యా
5. ణాయాస్తు తద్ధామ ప్రత్యూహతిమిరాపహం యత్ గజోప్యగజోత్ భూతం హరి
6. ణాపిచ పూజ్యతే[॥*౩॥]అస్తి క్షీరమయా ద్దేవైర్మథ్యమానాన్ మహాంబుధేః॥ (।)
7. నవనీతమివోత్ భూత మపనీతతమో మహః।[।*౪॥]*తస్యాసీత్తనయ
8. స్తపోభిరతులై రన్వర్థ నామా బుధః పుణ్యై రస్య పురూరవా భుజబ
9. లై రాయుర్ద్విషానిఘ్నతః తస్యాయుర్ నహుషో[౽*]స్య తస్య పురుషో
10. యుద్ధేయయాతిః క్షితౌ ఖ్యాత స్తస్యతు తుర్వశు²ర్వసునిభ[ః*]శ్రీదేవయా
11. నీపతేః[॥*౫॥]†తద్వాంశే³ దేవకీజానీ ⁴ర్దీదీపే తింమభూపతిః యశస్వీ
12. తులువేంద్రేషు యదోః కృష్ణ ఇవాన్వయే[॥*౬॥] తతో[౽*]భూత్ బుక్కమాజానీ⁵
13. రీశ్వరక్షితిపాలకః అత్రానమగుణభ్రంశం మౌలిరత్నం మహీభుజాం[॥*౭॥]
14. నరసార్దు⁶దభూ త్తస్మాన్నరసావనిపాలకః। దేవకీ నందనాత్కామో దేవ
15. కీనందనాదివ। [।*౮॥]‡వివిధసుకృతోద్దామేరామేశ్వరప్రముఖేముహుర్ముదితహృద
16. యస్థానేస్థానేష్వ ధత్తయథావిధి।బుధపరివృతో నానాదానాది⁷
17. రోభువిషోడశ త్రిభువనజనోద్గీతం స్ఫీతం యశః పునరుక్తయన్।[।*౯॥]**

---

[*] ఈగుర్తుగలవి మూలములో లేనివి. () ఈగుర్తుతో సూచింపబడినవి మూలములో ఎక్కువయగుటచే తీసివేయవలసినవి. * శ్లో. ౧ మొ. ౪ వఱకు అనుష్టుభులు. † శార్దూలవిక్రీడితము. ‡ శ్లో, ౬, ౭, ౮, అనుష్టుభులు. ** హరిణీవృత్తము.

1. 'శ్రీగణాధిపతయే' అని చదువవలయును. ఈశాసనములో తుదివరకును తరచుగా వర్గములోని చతుర్థాక్షరమునకు బదులు ద్వితీయాక్షరమును, ద్వితీయాక్షరమునకు బదులు చతుర్థాక్షరమును ఉపయోగింపబడియున్నది. పాఠకులు శాసనమూలమును చదువునప్పు డీవిషయమును జ్ఞప్తియం దుంచుకొనవలయును. 2. 'తుర్వసు' అని. 3. 'తద్వంశే' అని. 4. జాని అని. 5. డిటో 6. 'నరసానుదభూ' అని. 7. 'దానాని' అని,

18. కావేరీ మాశుబధ్వాబహులజలభరాంతాం విలంఘ్యైవ శత్రుం జీవ
19. గ్రాహం గృహీత్వా సమితిభుజబలాత్తంచ రాజ్యం తదీయం। కృత్వా శ్రీ
20. రంగపూర్వంతదపినిజవశేపట్టణం యో బభాసే కీర్తిస్తంభంనిధా
21. యత్రిభువనభవనస్తూయమానాపదానః।[।*౧౦॥] చేరంచోళంచపాండ్యంతమ
22. పిచమధురావల్లభంమానభూషం వీర్యోదగ్రం తురుష్కంగజపతినృ
23. పతించాపిజిత్వాతధాన్యా(న్)। ఆగంగాతీరలంకాప్రథమచరమభూభృత్త
24. టాంతంనితాంతం ఖ్యాతఃక్షోణీపతీనాంస్రజమివశిరసా[ం*]శాసనం యో వ్య
25. తానీత్ ।[।*౧౧॥]††తిప్పాజీనాగలాదేవ్యోః కౌసల్యాశ్రీసుమిత్రయోః। దేవ్యో
26. రివనృసింహేంద్రాత్తస్మాత్పంక్తి రథాదివ।[।*౧౨॥]‡‡ వీరౌవిజయినౌ రామలక్ష్మ

రెండవ రేకు : మొదటి ప్రక్క

27. ణావివనందనౌ జాతౌ వీరనృసింహేంద్ర కృష్ణరాయ మహీపతి [।*౧౩।]వీరశ్రీ
28. నారసింహాఖ్యః విజయనగరే రత్నసింహాసనస్థః కీర్త్యాసీత్యావిర
29. స్యన్నృగనలనహుషాన్ సత్యవన్యామధాన్యా(న్) ఆసేతోరాసుమేరో
30. రవనిసురనుత స్త్వైర మాచోదయాద్రే రాపాశ్చాత్యాచలాంతా దఖిలమ్హా
31. దయమావర్జ్య రాజ్యంశశాస [।*౧౪॥][1] నానాదానాన్యకార్షీత్కనకసదసియః శ్రీ
32. విరూపాక్ష దేవస్థానే శ్రీకాళహస్తీ శితురపి నగరే వేంకటాద్రౌచ కాంచ్యాం
33. శ్రీశైలే శోణశైలే మహతిహరిహరే [౽*] హోబలే సంగమేచ శ్రీరంగేకుంభకో
34. ణే హతతమసి మహానందితీర్థే నివృత్తౌ। [।*౧౫॥] గోకర్ణే రామసేతౌ జగతి తదితరే
    ష్వప్యశే
35. షేషుపుణ్యస్థానే ష్వారబ్ధ నానావిధ బహుల మహాదానవారి ప్రవాహైః। యస్యో
36. దంచంతు[2] రంగ ప్రకరఖురరజః శుష్యదంభోధి మగ్నత్మా భృత్పతుచ్ఛిదోద్య త్కరకలి
37. శధరోత్కంఠితా కుంఠితాభూత్ [।*౧౬॥] బ్రహ్మాండం విశ్వచక్రం ఘటముదితమహాభూ
    తకంరత్నధేనుం
38. సప్తాంభోధిం చ కల్పక్షితిరుహలతికే కాంచనీం కామధేనుం స్వర్ణక్ష్మాం యో
39. హిరణ్యాశ్వరథమపి తులాపూరుషం గోసహస్రం [3]హేమగర్భం కనకకరిరథంపంచలాం

†† ౧౦, ౧౧, శ్లో. స్రగ్ధరలు. ‡‡ శ్లో. ౧౨, ౧౩ అనుష్టుభులు

1. ౧౪, ౧౫, ౧౬, ౧౭ శ్లోకములు స్రగ్ధరలు. 2. 'దంచత్తురంగ' అని. 3. ౪౦-వ పంక్తిలో (+హేమాశ్వం) అన్నమాటను యిచ్చట చేర్చి చదువవలయును.

40. గల్యతాసీత్। [।*౧౭॥] ప్రాజ్యంప్రశాస్యనిర్విఘ్నం(+ హేమాశ్వం) రాజ్యంద్యామివ శాసితుం

41. తస్మిన్గుణేన విఖ్యాతే క్షితేరింద్రే దివంగతే। [।*౧౮॥] త ...... తో౽ప్యవార్యవీర్య శ్రీకృష్ణ

42. రాయమహీపతిః బిభర్తి మణి కేయూర నిర్విశేషాంమహీంభుజే। [।*౧౯॥][1]కీర్త్యాయ స్యసమం

43. తతః ప్రసృతయా విశ్వైరుచ్చైక్యంవ్రజే దిత్యాశంక్య పురాపురారిరభవద్యాలేక్షణః ప్రా

44. యశః। పద్మాక్షో[ఽ*]పి చతుర్భుజో[ఽ*]జని చతుర్వక్త్రో[ఽ*]భవత్పద్మభూః కాలీ ఖడ్గమథాద్రమా

45. చకమలం వీణాంచవాణీకరే।[।*౨౦॥][2] శత్రూణాం వాస మేతేదదతఇతిరుషాకింను సప్తాం

46. బురాశీన్నానా సేనా తురంగత్రుటిత వసుమతీధూళికాపాలికాభిః। సంశో౽ప్య

47. స్వైరమేతత్ప్రతినిధి జలధిశ్రేణికాయోవిధత్తే బ్రహ్మాండస్వర్ణధేను ప్రము

48. ఖనిజమహాదానతో౽ప్యై రమేయైః। [।*౨౧॥] [3]మద్దత్తామర్థిసార్థ శ్రియమిహాసుచిరం

49. భుంజతామిత్యవేత్య ప్రాయఃప్రత్యూహహేతో౽ స్తపనరథగతేరాలయాంందే

50. వతానాం తత్తద్దిగ్జైర[4] వృత్యాబిరుద జనపదైరంకితాం స్త్రర[5] తత్ర స్తంభాంజాలప్ర

51. తిష్ఠాప్యవ్యతనుతభువియోభూభృదగ్రభంకషాగ్రా।[।*౨౨॥]కాంచీశ్రీశైలశోణాచలకనక

52. సభా వెంకటాద్రి ప్రముఖ్యే ష్వావత్యార్థవత్యః సర్వేష్వతనుత విధివద్భూయసే శ్రేయ శ్రేయం

53. దేవస్థానేషు తీర్థేష్వపి కనకతులాపూరుషాదీని నానాదానాన్యేపో౽పదానై

54. రపిసమమఖిలైరాగ మోక్తానితాని॥ [*౨౩॥] రో౽పకృతః(ః)ప్రతిపార్థివ దండః

55. శేషభుజక్షితిరక్షణశౌండః భాషెగతప్పవరాయరగండ స్తోపకృదర్థి

56. షుదోరరణచండః॥ [*౨౪॥][6] రాజాధి రాజ ఇత్యుక్తో యో రాజపరమేశ్వరః। మూ వ[7]రాయర

---

1. శ్లో. ౧౮, ౧౯ అనుష్టుభులు. 2. శ్లో. ౨౦ శార్దూలవిక్రీడితము. 3. శ్లో. ౨౧, ౨౨, ౨౩ స్రగ్ధరలు 4. 'దిగ్జైత్ర' అని. 5. 'తత్ర' అని. 6. శ్లో. ౨౪ దోధకవృత్తము. 7. "మూరు."

రెండవ రేకు : రెండవ ప్రక్క

57. గండశ్చపరరాజభయంకరః। [।*౨౫॥][1]హిందూరాయసుర[త్రా]ణో దుష్టశార్దూలమ
దర్దనః। వీర[ప్ర]తా

58. పఇత్యాదిబిరుదైరుచితైర్యుతః॥ [*౨౬॥] ఆలోకయమహారాయజయజీవేతివాదిభిః।అం

59. గవంగకలింగాద్యైర్రాజభిః సేవ్యతేచయః ॥ [*౨౭॥] స్తుత్యౌదార్యః సుధీభిః సవిజయ

60. నగరేరత్నసింహాసనస్థః తన్త్రపాలాన్ కృష్ణరాయక్షితిపతిరథరీకృత్యనీత్యాన్య

61. గాన్ । ఆపూర్వాద్రేరథాస్తక్షితిధర కటకా దాచహేమాచలాంతా దాసేతోరర్థి

సార్థ[శ్రీ]

62. యమిహబహులీకృత్య కీర్త్యా బభాసే॥[*౨౮॥][2] కృతవతిసురలోకంకృష్ణరాయేని

63 జాంశం తదను తదనుజన్మాపుణ్యకమూర్చ్యుతేంద్రః। ప్రకటమవనిలోకంస్వాంశమేత్యా

64. రిజేతాఖిలనతిహారిజేతా విశ్వదిష్టప్రదాతా। [*౨౯॥][3] యత్కీర్తిచంద్రశ్చరతికుమా

ర్యాంతిధిష్య

65. శేషాసు విర్దతేచ । తతో౽తి[4] చక్రస్యముదం సమింధేదివాచసాయం కుముదైశ్చ

రంధే॥[5] [*౩౦॥] మదం

66. మనసిమారుతం శిథిలయంత్యమేధైరయై ర్యదశ్వపటలీఖురైః క్షితిరజోభి

67. రుద్ధా పితైః । అజీజనదితిక్రుద్ధాకిముశోషయంత్యంబుధిం బల[ప్ర]మథ

68. నస్యనోరయవిరోధినాం వాజినాం [।*౩౧॥][6] కారాగృహీకలితవాసివిరోధిభూప

69. దారావలీకరవిచాలితచామరస్య రాజాధిరాజ పరరాజభయంకరైక వీరాదికాని

70. బిరుదాని బహూనియస్య ॥ [*౩౨॥][7] గోకర్ణసంగమనివృత్తిసువర్ణసంసత్ అచ్ఛాద్రి

పర్వతపరించి

71. పురేషుకాంచ్యాం। శ్రీకాలహస్తినగరేపిచకుంభఘోణే దానానిషోడశబహూనికృతాని

72. యేన ॥ [*౩౩॥] అంభోదేన నిపీయమాన సలిలో [*౭] గస్త్యేనపీతోజ్ఝిత స్తథ్ధో

రాఘవసాయకాగ్ని

73. శిఖయా సంతప్యమానః సదా । (।) అంతస్థై ర్వడబాముఖానలశిఖాజాలై ర్విశుష్యో

ధృవం[8]

1. శ్లో. ౨౫, ౨౬, ౨౭ అనుష్టుభులు. 2. శ్లో. ౨౮ స్రగ్ధర. 3. శ్లో. ౨౯ మాలిని. 4. "తతో౽తి" అనిపాకశ
పల్లి శాసనం. 5. శ్లో. ౩౦ ఉపజాతి. 6. శ్లో. ౩౧ పృథ్వి. 7. శ్లో. ౩౨, ౩౩ వసంతతిలకలు .8. 'ధ్రువం' అని.

74. యద్దానాంబు ఘనాంబు రంబుధిరహో పూర్ణఃసముద్యోతతే ॥ [*౩౪॥][1] అంగేనాపి
    కలింగేన వంగేనచ పరై

75. ర్నృపైః । జయజీవమహారాజే త్యనిశం గీయతేచయః ॥ [*౩౫॥][2] సజయతినరపాలో
    రత్నసిం

76. హాసనస్థో విజయనగరవాసీ కీర్తిపూర్త్యాదివిలాసీ నృగనలనహుషాద్యై[3]

77. నీచయర్య్య రాజనీత్యా నిరుపమభుజవీర్యౌదార్యధౌరచ్యుతాఖ్యః ॥ —॥[*౩౬][4]

78. శకాబ్దేశాలిబాహస్య[5] సాహస్రేణ చతుఃశతైః పంచపంచశతాయాతి

79. గణనా ప్రాపితేక్రమాత్ ॥ [*౩౭॥] నందనే వత్సరేమాసి

80. పుష్యే మకరసంక్రమే । (।) ఉత్తరాషాఢనక్షత్రే ప్రథమాయాం

81 మహాతిథౌ । [*౩౮॥] అమ్రవత్యాపగాతీరే శుక్లపక్షే శుభేదినే । బహు

82. ద్విజసమాకీర్ణే హరిశంకరసంనిధౌ [।*౩౯॥] నానాశాఖాభిధా

మూడవ రేకు : మొదటి ప్రక్క

83. గోత్రసూత్రేభ్యశ్చాత్తవృత్తయః । విఖ్యాతేభ్యోద్విజాతిభ్యో వేదవి

84. ద్భ్యోవిశేషతః । [।*౪౦॥] కొలుంజవాడిగ్రామేణ సహప్రాచ్యాంవిరాజితం[6]

85. అమ్రవత్యాపగాయాస్తుదక్షిణస్యాందిశిస్థితం । [।*౪౧॥] మూలగ్రామస్యసీమాయా

86. దృషదఃపశ్చిమేస్థితం । గ్రామస్యసౌమ్య[7]దిగ్భాగేస్థితంరాయగుళస్యతు । [।*౪౨॥]

87. అచ్యుతేంద్రసముద్రాఖ్యంనూతనంసముపస్థితం । నీలంబేరూరితిఖ్యాత

88. నామానంగ్రామముత్తమం । [।*౪౩॥] పుత్తూరిత్యాభిధానేనగ్రామకేణచసంయుతం ।

89. సర్వమాన్యచతుఃసీమాసంయుతంచాసమంతతః । [।*౪౪॥] నిధినిక్షేపపాషాణ

90. జలాన్విత[8]సమన్వితం । అక్షిణ్యాగామిసంయుక్తంగణభోగ్యసుభూయుతం । [।*౪౫॥]

91. వాపీకూపతటాకైశ్చకచ్ఛేనాపిసమన్వితం । పుత్రపౌత్రాదిభిర్భోగ్యా

92. న్క్రమాదాచంద్రతారకం । [।*౪౬॥] దానస్యాధమనస్యాపి[?]విక్రయస్యాపిచోచితం ।

---

1. శ్లో. ౩౪ శార్దూలవిక్రీడితము. 2. శ్లో. ౩౫ అనుష్టుభు. 3. "నృగనలనహుషాదీ"లోని కడపటి రెండు 'న' లున్ను బండిమీద చెక్కబడియున్నవి. 4. శ్లో. ౩౬ శార్దూలవిక్రీడితం. 5. "శాలివాహస్య" అని. 6. మొదట చెక్కిన అక్షరములు తుడిచి దానిమీద 'గ్రామేణసహప్రాచ్యాం' అను వాక్యము వ్రాయబడి యున్నది. 7. "యామ్య" అని. 8. "జలాధార" అని.

93. అచ్యుతేంద్రమహారాజ్ఞః శాసనాద్బాలభూపతిః । [।*౪౭॥] గావేరీవల్లభః శ్రీమా
94. న్మార్తాండాన్వయవిశ్రుతః । భూవరశ్చెన్నరాజస్యతనయః కాశ్యపాన్వయః [।*౪౮॥]
95. పెక్కొండ్రరాజకొక్కొత్తుగండః కటకభేదనః । పరిసంధిమహీపాల
96. దంతిసందోహకేసరీ । [।*౪౯॥] బిరుదావనిపాలానాం బాయిబందిః ప్రతాపవాన్
97. సర్వలక్షణసంపన్నః సద్గుణైర్భువి విశ్రుతః । [।*౫౦॥] కీర్తిప్రతాపవిఖ్యాతః
98. పరరాజభయంకరః । పుణ్యశ్లోకమహీశానాం చారిత్రేణానువర్తయన్ [॥*౫౧॥]
99. రాజరాజాఖ్యనగరే కొంగురాజ్యంప్రశాసయన్ । దుష్టనిగ్రహణంకుర్వన్
100. శిష్టానాం[1]పరిపాలయన్ । [।*౫౨॥] సేవయాస్వామినశ్చిత్తం తోషయిత్వావిశేషతః
101. విజ్ఞాప్యధర్మవేళాయాం లబ్ధ్వోద్యత్తామ్రశాసనం [॥*౫౩॥] సంప్రహృష్టమనాశ్చెన్న
102. బాలరాజేంద్రభూపతిః । తద్గ్రామస్యకులంసమ్యక్పరిహృత్యయథాగతం [॥*౫౪॥]
103. పూర్వోక్తభూసురాణాంచ బాలరాజోర్వీపాలకః । సహిరణ్యపయోధారా
104. పూర్వకం దత్తవాన్ముదా । [।*౫౫॥] అష్టోత్తరశతంయాతే తద్గ్రామక్షేత్రసంచయే।
వృత్తిమంతోవిలిఖ్యంతే
105. వేదవేదాంగపారగాః । [।*౫౬॥] శ్రీమాన్తిరుమలేతాతార్యస్తాతా

మూడవ రేకు : రెండవ ప్రక్క

106. చార్య(శ్చ)నందనః ఆపస్తంబః కౌశికోత్రాశ్నుతేవృత్తిచతుష్టయం । [।*౫౭॥] నల్లార
య్యాత్మజశ్చా
107. పస్తంబో[*౭]నంతార్యనామధృక్ । శ్రీవత్సగోత్రసంజాతో వృత్తిమేకామిహాశ్నుతే।
[।*౫౮] అయ్యావై
108. య్యాభిధానశ్చనల్లారయ్యార్యనందనః। ఆపస్తంబోశ్నుతేవృత్తిమేకాంశ్రీవత్సగోత్రజః
[।*౫౯॥]
109. ఎంబారైయ్యార్యతనయో యెంబారైయ్యాహ్వయఃసుధీః । ఆపస్తంబీభరద్వాజో
110. వృత్తిద్వయమిహాశ్నుతే ॥ [*౬౦॥] పెద్దిభట్టాహ్వయఃపెర్యనంబీసూనుర్మహామతిః।
111. ఆపస్తంబీభరద్వాజో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౬౧॥] నాగాభట్టార్యతనయో
112. రామచంద్రాఖ్యదీక్షితః । ఆపస్తంబఃకాశ్యపోత్రాశ్నుతేవృత్తిచతుష్టయం [॥*౬౨॥]
113. గంగాధరసుతఃకృష్ణమార్యః కౌశికగోత్రజః । ఆపస్తంబాఖ్యసూత్రశ్చ

1. "శిష్టాంశ్చ" అని.

114. వృత్తిత్రయమిహాశ్నుతే । [।*౬౩॥] రామచంద్రాత్మజో విశ్వామిత్రగోత్రాశ్వలాయనః
115. గంగాధరార్యోరుగ్వేదీ[1] వృత్తిమేకామిహాశ్నుతే। [*౬౪॥] రామచంద్రార్యతనయో
116. నంజుండాఖ్యోమహామతిః। విశ్వామిత్రోబహ్వృచశ్చ వృత్తిద్వయమిహాశ్నుతే [॥*౬౫॥]
117. ఎఱంభట్టారకో[2]నామ నర్వాభట్టాత్మజఃసుధీః । ఆపస్తంబీభరద్వాజో
118. వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౬౬॥] ఆపస్తంబీలక్ష్మణాఖ్యః నర్వాభట్టారకాత్మజః
119. కౌండిన్యగోత్రసంజాతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౬౭॥] ఆపస్తంబీతింమణాఖ్యో
120. నారసింహాస్యనందనః । కౌండిన్యగోత్రసంజాతో వృత్తిమేకామిహాశ్నుతే [॥*౬౮॥]
121. సింగాభట్టారకోనామ కొండాభట్టారకాత్మజః । ఆపస్తంబీభరద్వాజో
122. వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౬౯॥] రామాభట్టారకోనామ విశ్వామిత్రాశ్వలాయనః
123. యతిరాజార్యతనయో వృత్తిద్వయమిహాశ్నుతే ॥ [*౭౦॥] యతిరాజార్యతనయో
124. విశ్వామిత్రాశ్వలాయనః । వల్లభైయాభిధానశ్చ[3] వృత్తిమేకామిహాశ్నుతే । [।*౭౧॥]
125. నంజంభట్టార్యతనయో విశ్వామిత్రాశ్వలాయనః । లింగంభట్టారకోనామ
126. వృత్తిమేకామిహాశ్నుతే। [।*౭౨॥] వీరవల్ల్యాహ్వయస్యాత్మసంభవో [*౭] నంతదీక్షితః
127. కౌండిన్యాపస్తంబసూత్రో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౭౩॥] నర్వాభట్టారకోనామ
128. కామాభట్టాఖ్యనందనః । ఆపస్తంబఃకాశ్యపశ్చ వృత్తిమేకామిహాశ్నుతే [॥*౭౪॥]

నాలుగవరేకు : మొదటిప్రక్క

129. కౌండిన్యాపస్తంబసూత్రస్తిమ్మయాఖ్యో మహామతిః సూనుమంగళనాథస్య
130. వృత్తిమేకామిహాశ్నుతే । [*౭౫॥] కౌండిన్యాపస్తంబసూత్ర శ్చిట్టి భట్టాఖ్యనందనః।
131. తిమ్మయాఖ్యోతి మేధావి[4]వృత్తిమేకా మిహాశ్నుతే। [।*౭౬॥] బసదార్యస్యతనయో
132. విశ్వామిత్రాశ్వలాయనః నంజినాథాభిధానశ్చ వృత్తిమేకా మిహాశ్నుతే । [।*౭౭॥]
133. ముద్దంభట్టారకోనామ రుగ్వేదీ[5]హారితాన్వయః । లఖణార్యతనూజాతో
134. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౭౮॥] ఆపస్తంబీవత్సగోత్రః సింగాభట్టార్యనందనః।
135. అలగంభట్టనామాచ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౭౯॥] ఔథళార్యతనూజాతో
136. వాసిష్ఠశ్చాశ్వలాయనః । బైచం భట్టారకోనామవృత్తిమేకామిహాశ్నుతే। [।*౮౦॥]
137. దేవభట్టార్యతనయో వాసిష్ఠశ్చాశ్వలాయనః । రామాభట్టారకోనామ
138. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౧॥] ఆత్రేయగోత్రోరుగ్వేదీ[6]సూనుః సింగరియజ్వనః

1. "ఋగ్వేదీ". 2. "ఎఱ్ఱంభట్టారకో" అని, 3. "వల్లభయ్యాభిధానశ్చ". 4. "మేధావీ" అని. 5. "ఋగ్వే-దీ" అని. 6. "ఋగ్వేదీ" అని.

139. దుర్గాభట్టారకో నామ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౨॥] ఆత్రేయాపస్తంబసూత్రీ

140. రంగనాథార్యనందనః గోవర్ధన ఇతిఖ్యాతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౩॥]

141. ఆపస్తంబీచహారీతః కృష్ణభట్టాహ్వయాత్మజః కొండాభట్టారకో నామ

142. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౪॥] ఎర్రంభట్టారకో[1]నామ రామాభట్టాఖ్యనందనః

143. ఆపస్తంబీచహారీతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౫॥] నారసింహార్యతనయో

144. [*ఽ]నంతయాఖ్యోమహామతిః । ఆపస్తంబీచహారీతో వృత్తిమేకామిహాశ్నుతే । [।౮౬*॥]

145. నృసింహార్యాభిధానస్య తనయః సింగణాహ్వయః । ఆపస్తంబీచహారీతో

146. వృత్తిమేకామిహాశ్నుతే।[।*౮౭॥] అబ్బంభట్టార్య తనయస్తిమ్మంభట్టాహ్వయఃసుధీః।

147. ఆపస్తంబీచహారీతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౮॥] ఆశ్వలాయనసూత్రశ్చ

148. ప్రథమాత్రేయసంగతిః తిప్పార్యజస్తిమ్మయాఖ్యోవృత్తిమేకామిహాశ్నుతే । [।*౮౯॥]

149. రామాభట్టార్య తనయోవాసిష్ఠశ్చాశ్వలాయనః నారసింహాభిధానశ్చ

150. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౯౦॥] నృసింహార్యస్యతనయో భారద్వాజాశ్వలాయనః

నాలుగవ రేకు : రెండవ ప్రక్క

151. లఖ్ఖంభట్టారకోనామ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౯౧॥] అంణం[2]భట్టార

152. కోనామ తిమ్మాభట్టాఖ్యనందనః । ఆపస్తంబీకాశ్యప

153. శ్చ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౯౨॥] పెరుమాళాభిధానస్య సూనుస్తిం

154. మయపండితః । ఆపస్తంబీకౌశికశ్చ వృత్తిమేకామిహా

155. శ్నుతే । [।*౯౩॥] ఆపస్తంబీకాశ్యపేయో [*ఽ]నంతభట్టార్యనందనః । కొండం

156. భట్టఇతివిఖ్యాతో వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౯౪॥] వాధూలాపస్తంబ

157. సూత్రో లక్ష్మణార్యస్యనందనః । సూరంభట్టాహ్వయోవిద్వాన్వృత్తి

158. మేకామిహాశ్నుతే। [।*౯౫॥] దేవంభట్టార్యతనయః కాశ్యపశ్చాశ్వలాయనః

159. సోమనాథఇతిఖ్యాతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౯౬॥] మాధవార్య

160. సుతశ్చాప స్తంబీకౌండిన్యగోత్రజః । తింమాభట్టఇతిఖ్యాతో

161. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౯౭॥] వాసిష్ఠఃసోమనాథస్య సూనుర్బోధా

162. యనఃసుధీః । లింగంభట్టాహ్వయోవాగ్మీ వృత్తిమేకామిహా

163. శ్నుతే । [।*౯౮॥] సూర్యనారాయణసుతః పారాశర్యాశ్వలాయనః । మల్లికార్జున

---

1. "ఎఱ్ఱంభట్టారకో" అని. 2. అణ్ణం అని.

164. భట్టాఖ్యో వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౯౯॥] జామదగ్న్య[1]వత్సగోత్రో నారిభ
165. ట్టాఖ్యనందనః । నారసింహాహ్వయో వృత్తి మేకాం బోధాయనోశ్నుతే । [।*౧౦౦॥]
136. మంచిభట్టాత్మజశ్చాప స్తంబీగంగాధరాహ్వయః । కాశ్యపా
167. న్వయసంజాతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౦౧॥] భానుభట్టసుతశ్చాశ్వ లా
168. యనః కాశ్యపాన్వయః । లింగయాఖ్యో[౽*]తిమేధావీ వృత్తిమేకాం[2] [*॥౧౦౨॥]
169. ఆపస్తంబీతిమ్మణార్య సూనులోహితగోత్రజః । శ్రీమాన్
170. లక్ష్మణభట్టాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౦౩॥] ఆపస్తంబీభర
171. ద్వాజ సంతతిభాస్కరాహ్వయః । గంగణార్యస్యతనయో వృత్తి

ఐదవ రేకు : మొదటిప్రక్క

172. మేకామిహాశ్నుతే । [।*౧౦౪॥] తిమ్మయాఖ్యః పుల్లయస్య తనయఃకౌ
173. శికాన్వయః । ఆపస్తంబాఖ్య సూత్రశ్చ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౦౫॥]
174. నారాయణార్యాభిధానో రేకణార్యస్య నందనః। ఆపస్తంబః కాశ్య
175. పేయోవృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౦౬॥] శంకరాయార్యాహ్వయో ధీమాన్ రంగం
176. భట్టాత్మజః సుధీః । ఆత్రేయగోత్రజోవృత్తిమేకాం[3]ద్రాహ్య
177. యనోశ్నుతే।[।*౧౦౭॥]తమ్మాభట్టాహ్వయశ్చాశ్వలాయనః కాశ్యపాన్వయః। దేవ
178. రాయార్యతనూజాతో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౦౮] విష్ణువృద్ధాన్వయశ్చాశ్వ
179. లాయనఃసింగణార్యజః బ్రహ్మావి త్తింమణాభిఖ్యో వృత్తిమేకా
180. మిహాశ్నుతే । [।*౧౦౯॥] లఖింభట్టాఖ్యతనయ స్తింమయాఖ్యో మహామతిః
181. ఆపస్తంబో[౽*]శ్నుతేవృత్తిమేకాం హారితసంతతిః । [।*౧౧౦॥] వాధూలగోత్రజశ్చా
182. పస్తంబీసింగియనందనః।ధర్మరాజాహ్వయో వైదోృవృత్తిమేకామిహాశ్నుతే।[*౧౧౧॥]
183. దేవరాజార్యతనయో భాస్కరాఖ్యోమహామతిః । ఆపస్తంబో[౽*]శ్నుతే
184. వృత్తిమేకాం కుండిన[4]గోత్రజః । [।*౧౧౨॥] కౌండిన్యగోత్రో[5]రుగ్వేదీ విస్సాభట్టా
185. ఖ్యనందనః । ఎల్లంభట్టారకోనామ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౧౩॥] జామదగ్న్య[6]
186. వత్సగోత్రోన్నృహరిశ్చాశ్వలాయనః । విరూపాక్షార్యతనయోవృ
187. త్తిమేకామిహాశ్నుతే । [।*౧౧౪॥] ఆశ్వలాయనసూత్రశ్చకౌండిన్యః కవిగిం
188. గయః । తింమయాఖ్యతనూజాతోవృత్తి మేకామిహాశ్నుతే । [।*౧౧౫॥] బసవంభట్ట

1. జామదగ్న్య అని. 2. ఇచ్చట శ్లోకము అసంపూర్తిగ విడువబడినది. "ఇహాశ్నుతే" అన్నమాట విడువబడినది. 3. ద్రాహ్యాయణో అని. 4. కౌండిన్యగోత్రజః అని. 5. ఋగ్వేదీ అని. 6. జామదగ్న్య అని.

189. నామాచ కాశ్యపశ్చాశ్వలాయనః। రామాభట్టార్యతనయో వృత్తి
190. మేకామిహాశ్నుతే। [౧౧౬॥] లింగంభట్టారకో నామ కాశ్యపశ్చాశ్వలాయనః।
191. రామాభట్టార్య తనయో వృత్తిమేకా మిహాశ్నుతే। [।*౧౧౭॥] లింగంభట్టాత్మజశ్చా
192. శ్వలాయనో మంగణాహ్వయః విశ్వామిత్రాన్వయేజాతో వృత్తిమేకామిహా
193. శ్నుతే। [।*౧౧౮॥] కృష్ణంభట్టాహ్వయశ్చాశ్వలాయనః శ్రీపతేఃసుతః। విద్వాన్
194. వసిష్ఠగోత్రశ్చ వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౧౯॥] వత్సగోత్రోద్భవశ్చాప
195. స్తంబో [*ఽ] నంతప్పనామభృక్। సూనుర్వరదరాజస్య వృత్తిమేకాం

ఐదవ రేకు : రెండవ ప్రక్క

196. ఇహాశ్నుతే। [।*౧౨౦॥] కామాభట్టాత్మజశ్చాశ్వలాయనః కాశ్యపాన్వయః।
197. కొండంభట్టారకో నామ వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౨౧॥] భారద్వాజాన్వయ
198. శ్చాశ్వలాయనః కేశవాత్మజః। సిరిగంభట్టనామాచ వృత్తిమేకా
199. మిహాశ్నుతే। [।*౧౨౨॥] గర్గగోత్రోద్భవశ్చాపస్తంబీ శ్రీకృష్ణయాహ్వయః। శ్రీవెం
200. గడస్యతనయో వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౨౩॥] ఆపస్తంబాఖ్యసూత్రీచ మాధ
201. వోమాచయాత్మజః। కౌండిన్యగోత్రసంజాతో వృత్తిమేకామిహాశ్నుతే॥ [*౧౨౪॥]
202. విరూపాక్షాహ్వయశ్చాపస్తంబీ కౌండిన్యగోత్రజః। నారాయణార్యత
203. నయో వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౨౫॥] శ్రీరామానుజదాసస్య సూనుఃకాశ్యప
204. గోత్రజః। బోధాయనో[ఽ*]నందాళ్వాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే॥ [*౧౨౬॥]
205. పోచిభట్టాహ్వయశ్చాప స్తంబీగంగాధరాత్మజః। ధీమానాత్రేయగో
206. త్రశ్చ వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౨౭॥] మారాభట్టార్యతనయో లింగాభట్టా
207. హ్వయఃసుధీః। ఆపస్తంబో[ఽ*]శ్నుతేవృత్తి మేకాంకౌశికగోత్రజః॥[।*౧౨౮॥] రామా
208. భట్టాత్మజశ్చాపస్తంబశ్చెవ్వందినామభృక్। పరాశరాన్వయేజాతో
209. వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౨౯॥] వల్లభార్యసుతశ్చాపస్తంబీ కౌండిన్యగో
210. త్రజః। ధీమాన్తిమ్మయభట్టాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే। [।*౧౩౦॥] కామా
211. భట్టాత్మజశ్చాపస్తంబీవాధూలగోత్రజః। లింగయాఖ్యో[ఽ*]తిమేధావీ
212. వృత్తిమేకామిహాశ్నుతే॥ [*౧౩౧॥] వల్లంభట్టాఖ్యతనయ స్తిమ్మాభట్టారకా
213. హ్వయః। ఆపస్తంబో[ఽ*]శ్నుతేవృత్తి మేకాంశాండిల్యగోత్రజః। [।*౧౩౨॥] శోభ
214. నార్యస్యతనయ స్తిమ్మయాఖ్యోమహామతిః। ఆపస్తంబో[ఽ*]శ్నుతే
215. వృత్తి మేకాంకౌశికగోత్రజః। [।*౧౩౩॥] ఆపస్తంబీ భరద్వాజగోత్రజ స్తిం

216. మ్మయాహ్వయః । వెంగళాఖ్యస్యతనయో వృత్తిమేకామిహాశ్నుతే ॥ [*౧౩౪॥]
217. అంనం[1]భట్టాఖ్యతనయ స్తిమ్మాభట్టాహ్వయః సుధీః । ఆపస్తంబో[ఽ*]శ్నుతే
218. వృత్తి మేకాంసంకృతిగోత్రజః । [।*౧౩౫॥] శ్రీమాన్కోనేరిదేవాఖ్య స్తిమ్మాభ
219. ట్టాఖ్యనందనః । ఆపస్తంబో[ఽ*]శ్నుతేవృత్తి మేకాంశ్రీవత్సగోత్రజః [।*౧౩౬॥]

ఆరవరేకు : మొదటిప్రక్క

220. లక్ష్మాభట్టార్యతనయ స్తిమ్మాభట్టాహ్వయఃసుధీః । శ్రీవత్సాప
221. స్తంబసూత్రో వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౧౩౭॥] ఆత్రేయాపస్తంబసూత్రో
222. వీరాభట్టాఖ్యనందనః । సర్వాభట్టాభిధానశ్చవృత్తిమేకా
223. మిహాశ్నుతే । [।*౧౩౮॥] ఆపస్తంబీగర్గగోత్రః సూనుర్నారయజ్వనః ।
224. యజ్వాహ స్తిగిరీంద్రాఖ్యో[ఽ*]శ్నుతేవృత్తిచతుష్టయం । [।*౧౩౯॥] ఆపస్తంబీ
225. తిమ్మయార్యసూనుః కౌశికగోత్రజః । సౌమ్యకేశవదాసాఖ్యో
226. వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౧౪౦॥] సర్వాభట్టాత్మజో భారద్వాజగోత్రో
227. ద్భవఃసుధీః । ఆపస్తంబీసోమయాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే [।*౧౪౧॥]
228. ఆపస్తంబ్యబ్బయాఖ్యశ్చ సూనురాత్రేయగోత్రజః । ఎల్లయాఖ్యో
229. వృత్తిమేకా మశ్నుతే నిశ్చలాత్మకః । [।*౧౪౨॥] ఆపస్తంబ్యబ్బయాఖ్యస్య
230. సూనురాత్రేయగోత్రజః । తిమ్మయాఖ్యో[ఽ*]తిమేధావీ వృత్తిమేకా
231. మిహాశ్నుతే ॥ [*౧౪౩॥]స్వగ్రామవాసినాంసమ్యగ్రక్షితుఃపార్వతీపతేః
232. వృత్తిరేకాతిసుఖదా సుధాహారాయకల్పితా । [।*౧౪౪॥] స్వగ్రామవా
233. సినాంసమ్యగ్రక్షితుఃశ్రీరమాపతేః । వృత్తిరేకాతిసుఖదా
234. సుధాహారాయకల్పితా । [।*౧౪౫॥] వేదాభ్యాసరతానాంచ బాలకానాం
235. ద్విజన్మనాం । ఋగ్యజు[2]ర్వేదవక్త్రోశ్చ కల్పితంక్షేత్రయుగ్మకం । [।*౧౪౬॥]
236. ఈఅచ్యు[*త]రాయసముద్రవెం । బీ అగ్రహారక్కె హోనకాల్వెయ
237. తహాల్లి[3] వీరాదిమంగలద సీమెయల్లి కాల్వెయనగదు[4]
238. కొండు హోకదక్కె[5] ఆనెలనఛేగెగాగి ప్రతియాగి అచ్యుత
239. రాయసముద్రదొళగె కొట్టదు ఇప్పత్తుఖండుగగద్దె ॥

1. అన్నం అని. 2. 'ఋగ్యజు' అని. 3. 'తహాల్లి' అనునది గ్రామ్యము. 'తపఃపల్లి' అనునది దీనికి సరియైన రూపము. 'తపఃపల్లి' మొదట తప్పల్లిగ మారి కడపట తహాల్లియైనది. 4. "నగెదు" అని. 5. హోగుదక్కె.

240. ఆఅచ్యుతరాయసముద్రద కాల్వెయమేలె పాలవనూకట్టి ।
241. వీరాదిమంగలదకాల్వెయ నీరనూ హారియిసికాట్ట[1] ఆపాల
242. [2]ఓమదరేముఱిదదుంటాదరె[3] ఆవీరాదిమంగలదవరె కట్టిసువ

ఆరవరేకు : రెండవప్రక్క

243. ఉంపకుయక్కె[4] శలవాగికొట్టదు[5] యెరడుఖండుగగద్దె॥—॥
244. ఈ అచ్యుతరాయసముద్ర[?]వెంబ[6] అగ్రహారక్కెఎల్లె । తెంబాంగలీక
245. నాడిగెసలువ సీలంబేహూరు । అదఱ[7]కాల్వళి[8] పుత్తూరు । నరెయ
246. నూరనాడిగె సలువ కొళింజవాడి యొళగాగి అగ్రహార
247. వాద । అచ్యుతరాయసముద్రద చతుస్సీమెయమేరెయవివర ।
248. మూడణదిక్కిగె మూలనూర ఎల్లెతలహిసల్లి[9] నెట్టవామనముద్రెకల్లు
249. దక్షిణదిక్కిగెరాయగుళద ఎల్లెతలహిసల్లి నెట్టవామనముద్రకల్లు
250. అదక్కెపడువణ దిక్కిగె పత్తిమూర ఎల్లెతలహిసల్లి నెట్టవామన
251. ముద్రెకల్లు । అదఱింద[10]పడవలు మణకడహినఎల్లెయల్లి నెట్ట ।
252. వామనముద్రెకల్లు । అదఱిందపడువలు వీరాదిమంగలద హిరియకాల్వె ।
253. అదఱిందబడగలు తిరుగిద ఎల్లెవివర । అదఱిందబడగలు వీరాది
254. మంగలదకాల్వెయ వోరగొండు ఆకాల్వెయమూడలు నెట్టవామనముద్రెయ
255. కల్లు । అల్లిందబడగలు । మూఱు[11]ఆలదమరద కెళగె నెట్టవామన
256. ముద్రెకల్లు । అదక్కెబడగలు వీరాదమంగలద హెద్దారివిడిదుకీళు
257. మణ్ణరె[12]వొళగాగినెట్టవామనముద్రెకల్లు । అదకెమూడలు వొడెయ
258. పిరాటియ మెల్లెగతెంకలాగి నెట్టవామనముద్రెకల్లు॥
249. అదక్కెఈశాన్య అగ్రమావతిహాళె । ఆకల్లిగెఈశాన్యక్కె
260. పెరమయద ఎల్లెకల్లు । అదక్కెఈశాన్యక్కె । (।) మూలనూర ఎల్లెకల్లు॥

ఏ డ వ రే కు

261. ఈతామ్రశాసనవు । (।) కొంగుధారాపురక్కె మూడలు అర్ధయోజన
262. దల్లి సర్వమాన్యవాద అచ్యుతరాయసముద్రవెంబ అగ్రహారక్కె

1. కొట్టు. 2. ఒడదరె. 3. 'ముఱిగుదుంటాదరె' అని. 4. 'ఉపకుయ' అని. 5. 'సలువాగి కొట్టుదు'. 6. 'అచ్యుతరాయసముద్రవెంబ' అని పఠించవలయును. 7. 'అదఱ' అని. 8. 'కాల్వళి'. 9. 'తలెహిసల్లి'. తక్కిన చోట్లను అట్లే. 10. "అదఱింద" అని. తక్కినచోట్లను అట్లే. 11. "మూఱు". 12. రే.

263. విద్యానగరియల్లి సింహాసనస్థరాగి ఇద్దంథా అచ్యుతదేవ
264. మహారాయర స్వహస్తద ఒప్పవనుళ్ల ఈతాంమ్ర[1]శాసనవనూ।
265. చోళాన్వయద చెన్నరాజతనూభవ బాలరాజగళూ అచ్యుత
266. రాయమహారాయరకయ్యల్లి పాలిసికొండు ఆకొంగుధారాపురద
267. అమ్రావతియెంబ హొళెయల్లి తంమ[2]ఉభయవాగి హొసఅణెయనూ।
268. కట్టిసి హొసకాల్వెయనూ తందు అగ్రామసీమెయకుళనూ
269. అనాడవరిగె కళిదుకొట్టు తమ్మస్వామి అచ్యుతదేవమహా
270. రాయర హెసరినల్లి। (।) అచ్యుత[3]రాయ సముద్రవెందు నామాం
271. కితవనూ మాడి కృష్ణార్పణబుద్ధియింద ఈఅగ్రహారద నూ ర్ఱ[4]
272. హత్తువృత్తియనూ వేదాంతవిత్తుగళాగి ఇద్దంథా బ్రాహ్మణోత్తమరిగె
273. సహిరణ్యోదకదాన ధారాపూర్వకవాగి ఆచంద్రార్కస్థాయియాగి తంమ[5]
274. స్వామి అచ్యుతరాయమహారాయరిగె పుణ్యవాగలియెందు చోళవంశోద్భవ
275. బాలరాజగళూ కొట్ట నీలంబేహూరు కొళుంజవాడి చతుఃసీమెయొళ[6]గాదకాల్వెల్లి సహ
276. వాగి సర్వమాన్యవాద అచ్యుతరాయసముద్రవెంబ అగ్రహారద తామ్రశాసన।
277. దానపాలనయోర్మధ్యేదానాచ్ఛ్రేయో[ఽ*]నుపాలనం। దానాత్స్వర్గమవా
278. ప్నోతిపాలనాదచ్యుతం పదం। [।*౧౪౭॥] స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తా
279. నుపాలనం। పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్। [।*౧౪౮॥] స్వ
280. దత్తాం పరదత్తాంవా యోహరేతు[7]వసుంధరాం। షష్టివర్షసహ
281. స్రాణి విష్ఠాయాంజాయతేక్రిమిః। [।*౧౪౯॥] ఏకైవభగినీలోకే సర్వే
282. షామేవభూభుజాం। నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా [।*౧౫౦॥]
283. సామాన్యో[ఽ*]యం ధర్మసేతుర్నృపాణాం కాలేకాలే పాలనీయో భవద్భిః।
284. సర్వా నేతాన్భావినః పార్థివేంద్రాన్భూయో భూయో యాచతే రామచంద్రః॥
[।*౧౫౧॥]
285. శ్రీమదచ్యుతరాయేంద్రః (।) శాసనాచ్ఛసభాపతిః అభాణీన్మృదు
286. సందర్భం తదిదంతామ్రశాసనం। [।*౧౫౨॥] శ్రీమదచ్యుతరాయేంద్ర శాసనాత్
287. మల్లణాత్మజః। అసౌశ్రీవీరణా
శ్రీవిరూపాక్ష 288. చార్యోవ్యలిఖత్తామ్రశాసనం॥—। [*౧౫౩॥][8]

---

1. "తామ్ర" అని. 2. 'తమ్మ' అని. 3. 'అచ్యుతరాయ'లోని 'త' మొదట విడువబడి తరువాత "చ్యు" 'ర' ల మధ్య మాక్కుముగ చెక్కబడియున్నది. 4. 'నూఱు.' 5. 'తమ్మ' అని. 6. 'యొళగాద' అని. 7. 'హరేత' అని. 8. శ్లోకములు ౩౪ మొదలు ౧౫౨ వఱకును అనుష్టుభౌలు.

# ఛాయామూర్తివిలాసము



ప్రకృతి పురుష స్వభావోపపాదనమున
*ఛాయయేమూర్తి మూర్తియేఛాయ
[యనుచుఁ
దెఱపు మఱపులఁ దేల్చి సంధించి పలుకు
వాదకర్తల కెందు నావందనములు.

మూర్తి:—

కను విప్పి చూడఁగంటిని
మనసైనది కదలి మెదలి మాటాడంగా
నను మేలుకొలిపి రెవ్వరు?
ఘన యోగారూఢనిద్రఁ గాంచినవాఁడ.

ఒంటినై యుంట తెలియఁగుదు, నోరులు వచ్చి
♦పలుకలేరని యెఱుఁగుదుఁ, బిలుచుచుంటిఁ
గూడి మసలంగవలెనని కోరుచుంటిఁ
బలుకరే! రారె! యెవరున్న భ్రాంతి గాక!

ఛాయ:—

ఓయని పలుకుదు నిదె నీ
ఛాయను, నామూర్తి! †భ్రాంతి చనునయ్య,
[నన్నీ
నీయాజ్ఞావర్తిని, నీ
ప్రేయసి, నీపాదదాసిఁ, బ్రీతిం గనుమా!

మూర్తి:—

ఛాయా! ప్రేయసి! చెపుమా!
నాయెడ లటు జల్లుమనఁగ నాకోర్కులతో
నాయుల్ల ముల్లసిల్లఁగ
సాయపడినయట్టి ‡మంత్రసానివి నీవా!

గర్భనరకమో స్వర్గమో కాని యెఱుఁగ,
అంధకారమో తేజమో యది యెఱుంగ,
ఉద్ధతాజ్ఞానమో జ్ఞానమో యెఱుంగ,
చెప్పలేని యవస్థఁ గాంచితిని నాఁడు.

మాయామయగోళంబునఁ
గాయను గనరాక బిందుకళలోఁ డిందక
వాయెఱుఁగనిగతి నుండితి
ఛాయా యానాఁటి కెందు చనితివి చెపుమా!

ఛాయ:—

లీలామూర్తివి నాకుఁ
జాలిం బడ నేల? క్రొత్తసంసారమె! నీ
కోలిం ꟾబాములువడఁగా
నేలా? యది మనవిలాస మెఱుఁగవె మూర్తీ!

---

* ఛాయయే మూర్తి, మూర్తియే ఛాయ యనియును.

♦ పలుకలేరు పలుకుటకు లేరు, అనియును.

† భ్రాంతియే యొప్పుననియును.

‡ లౌక్యమునకు రాణివి - అనఁగా మంత్రివనియును.

ꟾ బాములు — కష్టములు — పుట్టువులు అనియును.

మూర్తి:—

నిండు వెలుఁగునఁ జూచితి నీవు లేవు,
నిండుచీఁకటిఁ గాంచితి నీవు లేవు,
వెలుఁగుఁ జీఁకటిసందుల వెదకికూడ
నాఁడు నాచాయ! నిన్నుఁ గానంగనైతి.

ఛాయ:—

నిండువెలుఁగు దలంపఁగా నీవు గావె
నిండుచీఁకటి గణియింప నేను గావె
వెలుఁగుఁజీఁకటి *మనమైనవిధముఁ దెలిసి
నాఁడు నామూర్తి! వేఱ కానంగ నేల?

మూర్తి:—

నిన్ను వేఱుసేసి నే నిల్వఁగందునే
ఆకులతకు మూల మదియె కాదె,
భ్రాంతిలతకు ద్వంద్వఫలసిద్ధి యది కాదె
అదియె నీదులీల యగును గాదె.

ఛాయ:—

లేదు పాపపుణ్యంబులలీల నాకు
లేదు సుఖదుఃఖపరిణామలీల నాకు
లేదు కీర్త్యపకీర్తులలీల నాకు
నీయడుగులీల యొక్కటే నియతి నాకు.

మూర్తి:—

నాతోడునీడఁగా నడయాడుదువు గాని
యేకోరికయుఁగూడ నీకు లేదు,
నేఁ జేయుపనుల నన్నిటఁ గూడుదువు గాని
యేకర్జమునుగూడ నీకు లేదు,
నాయున్నతికొలంది †నాక మంటుదు గాని
యే‡కొలయునుగూడ నీకు లేదు,
నే బడలి పరుండ మైఁ బట్టుదువు గాని
యేకష్టమునుగూడ నీకు లేదు
నిజము నాచాయ! యేదియు నీకు లేదు,
లోకమునఁ లేని దేదియు నాకు లేదు,
అన్ని యున్నవి నీ వున్నయపుడె నాకు,
కలది యేదియు లేదు నాకంటె నీకు.

ఛాయ:—

ఆదర్శమూర్తి! నాకుఁ
నీదీవన యేటిక్రొత్త, నిత్యాశ్రయన
మ్మోదన ♦మనాదిగ నిచ్చిన
నాదైవమ వీవు గావునఁ సేవింతున్.

మూర్తి:—

మున్నాఁడీ మెసవనోల్లవు
నన్నెడసి, యొకప్పుడేని నాపానుపుపై
వెన్నొంపవు మున్నుగ §నా
కన్న సతీరత్న మీవు గావే చాయా!

ఛాయ:—

నిత్య పురుషమూర్తీ! నినుఁ
బత్యనురూపమునఁ బడసి బ్రహ్మాండము గా

---

* మనము — మన మిరువురమును, మనస్సు అనియును.

† ఉప్పొంగుదువు.

‡ కొల-కొలత, పాపము.

♦ అనాదిగ అనియు - నాదిగ - నాసొంతమైనదిగ అనియు.

§ నాకన్న-నాకంటె, నేనుకన్న అనియు.

*సత్యాఖ్యఁ బొందఁగంటిని
†సత్యమునకుఁ జాయ నైతి సౌభాగ్యమునన్.

మూర్తి:—

సుమమున సౌరభమట్టులు
క్రమమున నాలోన నిండి, కాలపవనవి
భ్రమమున వెనుకను ముందును
సమయ మెఱిఁగి సంచరించుచతురవు చాయా!

ఛాయ:—

నీలో నుండుదుఁ గానీ
నాలో నీ వుంటివే! సనాతన నన్నుం
గాలానువృత్తిఁ బెట్టిన
జాలికుఁడవు నీవు గావె శాశ్వతమూర్తీ!

మూర్తి:—

నా కన్నదాన వయ్యును,
నాకన్నులపాప వయ్యు, నాయడుఁగులనే
మైకొన్న చామ వయ్యును
నాకు సనాతన వదెట్లు నమ్మదుఁ జాయా!

ఛాయ:—

సకలలోకావనశంభుమూర్తివి నీవు
నీ ‡యొంటియద్దంపుఁజాయ నేను,
విశ్వ సమ్మోహన విష్ణుమూర్తివి నీవు
నీయెడఁ గల సిరిచాయ నేను

అతిరాగమ చతురాస్యమూర్తివి నీవు
నీయొప్పిదపుఁ బల్కుఁజాయ నేను,
భవ్యతేజోమయ భానుమూర్తివి నీవు
నీయడుగులఁ బట్టు చాయ నేను,
మూలరూప పరబ్రహ్మమూర్తి వీవు,
మూలహేతుమాయానంతమూర్తి నేను,
నను సనాతనఁ, బ్రకృతి, ననంత, లీల
నీశ! నీయనంతచ్ఛాయ నేలికొనుము.

మూర్తి:—

§కంటిలోఁ బాపవు గావె నాచాయ!
వెర వేది ని న్నింక వేఱుసేయంగ;

ఛాయ:—

ఇంటిలో దీపంబ వీవె నామూర్తి!
వీ లేది నిన్నింక వీడి యుండంగ;

మూర్తి:—

కష్టప్రపంచంబు గడచన్నదాఁక
నాతోడ నుండుమా నాచాయ నీవు;

ఛాయ:—

సృష్టికి విశ్రాంతి చేకూరుదాఁక
నను వీడఁబోకుమా నామూర్తి నీవు;

---

* సతీ-ఆఖ్య; సత్య-ఆఖ్య అనియు: ఇందు నిత్యునకు సత్యయు, పురుషునకు సతియు అనుస్మరణ యున్నది.

† సత్యమునకు నిజమునకు చాయను, చాయను-మాయనైన నేను, సౌభాగ్యవశమున సత్యస్వరూపుఁ డైన నీకు జాయనైతినని ధ్వని.

‡ ఒంటియద్దము-ఏకార్థము, అర్ధశరీరమని.

§ కంటిన్ - లోన్ - పాపవు గావె-చిన్న బిడ్డవు, గావు అనియును.

మూ ర్తి:—

అద్వయానందభాగ్యము కల్గుదాఁక

ననుఁ గొల్చుచుండుమా నాఛాయ నీవు;

ఛాయ:—

అమర బ్రహ్మానంద మబ్బినదాఁక

నాసేవ లందుమా నామూర్తి నీవు;

ఛాయ:—ఓ జగద్విధాత!

మూ ర్తి:—ఓ జగద్రూపిణీ!

ఛాయ:—వందనము.

మూ ర్తి:—శుభాభినందనములు.

ఛాయ:—ఓ యనంతమూర్తి!

మూ ర్తి:—ఓ యనంతచ్ఛాయ!

ఛాయ:—నిత్యజయము నీకు.

మూ ర్తి:—నిత్యశుభము.

---




3. శీఘ్రజలగామి 'మిస్ ఇంగ్లండు III.'

P. P. A.

# నూతనరాజ్యాంగవిధానము, స్వదేశసంస్థానములు

లేపమళ్ల రామచంద్రరావు పంతులుగారు, యమ్. ఏ., బి. యల్.

## ఉపక్రమణిక

భారతదేశమునకు గావలసిన రాజ్యాంగవిధానమునుగూర్చి కొన్ని సంవత్సరములనుండియు జరుగుచున్న చర్చలలో నిటీవల స్వదేశసంస్థానాధీశులు పాల్గొని మనరాజకీయములలో నొక నూతనభానూదయమును సంప్రాప్తింపజేసిరి. భారతదేశపరిపాలనవిషయమున నిర్ణీతము కాగల యెట్టివిధానమునకైనను నాధారములగు ముఖ్యసూత్రములలో స్వదేశసంస్థానములు గూడ మన భారతసామ్రాజ్యభాగములుగ నుండి బ్రిటిష్-ఇండియాయందలి రాష్ట్రములతో సరిసమానముగ తుల తూగుచు భారతదేశపు కేంద్రప్రభుత్వమునగూడ ప్రాతినిధ్యము గలిగియుండుట యొక ముఖ్యసూత్రమై యున్నది. ఈసూత్ర మేదొక్క-పార్టీవలననో మాత్రమే యామోదించబడినది కాదు; అందరు బ్రిటిష్పార్టీదారుల వలనను, బ్రిటిష్ప్రభుత్వమువారివలనను, భారతదేశమందలి కాంగ్రెస్, మితవాద్యాదిపక్షములవలనను నిరాఘాటముగ నామోదించబడినది.

కాని ఈస్వదేశసంస్థానముల నన్నిటిని రాజ్యాంగవిధానమున నెట్లు సమన్వయించుట యనునది మిక్కిలి కష్టమగుసమస్య. ఏలయన, భారతదేశమునందలి యీ స్వదేశసంస్థానములసంఖ్య సుమారు ఏడువందలకు మించినది. హైదరాబాదు, బరోడా, మైసూరు, తిరువాన్కూరు, కాశ్మీర్, మొదలగు పెద్దపెద్ద భూవసతిగల సంస్థానములు మొదలు ఏదొక్క గ్రామమో రెండుగ్రామములో తమ యావత్సంస్థానముగ గల కథియవాడ్ సంస్థానములవఱకును మనదేశమున గలవు. ఇవన్నియు బ్రిటిష్-భారతదేశపు పెద్దపెద్ద రాష్ట్రములతోపాటు పరిపాలనావిషయమున సమాన సత్వములు గలిగి యెట్లు నిలువబడగలవు? పెక్కురకములుగనున్న యీ యేడువందల సంస్థానములను మన మెట్లు మేళగించగలుగుదుము? ఈసంస్థానాధీశుల కందరకును సమానత్వ మొసగుటయు, శాసనసభలను వీరందరితోను బ్రిటిష్-ఇండియా ప్రతినిధులతోను నింపుటయు అనువుగానట్టియు, హాస్యాస్పదములగునట్టియు మార్గము లని యెల్లరును గుర్తించుచున్నారు. కావున భవిష్యద్రాజ్యాంగవిధానమున స్వదేశసంస్థానములను గూడ బ్రిటిష్-యిండియాతో కలిపియే తత్సంస్థానములును మనమును సమానముగ నిలువగల 'ఫెడరల్' పద్ధతిని తయారు చేయుట ప్రస్తుతసమయమున ముఖ్యమైయున్నది. రౌండు టేబిల్ కాన్ఫరెన్సువారును తదితరులును ఈవిషయమై శ్రద్ధవహించుచున్నారు. కాని, ప్రజలకు స్వదేశసంస్థానములను గుఱించికాని వానివిషయమై రానున్న మార్పును గుఱించికాని యేమియు తెలియదు. తెలిసినసంగతులు సరిగ బోధపడుటలేదు. ఆంధ్రదేశీయుల కీవిషయముల నించుక బోధపరచుటకును, నాయభిప్రాయములను వారి కందజేయుటకును ఉద్దేశించి యీవ్యాసలేఖనమున కుపక్రమించితిని. ఈవ్యాసమును పఠించుటవలన ప్రస్తుతము రాజకీయచర్చలలో ముఖ్యస్థానము నాక్రమించుచున్న యీ క్లిష్టసమస్యనుగూర్చియు, యిందలి క్లిష్టతను నివారించుటనుగూర్చియు ఆంధ్రదేశస్థులు చక్కగ తెలిసికొనగలుగుదు రని నా యాశయము.

## సంస్థానముల యావశ్యకత

ఈమధ్య సంస్థానముల ప్రజల సమావేశములు కొన్ని జరిగినట్లు పాఠకులు పత్రికలలో జూచి యుందురు. సంస్థానాధీశుల పరిపాలనము సరిగ లేదనియు, వారు తమ ప్రజలను బాధలు పెట్టుచున్నారనియు, ప్రజలకు సంస్థానముల పరిపాలనమునం దేవిధమగు జోక్యము నొసగుట లేదనియు ఇట్టిపరిస్థితు లంతరించి

సంస్థానము లాధునిక మార్గమున బ్రవర్తిల్లినగాని సంస్థానముల ప్రజలకుగాని బ్రిటిష్-ఇండియా ప్రజలకుగాని క్షేమము కలుగజాలదనియు పైన పేర్కొనబడిన సమావేశములు సలిపిన యాందోళనమైయున్నది. సంస్థానములనుగూర్చి యేమియు నెఱుగని వారీపైసంగతులను పత్రికాముఖమున నప్పుడప్పుడు తిలకించి స్వదేశసంస్థానములను కూకటివ్రేళ్లతో పెల్లగించి పారవైచినగాని భారతదేశమునకు మోక్షములేదని యభిప్రాయపడుటలో నాశ్చర్యము లేదు. కాని, సంస్థానములప్రజలుగాని, సంస్థానములనుగూర్చిన సంగతులను పరిశీలించినవారుగాని యిట్టి యభిప్రాయమును చెంతకు జేరనీయరు. సంస్థానముల పరిపాలన విషయమున ప్రజలకును కొంత బాధ్యత నొసంగవలెనని వారు కోరుదురే కాని సంస్థానములను రూపుమాపి, చదును చేసి, యావద్భారతదేశమును భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించి ఆరాష్ట్రములను కేంద్రప్రభుత్వముతో లంకించి 'ఫెడరల్' పద్ధతిని ప్రవేశపెట్టుటకు వారంగీకరించరు. సంస్థానములనుగూడ బ్రిటిష్-ఇండియాలో కలిపి రాజ్యాంగవిధానమును తయారుచేయుట కష్టముగదా యని, పైప్రకార మొక్కత్రుటిలో సంస్థానములనే తీసివేయు మనుట న్యాయ్యముగాని, సంభవముగాని యగు పనికాదు. సంస్థానములవలన మన కనేకములగు మేళ్లు కలిగినవని మనము గుర్తించవలెను. బ్రిటిష్-ఇండియాలో భారతీయులకు నిన్న మొన్నటివఱకును పెద్దపెద్దయుద్యోగము లీయబడలేదుగదా? భారతీయులకు తెలివితేటలుగాని, నైతికౌన్నత్యముగాని లేదు కాబట్టి చిన్న చిన్న పనులకే వారు పనికివత్తురుగాని కార్యదక్షత కావలసి వచ్చినపుడు వారెందుకును పనికిరా రనునింద ప్రతి భారతీయుని చెవియందును పడియేయుండెను. బ్రిటిష్-ఇండియా యిట్టిపరిస్థితులలో నుండియున్న సమయమున సర్ మోక్షగుండం విశ్వేశ్వరయ్య, సర్. టి. మాధవరావు, సర్ సాలర్ జంగు, సర్ దినకరరావు మొదలగు రాజకార్యప్రవీణులు, పరిపాలనాదక్షులు, రాజనీతిధురంధరులు స్వదేశసంస్థానములలో నత్యున్నతపదవుల నాక్రమించికాదా భారతీయుల ప్రాశస్త్యమును నిర్వివాదాంశముగా ప్రపంచమునకు చాటినది? బ్రిటిష్-ఇండియాలో నేటి కీవిషయమున నొకించుక పరిస్థితులు మారినవి. కాని, నేటికిని సైన్యమున నున్నతోద్యోగములు భారతీయులకు బ్రిటిష్-ఇండియాలో లభించుట లేదు. యుద్ధకార్యమున భారతీయుల కేవిధమగు ప్రతిపత్తియు లేని సందర్భములో హైదరాబాదు, మైసూరు, బరోడా, గ్వాలియర్, ఇండోర్, పాటియాలా, కాశ్మీర్, బికనీర్, మున్నగుసంస్థానములు తమతమ సైన్యములందు భారతీయులనే యున్నతోద్యోగము లందు నిలుపుచున్నారు. ఆసైన్యములు గొప్ప యుద్ధచాతుర్యము గలవై యున్నవి. పాశ్చాత్యులగు సలహాదార్ల సాహాయ్యమున మంచిశిక్షణమును బొంది యీసైన్యములు మంచిరణకౌశలముగలిగి ధైర్యశౌర్యములు బ్రిటిష్-ఇండియాయం దంతరించుచున్నను భారతదేశమున నంతరించలేదని చాటుచు నేటికిని కన్నులపండువుగ దేశమునకు తిలకాయమానములై యొప్పుచున్నవి.

అనేక శతాబ్దములనుండియు నున్నతమై నిలిచిన మన హైందవనాగరకతను స్వదేశసంస్థానములందు నేటికిని మనము చూడగలము. ఏసాంఘికజీవనము భారతదేశమున సర్వతోముఖమై యుండెనో యేయజ్ఞాతశక్తి ప్రభావమున భారతసంఘమునందలి సకల వర్ణములవారును మతములవారును పోరాటముగాని వైరముగాని లేక కలిసికట్టుగ జీవితములు గడపుచున్నారో ఆ సాంఘికజీవనమును, ఆయజ్ఞాతశక్తి ప్రభావమును నేటికిని- యీ స్వదేశసంస్థానములందు మనము కనిపెట్టగలము. పాశ్చాత్యనాగరకతా వ్యామోహమున జిక్కి, బావిలోనికప్ప బావినే సర్వప్రపంచముగ నెట్లు భావించునో పాశ్చాత్యనాగరకతయే నాగరకతగ మనము భావించుచున్నాము. మన హైందవసాంఘిక జీవనమున విప్లవమునెట్లు తెచ్చిపెట్టుకొనుచున్నామో మనము గుర్తెరుగుచుండుట లేదు. మన నాగరకత, మన వర్ణాశ్రమాదిధర్మములు, మనసాంఘికజీవనము—వీని నన్నిటిని మనము కాలద్రోసికొంటిమి. క్షణక్షణమును మనయూహలు పాశ్చాత్యవ్యామోహావృతములై పరివర్తనము చెందుచున్నవి. కాని స్వదేశ

## జ్ఞానోదయము

క్రౌను సైజు ౫౬ పుటలు. కర్త: వైద్యవిద్వాన్ తెలికిచెర్ల సుబ్బారావుగారు.

హిందుమతతత్వమును వేదాంత శాస్త్రసారము గురుశిష్యుల ప్రశ్నోత్తరపూర్వక సంభాషణరూపముగ ఇందు వివరింపబడినది. దీనిని పఠియించినవారికి మంచి విషయపరిజ్ఞానమును, మోక్షచింతయు బొడమును. వలయువారు రాజమహేంద్రవరం గ్రంథకర్తగారిపేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గ. స.

---

## నాయీ బ్రాహ్మణప్రదీపము

క్రౌను సైజు ౫౫ పుటలు. వెల ౮ అ.

క్షురకర్మ వేదకర్మయనియు, వేదయుగములో బ్రాహ్మణులే క్షౌరముచేయుచుండిరనియు, క్షౌరము చేయువారందరు బ్రాహ్మణులేయనియు, వారికి యజ్ఞోపవీతధారణార్హత యున్నదనియు మొదలగు విశేషముల నశేషపరిశోధనచేసి పండిత రేవతీప్రసాదశర్మగారు హిందీభాషయందు వ్రాసిరి. బ్రహ్మశ్రీ ఆకిగప్రాడి వెంకట్రామచౌదరిగారును పాలమును శేషాచలాచార్యగారును దీనిని అనువాదించిరి. దీనికి సంపాదకులు నడుకుదురు లక్ష్మీనరసుశర్మగారు, కాటూరుపోస్టు, కృష్ణా.

గ. స.

---

## నీతికథా నిధానము

క్రౌను సైజు ౧౩౮ పుటలు. కర్త: గుడిపాటి సత్యనారాయణశర్మగారు. వెల ౧౦ అ. ప్రకాశకులు: కమలాకర అండు కో., నందిగామ, కృష్ణాజిల్లా.

అతిథి సత్కారము, పాతివ్రత్యమహాత్మ్యము, అన్నదానము, సూనృతభాషణము మొదలగు విధులను గూర్చియు, మిత్రద్రోహము, విద్వనాక్షేపము మొదలగు నిషేధములనుగూర్చియు తొమ్మిది పురాణప్రసిద్ధములగు కథలు సుందరమును ధారాళమును నిర్దుష్టగ్రాంథికమును అగు శైలిలో ఇందు వ్రాయబడినవి. నిర్దుష్టమును సుందరమును నగు శైలి నభ్యసింపగోరువారు దీనిని పఠింపవచ్చును. పాఠశాలలలోని నాలుగైదుఫారముల విద్యార్థుల కిది పఠనగ్రంథముగ నిర్ణయింప తగ్గది.

గ. స.

---

## కవిజనరంజనము

క్రౌను సైజు ౮౧ పుటలు, వెల రు. ౧-౦-౦.

ప్రకాశకులు: జయరామ్ కంపెనీ, ౧౩ తంబుచెట్టివీథి, మదరాసు.

ఈగ్రంథము పదునెనిమిదవ శతాబ్దములో విజయనగరసంస్థానములో ఆస్థాన కవిగ నుండిన అడిదము సూరకవిచే రచింపబడినది. ఇందలి యితివృత్తము చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము. హరిశ్చంద్రుని సత్యవాక్యనిరతి, అందుకొరకు రాజ్యచ్యుతి, కాంతావియోగము, ఏకపుత్రమరణము, కాటి కాపరితనము, కళత్రహత్యాప్రయత్నము మొదలగు విషాదాంశములు గాని, వాటినుండి దైవప్రసాదమున మోచన మందు అద్భుత సందర్భములు గాని యిందు లేక, హరిశ్చంద్ర చంద్రమతుల సౌందర్యములు, శీలములు, పరస్పరానురాగములు, విరహములు, వివాహ కాంక్షలు, పెండ్లి మాటలు, కల్యాణము, శృంగారసౌఖ్యములు, విలాసములతో ముద్దులు మూటకట్టు శైలితో నలరారుచున్న మూడాశ్వాసముల ప్రబంధరాజము. ఈగ్రంథము తరువాత నింతచక్కని ప్రబంధ మాంధ్రమున వెలువడకుండుటచే ప్రబంధ యుగమున కిదియే కడపటి యొల్లయని చెప్పవచ్చును. ఇది కడపటిదే యయ్యు కల్పనలలో కాని, శైలిలో కాని, వర్ణనలలో కాని, వైఖరులలోగాని అత్యుత్తమ ప్రబంధములతో తుల్యమై వానిని మరపించుచుండును. ఇంత చక్కని పురాతనగ్రంథమును ఆంధ్రులపఠనముకొరకు చక్కగ ముద్రించి ప్రకటించిన శ్రీ గంటి సూర్యనారాయణ

శాస్త్రిగా రెంతయు కృతజ్ఞతాపాత్రులు. దీనికి భోగరాజు నారాయణమూర్తిగారు పీఠికను వ్రాసిరి.

గ. స.

---

## బ్రహ్మదేశచరిత్రము

మొదటిభాగము. గ్రంథకర్త: కొట్ర శ్రీరాములుగారు. చెన్నపురి ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము. వెల రు. ౧.

ఈగ్రంథమున బర్మాదేశపు నైసర్గికస్వరూపము, భారతీయులు, తెలుగువారు, మంగోలీయులు మొదలగువా రచ్చటికి వచ్చి పూర్వకాలములో నివాసము లేర్పరచుకొనుట, బౌద్ధమతవ్యాపనము, దేవాలయములనిర్మాణము, బర్మాదేశము నేలిన రాజవంశములచరిత్రములు, బర్మా ఆంగ్లేయులకు స్వాధీనమగుట, ప్రస్తుత బర్మీయుల ఆచారవ్యవహారములు మొదలగువిషయము లెల్ల సమగ్రముగ చర్చింపబడినవి.

బర్మా ఆంగ్లేయులవశమైనప్పటినుండియు హిందూదేశమునకును అచ్చటికిని సముద్రముపై రాకపోకలసౌకర్యము లేర్పడి, కూలీ నాలీ వ్యవహారలాభము మొదలగువాని కాశపడి అనేకులు వలసపోవుచున్నారు. ఇట్లు వలసపోయి స్థిరపడినవారిలో ఆంధ్రు లధికసంఖ్యాకులు, అనగా వారొకలక్షయేబదివేల కధికముగా స్త్రీపురుషులు కలిసియున్నారు. వీరిలో వ్యవహారములవలన ధన మార్జించినవారు కొంచెముమంది మాత్రమే. వారిచరిత్రలు చిత్రములుకూడ ఈగ్రంథమున ముద్రించబడినవి.

గ్రంథకర్త మిగుల శ్రమపడి అచ్చటి స్థితిగతు లెల్ల చర్చించినారు. ఆంధ్రులు పెక్కురు పఠించినచో అతనిశ్రమ కొంతె సార్థకమగును గనుక ఎల్లరును చదువవలెనని హెచ్చరించుచున్నాము.

గ. స.

---

## ఠాకూర్ దుర్గాదాస్

గ్రంథకర్త: యస్. ఆర్. రావుగారు. ఈగ్రంథము, కాకరపర్రు (పశ్చిమగోదావరిజిల్లా), సరస్వతీ గ్రంథమాలవారిచే ప్రచురింపబడిన యొక చారిత్రాత్మక నవల. వెల రు. ౧-౮-౦.

ఇందలి ఇతివృత్త మాంధ్రదేశమున నెల్లరు నెరిగినదే. విమలాదేవి, రసపుత్రవిజయము, ద్విజేంద్రలాలురాయిగారి యనువాదిత నాటకములు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి రాజస్థానకథావళి, ఇవి కాక రైలు స్టేషనులవద్దర నమ్ముచుండు చవుక గ్రంథములు మొదలగువాని ద్వారా యీ కథ ఆంధ్రదేశపాఠకులకెల్ల రోకళ్ల పాటయైనదే. పలువు రెరిగినట్టియు, పలువురిచే వ్రాయబడినట్టియు కథనే తిరిగి వ్రాయబోవునెడల నందులో నేదేని యొక విశిష్టవిశేషణమును గ్రంథకర్త చూపనోపునని పాఠకు లాపింతురు. అట్టి దేదియు నిందు లేనట్లే తోచెడిని.

ఈనవల యే హిందీ మరాఠీ లేక బంగాళీ మాతృకకో భాషాంతరీకరణమై యుండవచ్చునని ప్లాటుయొక్క బిగువువలన, వర్ణనల సంభాషణముల ధాటివలనను తోచెడిని. అయినను మాతృకయొక్క ప్రశంస పీఠికలో నెచ్చటను గానరాదు. ఇదివరకే మన ఆంధ్రవాఙ్మయము అనువాదితగ్రంథములతో, అందును విశేషముగ అనువాదిత నవలలతో మితిమీరి పోవుచున్నది. ఈగ్రంథలేఖకులగు యస్. ఆర్. రావుగారి వంటివారు అన్యరాష్ట్రీయుల సంబంధములగు చారిత్రక గ్రంథములమీదిదృష్టిని తమ మాతృరాష్ట్రీయము, సోదర జాతి, స్వీయభావ, పరిచితప్రదేశవర్ణనము మొదలగు విషయములపై త్రిప్పి స్వతంత్రరచనలకు గడంగి ఆంధ్ర కల్పనలయొక్క యమంగుపోకడలను పాఠకలోకమున కెల్ల చవిగొల్పుదురు గాక యని కోరుచున్నాము.

లేఖక ముద్రాపక ప్రమాదములు లేకపోలేదు, కొంచెము శ్రద్ధ బూనినచో నవి తొలగియుండెడివి. సుందరమగుశైలి, చక్కనిప్లాటు, అసమానరసపుత్ర శౌర్యసౌశీల్యప్రకటనము, హైందవసంఘద్వేషుల పరా

భవము చదువరులకు శౌర్యౌదార్యములను బురికొల్పక మానవు.

గ. న.

---

## 'బ్రహ్మచర్యము'

ఆదర్శగ్రంథమాలా పుష్పము ౧; గ్రంథకర్తలు: శ్రీయుతులు పాలడుగు శేషాచలార్య, ఆరికపూడి వేంకటరామ చౌదరిగార్లు. వెల రు. ౧-౮-౧.

కృష్ణాజిల్లా, ఎలమర్రు గ్రామములో స్థాపింపబడిన శ్రీ ఆదర్శగ్రంథమండలి వారి ప్రథమపుష్పమగు నీ 'బ్రహ్మచర్య' మను పుస్తకము గ్రంథమండలి పేరున కెంతయు వొప్పియున్నది. బ్రహ్మచర్య మన నేమి? తద్వ్రతనియమము లేవి? బ్రహ్మచర్య మెప్పుడు పుట్టెను? మున్నగు విషయములను గూర్చియు, బ్రహ్మచర్యము వలనిలాభము, దానిపాలన లేకపోవుటవలని నష్టము మొదలగు ననేక విషయములను గూర్చియు నీ గ్రంథమందు విపులముగ చర్చయున్నది.

అత్యంతకఠినమగు బ్రహ్మచర్యదీక్షను జయప్రదముగ సాధించుటకు వలయు విధులన్నియు పేర్కొనబడినవి. బ్రహ్మచర్యముయొక్క మహిమను నిరూపించెడి మహాపురుషులయొక్కయు, వేదాది మహాగ్రంథములయొక్కయు సుభాషితము లీగ్రంథమందు గానవగును. మరియు, శీర్షాసనము మున్నగు కొన్ని యాసనముల చిత్రపటములు చేర్పబడియున్నవి.

గ్రంథమునం దచటచట పునరుక్తి గలదు. బ్రహ్మచర్యపాలనవలన హైందవులు వీర్యవంతులయి, స్వరాజ్యమును బడయగలరని ప్రతిప్రకరణమునందును చెప్పుట యనావశ్యకము.

ఈ గ్రంథమును ఆంధ్రదేశమందలి కళాశాలల గ్రంథాలయములందు చేర్చుట యువకుల కెంతయు శ్రేయోదాయకముగ నుండగలదు.

'చంద్రశేఖరం'

---

## తత్త్వత్రయము

దివాన్ బహదూర్ రామానుజాచార్యులవారు తత్త్వత్రయ మను శ్రీభాష్యకారులగ్రంథమును హూణభాషా పరివర్తనము కావించి యాంగ్లేయభాషాపరిచయుల కత్యంతోపకారము కావించిరి. అందు వారీ విషయముల చక్కగా క్రోడీకరించి సరళమగు శైలియందు రామానుజ సిద్ధాంతము దెలుకపఱచిరి. ఇది తత్త్వజిజ్ఞాసువుల కత్యంతసహాయకారియై యున్నది. ఈగ్రంథప్రచురణమున శ్రీభాష్యపు ఆంగ్లభాషాపరివర్తనము పూర్తియగుచున్నది.

మానవునిహృదయము వస్తువిషయనిర్ధారణము కావించువఱకును తృప్తిచెందకున్నది. అమితవేగమున పరిభ్రమించుచుండు ఈనానాలప్రపంచ మే మూలవస్తువునుండి యుద్భవించినది? సత్యమన నేది? ప్రకృతియన నేది? జన్మమునకుఁ బూర్వము మానవుఁ డెచ్చోట నుండెను? మరణానంతర మేప్రదేశమునకు నేగుచున్నాఁడు? అను నీప్రశ్న లనాదినుండియు మనుష్యుల కలవఱపఱచుచున్నవి. ధీశక్తిచే మానవుఁడు పశుపక్ష్యాదులకు భిన్నుఁడై యా యమోఘశక్తిప్రభావమున నిట్టి విషయముల నిర్ధారింపఁ బ్రయత్నించుచున్నాఁడు. ప్రాచ్యఖండములందు బుద్ధ, మహావీర, గౌతమ, కపిల, మహమ్మద్, శంకర, రామానుజాలును, పాశ్చాత్యఖండమునందలి అరిస్టాటిల్, ప్లేటో, లుసిప్పస్, డెమొక్రిటిస్, కేంట్, హీగెల్ మొదలగువా రందరును పైప్రశ్నములకు సమాధానములు చాల కృషికావించి యొసంగిరి. వారు వారు తమకుఁ దోఁచినరీతిని నుడువుటచే తృప్తికరమగు విషయము కానరాకున్నది. రామానుజు లనేకసిద్ధాంతములఁ బరిశీలించి యందలి లోపాలోపముల గ్రహించి యట్టి లోపములు లేకుండునట్లు సర్వజనసమ్మతమగు సిద్ధాంత మొండు స్థాపించిరి.

తత్త్వత్రయమే వారిసిద్ధాంతము. ప్రకృతి కతీతుఁడును సర్వాంతర్యామియగు పరమాత్మ ప్రథమ తత్త్వము. అతనినుండియే శరీరఇంద్రియనిర్మాణకమగు ప్రకృతి వెడలుచున్నది. అనంతకోటిజీవాత్మలు తమ

ప్రత్యేకతచే భిన్నములైయున్నవి. సత్యజ్ఞానసాధకము
గు ప్రత్యక్ష అనుమాన శాబ్ద జ్ఞానవిషయముల నిర్ధారించి
యందుమూలమున పైతత్వముల రామానుజులు స్థాపించిరి.

ఇ. జ.

---

## కోళ్లపరిశ్రమ

కర్త, వెటర్నరీ ఆయుర్వేద వైద్యభూషణ డాక్టరు యేకెళ్ల శ్రీరాములు చౌదరిగారు. పశువైద్య గ్రంథనిలయము ౬-వ పుష్పము. మొదటికూర్పు ౧౯౩౭. సైజు డెమ్మీ ౧/౧౬, పుటలు ౧౧౭. వెల ౮ అణాలు. మనదేశమున కోళ్లపరిశ్రమ క్రమేపి క్షీణదశలోనికి వచ్చినందునను, కోళ్లపరిశ్రమకూడ రైతులకు సంబంధించిన ముఖ్యమైన ఉపవృత్తులలో నొకటి యగుటవలనను, మన తెలుగుభాషలో నీసంపత్తిని గూర్చిన పుస్తకమింతవరకు లేకుండుటలోటును దీర్చుటకును ఈగ్రంథము ప్రచురింపబడినదట. అన్ని జాతుల కోళ్లు బాతులు గూర్చిన యన్ని వివరములును, వానిని పెంచి వృద్ధి చేయురీతులన్నియు, వాని రోగనివారణ మార్గములును ఇందు తెలుపబడినవి. గ్రంథము ఆరుభాగములుగ నున్నది. సుమారు ౧౭ బొమ్మలుకూడ ముద్రింపబడినవి. ఈ విషయమున శ్రద్ధగలవారందరికి ఈపుస్తకము పయోగపడును. గ్రంథకర్తకు, అంగలూరు, కృష్ణాజిల్లా, వ్రాసినచో పుస్తకములు లభింపగలవు.

జ. బ్ర.

---

## ఆంధ్ర రఘువంశము

పద్యకావ్యము. బొబ్బిలి సంస్థానాస్థాన విద్వత్కవులును కీర్తిశేషులును అగు మండలేముల సీతారామశాస్త్రులవారు రచించినది. తత్పౌత్రుడు మం. వేంకటశాస్త్రిగారు, బి. ఎ., ఎల్. టి. ప్రకటించినది. ౧౯౩౭. వెల ౧ రూపాయి. డెమ్మీ ౧/౮ సైజున ౨౧౭ పుటలు. ఇందు శ్రీ శాస్త్రులవారి శిష్యుడు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు (సోంపేటలో ఉపాధ్యాయులు) వ్రాసిన కీ. శే. శాస్త్రులవారి జీవిత సంగ్రహముకూడ మొదట చేర్పబడియున్నది. వలయువారు మం. వెం. దక్షిణామూర్తిగారు, C/o డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, ఇచ్ఛాపురం, గంజాంజిల్లా అని వ్రాయవలెను.

---

## శ్రీ వివేకానంద సందేశము

స్వామివారి జన్మదినోత్సవ సందర్భమున ౧౯౨౯ లో మార్కాపురపు సమాజమువారికొఱకు వ్రాయబడిన వ్యాసము. త్రిలిఙ్గ పత్రికనుండి పునర్ముద్రితము. కర్త: కూచి నరసింహముగారు. ప్రకటన ౧౯౩౦. ౨౪ పుటల ఈ పుస్తకము "తెలుగుతోట" మలిపంటగా ప్రచురింపబడినది. ఈ దినువవిలాసమునకు వ్రాయుచు పోస్టులో ౧ అణాబిళ్ల అంపినవారి కొక్కొక్కరికి ౧ ప్రతిమాత్రము ఉచితముగ పంపబడునట. వ్యాసకుటీరము, మేలుపాక, విశాఖపట్టణముజిల్లా.

---

## శ్రీ పురుషోత్తమసంహితా (సంస్కృతము)

(శ్రీమత్ పాంచరాత్రాగమాంతర్గతా): సంపాదకః, పా. సీతారామానుజాచార్యః, భద్రాచలమ్, క్రీ. శ. ౧౯౩౭ వర్షమ్, శ్రీ పాంచరాత్రాగమశాస్త్ర సర్వస్వమ్, భద్రాచలమ్, గ్రంథమాలికాశాఖా—ప్రచురణమ్ ౨. సంహితాగుచ్ఛమ్—పుష్పమ్ ౨. ఈ కృతి శ్రీ కా. నాగేశ్వరరావు పంతులుగారికి సమర్పింపబడినది. డెమ్మీ ౧౯౮ పుటలు. వెల, పలురకముల ప్రతులు ౧-౮-౦ నుండి ౪-౦-౦ వరకు.

---

## గోరక్షణ

౧. గోప్రభావము: తెనాలివాస్తవ్యులు బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే రచింపబడినది. ౩౪ పుటలు.

౨. గోవు: ఏలూరు వాస్తవ్యులు శ్రీబొడ్డు బాపిరాజు శ్రేష్ఠిగారిచే రచింపబడినది. ౪౩ పుటలు.

౩. కామధేనువు : లక్కవరం సంస్థాన విద్వాంసుడు శ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారిచే రచింపబడినది. ౩౫ పుటలు.

పైమూడు పుస్తకములును ఏలూరు గోసంరక్షణ సమితి కావ్య ప్రచురణములు. సమితివారి త్రివార్షిక కావ్యబహుమానములలో వరుసగ ప్రథమగణ్యము (రు. ౧౧౬ బహుమతి), ద్వితీయగణ్యము, తృతీయగణ్యములుగ ఎంచబడి క్రౌనుసైజున గ్రంథములుగ ప్రచురింపబడినవి.

---

# గ్రంథ స్వీకారము

## దేవరబాగిలు

కన్నడభాష. కర్త బెంగ్రె గోవిందరాయరు, బి. ఏ., ఎల్ ఎల్. బి. జయకర్నాటక గ్రంథమాల, ధారవాడ. ౯వ పుష్పము. ౧౯౩౨. సామాజిక నాటకము. క్రౌను ౧౬ సైజున ౯౬ పుటలు. వెల. ౭ అణాలు.

---

## అనువినాశ శతకము

కర్త, దాసరి అంజదాసు, ఆదిపూడి, పర్చూరు పోస్టు, బాపట్లతాలూకా. ౧౯౩౨. వెల ౨ అణాలు. క్రౌను ౧౬ పుటలు. ఈ శతకము వేమనఫక్కి ననుసరించినది. నీతి, భక్తి సంయుతమై యున్నది. వలయువారు, కొప్పోలు చలపతిరావుగారు, చీరాల అని వ్రాయవలెను.

---

## మల్లెపువ్వులు

'(లిరికల్ పొయెట్రీ)'; కర్త, కే. అన్నమరాజశర్మ. ౧౯౨౬. క్రౌను ౮౨ పుటలు. వెల ౮ అ. శ్రీ బాలభారతీ గ్రంథనిలయము, అనుబంధ గ్రంథమాల-౩ ప్రచురము. ప్రకటనకర్త, యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి, చాగలమఱ్ఱి (కర్నూల్ జిల్లా).

---

## శ్రీ భగవద్గీతాదర్శనము

కర్త, నిడమర్తి జలదుర్గాప్రసాదరాయడు, రాజమండ్రి. ఈగ్రంథమున, మూలమును, మూలమునకు ప్రతిపదార్థమును, శ్లోకములకు గల సంబంధమును ప్రకటింపబడినవి. అధ్యాయార్థ సంగ్రహము, నధ్యాయ సంబంధమును వివరింపబడినవి. ముఖ్యపదములకు సూచిక గూడ చేర్చబడినది. కొన్ని మార్పు కూర్పులును, నర్థతాత్పర్యముల గొన్ని విశేషములు నిందు గలవు. డెమ్మీ ౧౬ సైజున ౧౯౦ పుటలు. ౧౯౩౨ ప్రచురము. వెల తెలుపబడలేదు.

---

## శోభావతి

తెలుగు సాంఘికనవల. గ్రంథకర్త్రి, ఎ. పెరియ పిరాట్టమ్మ, మదరాసు. ౧౯౨౮ ప్రచురము. డెమ్మీ ౧౬ న ౧౯౭ పుటలు. వలయువారిట్లు వ్రాయవలెను:— ఎ. ఎల్. మూర్తి, ౮. టంకసాల సుబ్బారాయలునాయని వీధి, పాతచాకలపేట, మద్రాసు.

---

## శ్రీమదరుణాచలక్షేత్ర మాహాత్మ్యము

ఇది శ్రీమదీశ్వర యతీంద్రులచే అనుగ్రహింపబడిన ద్రావిడభాషాగ్రంథమును వి. గోపాలునిచే ఆంధ్రీకరింపించి శ్రీ రమణీయవాణి పుస్తకాలయమువారిచే ప్రకటింపబడెను. ౧౯౩౦. క్రౌను ౧౬ సైజున ౯౬ పుటలు. వెల ౭ అణాలు. N. A. తిరువణ్ణామలైకి వ్రాసినచో పుస్తకములు లభించును.

---

## మహాత్మా గాంధి జీవితము, గాంధి యిర్విన్ ఒడంబడిక

హరికథ. గ్రంథకర్త, రావిపాటి కామేశ్వరరావు, పత్తెనపల్లి, గుంటూరుజిల్లా. క్రౌను ౧౬ సైజు, ౬౩ పుటలు. వెల ౬ అణాలు.

---

### అభినవ గాంధర్వకళ

(హార్మోనియం నేర్పుటకుగాను). మొదటి భాగము. గ్రంథకర్త, నవరత్నం వెంకోబాచార్యు, ఆత్మకూరు, కర్నూలుజిల్లా. ౧౯౩౨. డెమ్మీ క్రౌన్ సైజు, ౬౫ పుటలు. వెల ౧-౮-౦. హెచ్చుకాదా? వలయువారు టి. బాలనాగయ్యశెట్టి, బాలసరస్వతి బుక్కుడిపో, చౌక్ బజారు, కర్నూలు అనిగాని యెస్. హనుమంతరావు బ్రదర్స్, నందికొట్కూరు (కర్నూలుజిల్లా) అనిగాని వ్రాసిన బడయగలరు.

---

### My Experience as a Legislator
### (నా శాసనసభానుభవము)

గ్రంథకర్త్రి: శ్రీమతి డాక్టరు యస్. ముత్తులక్ష్మిరెడ్డిగారు, ఎమ్. బి. సి. యమ్., మదరాసు శాసనసభకు పూర్వము ఉపాధ్యక్షురాలు. గ్రంథప్రచురము ౧౯౩౦. డెమ్మీసైజున ౨౮౬ పుటలు. వెల ౨ రూపాయలు.

---

### శ్రీ గాయత్రీరామాయణమ్

ఇత్యాది, శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రోక్తమై, శ్రీమాన్ బహుజనపల్లి రాఘవాచార్యులవారిచే బరిష్కృతమై గోటేటి కృష్ణమూర్తిశర్మచే బ్రకటింపబడినది. ౧౯౨౧ ప్రచురము. చందాదారులకు రు. ౧-౨-౦, ఇతరులకు రు. ౧-౮-౦. క్రౌను ౬౨ పుటలు. చక్కని బైండు. జి. కృష్ణమూర్తిగారు, మామిడూరు, కృష్ణాజిల్లా అని వ్రాసినచో పుస్తకములు దొరకును.

---

## ధన్యోఽస్మి!

సోమంచి సూర్యనారాయణ శర్మగారు

చేదుమందుల రోసి భుజింపలేని
  గదికి నబ్బెను ప్రాక్తనకర్మవశత
అతిమధురతావకీన నామామృతమ్ము
ఇంక నామయభయము నా కేల స్వామి!

మొఱకుదొరల దలంచుటే నరకమన్న
కృతికి దొరకెను తొంటిసుకృతము కతన
నరసభవదీయ లీలాప్రసంగకలన
హేయనుతికలుమంబు నా కేల స్వామి!

కుటిల పరసేవ యన్న లో గ్రుంగుజీవి
కేమి పుణ్యముననో భజియింప నబ్బె
పరమసుభగమహా నీదు శ్రీపాదయుగము
ఇతర సేవాభయంబు నా కేల స్వామి!

బహుళతమభీకరవ్యథా భగ్నహృదయ
మేమిసుదినమొ కాని చిగిర్చె నేడు,
కురిసె త్వత్కరుణాసుధా కుంభవృష్టి!
హీనవైక్లబ్యమతి నా కికేల స్వామి!

---

# గాయత్రి

శ్రీ ముక్తేవి లక్ష్మీనరసింహదాసుగారు, బి. ఏ.

[స్థితిలేని నామనస్సున మా కోడలి సుబ్బారాయని హఠాన్మరణవార్త యూగినది. కరుణము పొంగిపోగా, నది కట్టుకొన్న దీభాగమే—]

ఓం భూర్భువస్సువః,
ఓం తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి,
ధియో యో నః ప్రచోదయాత్.

౧

భూలోకము

వాణి:—

నాపురాకృతపూర్వ పుణ్యములవెల్ల
ప్రోనుగట్టిన మానవమాత్రు డేను.

జన్మజన్మంబు లెన్నెన్నొ చాదుకొనిన
మహితవిజ్ఞానమునను చిన్మయుడ నేను.

ప్రాజ్ఞ వాషాఢ జలద పర్యంకమందు
తళుకులీనెడు సొబగు జ్యోత్స్నసముండ
అవిరళంబైన జీవితాంతరములందు
మధువు పుడిసిళ్ల ద్రావు దీపథమునందు.

స్నేహవాణి:—

అమితపుణ్యాసమార్జనంబైనయట్టి
జన్మ పొందినదానికి సార్థకమ్ము.
పూత మీజన్మ నవనవనీతమైన
మార్దవమ్మున సరిరాని మానసమ్ము.
ప్రథితజీవితరుచిరార్ద్రపథములందు
సూక్తిమధురమ్ము హా సార్ద్రశుభ్రవదన
మరవిరియు పూవుదమ్మి నిత్యమ్ము మాకు.

వైరాగ్యవాణి:—

అన లహంకార మనగ కాయమున నున్న
యెముకనిర్మాణమునగూడ నెగసిపడును
అసలుతావల మిద్ది దేహము దురంత
దుష్టవాంఛానిబద్ధ బుద్బుదమె యగును.

అంతర్వాణి:—

ఇది మహాజ్వర మింతింత నెదిగి యెదిగి
గాఢతమసంపు పరివృత్తి క్రమ్ముకొనును
అస్థిరంబున స్థిరమైన యట్టియూహ
స్థిరమునం దస్థిరత్వమ్ము సిద్ధపఱచు.
ఇద్ది యొకమానసప్లుతి ఈవిషమ్ము
అమృతవిశ్లేషమై తోచు నహరహంబు.

౨

భువర్లోకము

కావ్యవాణి:—

ఓయిమిత్రమ! నీయూహ లూరుచుండు
తరతమమ్ములతో స్వర్గధామములను
ఊహ కూహకు ముడివెట్టి యుత్ప్రబుద్ధ
మీమహాప్రజ్ఞకును నిర్నిద్ర మింద్రి(?)
యమ్ములందున ముల్లోక మాడుకొనును.

జిజ్ఞాసావాణి:—

ఎన్ని పరివృత్తులంబడి యీాది యీాది
పొందితివో దుర్లభంబైన పుణ్యరూప
మంత్రద్రవ్యాల తరియించి యమృతమూర్తి
విశ్వమయతేజ మిది యిట్లు వెలుగుగాత!
ఇంతగా జుట్టుకొను నహంకృతి ఫలించి
పరిఢవిల్లుచు నీ దివ్వె ప్రజ్వలించు!

ఆంధ్రవాణి:—

అగునగును నీవు చరితార్థుడగుదు నిజము
విస్మృతంబైన జాతీయ విశ్వమందు.
జాతి కుత్తరగతులకొ, చదువుతలల
ఒక్కకలమున చిత్రించి యుద్ధరించి
నావు మాలోన నొకడ వైనావు నీవు!

3

సువర్లోకము.

స్వర్గవాణి:—

పర్వ మీానాడు ప్రాప్తిల్లె ప్రాచినుండి
వాయుపథమందు వీతెంచు వాణి యొకడు
అఖిల తేజోమయంబైన యంతరిక్ష
మార్గమందున తేజమ్ము మానరముగ.
ఓ మహాకవి నీ వుర్వి నుద్భవిల్లి
విస్మృతములైన మాకీర్తి వెల్లువలను
ప్రతి గస్పష్టించినా వనుపలుకు మ్రోసె
రాజరాజులతో కృష్ణరాయుగొంతు!
అచటచట నున్న జ్యోతిర్మయంబులైన
ఈ పురావళు లివి యేమి యిందు నందు
నాకు నాత్మీయు లింద రున్నా రిదేమి?

* * * *

కొన్ని బంధము లిచ్చట పన్ను కొన్న
నెంతయో ప్రాణసంకట మెరిగినాను
చిరము వసియించుటను గాక చిత్రమైన
వ్యూహముల బన్ను కొని తృప్తినుందు రేల?
తిక్కనాదులు నిచ్చట తెలియరారు
కొందరు ప్రసిద్ధులైన ముక్తులునుమాత్ర
మిచట నున్నారునుంగూడ నిందు తమకు
కీర్తు లపకీర్తులనుచు లంఘింతు రేల?

రూపవాణి:—

వ్యాహృతులయందు సప్తధా భ్రాంతమైన
అర్చిరనుమేయమూర్తి గాయత్రిదేవి!
విస్ఫురచ్ఛందముల నన్ను విహృతిగొల్పి
కదపుచున్నది యూర్ధ్వలోకముల పొంత.

అరూపవాణి:—

శబ్దమున నర్థమట్లుగ ఛందమందు
గానమట్లుగ నోంకార గర్భశక్తి
బ్రహ్మమట్లుగ చిద్రూపభాగధేయ
రూపరహితుని నన్ను విద్రుతు నొనర్చు.

ఉపహృతి

అంతవాక్కులవడి కొంత వణచికొంచు
చక్ర మాకృతి గాంచిన సత్వతేజ
మంత కంతకు పెద్దదై యంత యింత
చిన్నదియు నొచు నొకట నదృశ్యమయ్యె!

# మనవి మాటలు

## 'తెనుఁగు - తోఁబుట్టువులు'

'వైశాఖి' యందు నాలవభాగము నాక్రమించినది 'తెనుఁగు-తోఁబుట్టువులు' అనువ్యాసము శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రిలుగారు బహుగ్రంథములు 'చూచి' దీనిని రచియించినారు. వీరు 'తాము తెలుపఁదలఁచువిషయము చదువువారిమదిని కుదురుగా నాటునటుల చేయఁజాలు శైలి' నలవరుచుకొనిన నిపుణులు. విషయము భాషాచరిత్రమునకు చెందినది. కావున నీవ్యాసము 'వైశాఖి' కి మకుటము; పాఠకుల కగ్రగణ్యము; భాషాచరిత్రజిజ్ఞాసువులకెల్ల పరమాదరణీయము. దీనిని 'వ్యాస' మనుటకన్న భాషాచరిత్రాత్మకమగు నొక చిన్నిగ్రంథమనుట యొప్పును.

ఇందు రచయిత తొలుత భాష, భాషాచరిత్రము, భాషాభేదములు, ఉపభాషలు, ప్రమాణభాషలు, భాషల మార్పు మున్నగువాని తత్త్వమును క్రమముగ వివరించుచు భాషాకుటుంబముల చర్చ నందుకొని 'తమకున్న పోలికలనుబట్టి ఏర్పడిన భాషాకుటుంబములలో మన భరతఖండమున ఎన్నికకు వచ్చునవి మూఁడు: ఉత్తరమున ఆర్యభాషాకుటుంబము; దక్షిణమున ద్రావిడభాషాకుటుంబము; ఈరెంటికిని నడుమ నున్నది ముండాభాషాకుటుంబము. ఇందు మొదటిది వడవంగడము, రెండవది తెన్వంగడము, మూఁడవది నడివంగడము—అనఁదగు........ సంస్కృతము, హిందీ మొదలగుభాషలు వడవంగడములోనివి. మన తెనుఁగును, దాని తోఁబుట్టువులు తెన్వంగడములోనివి' అనిచెప్పి 'తల్లిసంస్కృతంబె యెల్లభాషలకును' అనుమాట 'అభిమానమునుబట్టి చెప్పినదేకాని నిజము కాదు' అని ద్రావిడభాషల స్వతంత్రస్థితి నంగీకరించిరి. ఈ 'భాషాకుటుంబములలో ద్రావిడభాషాకుటుంబము తక్కినభాషాకుటుంబములకంటె తొల్లింటి' దని సకారణముగ చర్చించి దాని ప్రాచీనతను స్థాపించిరి. ఈ 'తెన్వంగడము' భాషలలోనివగు 'గోండి, కోయ, కురుఖు, మల్తో, కోలామి' అను ౫ భాషలు అవి వాడుకయం దున్నప్రదేశములనుబట్టి 'ఉత్తరదేశభాషలుగా లెక్కకువచ్చును.' ఇది యిప్పటిస్థితినిబట్టి, నాటి కాలమున 'దస్యులతోఁ బోరి తుదకు వారి నోడించి వారి దేశ మార్యు లాక్రమించినపిదపఁగదా ఉత్తరదేశ మార్యావర్త మయినది. అయిన దస్యు లేమయిరి? ఎక్కడకు పోయిరి? ఇపుడు వారిసంతతివా రెవరు?' అని ప్రశ్నించి 'దస్యులే ద్రావిడులై' రని తలంచుటచే 'భారతఖండమంతయు తొలుత ద్రావిడదేశమే' అనియు, 'ద్రావిడభాషయే అపుడు భరతఖండభాష' యనియు శాస్త్రిగారికి తోఁచుట న్యాయ్యమే. ఇది కాదనువా రెవరేని ఆర్యభాషలగు ప్రాకృతములలోని దేశ్యములు ద్రావిడభాషలలోనివిగాక మరియేభాషలలోనివో చెప్పవలసియున్నారు. వీరి యీసిద్ధాంతమునకు 'ఇపుడుకూడ బలూచిస్థానమున దానికి రాజధానియగు క్వెట్టాపట్టణమున వాడుకనున్న "బ్రాహూఈ" అను భాషయే 'ప్రబలమగు తార్కాణ' అయినది.

అంత తెన్వంగడమునందలి పదునాలుగుభాషలను పేర్కొని, వానియుత్పత్తి, అవి మాటలాడు దేశభాగములు, ఆయాభాషల యుపభాషలు, వానివాని వాఙ్మయములస్థితి మొదలగువిషయములను సంగ్రహముగ వివరించి వానిస్వరూపము దెలియుటకు మచ్చువాక్యముల నిచ్చిరి. 'తెన్వంగడములో కొలుచువారి మొత్తమునుబట్టి తెనుఁగుపలుకువెలందియే తొలిగద్దెను వెలయుచున్నది.' తరువాతివి తమిళము, కన్నడము, మలయాళము. వానికి దరువాతివి తక్కిన తొమ్మిదిభాషలు.

మనభాషకు గల "'తెనుఁగు; తెలుఁగు, ఆంధ్రము' అను పేరులలో 'తెలుఁగు' నకు 'తెల + ఉన్ + ంగ్' కలసి 'తెలుంగ్' అయి ఇప్పటి పలుకుబడినిబట్టి 'ఉ' చేరఁగా 'తెలుంగు' అనునది ఏర్పడియుండును...దానికి 'తెల్లగా ఉండువారు, అట్టివారిభాష, తేటగా ఉండునుడులభాష, అని అర్థములు వచ్చును" అని వ్యుత్పత్తి చెప్పిరి. కాని 'దీని వ్యుత్పత్తినిబట్టి భాషాగుణము తెలియవచ్చుచున్నది.

గాని యిది తెనుఁగునాటిభాషకు తొలిపేరు కాదనియు 'తరువాత వచ్చిన పేర'నియు తలంచిరి. 'నన్నయ తిక్కనలు వాడిన తెనుఁగునుడి, రూపాంతరమును, అముఖ్యమునుగాక, స్వతంత్రమును, ముఖ్యమును అనియు మన భాషకు మొదటిపేరనియు' నమ్మిరి. 'తెనుఁగు' పదమును 'తెన్ + ఉన్ + ంగ్ + ఉ' అని విడదీసి 'తెన్నున (దారిలో) ఉండువారు; వారిభాష. తెన్నున ఉండువారి దేశము తెనుఁగునాడయ్యె. ఈ తెనుఁగునాడే ఆర్యుల దక్షిణాపథము. దక్షిణాపథము, దక్షిణదేశము నొకదానివి తెలుపునని, యందుకు నిదర్శనముగా

"ఇది దక్షిణాపథంబున
కిదియు విదర్భాపురమున కిది కోసల కి
య్యది యుజ్జయినికిఁ దెరువులు
మది నిన్నిటిలోని నరుగ మన కెద్దియగున్."

అను భారతారణ్యపర్వాంతర్గత నలోపాఖ్యానమునందలి పద్యము నొసఁగిరి. తరువాత 'ఆంధ్రశబ్దము భాషనేకాక, జాతిని—దేశమునుకూడ తెలుపుచున్నది. ఇది సహజముగా మొదట జాతికిని, పిమ్మట భాషకును, అటుపిమ్మట దక్షిణమున ఒకదేశమునకు పేరై ఉండవలె. ఆంధ్రులు తరువాత తెలుఁగువారితోఁ గలసిపోయినను మొదట ఆర్యజాతివారయినటుల ఐతరేయబ్రాహ్మణమువలన తెలియవచ్చుచున్నది. వారిభాష ఆంధ్రమును ఆర్యభాషలలో ఒకటి అని వేఱే చెప్పనక్కఱలేదు. ఆంధ్రులు తొలుత అనాగరకులును, బలహీనులు నైనను కొంతకాలమునకు బలవంతులయి రాజులయి, తెనుఁగునాటి నాక్రమించుకొని పాలించుటచే అదియు ఆంధ్రదేశమయ్యె. ఆంధ్రులు కొలఁదిమంది అగుటచే వారిభాష తెనుఁగువారిభాషతో కలసిపోయినది. ఇట్లు తెన్వంగడములోని తెనుఁగుభాషయును, ఆర్యభాషా కుటుంబములోని ఆంధ్రమును కలసి యేర్పడిన మొత్తము భాషకు తెనుఁగు, తెలుఁగు నుడులే కాక ఆంధ్రపదము కూడ పేరయ్యె' నని చెప్పి 'ఇందువలన తెనుఁగునాటి తొలిభాష తెనుఁగే కాని ఆంధ్రము కాదనుట తేటతెల్లము' అని తేల్చిరి.

'కొలఁచువారి మొత్తమునుబట్టి' 'తొలిగద్దెను వెలయుచున్న' మన తెనుఁగుయొక్క 'వాఙ్మయము ప్రాచీనతనుబట్టి మూఁడవదిగా లెక్కకువచ్చుచున్నది.' కాని వెనుకటిది, యిప్పటిది కలిపిన కొంత విరివిగనే కాన్పించుచున్నను 'మహాభాషలని పేరొందిన సంస్కృతము ఇంగ్లీషు మొదలగు భాషలలోని వాఙ్మయములవలె సంపూర్ణమయినదని తెనుఁగువారు చెప్పుకొని సంతోషింపఁజాలని స్థితిలో' నుండుట నిక్కము. ఈలోటును దీర్చుటకయి సరియయిన ప్రయత్నములు కొనసాగుట లేదనియు, ఇతరభాషలలోని ఉత్తమగ్రంథములను తెనిఁగించుటయు 'స్వతంత్రములగు' సాహిత్యగ్రంథములు, లక్షణ గ్రంథములు, చరిత్రగ్రంథములు మొదలగువానిని 'పసగలశైలిని' 'పసిగా వ్రాయ'వలయుననియు హెచ్చరించుచున్నారు.

'పసగలశైలి యలవడుటకు తెనుఁగు పసిగా నేర్చుకొనవలె......అనఁగా తెనుఁగునుడుల నిక్కపురూపులను అర్థములును, సామెతలును, సొగసులును తెలిసికొనవలె; నుడులు కూర్చు నేర్పు సమకూర్చుకొనవలె' నన్నారు. 'లేనిచో మదిలోని తలంపులను నూటిగా వెల్లడించు పసగల మేలిశైలి పట్టువడదు. అది లేనిచో మనవాఙ్మయము వన్నెకెక్కదు; లోకమునకు పనికిరాదు. అట్టిచో మనకు వాఙ్మయము ఉన్నను లేకున్నను ఒక్కటియే' అని గట్టిగా చెప్పినారు. 'తమ వాఙ్మయము లోకమునకు పనికివచ్చునట్లు పెంపొందింపఁదలఁచు తెనుఁగువారు తెనుఁగున మంచిపాండిత్యము గడించుకొనవలె' నన్నారు. అట్లు తెనుఁగున మంచిపాండిత్యమును సంపాదించుటకు 'తెనుఁగును, సంస్కృతమును మాత్రము కాక తెనుఁగుతోఁబుట్టువులగు తెన్వంగడములోని భాషలను, తెనుఁగునకు తోడ్పడిన ప్రాకృతము మొదలగు భాషలను, భూమండలమందంతటను వ్యాపించి సంపూర్ణమగు వాఙ్మయముతో వెలయుచున్న యింగ్లీషుభాషయును చదువవలె'నని రచయిత కావించిన యమూల్యోపదేశము భాషాజిజ్ఞాసువులకు, వాఙ్మయ సేవాపరాయణులకు నెంతయుసమాదరణపాత్రము. చివరకు 'తెనుఁగు వాఙ్మయమున కున్నలోపము తీర్చుతలంపుతోడనే అంగబలముతోడను, అర్థబలముతోడను' ఏర్పడిన

ఆంధ్రసాహిత్యపరిషత్తు'చేయఁబూనుకొనిన మొదటి పెద్ద పని-సూర్యరాయాంధ్రనిఘంటు ప్రచురణము' 'నేటికిని వెలువడనిది కా' దని వగపును దెలుపుచు తత్ప్రచురణము త్వరలో కావింప పరిషత్తువారిని కోరిరి.

మఱియు తెనుఁగునకు సంప్రాప్తమయిన 'దురవస్థను తప్పింపవలసినబాధ్యత నిజమునకు ఇపుడు ఆంధ్ర విశ్వవిద్యాపరిషత్తు వహింపవలె' నని కోరుచు నీవ్యాసమును పరిసమాప్తికొందించిరి. ఈ యమూల్యవ్యాసమునే రచయిత విపులీకరించి గ్రంథముగ ముద్రించి ప్రచురించినయెడల తెనుఁగు చదువువారికి గొప్ప ఉపకారము చేసినవా రగుదురు.

అందును ప్రాచ్యవిద్యాపరీక్షలకుచదువు విద్యార్థులకు ప్రకృతము భాషాతత్త్వ చరిత్రాధ్యయనము అందనిమ్రానిపండయి శోభను గలిగించుచున్నది. ఉన్న గ్రంథము లాంగ్లమున నుండుట, తెలుఁగున చెప్పఁదగిన దొక్కటియైన లేకపోవుట, ఆంగ్లమునన్నవానిలో పెక్కులు విపరీతసిద్ధాంతములతో విప్రతిపత్తి కాకరములయియుండుట, బోధకులకే యవి దురవగాహములగుట విద్యార్థుల శోభకు గారణములు. కావున శాస్త్రిగారు వ్యాసమును పెంచి గ్రంథరూపమున వెలువడఁజేసి విద్యార్థిబృందముకృతజ్ఞతకు పాత్రు లగుదురుగాక! 'తెనుఁగుతల్లి' 'మేలివాఙ్మయములున్న పలుకులవెలందు లెక్కిన గద్దియలతో సాటివచ్చు గద్దె' నెక్కుట కొకమెట్టును కట్టి 'వాసికెక్కుదురుగాక!'

---

## సూర్యరాయాంధ్రనిఘంటువు

'తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటువు నొకదానిని రచించి ప్రకటించుట' ఆంధ్రసాహిత్యపరిషత్తు ఉద్దేశములలో ప్రధానమయినది. 'ఆంధ్రసాహిత్యపరిషత్తు తెలుఁగుభాషను వాఙ్మయమును అభివృద్ధి నొందించుమార్గములలో నిది మొట్టమొదటిది.' ఈయుద్దేశము పరిషత్తు పుట్టిననాడు (౧౨-౫-౧౯౧౧) పుట్టినది. ఇది తెలుఁగుభాషకు తెలుగునాటికి మహోపకారకమయిన కార్యమని తలపని, యుప్పొంగని యాంధ్రు డుండడు. అప్పుడే ఈనిఘంటువును ఆంధ్రసాహిత్య పరిషత్తునాధిపత్యముక్రిందనే, తత్కార్యముగనే తయారుచేసి ముద్రించుటకగు ధనమునంతయు తా మొసంగెదమని శ్రీ పిఠాపురము మహారాజావారు వాగ్దానము చేసిరి. కావుననే నిఘంటువు తన్నామాంకితమయినది. శ్రీ జయంతి రామయ్యపంతులుగా రిందుకు కారకు లవవలసియున్నది.

తరువాత నిఘంటు నిర్మాణపద్ధతులను గూర్చి శ్రీ జయంతి రామయ్యపంతులుగా రొకవ్యాసమును వ్రాసి ౧౯౧౨ లో ప్రకటించి విద్వాంసులకు కొందఱికి పంపి వారి అభిప్రాయములను సంపాదించిరి. వాని నొక 'పండితసంఘము' చర్చించినది. 'ఆలస్యా దమృతం విషం' అను నార్యోక్తి ననుసరించి ఒకరో యిద్దరో తమ యిష్టముచొప్పున చేసేకార్యము కాదనియు, పదిమంది విద్యాధికులు చేరి చేయవలసిన'దనియు నిశ్చయించినది. 'ద్రావిడభాష కొకనిఘంటువు రచించువటుల దొరతనమువారు రీవడుమ నుత్తరవుచేసి యాకార్యము నిర్వహింప నొకసంఘము నేరుపాటు చేసియున్నారు. వా రింకను నిర్మాణపద్ధతులను నిరూపించుకొన్నట్లు తోపదు. ద్రావిడాంధ్రభాష లన్యోన్యసంబంధము కలవి కావున నీరెండుసంఘములు నొకదానితో నొకటి సంప్రతించుకొనుచుండుట 'మేలు' అనికూడ సంభావించినది. 'మేలు' అన్న 'సంప్రతింపులు' ఎన్నిమారులు జరిగెనో, ఏవిధమయిన 'మేలు' సమకూరెనో తెలియరాదు. చివరకు శ్రీ రామయ్యపంతులుగారు సూచించినపద్ధతుల ననుసరించియే నిఘంటురచనము ప్రారంభమయినది.

ప్రమాదీచ(౧౯౧౩-౧౪)సంవత్సరమున నిఘంటు నిర్మాణమునకు పూర్వాంగముగా భారతప్రయోగానుక్రమణిక * వ్రాయబడినది. నిఘంటురచనమున కిది

* భారతమునందలి పదముల నన్నింటిని విడదీసి యొక్కొక్కదాని నొక్కొక్క కాగితపుముక్కమీద వ్రాయుట.

సహకారి అంతగా కాకున్నను వ్యయమ మాత్రము అధికమయియుండును. తెలుగుజిల్లాలయందంతట వాడుకలో నున్న వృత్తిపరిభాషాపదములు కొన్ని సేకరింపబడినవి.

౧౯౧౫-వ సంవత్సరమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు సంపాదకులుగా నియమింపబడిరి. వారికి సాహాయ్య మొనర్చుటకును, తత్సమాదిశబ్దములను ఏరుటకును మరికొందరు నియమింపబడిరి. ఈకార్యము చెన్నపురమున నాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందే జరుగుచుండెను. శ్రీ శాస్త్రిలుగారివంటి యుద్దండపండితులు సంపాదకు లగుటచే నిఘంటు వచిరకాలముననే సంపూర్ణమయి యాంధ్రలోకమునకు లభింపగల దనువాశ కలిగెను. పనియంతయు వంరుకయి ఏరుపడిన యొకసంఘమువాదేశము ననుసరించియే జరుగుచుండినది. సంపాదకు లాసంఘమున నొకసభ్యుడయ్యును ప్రత్యేకము తమ యభిప్రాయముల ననుసరించి నిఘంటురచనమును జరుప ననుకూలపడమిచేత కాబోలు రెండేండ్లకు తరువాత పరిషత్తువారు చెన్నపట్టణమున జరిగిన పని యంత తృప్తికరముగా లేదని చిన్నపుచ్చుకొనవలసి వచ్చినది. ఇందుకు నిఘంటు నిర్మాణమును కొనసాగించుచున్నవారి లోపమో, వారి నమపదమును 'ఇటు అటు' అని తన యిష్టానుసారము త్రిప్పుచుండినసంఘములోపమో కాని, నిఘంటువునకు ధనము నొసంగ ప్రతిశ్రుతులేము చేసిన మహారాజావారు తమ అనుక్షణ పర్యవేక్షణమున నిర్మాణకార్యమును జరిపెద మనిరన్న కారణమున నిఘంటుకార్యస్థానము కాశీయుక్తి (౧౯౧౮) సంవత్సరాదినాటికి పిఠాపురమునకు మార్చబడినది.

శాస్త్రిలుగారి సంపాదకత్వము చెల్లిపోయినది. 'నిఘంటునిర్మాణసంఘము' మాట మరి వినరాదయ్యెను. చెన్నపురమున పనిచేయుచుండినవారిలో శ్రీ తంజనగరం తేవప్పెరుమాళ్లయ్య (దేవరాజసుధి) గారు—ఇంచుమించు శ్రీ శాస్త్రిగారిని పోలినపండితులు—ఒక్కరే కార్యస్థానముతో పాటు పిఠాపురమునకు తీసికొనిపోబడిరి. సంపాదకులుగా కాదు, నిఘంటుకార్యాలయమున తత్సమపదముల పనిచేయుటకు. నాడుమొదలు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు సంపాదకత్వమును వహించిరి— శ్రీరాజావారు వారిని కోరినందున. అప్పటినుండియు 'వస్తుసంగ్రహము, తద్విమర్శనము' జరుగుచు వచ్చినది. ౧౯౨౦-వ సం. మార్చి ప్రాంతమునకు, మూడింట రెండుపాళ్లు అనగా 'ప' లో సగమువరకు తత్సమపదములు కూర్చబడినవి. 'వచ్చినవే పెక్కుసారులు వచ్చినమాట లనేకములున్న' ఆచ్ఛికపదములు ౭౭౫౯౫ సేకరింపబడినవి. 'ప్రాకృతపదములు ౮౩౧', 'ద్రావిడపదములు ౫౩౧౭' సిద్ధమయినవి. మొత్తము సమకూర్చినపదములు ౧౩౫౮౮౧. ఇది నిఘంటు కార్యస్థానము పిఠాపురముచేరిన రెండేండ్లలో జరిగినపని. ఈవిషయము, పైపదములకు పండితులు నిర్ణయించిన అర్థాదులను 'పరిశీలించి సిద్ధాంతీకరించుభారము' తమయందు గల, 'భారతము మొదలయిన పెద్దగ్రంథములు కొన్ని' తాము 'ముందుగాజదివి యందలి ముఖ్యపదముల గుర్తించుచున్న' సంపాదకులు ౧౯౨౦-వ సం. మార్చినెలలో ప్రచురించిన నివేదికవలన స్పష్టమగుచున్నది. ఇట్లా రెండేండ్లలో పని చురుకుగ జరిగినది. ఇపు డీసంపాదకుల కున్నస్వాతంత్ర్యము, సిద్ధాంతీకరణభారము వెనుకటి సంపాదకులకు లేకపోవుటచేతనే కాబోలు ననవలెను ఆరెండుమూడేండ్లలో కార్యఫల మేమియు కనబడక పోవుటకు కారణము! అది యిపు డప్రస్తుతము.

ఎట్లయిననేమి, ౧౯౧౧-వ సంవత్సరమున ఆంధ్రసాహిత్యపరిషత్తున నుద్దేశరూపమున మొలకెత్తిన నిఘంటునిర్మాణకార్యము మహారాజపోషణము గలిగియుండియు ౧౯౨౦-వ సం. నాటికి (అనగా ౯ ఏండ్లకు) ఇట్లు రెండవఅకు వేసినది. పదపడి కొలదికాలమునకు, ఏపండితుని ప్రకృష్టపాండిత్యము నిఘంటు నిర్మాణమున హాతగత్తిగా నుండదగినదో ఆ పండితుడును, తేవప్పెరుమాళ్లయ్యగారు కాలగతినిచెందిరి. వారిస్థానమున శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నియమింపబడి వారు చేయుచుండినపనినే సాగించుచుండిరి.

నిఘంటునిర్మాణవిధానమునుగూర్చి తొలుత శ్రీ రామయ్యపంతులుగారి వ్యాసము, చెన్నపురమున కార్యస్థానముండగా నొకమచ్చుపదములపట్టిక, పిఠాపురమునకు మారినతరువాత సం. ౧౯౩౩ లో నింకొకమచ్చు

పదములపట్టిక, ఆ పయి సం. ౧౯౩౫ లో మరొక్క పట్టిక ప్రకటితములయి పండితులకు విమర్శనార్థము పంపబడినవి. కాని వాటి విమర్శన మెట్టిదో లోకమునకు తెలియక పోయెను. చివరపట్టికపయినమాత్రము సూచనలు' విమర్శనలు కొన్ని 'భారతి'యందు ప్రకటితములయినవి.* మహారాజపోషణము, ఎక్కువ భారమును వహించిన సంపాదకులు గల ఈనిఘంటురచన మీతీరుననుండ, దీనికంటె రెండేండ్లతరువాత ప్రారంభమయిన ద్రావిడ నిఘంటువున, దేశభాషలపయి పక్షిమాన మంతగా చూపరనుకొను విశ్వవిద్యాలయమువారు తేయారుచేయించుచున్నదానియందు ౬౩౨ పుటలుగల మొదటిసంపుటము, భాగత్రయాత్మకము, ముద్రితమయి ప్రకటితమయినది. అందు మొదటిభాగము ౨౬౬ పుటలు గలది ౧౯౪౪-వ సంవత్సరముననే ప్రకటితమయినది. అది మొదలు ఏటా రెండేసిభాగములవంతున ప్రకటితములగుచునే యున్నవి. ఈసంవత్సరము అయిదవ సంపుటమున మొదటిభాగము వెలువడినది. అందు చివరపదము 'క్షేమ్యాష్టమి' (భీష్మాష్టమి). మొత్తము నిఘంటువున నేటికి వెలువడిన పుటలు ౨,౪౩౨.

సూర్యరాయాంధ్రనిఘంటుప్రకటనము అనువత్సరము 'అది జరుగుతూ ఉన్నది, ఇది జరుగుతూ ఉన్నది, ఇదిగో ప్రకటించుచుంటిమి, ఏవో యిబ్బందులు కలిగినవి' అని యీతీరున దూరదూరమునకు పోవుచున్నది. ఇటీవల ప్రమోదూత సంవత్సర కార్యనివేదికయందు 'అకారాదిపదముల చివరపరిశోధనము నిఘంటుసంపాదకులచే గావింపబడుచున్నది. అజాదిపదములన్నియు నిట్లు పరిశోధింపబడినపిమ్మట నవి నిఘంటు ప్రథమసంపుటముగా ముద్రింపఁబడును.' అని సంపాదకులు తెలిపిరి. ఇప్పటికి ఒకటిన్నర ఏడాది అయినను సంపుటము ఇంకను వెలువడినది కాదు.

పదియేండ్లకు పైగా నిఘంటుశరీరమునకు ప్రధానాంగములను సమకూర్చుచు, నిఘంటునిర్మాణకార్యములయందు మంచి యనుభవమును గడించుకొనిన శ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగారిటీవల కార్యాలయమును వదలిపోయిరని తెలియవచ్చుచున్నది. సమర్థులు, అనుభవము, విషయసంగ్రహము గలవారు నగు శ్రీ శాస్త్రిగారు నిఘంటునిర్మాణకార్యాలయము నిట్లు వదలిపోవలసివచ్చుట నిఘంటువు దురదృష్ట మనవలసియున్నది.

నిఘంటునిర్మాణము ప్రారంభమయి యిరువదేండ్లు దాటినది. దాదాపు లక్షరూపాయలు వ్యయమయినవి. కాని, నిఘంటువున నల్పభాగమేనియు నింకను ముద్రితము కాకున్నయది. ద్రావిడ నిఘంటువ§వన్నో మూడింట రెండువంతులు ముద్రితమయి వెలువడినది.

---

* భారతియందు ప్రకటితములయిన వ్యాసములు:—

౧. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు. శ్రీమాన్ యీయుణ్ణి వెంకటవీరరాఘవాచార్యులుగారు. ప్రభవ, శ్రావణమాససంచిక, పు. ౧౫-౨౫. ఇందు సూచనలు గలవు.

౨. సూర్యరాయాంధ్ర నిఘంటువు - మచ్చుపదములు. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు. ప్రభవ, ఆశ్వయుజసంచిక, పు. ౫-౧౫. ఇందు విమర్శనపూర్వకము లగు సూచనలు కలవు. 'పదిహేనుఏండ్లనుంచీ జరుగుతూఉన్న ఈ బృహన్నిఘంటునిర్మాణము ఏఅవస్థలోఉన్నదీ' తెలుపునుకూడ.

౩. సూర్యరాయాంధ్రనిఘంటు విమర్శనఖండనము. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. ఇది పై శ్రీ చి. నా. రా. గారి వ్యాసమునకు ఖండనము. ప్రభవ, ఫాల్గునమాససంచిక, పు. ౩౬౮-౩౭౪.

౪. సూర్యరాయాంధ్ర నిఘంటువు - మచ్చుపదములు. శ్రీ చి. నా. గారు విభవ, వైశాఖ సంచిక, పు. ౪౯౭-౫౦౩. ఇది పై శ్రీ జ. రా. గారి ఖండనమును ఖండించునది.

ఈ విమర్శనలు ఖండనలు చురుకుపాలు ద్రాగించుటలు వ్రాసుటలు—వీనితోనే సరిపోయినవి.

§ ద్రావిడ నిఘంటువున వెలువడిన పుటలు ౨,౪౩౨. సరాసరి నూటరువదిపుటలుగల యొక్కొక్క భాగమునకు వెల రెండురూపాయలు. ఇప్పటికి వెలువడినభాగములు పదునేడు.

పచ్చయప్ప కళాశాలయం దాంగ్లాచార్యపదము నధిష్ఠించి మెప్పును గన్నవారు. అరటిపం డొలిచిపెట్టినట్టులు బోధింపగలవారు. విద్యార్థులను కన్నసంతానమువలె ప్రేమించి వారికి సౌకర్యములను సమకూరిచి కంటిని రెప్పవలె కాచి వారిలో నొకరుగ నుండు స్వభావము వీరిది. ఆంధ్రభాష, ఆంధ్రులు అన్న చెవికోసికొనువారు. చెన్నపురమునందలి యాంధ్రుల యౌన్నత్యమున కుపకరించు నెల్లకార్యములయందు వీరిచేయి కలిసియేయుండును. ఇట్టి విద్యావంతుడు, బోధనచతురుడు, వినయశీలుడు, దయాళువు, విద్యార్థికల్పవృక్షము నగు నీసత్పురుషుడు యశశ్శరీరమును మిగిల్చి పోయినాడు. వీరికయి వగచు పచ్చయప్పకళాశాలవారు, విద్యార్థులు, చెన్నపురము నాంధ్రులు, సుబ్రహ్మణ్యముగారి కుటుంబముతోపాటు ఆశ్వాసమును చెందజేయుదురు.

---

## అల్పాయువు కోడాలి వెంకటసుబ్బారావు

జననము ౧౨-౧౨-౧౯౦౮. మరణము ౧౧-౮-౧౯౩౯.



అతర్కితోపనతము, అతిదారుణము వెంకటసుబ్బారావు మరణము. ఇరువదెనిమిదేండ్ల ప్రాయమున, పొంగారు యౌవనమున, సకలైహికభోగానుభవసమారంభవేళయందు హృదయమువలె స్నిగ్ధము, భావమువలె సున్నితము, బుద్ధివలె వికతజాడ్యము, ధైర్యమువలె సుదృఢము, ప్రకృతివలె మనోహరము నగు వెంకటసుబ్బారావుశరీరము, కటకటా, కట్టిడి మృత్యువువాత పడిపోయినది! సురభిళకుసుమ మొకటి సుడిగాలిలో నలిగిపోయినది!! సతికి పతివియోగము, తండ్రికి పుత్రవియోగము సంఘటిల్లినది. ఈవియోగము దుస్సహము, నిరవధికము. దైవ మెంతనిర్దయము! అథవా, జీవకోటికి స్వకర్మానురూపఫలానుభూతి యనతిక్రమణీయము.

వెంకటసుబ్బారావు భావకుడు, కవి, రసజ్ఞుడు. అతని కావ్యనిర్మాణ మాతని జీవితమువలె అల్పమాత్రము, ప్రశస్తము. అతనికావ్యములు మిక్కిలిగ వస్త్వాశ్రయములు. అతని నిశితమతి వస్తుతత్త్వగ్రహణనిపుణము. వస్తుతత్త్వజ్ఞానమున నుత్పన్నములయిన యతని భావము లుద్వేలములుగ పొంగి రమణీయకల్పనాబద్ధములయి కావ్యరూపమున పరిణతిని గాంచునవి. భావానురూపపదరచన గలిగి ధారావాహినియయి యొప్పు నతని కవితకు వర్ణితవస్తువు నెదుటబెట్టి పాఠకుని హృదయమును రసింపజేయు శక్తి కలదు. అది కేవలము శబ్దానుశాసనమునకు లొంగునదికాదు; లక్షణనియమములకు లోనగు నదికాదు. భావవీథి నుద్దండముగ పరువిడుచు పాఠకుని వెనువెంట పరువులువార జేయునది. ఈ యల్పాయువురచనములలో 'హంపీక్షేత్రము' ప్రశస్తము: అది గ్రంథరూపమును గాంచదగినది.

ప్రపంచము నెల్లవిషయముల నవ్యతే నాశించుకాల మిది. భావకులగు నవకవులు కొందఱు కవితను నూతనమార్గముల నడిపించుచు నభినవరూపరమణీయను గావించుచున్నారు. ఆ కొందరిలోనివాడు సుబ్బారావు. అతనికావ్యములను 'భారతి' కై నేసి కొనినది. ఇంకను కైసేయ మురియుచుండినది. ఇంతలో నిటు విపరీతముగ పరిణమించినది.

సుబ్బారావుభౌతికశరీరము నేడు ప్రణష్టమయినది; కావ్యశరీరము మిగిలినది. అది భావనాచైతన్య విలసితము, చిరంజీవము. ఆ రూపమున సుబ్బారావును సహృదయులు నిరంతరము దర్శించుచుండగలరు. పూవు నశించినను తావి నశింపదు.

---

# ఘన ప్రశంస

తిరుమల రంగాచార్యులు గారు

కలరు ఘను లన్నిజాశ్రితుల కాంక్షలమాత్రమె తీర్చువారలి
య్యిల నెపుడైనఁ జూడ నగునే? యితరు ల్తమ వేడకున్న ని
శ్చలతను జీవనం బొసఁగు సాహసవంతులు? చెప్ప దేను ని
ర్మల మతితోడ నోయిఘనమా! విను సార్థకనాముఁ డీవహో!

ఇల నొకచోఁ దగం గురిసి యింకొకచో నటు చేయువంచు నాఁ
గల దొక నింద నీకు సరి గా దిది యోచన సేయఁగా మహా
బలునికిఁ జిక్కు సత్పథవిభాసురు లేమి యొనర్పనౌను సం
చలితులు గాక యుందురె? విచారము మాను వలాహకోత్తమా!

ఉపకృతి యందు రొక్కమొగి నుండినయర్థము లిచ్చినంత నే
తపమునఁ బొందఁజాలు నమృతమ్ము మహోన్నతమైనయట్టి వి
ష్ణుపదమునందు నిల్చి సహజోద్ధతి మాని యొసంగి తాప మె
ల్లపు డొకరీతిఁ బాపెడి వలాహకుఁడా, సరిలేరు నీ కిలన్!

కురిసెద వీవు వర్షమును గొండలపై జలరాశిపైన సు
స్థిరగతి సజ్జనోక్తి గల దేకియ నానుడి రిత్తరాను? భూ
ధర వరరత్నధుల్ సుజనతాశ్రయయోగ్యులు గాన వారి భా
స్వరగుణసంయుతుల్ ఘనరసప్రదు లాశ్రయ మొందు టొప్పదే.

ధన మది యెంత యుండిన ననారతవైభవ మెంత యుండినన్
ఘనుఁడ! భవత్ప్రసన్నత యొకానొక యేఁటను వ్యగ్యమాయె సం
జను లధికార్తిఁ బొందుచును సారెకు సారెకుఁ గోరుదు రగ్గదా
యనుపమమైన నీకరుణ నందగఁజేయఁ జరాచరేశ్వరున్.

---




పరునకురోయుమాట పాటించై భరకెల్ల, నొక్క మాటమాట యొక్క యెందు
కోరకుండువాని కూరెల్ల నోపదు, విశ్వదాభిరామ వినుర వేమ.

వేదాంతవేది వేమన చెప్పిన హితోపదేశము దురభిమానపరాయణులకు మననయోగ్య ముగ నున్నది. హిందూస్థానమునకు సర్వాధి కారమంత్రియైన సర్ సామ్యుయలు హోరు గారిబుద్ధియందు హితోపదేశములకు స్థలము లేదని తెలిసినవిషయమే. కాని సర్ సామ్యు యలు హోరుగారి ప్రగల్భవాక్యములు మాత్రము వారికి హితమైనను ప్రపంచమును మోసగింపజాలవు. వారు హిందూస్థానమునకు జేసిన మహోపకారములందు నిర్బంధవిధాన విజయమును, ప్రభుత్వము చేసిన అహ్వాలవిజయ మును, ఒటావాసమావేశఫలమును, సాంఘిక నియోజకనిర్ణయమును ప్రశంసించుటయందు వారికి సహజమైన నిరంకుశాధికారాభిమా నము వెల్లడియగుచున్నది. నిర్బంధశాసనపరి పాలనము నన్నిపక్షములవారును నిరసించుచు న్నపుడు దానిని ప్రశంసించుట నిరుపయోగము.

హిందూస్థానము నిటీవలనే సందర్శించి దేశపరిస్థితులను స్వాయముగను గనుగొనిన లోథియనుప్రభువుగారి యభిప్రాయముల నైనను విశ్వసించుట హోరుగారికి కర్తవ్యము. లోథియనుప్రభువు జాతీయప్రభుత్వమునందు బాధ్యతగల సహాయమంత్రి. వారిపర్యటనము నందును, సంప్రతింపులందును ప్రజాభిప్రాయ మును దేశపరిస్థితులను కొంతవరకైనను గ్రహించుట కవకాశములను గలిగియుండిన లోథియనుప్రభువుగారి సలహాను సయితము పెడచెవిని బెట్టుట హోరుగారికి నిర్బంధవిధా నమునందుగల విశ్వాసమును విశదముచేయు చున్నది. ప్రశాంతస్వభావముగల పండిత మదనమోహన మాలవ్యగారు దేశమునం దిట్టి అశాంతి యెన్నడును గలుగలేదనియును, ఏ పక్షమువారికిని విశ్వాసము లేదనియును ఇటీ వలనే కలకత్తాయందు కంఠోక్తిగను దెలిపియుం డిరి. ఇంగ్లాండునుండి హిందూస్థానపరిస్థితులను బరిశీలింప వచ్చిన ఇండియాసమితిప్రతినిధులును కన్సర్వేటివు సభ్యుడు హేలుగారు మొదలగు నాంగ్లప్రముఖులును లోథియనుప్రభువు తెలిపిన సద్భావములనే వెల్లడిచేసిరి. నిర్బంధవిధాన ప్రయోజనమును విశదముచేయునవి ప్రజా హృదయములు గాని కల్లుపాటలు, విదేశవస్తు వుల దిగుమతులును గావు.

నిస్సహాయస్థితియం దున్న ప్రజలు ధర్మ విరుద్ధమైన కార్యములను జేయుటయందు విచిత్రము గనుపడదు. మహానిర్బంధప్రస్థాన మారంభమై ఎనిమిదిమాసములు గతించి నను ప్రజాశక్తి విజృంభించుచున్న విధ మును దేశవ్యవహారములు విశదము చేయు చున్నవి. లాఠీప్రయోగములు, నిర్బంధములు జరీమానాలు, జప్తులు, రహస్యదండన నిర్బం ధములు ప్రజాశక్తిని వృద్ధిచేయుచున్న విధ మును వివిధప్రాంతములందును జరుగుచున్న సత్యాగ్రహ వ్యవహారములు ఋజువుచేయు చున్నవి. నిర్బంధవిధానము శాంతి స్థాపనము నకు బదులు అశాంతిని వృద్ధిచేయుట ప్రకృతి ధర్మము. ప్రపంచమంతయును శాంతికై పరిత పించుచున్న సమయమునందు శాంతి దూతను నిర్బంధించుటయును, నిర్బంధవిధాన వ్యాపన మును సమ్వారిష్టములకును సాధన భూత ము గా గలదు. ప్రపంచేతిహాసములం దెచ్చ టను నెప్పుడును విజయమును బడయని నిర్బంధ విధానము హిందూదేశమునందు విజయమును బడయజాలదు.

* * * *

అప్పులవిజయము

ప్రభుత్వము చేసిన యప్పుల విజయము దేశశాంతికిని ప్రజావిశ్వాసమునకును నిదర్శ నము గాజాలదు. బ్యాంకులు, వ్యాపారము విదేశీయుల వశమునం దున్నపుడు ప్రాత గవర్నమెంటు పత్రములను క్రొత్తపత్రములను మార్చుట కవకాశ మున్నప్పుడు అప్పును పూ రించుట ప్రజల నిస్సహాయస్థితికి నిదర్శనము కానివిశ్వాసప్రత్యయములకు నిదర్శనముగాదు. దీనివలన శ్రీమంతులు, విదేశీయులు లాభ మును బొందినను ప్రజల కెట్టి లాభమును నుం డదు. హిందూస్థానమునుండి విదేశములకు గతించిన పదిమాసములందును నెగుమతియైన ౯౦ కోట్ల రూప్యముల బంగారమును హిందూ దేశము నావరించిన దురవస్థను విశదము చేయుచున్నది. గతించిన కతిపయమాసము లందును హిందూస్థానమునుండి సహజమైన పదార్థముల యెగుమతి ౩౦ కోట్ల రూప్య ములవి తగ్గుటయును, ౯౦ కోట్ల రూప్యముల బంగార మెగుమతి యగుటయును హోరుగా రికి సంతృప్తిని కలుగజేసినను దేశక్షేమ పరా యణుల కెవరికిని సంతృప్తిని గలుగజేయ జాలదు. ప్రపంచమంతయును నొకమార్గము నను హిందూస్థాన మొకమార్గమును నడు చుట విపరీతమైన యార్థికనీతియనియును సహ జమైన యార్థికనీతి కాదనియును బాలిశులు సయితము గ్రహింపగలరు. ఒటావా సమావేశ మున నాటిన విషబీజములఫలమును కాలము పరిపక్వము చేయగలదు.

* * * *

సాంఘికసమస్యానిర్ణయము

ఈనిర్ణయము బ్రిటిషు ప్రభుత్వమునకు హిందూస్థానస్వాతంత్ర్యముపట్ల గల నిజాభి ప్రాయమును లోకమునకంతకును విదితముచేసి నది. హోరుగారే బ్రిటీషుప్రభుత్వసద్భావ మునకీ నిర్ణయమును ప్రమాణముగ నుదాహ

రించిరి. బ్రిటీషు ప్రభుత్వమునకు పరమార్థము జాతీయబాధ్యతాయుత ప్రజాస్వామికపాలన స్థాపనము. ప్రభుత్వము ప్రకటించిన సాంఘిక నిర్ణయ మీపరమార్థమును నూరేండ్లకైనను సాధ్యపడనీయదు. హిందూస్థానమునందు రెండువంతులు ప్రజలైన హిందువులకు నియోజకవర్గమునందు నామరూపములు పోయినవి. సామాన్యనియోజకవర్గమునం దెవరు గలరో యది పరమరహస్యము. హోరుగారికిని, వారి యాంతరంగికులకును మాత్రము విదితము. హిందూస్థానమును జాతిమతలింగశాఖావృత్తి స్థితి భేదములతోను తుత్తునియలు చేయుటయం దీనిర్ణయము భయంకరరూపమును దాల్చుట సహజము. హిందూమహమ్మదీయ సిక్కు భేదములను, యూరోపియను ఆంగ్లో-ఇండియను క్రైస్తవభేదములను, స్త్రీపురుషాదిభేదములను కల్పించి హిందూస్థానమును చీలికలు చేసిన హోరుగారి రాజ్యనీతి ప్రశస్తమైనను వారినద్భావములు మాత్రము ప్రశంసాపాత్రములు గావు. ఈప్రక్కనుగల వివిధరాష్ట్రములందలి స్థానముల పట్టిని పరిశీలించినవారలకు నిజము విశదమగుచున్నది.

మదరాసు శాసనసభకు నిర్ణయించిన ౨౧౫ స్థానములందును సామాన్యస్థానములు ౧౩౮ ను ప్రత్యేకస్థానములు ౭౭ యు కలవు. ప్రత్యేకస్థానములందు ప్రత్యక్షముగనో పరోక్షముగనో యూరపియనులకు ౨, స్త్రీలకు ౮, నిమ్నజాతులకు ౧౬, కార్మికులకు ౬ స్థానములు గలవు. మహమ్మదీయక్రైస్తవ స్త్రీలకు స్థానములను ప్రత్యేకించినపుడు యూరపియను ఆంగ్ల ఇండియను స్త్రీల కేల ప్రత్యేకింపలేదో తెలియకున్నది. స్త్రీలు ప్రత్యేకస్థానములను నిరసించుచు తీర్మానములను జేసిరి. అయినను వారిని సామాన్యస్థానములనుండియును, స్వీయసంఘస్థానములనుండియును విడదీయుట దేశమునకును, సంఘమునకును ప్రయోజనకరము గాదు. మద్రాసు గవర్నరుగారు పక్షములు సిద్ధాంతముల ననుసరించి ఏర్పడవలయుననియును, సంఘముల ననుసరించి ఏర్పడజనదనియును చేసిన హితోపదేశమునకును, సాంఘికనిర్ణయములకును గల సంబంధమును దేశక్షేమ పరాయణులు గ్రహింపగలరు.

వంగరాష్ట్రమున కేర్పడిన ౨౫౦ స్థానములందును సామాన్యస్థానములు ౭౮ మాత్రము గలవు. మహమ్మదీయులకు ౧౧౯, యూరపియనులకు ౨౫, నిమ్నజాతులకు ౩౦ స్థానములును కలవు. ఈమూడు సంఘములును కలిసి ౨౫౦ స్థానములందును ౧౫౮ స్థానములను గలిగి యున్నపుడు వీరి శాశ్వత బలమును భేదించుట కెట్టి యవకాశములును గలుగజాలవు. సామాన్యపక్ష మేర్పడుట కేవిధమైన యవకాశములును గలుగజాలవు. ఈ విధముననే వివిధరాష్ట్రములను చీలిక చీలికలుగను జేసిన సాంఘికనిర్ణయమునందలి సద్భావములు సర్ సామ్యుయల్ హోరుగారు గ్రహించినను హిందూస్థానము యొక్క క్షేమ పరాయణు లెవ్వరును గ్రహింపజాలకున్నారు. బ్రిటీషు

| రాష్ట్రీయశాసనసభలు | మదరాసు | బొంబాయి సింధు | బెంగాలు | సంయుక్త రాష్ట్రములు | పంజాబు | బీహారు-ఒరిస్సా | మధ్యరాష్ట్రములు-బేరారు | అసాము | సరిహద్దు రాష్ట్రము | సింధు | సింధువినా బొంబాయి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొత్తము స్థానములు | 215 | 200 | 250 | 228 | 175 | 175 | 112 | 108 | 50 | 60 | 175 |
| సామాన్యస్థానములు | 134 (పు 128- స్త్రీ 6) | 97 (పు 92- స్త్రీ 5) | 80 (పు 78- స్త్రీ 2) | 132 (పు 128- స్త్రీ 4) | 43 (పు 42- స్త్రీ 1) | 99 (పు 96- స్త్రీ 3) | 77 (పు 74- స్త్రీ 3) | 44 (పు 43- స్త్రీ 1) | 9 | 19 (పు 18- స్త్రీ 1) | 109 (పు 104- స్త్రీ 5) |
| నిమ్నజాతులకు | 18 | 10 | — | 12 | — | 7 | 10 | 4 | — | — | 10 |
| వెనుకబడియున్న ప్రదేశములకు | 1 | 1 | — | — | — | 8 | 1 | 9 | — | — | 1 |
| మహమ్మదీయులకు | 29 (పు 28- స్త్రీ 1) | 63 (పు 62- స్త్రీ 1) | 119 (పు 117- స్త్రీ 2) | 66 (పు 64- స్త్రీ 2) | 86 (పు 84- స్త్రీ 2) | 42 (పు 41- స్త్రీ 1) | 14 | 34 | 36 | 34 (పు 33- స్త్రీ 1) | 30 (పు 29- స్త్రీ 1) |
| దేశీయక్రైస్తవులకు | 9 (పు 8- స్త్రీ 1) | 3 | 2 | 2 | 2 | 2 | — | 1 | — | — | 3 |
| ఆంగ్లోఇండియనులకు | 2 | 2 | 4 (పు 3- స్త్రీ 1) | 1 | 1 | 1 | 1 | — | — | — | 2 |
| యూరోపియనులకు | 3 | 4 | 11 | 2 | 1 | 2 | 1 | 1 | — | 2 | 3 |
| వాణిజ్యము, పరిశ్రమలు, గనులు, తోటలకు | 6 | 8 | 19 | 3 | 1 | 4 | 2 | 11 | — | 2 | 7 |
| భూస్వాములకు | 6 | 3 | 5 | 6 | 5 | 5 | 3 | — | 2 | 2 | 2 |
| విశ్వవిద్యాలయములకు | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 1 | — | — | — | 1 |
| కార్మికులకు | 6 | 8 | 8 | 3 | 3 | 4 | 2 | 4 | — | 1 | 7 |
| సిక్కులకు | — | — | — | — | 32 (పు 31- స్త్రీ 1) | — | — | — | 3 | — | — |

౪౯౦

జాతీయ ప్రభుత్వము నిర్ణయించిన సాంఘిక నిర్ణయమును స్వార్థపరాయణులకు సంతృప్తికరమైనను సామాన్యముగను సకలసంఘముల యొక్కయు నిరసనమును బడయుచున్నది. స్వార్థపరాయణులయొక్కయును పూర్ణామోదమును బడయజాలకున్నది. బ్రిటీషు ప్రభుత్వముచేసిన సాంఘికనిర్ణయమునకు బాధ్యులు హిందూ దేశీయులని యంగీకరింపవలయును. ఈ విషమసమస్యకు బీజములు ప్రభుత్వవిధానమునందే కలవని రాజ్యాంగానుభవము విశదముచేసినది. హిందూస్థానమునందు జాతీయ ప్రజాస్వపరిపాలనమును స్థాపించుట బ్రిటీషు పరిపాలనమునకు ప్రయోజనమని బ్రిటీషు రాజనీతిజ్ఞులు సమయా సమయములు లేకను ప్రకటించుచుందురు. ఆ ప్రయోజనము నీసాంఘికనిర్ణయ మెంతవరకు సమకూర్చునో బ్రిటీషు ప్రభుత్వమును ప్రజలును యోచించుట ధర్మము. స్వరాజ్యమును గోరెడి హిందూ దేశీయులు స్వరాజ్యసిద్ధికి వారిశక్తిమీఁద నాధారపడుట ధర్మముగాని పరులమీఁద నాధారపడుట ధర్మముగాదు. భారతజాతీయమహాసభ ౪౭ ఏండ్లు నిర్వహించిన మహాకార్యమును సాంఘికనిర్ణయమును నిరంకుశశాసన పరిపాలనమును నిర్మూలముచేయ నమకట్టినను, భారతీయచైతన్యము చిరకాలసంవర్ధితంబైన భారతజాతీయశక్తిని అధర్మ సంకల్పము నాశనము చేయజాలదు.

* * * *

## హిందువుల కర్తవ్యము

సాంఘిక ప్రాతినిధ్యనిర్ణయమునం దధిక సంఖ్యాకులైన హిందువులపేరైనను గనుపడదు. ఇందులకు గారణము నిరంకుశాధికారుల యాగ్రహమై యుండనోపును. వారి ఆగ్రహమెట్లున్నను నిర్ణయము వారి సంస్కారమున కనురూపమైనఫలమును సమకూర్చినది. అధిక సంఖ్యాకులైన హిందువు లితరసంఘములకు వారికోరికల కనురూపముగను స్థానముల నంగీకరించి దేశక్షేమమునకును, స్వాతంత్ర్యమునకును వారి శక్తిసామర్థ్యములను వినియోగించుట పుణ్యమును పురుషార్థమును గాగలదు. క్షీణించుచున్న దేశము శుభప్రదముగనున్నపుడు వివిధసంఘములును వర్ధిల్లుట కవకాశము లేర్పడగలవు. దేశక్షేమమే దుర్లభమైనపుడే సంఘమునకును క్షేమము గలుగజాలదు. బ్రిటిషుప్రభుత్వమునకు గల సద్భావములను సాంఘికనిర్ణయమువలె రాజ్యాంగనిర్ణయములును తెలుపగలవు. రాజప్రతినిధి సోమవారమునాడు శాసనసభయందు జేసిన ప్రసంగము ఫలమును ద్యోతకము చేయుచున్నది.

* * * *

## రాజప్రతినిధి ప్రసంగము

కాంగ్రెసు పక్షము నడచివేయుటకు ప్రభుత్వ మవలంబించుచున్న నిరంకుశప్రస్థానము సఫలమైనను కాకపోయినను రాజ్యాంగతంత్రమునునడపుటకైనను హిందూస్థానప్రజలు

గావలసియుందురు. మితవాదులైనను వారు రాజ్యాంగములందు ప్రమేయమును గల్పించుకొనుటకు గావలసిన నిర్ణయములను వెల్లడిచేసిరి. మూడవ రౌండుటేబిలుసమావేశమును జరుపవలయును. ఆ సమావేశమునందు భారతీయప్రతినిధులకును బ్రిటీషుప్రతినిధులకును సమానప్రతిపత్తి యుండవలయును. ఈ సంప్రతింపులఫలము శాసనరూపమును దాల్చవలయును. కుడుపబోవుచెడికూడు విషయమై రుచి యడుగవలసిన యవసర ముండదు. అనతికాలములోనే తేలనున్న విషయముల విషయమై వితర్కము లనవసరము. కాని రాజప్రతినిధిచేసిన ప్రసంగ మెప్పటివలెనే సందిగ్ధముగ నున్నది.

బ్రిటీషుప్రభుత్వము, బ్రిటిషుపార్లమెంటు, బ్రిటీషుప్రజలు భారతీయులకు రాజ్యాంగసంస్కరణముల ననుగ్రహింపదలచుట నిజమే. సంస్కరణశాసనమునందు అఖిలభారతసంయుక్తపరిపాలనము, కేంద్రప్రభుత్వమునందు వీలైనంత బాధ్యతయును, రాష్ట్రీయస్వపరిపాలనము పేర్కొనబడుటయును యథార్థము. కాని క్రియారూపమున నీశాసనము స్వాతంత్ర్యమును ప్రసాదించుటయే నిర్ణయము గావలసిన విషయము. రాజప్రతినిధిగారి ప్రసంగమునందును ఇండియామంత్రిగారి ప్రసంగములందును నీవిషయమును తెలుపుటకు సూచనలు కనుపడవు. వారేమి నిర్ణయించునదియును నవంబరుమాసము తెలుపగలదు. కాని హోరుగారిప్రసంగము లీవిషయము నసందిగ్ధముగ వ్యక్తముచేయుచున్నది.

భారతీయ రాజ్యాంగములను నిర్ణయించుట కధికారము పార్లమెంటునకుగలదు కాని అనుభవింపవలసిన భారతీయులకు లేదు. పార్లమెంటు నిర్ణయించిన విధానమును భారతీయులు హర్షధ్వనులతో నాచరణమునందు పెట్టవలయును. రాజ్యాంగ సంస్కరణముల ప్రయోగమును సుకరముచేయుటకు స్వాతంత్ర్యనిరోధకశాసనములు సహాయము చేయగలవు. నిర్బంధశాసనముల సారమును శాసనరూపమున ప్రభుత్వము స్థిరముచేయుటకు సంకల్పించినది. ప్రభుత్వసంకల్పము నరికట్టుట కెవ్వరికిని శక్తిలేకపోయినను నిత్యమైన ధర్మమునకుమాత్ర మట్టి శక్తిగలదు. బ్రిటీషు ప్రభుత్వము విల్లింగ్డనుప్రభుత్వముద్వారా హిందూస్థానమునందు నిజమైన బాధ్యతాయుత స్వపరిపాలనమును స్థాపించినపుడు కాంగ్రెసుప్రయోజనమెం యంతరించినను విచారము గలుగదు. కాంగ్రెసు హిందూదేశమునకు స్వపరిపాలనమును సాధించుటకు సాధనముగ నేర్పడినది కాని పరిపాలించుట కేర్పడలేదు. విల్లింగ్డను ప్రభువుగారు స్వయముగ నీసంకల్పమును సఫలము చేసినపుడు కాంగ్రెసునకు పూర్ణవిజయము గలిగినదని యెంచనగును. కాని నిరర్థకములైన సంస్కరణప్రణాళిక నేర్పాటుచేసి కాంగ్రెసును నిర్బంధించినంతమాత్రాన ప్రజాహృదయమునందు సంతృప్తియును దేశమునందు శాంతియును గలుగజాలవు. స్వారాజ్య

వేదనతో నారంభమైన స్వరాజ్యసత్యాగ్రహోద్యమము స్వరాజ్యముతో గాని యంతరింపజాలదు. రాజ్యతంత్రప్రవీణులు ఇరువదవ శతాబ్దమునందు మాటలతో ప్రజలను సంతృప్తులను జేయ దలపెట్టుట కేవలము నిరర్థక ప్రయత్నమని గ్రహించుట వివేకము.

* * * *

రౌండు టేబిలుసమావేశము

మూడవ రౌండు టేబిలు సమావేశము నవంబరుమాస మధ్యభాగమునందు లండను నగరమునందు గూడుననియును, కొందరు భారతీయప్రముఖులును, సంస్థానాధీశులును నాహ్వానింపబడుదురనియును, విషయ విమర్శనము గోప్యముగ చేయబడు ననియును రాజప్రతినిధిగారు తెలిపియుండిరి. గాంధిమహాత్ముడు, పండిత మాలవ్యా, సరోజినిదేవిగారులును నాహ్వానింపబడుదురనియును వార్తలు తెలుపుచున్నవి. కాంగ్రెసును నిర్మూలము చేయుటకు యావచ్ఛక్తిని వినియోగించుచు కాంగ్రెసు
నకు ప్రధానప్ర          త్ముని నా
హ్వానించుట విచ          రుండును.
దురభిమానము          సాధన
మైనటులు కార్యసి          గాజాలదు.
రెండవసమావేశము          మువలెనే వర్త
మానసమయమునం          దిగ్గస్థితి ఏర్పడి
నది. కాంగ్రెసువాదు          ంధముల ననుభ
వించుచున్నపుడు గాం          త్ముడు రౌండు
టేబిలుసమావేశమునకు          డలజాలడు. ఒక
వేళ వెళ్లినను నిసుమంతయైనను ప్రయోజనము గలుగదు. గతసంవత్సరమునందు ఇర్విను ప్రభు వవలంబించిన మార్గమునే ఈయేడు విల్లింగ్డను ప్రభువును నవలంబించుట శ్రేయస్కరము. కాని కన్సర్వేటివుపక్ష రక్షితమైన, బలవత్తరమైన జాతీయప్రభుత్వమున కిట్టి వివేకము గలుగుటకు బలవత్తరమైన భగవదనుగ్రహము శరణ్యముగాని మానవప్రయత్నములు నిరర్థకములు.

---

Printed and Published by C. Seshagiri Rao, B. A., at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.